తెలుగు సాహిత్యములో

# హనుమంతుని కథ-పాత్రచిత్రణ



డా॥ ఆర్. ఎస్. సుదర్శనాచార్యులు, ఎం. ఏ., పిహెచ్. డి.,
రిటైర్డ్ ప్రిన్సిపాల్, కడప.

ప్రథమ ముద్రణ: 1992

ప్రతులు: 1000



ప్రాప్తిస్థానం:

డా॥ ఆర్. ఎస్. సుదర్శనాచార్యులు

10/553, బెల్లంమండి వీధి,

కడప-516 001.



ముద్రణ:

గాయత్రి ప్రింటర్స్

ప్రొద్దుటూరు - 516 360.

ఓమ్ నమో వాయుపుత్రాయ   శ్రీమ   శ్రీ శ్రీనివాసాయనమః

శ్రీమతే రామానుజాయనమః



ఈ గ్రంథము శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల వారి 'ధార్మికగ్రంథ' ప్రచురణకు ఇచ్చు ఆర్థిక సహాయముతో ముద్రితమైనది.

# అభిప్రాయములు

మానవుని ప్రయోజనార్థము రకరకాల రంగుల పూలనుండి తేనెను సేకరించి 'వండి' తేనెపట్టులో సిద్ధంగా ఉంచుతుంది తేనెటీగ. అదే విధంగా శ్రీ ఆచార్యులు 'నాన్మషిః కురుతే' అన్న ఆలంకారికుల నిర్వచనం ప్రామాణికముగా, ఋషిసత్తములు రచించిన సుమారు 150 గ్రంథములలో నుండి శ్రీమత్ హనుమంతునిలోని వివిధ దృక్పథములను వెలికితీసి విరిదండగా కూర్చి మనకు, రాబోవు తరాలకు, తావివీడని, వసివాడని పూల గురుతుగా పరిమళింపజేశారు.

సప్తలోకాలలో, సప్తసముద్రాల మధ్య, సప్తర్షిమండలాలలో సంస్తుతింపబడే సప్తమావతారం 'శ్రీరామావతారం'. ఆ శ్రీరాముని దాసుడు అంజనేయుడు. అతడు జితేంద్రియుడు. దేహాత్మాభిమానమున్నప్పుడు నేను నీకు దాసుడను, జీవాత్మాభిమానమున్నప్పుడు నీలో నేనొక భాగాన్ని. ఈ రెండు అభిమానములను వదలి 'కూటస్థుడే' నేను అని నిశ్చయించితినేని మన ఇద్దరికీ భేదమేలేదని మారుతి వినమ్రతతో శ్రీరామునితో వక్కాణించినాడు.

తన శరీరముచే శ్రీరాముని పాదయుగ్మసేవను, వాక్కుచే నిరంతరము శ్రీరామ నామగాన స్మరణంబును, మనస్సుచే పరమార్థ స్వరూపధ్యానమును గావించుచూ త్రికరణశుద్ధిగా శ్రీరాముని సేవించుచున్న భక్తశిఖామణి అంజనేయ స్వామి. మరియు ఈతడు అమేయ భక్తి సమన్వితుడు, వీర విక్రమ సాహస పరాక్రమ సముపార్జితుడు, అహంకారదూరుడు, సకలసద్గుణ విలసితుడు, అజన్మబ్రహ్మచారి, సాంగచతుర్వేద పారీణుడు. ఈ విధంగా అగణిత గుణములను ఆయన వ్యక్తిత్వము నుండి వెలికి తీయవచ్చును.

ప్రతి మంచి పనికి ప్రతిబంధకాలు తప్పనిసరి - ఏ విధముగా వీటిని అధిగమించగలరు అనే విషయం, ప్రతి మనిషియొక్క స్వభావంపైన ఆధారపడియుంటుంది. ఎల్లవేళలా అన్ని పరిస్థితులలోను ఈ ప్రతిబంధకాలతో పోరాడటం సాధ్యం కాకపోవచ్చు. అదే విధంగా ప్రతిసారి వాటినుండి తప్పించుకోవటం సులభమైన పనికాదు. బృహత్కార్య నిర్వహణలో దృఢమైన పట్టు

దలతో ఉన్న వ్యక్తికి విశ్రాంతి పొందాలనే కోరిక కూడ ఒక ప్రతిబంధకమే. ఇది హనుమంతుని జీవితం నుండి నేర్చుకోవలసిన పాఠం.

వాయుదేవుడు ప్రధాన సేవావిధానమునకు ముఖ్య ప్రతీక. సూర్యుడు, పృధ్వి. వరుణుడు అందరూ కూడా సేవాతత్పరులే. కానీ వాయుదేవుని సేవా విధానములో గల సమగ్రత వారిలో పూర్తిగా లేదు. సకల చరాచర జీవ రాసుల శాశ్వత సేవలో నిమగ్నమై ఉంటాడు పవనదేవుడు. వాయు తనయుడు హనుమంతుడు అంకితభావానికి, సర్వసంగ పరిత్యాగానికి, సత్యమైన సంకేతము వంటివాడు. రుచి, వాసనలేని గాలి చల్లదనాన్ని, పరిమళత్వాన్నేగాక, అది ప్రయాణం చేస్తున్న పరిసరాలకు సంబంధించిన ఆనవాళ్లను కూడ మోసుకు వచ్చినట్లే అంకితభావానికి, సర్వసంగ పరిత్యాగానికి, సత్యసంకేతమైన పవన కుమారుడు కూడా తన 'గురువ'గు శ్రీరామచంద్రుని కార్యములను మోసుకు వచ్చే మానస పుత్రునిగా గుర్తింపవచ్చును. రాముని సందేశాన్ని ప్రపంచానికి చాటిచెప్పటానికి హనుమంతుడు ఒకవారధి.

తోడుగా రావటానికి సరయూనదీతీరాన వేచిఉన్న అశేష జనవాహిని వద్ద నిలబడిన శ్రీరాముడు వినయవిధేయతలతో చేతులు మడిచి నిలబడిన హనుమంతునితో 'హనుమా,' స్వర్గసుఖాలను అనుభవించటానికి నీకు కూడా నావెంట రావాలని ఉందా? అని ప్రశ్నించాడు. అప్పుడు ఆంజనేయుడు 'స్వామి, నాలో నాకుగా స్వతంత్రమైన కాంక్షగానీ కోరికగానీ లేనేలేదు. నాలోని అణువణువు ఎప్పుడూ నీ ఆజ్ఞకోసం, నీ సంతోషం కోసమే ఎదురు చూస్తూ ఉంటుంది' అన్నాడు.

అదివిని శ్రీరాముడు గద్గద స్వరంతో 'హనుమా, నీవు వరపుత్రుడవు. అంకితభావం గల నీవంటి వ్యక్తుల అవసరం ప్రపంచానికి ఎంతయో అవసరం. అందుకే ఈ ప్రపంచంలో నీవు చిరంజీవివై, నాకథ మార్మ్రోగుతున్నంత కాలం నువ్వు ఇక్కడే ఉంటావు. స్వామిభక్తి పరాయణుడైన హనుమంతుడు తన గురువుయొక్క ఉత్తర్వును తలదాల్చి రామభక్తుల మనసులలో ఆవరించి ఉన్న అంధకారపు పొరలను పటాపంచలుచేస్తూ శ్రీరాముని దివ్యకథామృత గానానికి శాశ్వత శ్రోతగా, భగవంతునికీ భక్తునికీ మధ్య అనుసంధానం కలిగిస్తూ ఇక్కడే ఉండిపోయాడు.

హనుమంతుడు మహాయోగి. ఆయోగ మహిమచేతనే అతడు దుష్కర మైన మహాకార్యములనొనర్చ గలిగాడు. ఇటువంటి మహాయోగి, స్వామిభక్త పరాయణుని కథ, అతని మూర్తిమత్వ చిత్రణ తెలుగు సాహిత్యంలో ఎక్కడెక్కడ ఉదాహరించారో సవివరంగా పరిశీలించి ఒక సిద్ధాంత గ్రంథరూపంలో అందించి శ్రీ సుదర్శనాచార్యులు తెలుగు సాహిత్యాన్ని విస్తృతపరచటానికి, తద్వారా తెలుగువారికి ఎనలేని సేవచేశారు. వీరి గ్రంథములో హనుమంతుని గురించి సామాన్యంగా తెలియని అనేక విషయాలను అంతర్గతభావ సందర్శనంతో విపులంగా చర్చించి హనుమంతుని గొప్పతనాన్ని, ఔన్నత్యాన్ని చక్కగా విశదీకరించారు.

ఇహపర సాధనకు ఈ మహా గ్రంథము ప్రతి ఒక్కరికీ ఎంతో ప్రయోజనకారిగా భాసిల్ల గలదు.

పి. ఎస్. రామచంద్రరావు ఎం. ఎస్సీ.,
కంట్రోలర్ ఆఫ్ ఎగ్జామినేషన్సు (రిటైర్డు)
ఇంటర్మీడియట్ బోర్డు, హైదరాబాదు.

సుగుణాభిరాముడైన శ్రీరామునికి సేవకుడై ప్రభువుతోపాటు పూజ లందుకున్న భటుడు శ్రీ ఆంజనేయుడు. శక్తి యుక్తి భక్తి సంగమించిన ఒక త్రివేణీతీర్థం శ్రీ ఆంజనేయుడు. స్వార్థ స్పర్శ లేకుండా జీవితాన్ని లోక కల్యాణానికి అంకితంచేసిన మహానుభావుడు శ్రీ ఆంజనేయుడు. ఆయన చరిత్రను, గుణగణాలను, ఘనవిజయాలను చక్కగా విశ్లేషించి సరళ సుందర శైలితో లోకానికందించిన సహృన్మణులు డాక్టర్ సుదర్శనాచార్యులుగారు. వారికి హృదయపూర్వక అభినందనలు. ఆలోచించటానికి, ఆనందించటానికి ఆచరించటానికి అనేకాంశాలున్న ఈ గ్రంథం అందరికీ అవశ్య పఠనీయం.

డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య ఎం. ఏ., పిహెచ్. డి.,
కార్యదర్శి, ధర్మప్రచార పరిషత్,
తిరుమల తిరుపతి దేవస్థానము–తిరుపతి.

పరిశోధనకు లభించిన సారస్వతాంశములను సమర్థవంతముగా విశ్లేషించి శ్రీ హనుమంతుని వ్యక్తిత్వాన్ని సమగ్రంగా చిత్రించిన డాక్టర్ సుదర్శనాచార్యులగారి కృషి శ్లాఘనీయం. రామాయణ సాహిత్య సాగరంలో నుండి వెలికి తీసిన మరో రత్నమే యీ ప్రబంధం.

డా॥ ఆర్. అనంతపద్మనాభరావు ఎం. ఏ., పిహెచ్. డి.,
డైరక్టరు, ఆకాశవాణి, అనంతపురం.

# ఆప్తవచనం

ఇది ఆంజనేయుడి పాత్రకు సంబంధించిన విజ్ఞాన సర్వస్వం. దైవిక శక్తులన్నీ ఏకత్రరాశీభూతమై, రెండు మూడు యుగాలకు విస్తరించి, ఒకరికి భక్తుడుగా, కోట్లాది ప్రజలకు ఆరాధ్యుడుగా - ఇలా వైవిధ్యంతోకూడి దైవ మానవ జంతు కోటితో సతులూ, సుతులూ అందుకొన్న పాత్ర ఆంజనేయుడు.

కలియుగంలో వైష్ణవ సంప్రదాయంలో భగవంతుడికంటె భక్తుడికే అధిక గౌరవం. ఆంజనేయుడు రామభక్తుడైనా, ఈనాడు ఊరూరా రామాలయాలున్నా, క్షేత్ర పాలకుడుగానో, రామబంటుగానో ఈ యాలయాల్లో దర్శనమిస్తూఉన్నా, కులమత ప్రాతిపదికలు లెక్కించక రాముడి బొమ్మగాక ఆంజనేయుడి బొమ్మ (తాయెత్తు) మణికట్టునో, రెట్టనో, మెడనో ఆశ్రయించి శక్తికీ, ధైర్యానికి రక్షణగా ఆరాధింపబడటం జగద్విదితసత్యం. అంతేకాక ఈనాడు పల్లెల్లో, పట్టణాల్లో జానపదులు, నాగరకులు శ్రీరామునికంటె ఆంజనేయుణ్ణే అధికంగా కొలవడం ఆయన విజయ సంకేతం. భూతప్రేత పిశాచాలు ఆయన పేరు స్మరించగానే పరుగెత్తి పోతాయని ప్రజల విశ్వాసం. రామభక్తులైన జాంబవదాదులకీ గౌరవం దక్కకపోవడం గమనించవచ్చు. లౌకికదృష్టిలో ఆంజనేయుడి పాత్ర ఇలాంటి విశిష్ట ప్రయోజనం సాధించింది.

ఇంక రామాయణ సుందరకాండ సీతాన్వేషణ ఘట్టంలోను, లంకా దహనంలోను, యుద్ధకాండలో రామలక్ష్మణులకు గావించిన సహకారంలోను ఆంజనేయుడి బహుముఖ ప్రజ్ఞ ఆధ్యాత్మిక దృష్టితో అనుశీలింపవలసినంత గహనమైంది.

"తెలుగు సాహిత్యంలో హనుమంతుని కథ - పాత్ర చిత్రణ" అనే సిద్ధాంత వ్యాసం డా॥ ఆర్. ఎస్. సుదర్శనాచార్యుల విశేష కృషి ఫలితం. ఈ గ్రంథాన్ని నేను దైవ ప్రేరణతో ఆమూలాగ్రం నిశితంగా చదవటం తటస్థించింది. తర్క వితర్కాలు, ఖండన మండనలు స్పృశించి, సంస్కృతాంధ్ర ఆంగ్ల హిందీ తమిళ గ్రంథాలలో ఆంజనేయుని పాత్రను పోషించిన రీతిని సూక్ష్మేక్షికతో పరిశీలించి, జీర్ణించుకొని, పరిశోధన ఫలితాన్ని శిష్ట వ్యావహారిక భాషలో ఆంధ్ర ప్రజానీకానికి అమూల్యోపహారంగా అందించిన ఆచార్యులు గారిని హార్దికంగా అభినందిస్తున్నాను.

డా॥ యన్. రామచంద్ర, ఎం. ఏ., పిహెచ్. డి.,
ఆంధ్రోపన్యాసకులు,
ప్రభుత్వ కళాశాల, ప్రొద్దుటూరు.

# విజ్ఞాపన

అంజనేయం మహావీరం బ్రహ్మవిష్ణు శివాత్మకమ్
తరుణార్కప్రభం శాంతం రామదూతం నమామ్యహమ్

"ఆపదా మపహర్తార"మని నుతికెక్కిన శ్రీరామునికే ఆపన్నివారకుడైన వాడు శ్రీ ఆంజనేయుడు. శ్రీ సీతారాముల వియోగదుఃఖాన్ని తొలగించి వారి ప్రాణముల నిల్పిన ప్రాణనందనుని పాత్ర వంటిది ప్రపంచ భాషలలో ఏ సాహిత్యంలో కూడా నభూతో న భవిష్యతి. సర్వజగద్రక్షకుడైన పరమాత్మని చతుర్యుగములలో సేవించిన భాగవతోత్తముడు శ్రీ ఆంజనేయుడు. 'దాసోఽహం కోసలేంద్రస్య' అని ప్రకటించుకొని ఆ శ్రీరామునికే పరతంత్రుడై, శ్రీరామార్పిత సర్వకర్ముడై మోక్షము మది కోరనొల్లని మహాత్ముడు మారుతి. నిర్హేతుకమైన భక్తియే ముక్తికన్నామిన్న అనే భాగవతవాక్యానికి ప్రత్యక్షసాక్షి పావని. మా గురువర్యులగు కీ॥ శే॥ ఆచార్య జి. యస్. రెడ్డిగారికి శ్రీ హనుమానుడే యిష్టదైవం. తమ ఇష్టదైవాన్ని గూర్చి పరిశోధన చేయటానికి వారు నన్నే నిర్ణయించి 'గైడు లేకుండా పరిశోధించు విధానము'లో (WITHOUT GUIDE REGULATIONS) నాచేత దరఖాస్తు పెట్టించి రిజిష్టరు చేయించారు. గైడుకాకున్నా అంతకన్నా మిన్నగా నాకు తోడైనారు. శ్రీ ఆంజనేయస్వామిని గూర్చి పరిశోధించే భాగ్యాన్ని కల్గించారు. వారి వాత్సల్యానికీ ప్రోత్సాహానికి నా జోహర్లు. పరిశోధనా విధానమును గూర్చి పలు సూచనల నందించిన కీ॥ శే॥ డాక్టర్ జే. శ్రీధరబాబు గారికి నా నివాళులర్పించుచున్నాను.

పరిశోధనకు నన్ను ప్రోత్సహించిన వారిలో నా చిరకాల మిత్రులు ఆచార్య ఎస్. గంగప్ప గారు డాక్టరు ఆర్. అనంతపద్మనాభరావు గారు ముఖ్యులు. ఎన్నో గ్రంథాలను నా అందుబాటులోనికి తెచ్చి తోడ్పడినవారు తిరుపతి ఓరియంటల్ లైబ్రరీ అధికారి డాక్టర్ ముదివేడు వేణుగోపాలరావుగారు అనంతపురం ప్రభుత్వ కళాశాలాంధ్రోపన్యాసకులు చిరంజీవి ఎన్. ఆదిశేషయ్య గారు, ప్రొద్దుటూరు పురప్రముఖులు డాక్టరు కే. వేంకట రమణాచార్యులుగారు నా సహాధ్యాయి గుంటూరు హిందూ కళాశాల ప్రిన్సిపాల్ డాక్టర్ పొన్నెకంటి హనుమంతరావుగారు - వీరందరికి నా కృతజ్ఞతాంజలి.

శ్రీ హనుమత్కథాంశముల కొన్నింటిని గూర్చి నాకు కల్గిన సందేహాలను పరిష్కరించడంలో పూజ్యశ్రీ భగవాన్ సత్యసాయిబాబాగారు, ఉభయ వేదాంత ప్రవర్తకులైన శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యస్వామివారు, మా గురువర్యులు సరస్వతీపుత్ర కీ॥ శే॥ పుట్టపర్తి నారాయణాచార్యులు గారు, శ్రీ అన్నదానం చిదంబరశాస్త్రిగారు, శ్రీ మామిళ్లపల్లి నరసింహంగారు నాకెంతో తోడ్పడినారు. ఈ మహాత్ములందరికీ నా ప్రణామములు.

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారు ఈ గ్రంథానికి ఆర్థిక సహాయమందించినందున దీనిని ముద్రించుటకు వీలయినది. మా ఇలవేల్పగు ఏడుకొండల శ్రీ వేంకటరమణస్వామికి, ఆయన దేవస్థాన కార్యనిర్వహణాధికారికి, వారి సిబ్బందికీ నా నమస్కారములు.

ఈ గ్రంథాన్ని 1988 లోనే ముద్రించాలని నేను చేసిన ప్రయత్నాలు నెరవేరలేదు. శ్రీ శంఖారాం ప్రభుత్వ డిగ్రీ కళాశాల, పుంగనూరులో ప్రిన్సిపాలుగా పనిచేయుచుండగా రాష్ట్ర ప్రభుత్వము ద్వారా నాకు ఉత్తమ ఉపాధ్యాయ పురస్కారము లభించిన సందర్భములో నన్ను సన్మానించటానికి స్వయంగా విచ్చేసిన కళాశాల ప్రధానదాతగారైన శ్రీ ఎస్. రామమూర్తిగారు నా యీ గ్రంథ ప్రచురణకై అయాచితంగా వెయ్యిన్నీ అరువది ఆరురూపాయిలు అరువది ఆరుపైసల ద్రవ్యసహాయాన్ని బ్యాంకి చెక్కుద్వారా పంపినారు. మంచి మనసుతో వారిచ్చిన విరాళము నాకు చేరిన వేళావిశేషమున ఆత్మీయ బంధుమిత్రులతో స్వామివారికి నాపైగల కృపకు నిదర్శనంగా భావిస్తున్నాను. ఈ గ్రంథ ప్రచురణలో నాకు తోడ్పడిన దాతలందరికీ దీర్ఘ ఆయురారోగ్య విజయ సౌఖ్యసంపదలను శ్రీస్వామివారు ప్రసాదించుటకై భక్తితో ప్రార్థించుచున్నాను.

ఈ పుస్తకాన్ని చదివి తమ అమూల్యమైన అభిప్రాయములనందించిన ఆప్తమిత్రులు శ్రీ పి. ఎస్. రామచంద్రరావు గారికి, డాక్టరు అప్పజోడు వేంకటసుబ్బయ్య గారికి, డాక్టర్ ఎన్. రామచంద్ర గారికి, డాక్టరు ఆర్. అనంత పద్మనాభరావు గారికి నా అభివాదములు. గ్రంథ ప్రచురణకుపక్రమించిన రోజునుండి పూర్తి అయ్యేదాకా నాకెన్నోవిధాల సహకరించిన డా॥ యన్. రామచంద్రను గూర్చి కేవలోపచార వాక్యముల పలుకలేను. నాకు రెండవ ఆత్మయైన రామచంద్రకూ నాకూ మధ్యగల స్నేహాన్ని చిరంజీవిని చేసినందుకు ఆనందించుచున్నాను.

సకాలంలో ముద్రించి గ్రంథాన్ని సుందరంగా తీర్చిదిద్దిన గాయత్రి ప్రింటర్స్ అధినేత శ్రీ కె. నరసింహారెడ్డి గారికి నా కృతజ్ఞతాంజలి.

కాపురానికి వచ్చినదాదిగా నాలుగు దశాబ్దాలుగా నా విద్యా విషయిక ప్రయత్నాలకు ప్రేరణకల్పించి తెలుగు ఎం.ఏ. డిగ్రీ, ఇంగ్లీషు ఎం.ఏ. డిగ్రీలకు తోడుగా డాక్టరేట్ డిగ్రీ పొందేవరకు నన్ను ప్రోత్సహించిన నా ధర్మపత్ని చి॥ సౌ॥ రాజ్యలక్ష్మి చేస్తున్న హనుమత్పూజాఫలితమే నా యీ కృషి. హనుమంతునికథ - పాత్రచిత్రణను గూర్చి నేను చేసినది సమగ్రమని నేను భావించడంలేదు; కేవలమిదొక ప్రయత్నమే. మతగ్రంథాలలో, ఇతర సాహిత్యాలలో, జానపదగాథలలో ఎన్నో అంశాలు నా దృష్టికి రానివి ఉన్నాయి. భవిష్యత్పరిశోధకులు వాటిని సాధించగలరని ఆశిస్తాను. విషయ ప్రతిపాదన లోనూ రచనలోనూ దొరలిన దోషాలను నా అవిద్యాఫలముగా భావించి మన్నింపగల సహృదయ పాఠకులకు నా సాదర ప్రణామములు.

త్యక్తసంగుడై ఫలాపేక్షరహిత కర్మయోగానికి కమనీయమైన అదర్శాన్నందించిన ఆంజనేయస్వామియే నాచేత ఈ కార్యాన్ని నిర్వహింపజేశాడని నా నమ్మకం.

ఆంజనేయః పూజితశ్చేత్ పూజితా స్సర్వదేవతాః
హనుమాన్మహిమాశక్యో బ్రహ్మణాపి నవర్ణితుం॥

హనుమద్భక్త జనసేవలో
ఆర్. ఎస్. సుదర్శనాచార్యులు

శ్రీ హనుమద్భక్తుల సహాయము

శ్రీ స్వామివారి కైంకర్యమునకై ఉదారముగా
విరాళములనిచ్చిన దాతలు.

| | | |
|---|---|---|
| 1. | శ్రీమాన్ బి. జి. రంగాచార్యులుగారు, కడప. | రు. 1116-00 |
| 2. | శ్రీమాన్ ఉప్పల శేషాచార్యులుగారు, కడప. | 1116-00 |
| 3. | శ్రీమాన్ కే. వి శేషాచార్యులుగారు, తెనాలి. | 1116-00 |
| 4. | శ్రీ ఎస్. రామమూర్తిగారు, శ్రీ శఖారాం ట్రస్టు – బెంగుళూరు. | 1066-66 |

| | |
|---|---|
| 5. శ్రీమాన్ తట్టా శ్రీరంగమన్నారుగారు, న్యూఢిల్లీ. | 558-00 |
| 6. శ్రీమాన్ ఉప్పల వేంకటకృష్ణమాచార్యులుగారు, పొంపల్లె. | 516-00 |
| 7. శ్రీమాన్ ఉప్పల పద్మనాభాచార్యులుగారు, ప్రొద్దుటూరు. | 501-00 |
| 8. శ్రీమాన్ జే. శ్రీనివాసరావుగారు, టి. అగ్రహారం. | 316-00 |
| 9. శ్రీమాన్ [illegible] రెడ్డి తిరుపాలురెడ్డి & కంపెని, ప్రొద్దుటూరు. | 316-00 |
| 10. శ్రీమాన్ పి. వి. ఎస్. ఎస్. నరసింహరావుగారు, కాకినాడ. | 120-00 |
| 11. శ్రీమాన్ టంకసాల సత్యనారాయణగుప్తగారు, పుంగనూరు. | 116-00 |
| 12. శ్రీమాన్ వేదాల యతిరాజ సంపత్కుమార్‌గారు, న్యూఢిల్లీ. | 116-00 |
| 13. శ్రీమాన్ విలకపట్టి పురుషోత్తంగారు, రాజంపేట. | 116-00 |
| 14. శ్రీమాన్ కే. వి. శేషాచార్యులుగారు, రాజంపేట. | 116-00 |
| 15. శ్రీమాన్ కే. వి. నారాయణగారు, కడప. | 116-00 |
| 16. శ్రీమాన్ ఆర్. వేంకటరమణగారు, కడప. | 116-00 |
| 17. శ్రీమాన్ ఆర్. రంగనాథంగారు, కడప. | 116-00 |
| 18. శ్రీమాన్ దరిశ భాస్కరయ్యగారు, కడప. | 116-00 |
| 19. శ్రీమాన్ మాకం ఆంజనేయులుగారు, కడప. | 116-00 |
| 20. శ్రీమాన్ జి. టి. నరసింహాచార్యులుగారు, కడప. | 116-00 |
| 21. డా॥ పి. భీమసేనరావుగారు, కడప. | 116-00 |
| 22. డా॥ ఎం. కృష్ణమూర్తిరావుగారు, కడప. | 116-00 |
| 23. శ్రీమాన్ ఆర్. వేంకటాచార్యులుగారు, బద్వేలు. | 116-00 |
| 24. శ్రీమాన్ ఆర్. రాఘవన్‌గారు, హైదరాబాదు. | 116-00 |
| 25. శ్రీమాన్ వి. ఎస్. రామానుజం, ప్రొద్దుటూరు. | 116-00 |
| 26. శ్రీమాన్ ఆర్. ఏ. రామకృష్ణగారు, కడప. | 116-00 |
| 27. శ్రీమాన్ ఆర్. ఎస్. ఫణికుమార్‌గారు, కడప. | 116-00 |
| 28. శ్రీమాన్ కోటా నరసింహారావుగారు, కడప. | 116-00 |
| 29. శ్రీమాన్ బి. జి. వాల్మీకి శేషాచార్యులుగారు, హైద్రాబాదు. | 100-00 |
| 30. శ్రీమాన్ జి. కృష్ణమాచార్యులు, ప్రొద్దుటూరు. | 100-00 |
| 31. శ్రీమాన్ బి. కావేరిశెట్టిగారు. కడప. | 58-00 |
| 32. శ్రీమాన్ పొద సుబ్బయ్యగారు, టి. అగ్రహారం. | 50-00 |
| 33. శ్రీమాన్ బొడ్డా సుబ్బరావుగారు, టి. అగ్రహారం. | 50-00 |
| 34. శ్రీమాన్ ఆర్. వరదరాజన్‌గారు, కడప. | 50-00 |

# విషయసూచిక

## అధ్యాయము 1. హనుమంతుని జన్మవృత్తాంతము



## అధ్యాయము 2. బాల్యయౌవన వృత్తాంతము



## అధ్యాయము 3. శ్రీరామ సందర్శనము



## అధ్యాయము 4. సీతాన్వేషణము



## అధ్యాయము 5. లంకలో హనుమంతుని సాహసకార్యాలు

## అధ్యాయము 6. రామరావణ యుద్ధము-హనుమంతుని పాత్ర



## అధ్యాయము 7. అయోధ్యలో హనుమంతుడు



## అధ్యాయము 8. ద్వాపరయుగమున హనుమంతుని వృత్తాంతము



## అధ్యాయము 9. హనుమంతుని పాత్రచిత్రణ

## అధ్యాయము 10. హనుమంతుని గుణగణాది విశేషాలు

# తెలుగు సాహిత్యములో హనుమంతునికథ - పాత్రచిత్రణ

## అధ్యాయము I.

## 1. ఉపోద్ఘాతము :

శ్రీరామదాసుడగు ఆంజనేయుని ఆసేతు శీతాచలం అన్నిప్రాంతాలవారు కొలుచుచున్నారు. మనదేశంలో రామమందిరంగానీ, మరి హనుమంతునిగుడి కానీ లేని తావే లేదు. ఆంజనేయునారాధించువారిలో హైందవేతరులుగూడ ఉన్నారు. ఆంధ్రుల నిత్యజీవితములో ఆంజనేయస్వామికి ఎంతో స్థానమున్నది. తెలుగులో ఈ మహాత్ముని కథ ఏవిధంగా ప్రతిబింబించిందో తెలుసుకోవాలన్న ఆసక్తి నాలో అధికం కాగా, సాహిత్యపరిశోధనకు పూని, మా ప్రియతమ గురువర్యులగు ఆచార్య శ్రీ జి. ఎన్. రెడ్డిగారిని కల్సుకోగా, నా పూర్వపుణ్య విశేషమునకు తగినట్లుగా "తెలుగు సాహిత్యములో హనుమంతునికథ - పాత్ర చిత్రణ"ను నాకు పరిశోధనాంశముగా వారాదేశించగా నేనీ ప్రయత్నమునకు పూని, ఇది నా జన్మ చరితార్థమగునట్లు చేయగల ప్రయత్నముగా భావించి క్రీ.శ. 1978లో నాకృషికి శ్రీకారము చుట్టితిని. ఇంకొక ప్రబల కారణము గూడ నన్నిందుకు ప్రోత్సహించినది. ఈనాడు జనులలో ధార్మికత ద్రుతమై, నీతి మృగ్యమై ధనార్జనమే జీవితధ్యేయమై, దౌర్జన్యయుతమగు అవినీతియే దానికి సాధనమై, స్వార్థము పరాకాష్ఠకు చేరియున్నది. శ్రీరామ, శ్రీకృష్ణుల వంటి పురుషోత్తములు, సిద్ధార్థుడు, రామకృష్ణ పరమహంస, వివేకానంద స్వామి, గాంధీజీవలె ఉదాత్తాదర్శములతో జనతను ప్రభావితము చేయగల నాయకులు కరువైపోగా, సమాజము 'కాననివాని నూతగొని నభీష్ట వస్తువుం గానని భంగి' సాగుచున్నది. యువత తమ ధర్మమేదో తెలియక క్రమశిక్షణ, బ్రహ్మచర్యము, జ్ఞానతృష్ణ, సచ్ఛీలములకుద్వాసన పలికి క్షణికోద్రేకతత్పరులై హింసామార్గమున దుర్వినయమునకు పాల్పడుచుండుట నా హృదయమున కెంతో బాధ కలిగించుచుండగా, హనుమంతుని ఘనతను చాటినచో జాతికి మేలు కలుగునని యీ పరిశోధనకుపక్రమించియున్నాను. త్రికరణశుద్ధీ, బ్రహ్మ

చర్యమూ, శక్తీ, యుక్తీ, భక్తీ, అసాధ్యసాధక ప్రతిభా విశేషములూ గల హనుమంతుని జీవితమే ఒక సందేశముగా జాతిని ఉద్ధరించగలదని నా విశ్వాసము.

భారతీయుల సనాతన ధర్మము విశిష్టమైనది. సకల మత సారమును అది తనలో కలుపుకొంటూ వచ్చినందున ఏకేశ్వరోపాసనకు అంకితమైన పద్ధతికి బదులు బహు దైవముల నుపాసించు విధానమే వేరూనినది. అందు వలన ముప్పదిమూడు కోట్ల దేవుళ్లు ఏర్పడినారు. ప్రతియొక్క వ్యక్తికి ఇష్ట దైవం, కులదైవం, గ్రామదైవం అని ముగ్గురుపాస్యదేవతలుండడమేకాక కొత్తకొత్త రూపాలతో, కొత్తకొత్త పేర్లతోకూడ దైవాలు ఏర్పరచుకొనడం జరుగుతూనే వుంది. 'యే యథామాం ప్రపద్యన్తే తాం తథైవ భజామ్యహం'[1] అని భగవద్గీతలో పరమాత్ముడే చెప్పినట్లుగా ఎవరెవరు ఏ యే రూపాల్లో ఆరాధిస్తారో వారికాయారూపాలద్వారానే తరణోపాయమనుగ్రహించెదనని (గీతాచార్యుడు చెప్పినట్లుగా) భక్తుల భిన్న మనః ప్రకృతులకు తగినట్లుగా దేవుళ్ల సంఖ్యకూడా పెరిగినది. కవితావిర్భావానికనుగుణమైన ఛందస్సు లనంతముగా ఏర్పడినట్లే బహునామములతో, బహు రూపములతో దేవుళ్లు కూడా వెలసినారు. కాని వీరిలో కొందరికి అధిక ప్రచారమూ ప్రసిద్ధి యేర్పడి నది. త్రిమూర్తులు, త్రిమాతలు, సూర్యచంద్రులు, నవగ్రహములు, దిక్పాలకులు తరు గిరి ధాత్రీ రూపాలు, మత్స్య కూర్మ వరాహ నారసింహ హయగ్రీవ రూపాలూ, నందీశ్వరుడు, గజాననుడు, గరుత్మంతుడు, శుకుడు, నాగేంద్రుడు, భైరవుడు, ముఖ్యులు. మర్కటరూపుడగు హనుమంతుడుకూడ వారిలో ఒకడు. ఇతనినిగూర్చి తెలుగు సాహిత్యములో ప్రతిబింబించిన అంశములను పరిశోధించి హనుమంతుని కథనూ, పాత్రనూ గూర్చి తెలుపుటయే నా ప్రయత్నము. 'ఆత్మానం మానుషం మన్యే'[2] అని శ్రీమద్రామాయణమున శ్రీరాముడు తనను మానవమాత్రునిగా చెప్పుకొనినట్లే హనుమంతుని దైవముగా కన్నా, సామాన్య వ్యక్తిగానే చూచి నా పరిశోధన చేసినాను. అట్లని హనుమంతుని ప్రశస్తినీ, ఘనతనూ తగ్గించడానికిగానీ, హెచ్చించడానికిగానీ అతని దైవత్వాన్ని మరుగు పరచడానికిగానీ నేనేలాంటి ప్రయత్నమూ చేయలేదు,

హనుమంతుని చరిత్ర ఇతివృత్తంగా కలిగిన గ్రంథాలు తెలుగులో తక్కువ. సంస్కృతభాషలో అగ్నిపురాణము, పద్మపురాణము, శివపురాణము,

వాయుపురాణము, భవిష్యత్పురాణము, విష్ణుపురాణము, వాల్మీకిచే రచింపబడిన శ్రీమద్రామాయణము, పరాశర సంహితాది గ్రంథాలు, శామరహస్యోపనిషదాదులు, భారతము, భాగవతము, దేవీ భాగవతము మొదలైన గ్రంథములు హనుమత్సంబంధమగు కథాంశములు కలిగియున్నవి. ఈ గ్రంథములు కొన్ని తెలుగులో అనువదింపబడియున్నవి. పుష్పగిరి తిమ్మన వ్రాసిన 'సమీర కుమార విజయము' మాత్రము హనుమంతుని కథను తెలుపుటకే వెలసిన గ్రంథము. తిమ్మన ఇందులో తెలిపిన కథాంశములు ఏ యే మూల గ్రంథముల నుండి గ్రహించినాడో తిమ్మన తెలిపియుండలేదు. అవాల్మీకములగు రామాయణములు సంస్కృతముననే చాలా కలవు. వీటికి తెలుగులోకూడ అనేకానేక అనువాదాలు వెలసినవి. శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారి ధర్మసార రామాయణమునకు పీఠిక వ్రాయుచు శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు—"ఆనంద, యోగవాసిష్ఠ, హనుమ, లఘుబృహత్, అధ్యాత్మ, నారద, వసిష్ఠ, అగస్త్య, భరద్వాజ, శివ, భరత, దేవీ, గుహ్యక, మంగళ, రవి, పులస్త్య, విశ్వామిత్ర, సుతీక్ష్ణ, విభీషణాది సంజ్ఞలతో వెలసిన రామాయణాలు వాల్మీకి తర్వాత వెలసినవి. ఇట్లు రామాయణములు వేలకొలది వెలసినవని వక్కాణించునది మురారి అనర్ఘ రాఘవము. ఈ గ్రంథాలన్నీ ఆ యా ఋషుల పేర్లపై అన్యులు వ్రాసినట్లుగా ఊహింపదగును"—అని వ్రాసియున్నారు.[3] వీనిలో కొన్నింటిని మాత్రమే నేను పరిశీలించినాను. జైన బౌద్ధ మతసాహిత్యములలో రామకథ వైదికధర్మ విరుద్ధముగా ప్రతిపాదింపబడినందున వానిని పరిశోధనలో వాడుకొనలేదు. భారతము, భాగవతము మొదలగు గ్రంథాలలో హనుమంతుని ప్రసంగ విశేషములున్ననూ వానిలో పునరుక్తులున్నవి. రామాయణ రచయితలు శ్రీరామునికి ప్రాధాన్యమునిచ్చి వ్రాసియున్నారేకానీ హనుమంతునికి ప్రాధాన్యము నీయరైరి. తమ కాలమునకనుగుణముగాను, తమ ప్రతిభకు తగినట్లుగాను వారు వాల్మీకి తెలుపని ఎన్నో అంశములను కల్పించియున్నారు. హనుమంతుని రామకింకరునిగా, రామభక్తునిగా రామదూతగా చిత్రించు ప్రయత్నమును వారు చేసియున్నారేకానీ బాల్యమాదిగాగల హనుమజ్జీవిత కథాంశములను వారు పేర్కొనలేదు. హనుమంతుని దైనందిన జీవిత ప్రతిక్షణానుభూతులను గానీ, అతడు నివసించిన సమాజస్వరూపమును గానీ వారు ప్రతిపాదింపరైరి. తమ కావ్య కళాధర్మమునకు తగినట్లుగా, కథావసరమును

బట్టి కొంతవరకే హనుమంతుని పాత్రను మలచియున్నారు. రామకథ ధార్మిక బోధకూ, నైతిక ఉపదేశానికి వాడియున్నందున పరిశోధనకు కొన్ని చిక్కులు ఎదుర్కొనవలసి వచ్చినది. ఆ యా గ్రంథాలలోని కవితా ముసుగును (Poetic Garb) తొలగించుకొని విషయముల గ్రహించుట; స్తుతులు, స్తోత్రాలు, మంత్రములలోని అత్యుక్తుల స్వీకరించుటలో విచక్షణతో వ్యవహరించుట; చతుర్యుగములలో వ్యక్తమగు హనుమంతుని కథలోని సన్నివేశములనూ, చారిత్రక క్రమమునూ గుర్తించుట; ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత మత సంప్రదాయములలో గల వ్యత్యాసముల వలన కథాంశములలో గల తేడాలను గమనించుట ఇందులో కొన్ని. హనుమంతునికి భూత ప్రేత పిశాచాదుల నణచివేయు మహిమలున్నందున అతనియెడ వాగ్రూపముగాగానీ, క్రియా కర్మాదులవలన గానీ ఏదైనా అపచారము జరిగినచో దానివలన కీడు మూడునను విశ్వాసము చాలామందికున్నందున వారివారి మత విశ్వాసములకు భంగకరము కాని రీతిలో నేను వ్యవహరింపవలసి వచ్చినది. లభ్యస్థ ఆధారములలో హనుమంతునికి సంబంధించిన అంశములను యధాతథముగా స్వీకరించితినే కానీ ఆ యా గ్రంథముల ప్రామాణికతను గూర్చికానీ, వారుగ్గడించిన విషయముల మూలములను గూర్చికానీ నేను విమర్శించలేదు. తెలుగు సాహిత్యములో ప్రతిబింబించిన హనుమంతుని కథను, పాత్రచిత్రణను గూర్చి తెలుపుటకు మాత్రమే నా ప్రయత్నము పరిమితము. అన్యభాషా గ్రంథములలో లభించిన కథాంశములను ప్రధానాధారములుగా కాక విశేషాంశముల తెలుపుటకే వినియోగించుకొన్నాను. ఈ పరిశోధనలో హనుమత్సంబంధమగు ఉపాసన, శ్రీవిద్యోపాసన, కుండలినీశక్తి, తంత్రరహస్యములు, అర్చనావిధులు మొదలగు వానిని గూర్చి తెలుపు ప్రయత్నము ఏమాత్రము లేదు.

సిద్ధాంత రచనలో నేననుసరించిన మార్గము:— కాలక్రమమున మొదటిదగు వాల్మీకి రామాయణములోని అంశములను ప్రథమమున తెలిపియున్నాను. శ్రీ వావిలికొలను సుబ్బరావుగారు యథా మూలముగా దీనిని అనువదించియున్నారు కావున వారి అనువాదమును దానికి వారు వ్రాసిన 'మందరము' అను వ్యాఖ్యను స్వీకరించియున్నాను. ద్వితీయ స్థానమున పరాశరసంహిత అను పేరగల ఆంజనేయ చరిత్ర దీనిని శ్రీ అన్నదానం చిదంబరశాస్త్రిగారు అనువదించియున్నారు. అటుతర్వాత పురాణములలోని అంశములు తెలిపి

యున్నాను. ఆతర్వాత తెలుగులో ప్రథమ రామాయణమగు రంగనాథ రామాయణము, నిర్వచనోత్తర రామాయణము, భాస్కర రామాయణము, కంకంటి పాపరాజు ఉత్తర రామాయణము వగైరాలను స్వీకరించియున్నాను. పంచమ స్థానమున స్వీకరించిన గ్రంథం పుష్పగిరి తిమ్మనకృత 'సమీర కుమార విజయము.' హనుమంతుని కథను విపులముగా తెలిపిన ఏకైక చంపూ కావ్యమిది. రామాయణమున లేని ఎన్నో అవాల్మీకములగు కథాంశము లిందున్నవి. తిమ్మన ఆ యా కల్పనలను ఏ యే మూలాధారములనుండి గ్రహించెనో తెలుపుటకై నేనెక్కువగా శ్రమ తీసుకొనలేదు. తక్కిన ఆంధ్ర భాషా గ్రంథములలోని అంశములు, అన్యభాషలలో కల అంశములనూ పేర్కొని యున్నాను.

## 2. హనుమంతుని జనన వృత్తాంతము

శ్రీ మద్రామాయణము సుందరకాండమున హనుమంతుని జనన వృత్తాంతమున్నది. దీనిని హనుమంతుడే స్వయముగా సీతాదేవికి తెలిపి యున్నాడు. శంబసాదనుడను రాక్షసుని చంపిన కేసరియను వానర పుంగవునకు అతని భార్యయందు వాయుదేవుని వలన తాను జన్మించినట్లు హనుమంతుడు తెలిపియున్నాడు.[4] కిష్కింధాకాండమున హనుమజ్జనన కథను జాంబవంతుడు తెలిపియున్నాడు. "పుంజికస్థల అను అప్సరస శాపముచే వానరస్త్రీయై కుంజరుడను వానరునకు పుత్రియై జన్మించి కామరూపధారణా శక్తి కలదై కేసరి అను కపికాంతునికి భార్యయై ఒకనాడు మానవ స్త్రీ రూపమున సంచరించుచుండెను. కొండగాలికి ఆమె కట్టిన వస్త్రము తొలగిపోగా, ప్రకాశించిన ఆమె సౌందర్యమునకు వాయుదేవుడాకర్షితుడై ఆమెను కౌగిలించెను. తన పాతివ్రత్య భంగకారణమునకామె చింతించసాగగా వాయుదేవుడామెనోదార్చి "నేను నిన్ను సర్వదా తాకుచుండు వాయుదేవుడను. నా స్పర్శవలన నీకు పాతివ్రత్యహాని లేదు. నావలన నీకు నావంటి మహాబలవంతుడు పుత్రుడుదయించును. దాని వలన నీకు కీర్తి కలుగును" తెలుపగా దానికామె సంతోషించి, పోయి ఒక కొండ గుహలో నిన్ను కనెను. కావున నీవు వాయుదేవునకు ఔరసుడవు" కేసరికి క్షేత్రజుడవు"—అని జాంబవంతుడు హనుమంతునికే ఈ కథను తెలిపెను.[5] రామాయణోత్తర కాండమున

హనుమంతుని సమక్షమందే అగస్త్యుడాంజనేయుని జనన వృత్తాంతమును శ్రీరామునకు తెలిపెను. మేరుపర్వత ప్రాంతమున కేసరి అంజనతో నుండగా వాయుదేవుని వరము వలన అంజన కుమారుని కనినట్లు అగస్త్యుని వచనము.[6]

పరాశర సంహిత ప్రకారము హనుమంతుని జనన కథ:– దేవతలకు రాక్షసుల బాధ అధికమైనందున వారిని నాశనము చేయు చింతతో వారు బ్రహ్మనాశ్రయించిరి. బ్రహ్మ వారిని తనవెంట కైలాసమునకు వెంటబెట్టుకొని వెళ్లి శంకరుని దర్శించెను. రాక్షసవధోపాయముగూర్చి అడిగిన బ్రహ్మకు శివుడు సమాధానమేమియు తెలుపక వారిని అందరిని బదరికాశ్రమమునకు తరలించి శరణాగత రక్షకుడగు నరనారాయణునడిగెను. అపుడా నారాయణుడు దేవతలయొక్కయు తనయొక్కయు తేజస్సులను సంగ్రహించి దానినొక ముద్దగా చేసి శంకరునకివ్వగా అతడు దానిని మ్రింగెను. శివునిలో ప్రవేశించిన ఆ తేజస్సు నుండి బలవంతుడగు నొక వానరుడు జన్మించుననియు తద్వారా రాక్షస నిర్మూలన మగుననియు తెలిపెను. దేవతలు సంతసించి వెళ్లిపోయిరి. కొంతకాలము తర్వాత శివుడు సతీసమేతుడై శ్రీ వేంకటాచలము చేరి అచట విహరింపసాగెను. రతిక్రీడ సల్పుచున్న కోతిజంట యొకటి వారికాకొండపై కనబడెను. ఆ దృశ్యము చూచి పార్వతి సిగ్గుపడుచుండగా, శివుడది గమనించి తాము కపిరూపమున విహరించుటకు పార్వతినొడబరచి మర్కట మిథున క్రీడకుపక్రమించెను. వేయి సంవత్సరములావిధముగా వారు రతిక్రీడ సలిపిరి. శ్రీవిష్ణువుద్వారా తనలో చేరియుండిన దివ్యతేజమును శివుడు పార్వతి గర్భమున ప్రవేశపెట్టి రతి విరమించెను. శివతేజమును పార్వతి భరింపజాలక దానిని అగ్నియందుంచెను. అగ్నియు దానిని దాల్ప శక్తిలేక దానిని వాయువు నందుంచెను. భర్త ఆజ్ఞపై పుత్రార్థినియై కేసరికాంతయగు అంజనాదేవి ఆకాలమునందే తపమొనరించుచుండెను. ప్రతిదినమామెకొక ఫలము నిచ్చు వాయుదేవుడా శివతేజము నామె చేతిలో నుంచెను. దానిని ఫలమనుకొని ఆమె భక్షించెను. అనతికాలములో తనలో కలిగిన గర్భ చిహ్నముల నామె గమనించి, సిగ్గుచెంది, బాధతో తన పాతివ్రత్య భంగమునకై పరితపించుచుండగా "నీకు వ్రతభంగమేమియులేదు. దైవానుగ్రహమున నీకు మహాపురుషుడొకడు జన్మించును" అని ఆకాశవాణి ఘోషింపగా ఆమె విని ఆనందించెను. తర్వాత ఆమె ఆంజనేయుని పుత్రునిగా పొందెను.[7]

పురాణములలో హనుమంతుని జనన వృత్తాంతము: పార్వతీపరమేశ్వరులు గోలాంగూలములై విహరించుచుండగా వారిని వాయుదేవుడు సమీపించి తనకొక పుత్రుని ప్రసాదింపుమని వేడెను. పరమేశ్వరుడు సమ్మతించి తత్సమయమున స్ఖలనమైన తన వీర్యమును వాయుదేవుని చేతిలో పడునట్లు చేసెను. ఆ వీర్యమును వాయుదేవుడు అంజన చేతిలో నుంచెను. ఫలమనుకొని ఆమె దానిని భక్షించెను. తత్ఫలితముగా ఆమెకొక పుత్రుడు కలిగెను. అతడే అంజనేయుడు. తన చేతిలో పడిన పదార్థము ఫలమా! వీర్యమా! అని ఆమె గుర్తింపలేకపోవుటకొక కారణము ఆమె కళ్లుమూసుకొని యుండుటయే. దీనికొక పూర్వకథ కలదు. పతికి ద్రోహము చేయుచు తన తల్లియగు అహల్య సంక్రందనునితో సంగమించుటను చూచిన బాలిక అగు అంజన ఆ సంగతి తండ్రియగు గౌతమునకు తెలిపెను. దీనికై అహల్య ఆగ్రహించి 'ఆడుదానివై యుండికూడ ఆడుదాని గుట్టు కాపాడనందుకు నీవు మర్కట రూపుడగు పుత్రుని పొందెదవుగాక" అని అంజనకు శాపమిచ్చెను. అంత అహల్య శాపమునకు ప్రతిగా, అంజన "నేను వివాహమాడినగదా నాకు కోతిరూపుగల కుమారుడుదయించుట. కావున నేనింత నుండి బ్రహ్మచర్య దీక్షనుపూని అరణ్యములలో తపమాచరించుచు జీవితము వెడలబుచ్చెదను. కన్నులు తెరచినగదా ఏ పురుషుని యందైనా మనమాకర్షింపబడుట జరుగును. కావున నేను జీవితాంతము గ్రుడ్డిదానివలె నా నేత్రములను మూసికొని చరించెదను" అని అంజన ప్రవర్తించినందున ఆమె తపము చేయుచో తన చేతిలో పడిన పదార్థము పండో, వీర్యమో అని గుర్తింపకపోయెను.[8] బ్రహ్మవలన రావణుడు వరములను పొందుచో వాడు నరవానరులను హీనముగా భావించి తనకు మృత్యువు ఎవరి వలన రాకూడదో పేర్కొనుచో నరవానరులను వదలివేసెను. వాడు లోక కంటకుడు కాగా వానిని వధించుటలో నరవానరములే శరణ్యమని బ్రహ్మ విష్ణువునకు తెలిపెను. నిత్య శివపూజా తత్పరుడగు రావణుని వధించుటలో విష్ణువు శివుని సాహాయ్యము కోరెను. శివుడంగీకరించి తాను హనుమంతుడై జన్మించి రావణ వధోద్యోగమున రామునికి తోడ్పడగలనని తెలిపినందున అంజనేయుడు వానరాకారమున జన్మించెనని యిదే పురాణమున కలదు.[9]

ప్రాచీన దేవీభాగవత కథ ప్రకారము: దశకంఠుడు దేవిని ప్రార్థించి త్రైలోక్యవిజయుడయ్యెను. వానిని నిర్జించు ఉపాయమును తెలుపుమని

త్రిమూర్తులు దేవిని కోరిరి. "రావణుని పురమును నేను రక్షించుచున్నాను. వీడెన్ని దుర్మార్గముల జేసినా వీనిని సంహరించుటకు వీలుకాదు. విష్ణువు మానవావతారము ధరించినపుడతనికి సహాయపడుటకై శివుడు హనుమంతుడుగా అవతరించును. అపుడు నేను లంకను వీడి వచ్చెదను. దానివలన రావణ వినాశ మవలీలగా జరుగును" అని దేవి తెలిపెను.[10]

ఆనంద రామాయణము ప్రకారము: రుద్రులంతా వానరులుగా, సంజీవనీ ముద్రతోనూ, కామరూప ధారణాశక్తితోను జన్మించగా సాక్షాత్ ఏకాదశరుద్రుడే హనుమంతుడుగా జన్మించెను. యుద్ధరంగమున నాగపాశ బద్ధుడైన రాముడు గరుత్మంతుని స్మరించగా, అతడేతెంచి సాక్షాత్ రుద్రుడే హనుమంతుడై అవతరించి యుండగా తనను రాముడు స్మరించుటయేల? అని గరుత్మంతుడనినట్లు ఆనందరామాయణకథ.[11] కేసరి అను వానరరాజుకు ఇద్దరు భార్యలు. అంజనాదేవి మార్జారాస్య. ఒకరోజున అంజనాద్రిలో విహరించుచున్న అంజన ఎదుట (సువర్చల అను పేరుగల) ఒక గ్రద్ద పాయస మయమైన పిండమును వైచెను. ఇది దశరథ సతియగు కైక చేతిలోని పాయసమే. ఆ ముద్దను అంజన భక్షించెను. అక్కడికి మార్జారాస్య రాగా వారిరువురు ఆ గిరిపై విహరించుచుండిరి. వాయుదేవుడపుడచట వారి వస్త్రముల నెగురకొట్టెను. వారి జఘన ప్రదేశముల జూచుట వలన వాయువు కామ మోహితుడయ్యెను. అతడు అంజనాదేవిని సమ్మతింపజేసి ఆమెను సురతమున పొందెను. దశరథ మహారాజ యజ్ఞప్రసాద భక్షణం వలనను వాయుదేవుని సంపర్కము వలనను అంజనకు కుమారుడుదయించెను. ఇతడే అంజనేయుడు.[12]

సమీరకుమార విజయము ప్రకారము హనుమజ్జనన కథ: శ్రీకరమూర్తి సర్వబుధసేవితుడగు పావని ఏకపాదరుద్రాకారుడని శ్రీరాముడు సీతకు తెలిపెను. హనుమంతుడేల కపిగా అవతరించెనో తెలుపుమని సీత కోరగా శ్రీరాముడు హనుమజ్జననవృత్తాంతమునతి విపులముగా ఆమెకు విశద పరచెను. "ఏ విద్యచేత సంసార బంధము సడలునో అది నా ప్రథమ పాదము శివుడా విద్యలో దివ్యానుభూతితో సదా వెలంగుచుండును కావున అతనికి ఏకపాదుడని పేరు. ఇతనిని ముప్పదిరెండర్బుదముల రుద్రులనుసరించు చుందురు. జ్ఞానశక్తితోగూడి ఏకపాద రుద్రుడీ అజాండము నేలుచుండును.

ఇచట బ్రహ్మ 'ప్రద్యు' సమాఖ్యతో నుండి సృష్టి చేయుచుండును. ఏకపాద రుద్రుని కరుణవలన ఇచట ప్రాణులు కాలకర్మము లెఱుగరు. వీరికి గాలిత్రోవల లీలగతులుండును. వీరికి ఆకలి దప్పు లెడలియుండును. అణిమాది సిద్ధులతో వలయు రూపములను గాంచుచు తలపులెందున్నా చలన మొందని రీతి గలవారుగా నుందురు. పుట్టినప్పుడే యౌవనము పొందిన వీరికి ఏ వేళలో మారుని కాకలు కలుగవు. ఇచటి ఏకపాదరుద్రుడూహింప వశముకాని మహిమలు కలవాడు. ఇతనిని రుద్రులు వినుతించుచుండగా "మాం రక్ష" అని ప్రద్యుమ్నడెంచుచుండును. ఇచ్ఛాశక్తి మొదలగు రమణీ మణులు ఏకపాదరుద్రునకు చామరములు వీచుచుందురు. శాంతి, దాంతి, విరక్తి మొదలగు సత్త్వాది గుణాలు ఆకారములు దాల్చి కొలుచుచుండును. ఈతడు నన్ను 'నిష్కళంకరూపమున మనమున చింతసేయు ధన్యుడు. ఒకానొకచో నా దివ్యమంగళ విగ్రహము దివ్య తేజోమయమై ఈ ఏకపాదరుద్రుని మనమున తోచగా ముప్పిరిగొను భక్త్యనురాగ సంభ్రమములతో ఆపోటు వదలి, డెందంబు కందళింప, తన మనోవృత్తి ననుసరించు శరీరంబు సభ్యత్యా-పరివారంబుగా మఱచి, దూరమున నున్న ఆ దివ్యతేజము చేరుటకై కూర్చున్న యటుల తద్గగనంబున కుద్యమించగా, నచటివారది గమనించి పలుతెఱంగుల భావించి 'రక్ష–రక్ష' అని కొంత దవ్వరుగుదెంచి రాగా ఆ రుద్ర విగ్రహంబు దృగ్గోచరంబు గామి, జ్ఞాన క్రియా ప్రముఖ శక్తులు, షడ్గుణైశ్వర్యాదులు అతని ననుసరించి వచ్చినవి. తక్కిన రుద్రులు అతనిని చింతించుచు కొంత కాలమునకు పునరావృత్తి రహితంబగు రామపదము ప్రాపించిరి. ఆ ఏకపాద రుద్రుడు శతకోటి భానుప్రభా సముద్దీపంబగు ఆ తేజోరూపమున కున్ముఖుడై మరుద్గతినతిశయించు మనోగతియు, మనోగతినతిశయించు దర్శనాభిలాషయు, తదనుకూలంబగు దృగ్జాలంబు మేలంబు సూరెను, ప్రాణ, పంచేంద్రియములా నా దివ్యతేజమునందే పొందించి, మహత్త్వావరణంబు మీరి, అహంకార సాలంబు దూరి, భూతాకాశంబు డాసి, సత్య తపోలోకంబుల త్రోవలం బడి స్వర్లోకవాసులకాశ్చర్యంబు కల్గించి భువర్లోకంబు తరించి, కైలాసంబు చేరి, రామతారక బ్రహ్మ మంత్ర జపానుష్ఠాన నిష్ఠాగరిష్ఠుండైన ఆ శంకరుని నాసికా రంధ్రాంతరాకాశపథంబున ప్రవేశించిన ఆ తేజోవిశేషము వెంట తానుగూడ ఆ భూతనాథుని చేతనం బ్రవేశించెను. ఈశానుని మూర్ధసీమలో చేరి సుషుమ్న జొచ్చి వెన్నాడి, హృదయాకాశమున ఆరాముని కానక అతనిలో నీట నీరువలె

కాయము భేదములేక ఏకమైపోయెను. జగత్కారణమూర్తి కావగిన కారణమీ ఏకపాదరుద్రుని యందున్నందున ఈతడే ఆంజనేయుడై జన్మించెను" అని రాముడు సీతకు హనుమజ్జననకారకమగు పూర్వకథ తెలిపెను.

ఈ ఏకపాదరుద్రాంశ సహితుడగు శివుడొకనాడు వనవిహారమునకై బయలుదేరి పార్వతినిగూడ తనవెంట తీసుకొని వెళ్లెను. అది వసంతఋతువు. అధికోల్లాసముతో వారందు మన్మథ వ్యాపార పరతంత్రులై విహరించబోగా వారి దృష్టికొక మర్కట మిథునము 'మన్మథ సుఖస్థితి'లో క్రీడసేయుట గోచరించెను. గిరికన్య శివుని ముఖము చూడలేక సిగ్గుచెందగా శివుడామెను గమనించి తామునూ అట్టి మర్కట రూపమున విహరింతము గాక అని పలికి 'మర్కటాకృతిన్ జిగురు కటారి వజీరుని కేళి'లో నామెను తేలించెను. సురతానంతరం లీలాభరిత కపి దంపతీత్వముడిగి ఆత్మరూపముల వారు ధరించు సమయములో పార్వతీసతి ఆ తెల్లని వేలుపు తేజపుభారము భరింపఁ దేకువ లేక దానిని 'వేఱొండెడజేర్పగదే' అని కోరెను. అపుడు శివుడు మందహాసముతో ఆ తేజమును ధారుణియందిడెను. భూదేవి అ తేజాన్ని దశ శతవర్షంబులు మోసి కృశించి, మోయజాలక, 'దీనినీవేడనైనను నిల్పవే పరమేశ ద్రుమొక్కెదన్' అని పలికెను. దానిని భరింపుమని శివుడు అగ్నిదేవుని కోరెను. అతడును వేయి సంవత్సరములా తేజమును మోసిన తర్వాత దానిని తాను భరింపలేనని శివునితో పలుకగా, శివుడు వాయుదేవుని పిల్చి ఆ తేజమును వహింపుమనెను. ఆ వాయుదేవుడు దానిని వెయ్యేండ్లు భరించి అంజనాదేవి కివ్వగా తత్ప్రభావమున ఆమెకు అంజనేయుడు జన్మించెను.[13]

ఆంజనేయుని తలిదండ్రులగు అంజనాదేవి కేసరికపి గారలను గూర్చి వారి పూర్వవృత్తాంతములు సమీరకుమార విజయము విపులీకరించి యున్నది. బ్రహ్మ అపూర్వ సౌందర్యముతో అహల్యను సృష్టించెను. ఆమె గౌతమునికి సతియైనను ఇంద్ర సూర్యులామెను కామించి అనుభవించిరి. ఇంద్రునివలన వాలి, సూర్యునివలన సుగ్రీవుడు ఆమెకు కలిగిరి. ఆమె తప్పిదమును బ్రహ్మ వాక్యానుసారము క్షమించి గౌతముడహల్యతో జీవించి ఔరసపుత్రిగా అంజనాదేవిని పొందెను. తమకము తీరని ఇంద్రుడు మరల అహల్యను చేరవచ్చెను. తన తల్లి అహల్య ఇంద్రుని పొందుటను గూర్చి అంజన తన తండ్రికెరిగించెను. గౌతముడంత అహల్యను పాషాణమగునట్లుగా శపింపబూనెను. రెండవమారు

ఇంద్రసంబంధమున అహల్యకు శతానందుడను కుమారుడుదయించియుండెను. శాపమునసుభవింపబోవుటకు ముందు అహల్య గౌతముని క్షమాపణకోరి శతానందునిగూడ క్షేత్రజ పుత్రుడుగా స్వీకరింపకోరెను. గౌతముడు వాలికి, సుగ్రీవునికికూడ శాపముల నొసంగెను. "వీరు తమతమ మానవ రూపముల నుడిగి తమ కన్నతండ్రులతో కలసి అవే అంశములతో వేరొక కపికి జన్మించి, అవే పేర్లతో వ్యవహరించి ఇరువురునూ ఒకే ఇంతికి భర్తలై యీసుచే ఒండొరులు కయ్యంబు కావింపగలరు" అని వారికి శాపము కలిగెను. తమ తల్లి అపరాధము తండ్రికి తెలిపిన కారణమున తమకు శాపము కలిగినందుకు వాలి కోపించి అంజనను 'కపికాంత' యగునట్లు శాపమిచ్చెను. కాని సుగ్రీవుడామెను బాధపడకుండా ఓదార్చెను.

"........చిం

తిల్లం బోకు వివేకశాలి యగు వానిన్ వానరుం బెండ్లియై

ముల్లోకంబులు నెంచ సర్వగుణధాముం బుత్రునింగాంచి రం

జిల్లం" గలవని తెలిపి ఆమె కుమారుని తన స్నేహమును పాటింపుటకై పంపుమని తెలిపెను. వాలి సుగ్రీవులు తనువులు వీడి ఋక్షరజుడను వానరునికి పుత్రులై జన్మించిరి. శతానందుని జనకునికి పురోహితునిగా జేసి గౌతముడు అంజనను తగిన వరునకొసంగుటకై అన్వేషింప పయనమాయెను. అంజన కపికాంత అగుటకు కారణమపుడా గౌతముని యోగదృష్టికి తెలిసెను.

అంజనాదేవి పూర్వజన్మ వృత్తాంతము:— పూర్వజన్మలో అంజన ఒక విద్యాధరుని పుత్రిక. పేరు సుగంధి. సకియలతోచేరి ఒకనాడీమె హిమాద్రిలో వనవిహారమొనర్చి శ్రమాపనోదనేచ్ఛతో నచటి కొలనులో జలక్రీడలాడి ఆపై ఒక మావికెలనున చివురు పాన్పున నుండగా మహాభారమగు శివతేజమును భరించి తూలుచూ పోవుచుండిన అగ్నిదేవునామె చూచి నవ్వెను. దానినవమానముగా భావించి అగ్ని ఆమెను చూచి....

...."నీ శరీరమతి యొండొక రూపున కీశపత్నివై

యిది భరియించి పుత్రుగనుమీ...."

—అని శాపమిచ్చెను. ఈ పూర్వజన్మ వృత్తాంతము గౌతముడంజనకెఱింగించి దానివలననే వాలిశాపమామెకు సంక్రమించెనని వివరించెను. దైవకృతమును భరించి వనాటుని పెండ్లియాడుమని ప్రోత్సహించి గౌతముడామెను హిమాద్రిలో

తపము చేసికొనుచున్న కుంజరుని వద్దకు చేర్చెను. "పుత్రార్థివగు నీకీమె పుత్రిక" కాగలదని అంజననాతనికిచ్చి గౌతముడామెను "కామరూపిణివై, పతి భక్తికల్గి, నిత్యయౌవనము, అతిశయశీలము నిగ్రహానుగ్రహ సామర్థ్యము కలిగి సత్పుత్రుని పొందునట్లు ఆశీర్వదించి తన ఆశ్రమమునకు వెళ్లిపోయెను."

కుంజరునికథ: కుంజరుడను కపి పుత్రార్థియై శివునిగూర్చి తపమొనర్చుచుండెను. మహాదేవుడతని భక్తికి మెచ్చి సాక్షాత్కరించి, "పుత్రస్పృహా సౌశీల్యాత్మకమైన పుణ్యము పూర్వజన్మమున జేయవు గాన గౌతముని పుత్రికను నీకుమార్తెగా స్వీకరింపుము. ఆమె పేరు అంజన. ఆ చక్కని కన్యకు నా అంశమున కుమారుడుదయించి వంశోద్ధారకుడగును." అని తెల్పి అంతర్ధానమయ్యెను. గౌతముని రాక కెదురుచూచు కుంజరుని వద్దకు గౌతముడు రాగా అతనిని సగౌరవముగా నెదుర్కొని మహాదేవుని వరమును గురించి అతనికి నివేదించగా గౌతముడానందించి తన పుత్రిక అంజననతనికిచ్చి వెళ్లెను. కుంజరునిభార్య 'వింధ్యావళి' ఆమెను పుత్రీప్రేమతో లాలించగా ఆ వానర మిథునమునే తన జననీజనకులుగా భావించుచు అంజన వారివద్దనే యుండెను.

యుక్తవయస్కురాలై అంజన ఒకనాడు సఖులతో కలిసి వనవిహారమునకై వెళ్లెను. దేవతాస్త్రీల పాటలలో ఆమె చక్కదనాన్ని గూర్చి వినియుండిన కేసరి అను వానరేంద్రుడు ఆమెను చూడవలెనను తలంపుతో ఆ వనములోనికి వచ్చెను. కంతుని సోయగము గైకొనిగానము చేయుచున్న అంజననుచూచి అతడనంగతాపపీడితుడాయెను. కేసరిని చూచిన అంజనకును మరులు కలిగెను. ఈ విషయమెఱింగి కుంజరుడానందించి తన కూతురగు అంజనను కేసరికిచ్చి వివాహము చేసెను.

అనురాగ దాంపత్యముకల అంజనా కేసరుల కెన్నేళ్లు గడచినను సంతానము కలుగలేదు. ఫలదానములు, వృద్ధోపసేవలు, ద్విజదంపతుల కొలుచుట, అన్నదానములు, ధనకనక వస్తు వాహన ధాన్య కన్యాది దానాలు వారెన్నెన్నో చేసిరి. అంజనకూడ గజగౌరి, ఉత్తరాగౌరి, సాంవత్సరగౌరి, పదియారుగౌరి, పసపుపట్టెగౌరి, నిట్టుప్పుగౌరి, తంగేటిగౌరి, చల్లకూటిగౌరి, సావిత్రిగౌరి, చద్దిగౌరి, కరళ్లగౌరి, ఆదిత్యగౌరి మొదలుగాగల మూడువందల అరువది వ్రతముల చేసెను. సంతానము కొఱకై ఎవరేమి చెప్పినా, దానినంతయు నామె చేయుచుండెను.

ఆకైన దెల్లఁ బత్తిరి
యే కష్ట రాయైన దెల్ల నీశ్వరుడనుచున్
జేకొని భక్తి భజింపుదు
రా కపి దంపతుల నియమ మరుదు నుతింపన్.

ఈవిధముగా ఎన్నో వ్రతాలూ, నోములూ చేయు నామె కడకొకనాడు ధర్మదేవత కూరిమికల్గి యెఱుకతయై వచ్చెను,

"బంగరు గుంటి వింటి దొరపాటి యనందగు మేటి, సాటి మీ
రంగల గొంటు రక్కసుల రాయిడి గండెడు పోటుబంటు"

పాపడై ఆమెకు కల్గునని తెలిపి పతి అనుమతితో తపము చేయుమని ఉపదేశించి వెళ్లెను. ఈవార్త వినిన కేసరికూడ అంజననుచూచి "నాకు పుత్రుడు కలుగునని భరద్వాజాది మహర్షులు వరమొసంగియున్నారు. ఆ కథ నీకు తెలిపెదను. శంఖకబళుడను రాక్షసుడు మత్తేభ రూపము ధరించి మునులను బాధించుచుండెను. మహర్షులను సేవించుచుండిన నేను నా పిడికిటి పోట్లతో వానిని చంపినందున భరద్వాజ మహర్షి నన్ను 'కేసరి' అని నుతించెను. వారు

"సర్వలోకోపకారి శాశ్వత బలుండు
నిర్మలుడు పుత్రుడొకడు జన్మించు నీకుఁ
దప్పదీమాట" అని వరమనుగ్రహించిరి. ఆ వాక్యము నాలో వేదార్థమై భాసించుచున్నది. అఖిల జీవులకు ఆధారభూతుడై, సర్వలోకములకు ప్రాణమై, అన్నిచోటుల పరిపూర్ణుడైయుండు దైవమే వాయుదేవుడు. కావున నీవు వాయుదేవుని గూర్చి తపమొనర్పుము" అని కేసరి తన భార్యయగు అంజనకు తపోదీక్ష స్వీకరింప ప్రేరేపించెను. "పుంజికస్థలమను ప్రదేశ మశేష ఫలదాయక మనియు, నచట తపోవ్రతమూనినచో ధర్మదయాకీర్తి సత్య సత్వరమతి డాంతి శాంతి గుణ ధైర్య పరాక్రమ వేదశాస్త్ర విస్ఫురదణిమాది వైభవ విభుత్వ హితుండు సుతుండు కలుగునని" కేసరి తెలిపిన మాటలను శిరసావహించి అంజన తపోదీక్ష పూనెను.

అతి కఠోర నియమముతో ఆమె తపమొనర్చసాగెను. ఆమెక్షుద్బాధను తీర్చుటకై పవనుడామెకు నిత్యమొక ఫలమును ఇచ్చుచుండెను. వాయుదత్త ప్రసాదముతో ఆమె యేడువేలయేండ్లు తపస్సు కొనసాగించెను. అనిల దేవుడామె తపస్సునకు మెచ్చి—

ఇందు కళాధరుండు ధరియింపఁగ మున్నిడినట్టి తేజ మ
య్యిందు నిభాస్య కోర్కి ఫలియింప ఫలాకృతి జెంత నుంచి పో
వం దరుణీలలామ ప్రతివాసరలబ్ధి ఫలంబెయంచు నా
త్మం దలపోసి లోఁ గొనినఁ దచ్ఛివ తేజమమోఘమౌటచేన్,

—ఆమె గర్భము ధరించెను. తనలో గర్భ చిహ్నముల గమనించి అంజన విస్మయాన్వితయై తపోదీక్ష విరమించి 'అయ్యో' పతినిబాసి ఒంటరిగాద్రిమ్మరు నాకు గర్భము వచ్చుట వలన అపకీర్తి కలుగునుగదా! అని పరిపరివిధముల చింతించుచుండగా నపుడు 'గగనభారతి' ఆమె నూరడించుచు పలికిన పలుకులు వినబడెను. శివతేజమనిలుని ద్వారా ఆమెకు ఫలరూపముగా లభించినందున, దానినామె భక్షించినందున....

....“నీ గర్భ యుక్తిఁ బ్రత్యక్ష శివుడు
పెరుగుచున్నాడు గాడ్పు గర్భీకరించెఁ
గాన వాయుజుడను పేరు గాంచునితడు”

ఈ వర గర్భ శక్తి జనియించు కుమారక రత్నమార్య సం
భావిత దివ్యకీర్తి సురపాలక జాల కిరీట ఝూట శో
భావహమూర్తి సర్వ జగదంచిత సర్వ గుణానువర్తి నా
నా విధ రామకార్య ఘటనాహృత నమ్ర జనార్తి” యంచని పల్కెను.

అంత వాయుదేవుడుకూడ అచట ఆమెకు ప్రత్యక్షమై తన నిజాకృతి చూపి “ఇపుడు ఆకాశవాణి పలికినది నిజము. కావున చింతింపకుము. నీ విభున కీ విధమంతయు తెల్పుము.” అని ఊరడించి వెళ్లెను. కేసరిని చేరి అంజన ఈ విషయమంతయు నతనికి నివేదించి అతనినే సేవించుచు ఉండగా ద్వాదశ మాసము లేగిన తర్వాత ఆమెకు కుమారుడుదయించెను.[14]

హనుమంతుని జనన వృత్తాంతమునుగూర్చి యితర గ్రంథములలో తెలియదగు విషయము. 1. ధర్మసార రామాయణము ప్రకారం వాయుదేవుడు కేసరి రూపమున వచ్చి అంజనను పొంది వెళ్లిన తర్వాత నిజనాథుడేతెంచగా అంజన జరిగిన ఘోరమును భర్తకు వివరించగా అతడు పుత్రార్థమై కొలుచు వాయుదేవుని వలన పుత్రుని పొందుటలో దోషము లేదని ఆమె నూర డించెను.[15] 2. శ్రీమదాంధ్ర వచన రామాయణము ప్రకారము, తపముచేయు అంజనను స్పర్శద్వారా కౌగిలించి వాయుదేవుడామెతో సంభోగించగా ఆమె

పాతివ్రత్యభంగమునకు కుందుచుండగా వాయుదేవుడామెకు పాతివ్రత్య భంగము లేనట్లుగా వరమిచ్చి తనతో సమానముగా ఎగురుటలో, దుముకుటలో శక్తిగల వీరుడు పుట్టునట్లనుగ్రహించి వెళ్లగా మేరు పర్వతగుహలో అంజనా దేవి కుమారుని గాంచెను.[16] 3. సంపూర్ణ రామాయణమునకూడ కథ ఇట్లే కలదు. కాని అంజన వాయుదేవుని శపింపబోగా అతడామెను వారించి వర మిచ్చినట్లు మాత్రమున్నది.[17] 4. గణపతి రామాయణ సుధ కథలోకూడ నిట్లే యున్నను

యశస్విని నిను నేను హృదయముననె
కౌగిలించుకొనుచు పొంద నాగినాను

............................................

నీదగు సతీత్వమునకుర్వి లేదు లోటు
దైవ సంపర్కమున లేదు తప్పు సతికి.... అని కలదు.[18]

ఇట్లే కట్టా వరదరాజకృత రామాయణమున, ఆశ్చర్య రామాయణమున, శ్రీకృష్ణ రామాయణమున అత్యల్ప భేదములతో కథ కలదు.[19]

"హనుమాన్ లీలా తరంగిణి" "హనుమద్విలాసము" "శ్రీమద్రామా యణాంతరార్థము" అను అధునిక గద్య గ్రంథములలో శివుడేల హనుమంతు డుగా నవతరించెనో తెలుపు కథలున్నవి. ఏ ఆధారమునుబట్టి వారు అట్లు వ్రాసిరో మాత్రము పేర్కొనలేదు. కైలాసమున శివుడొకనాడు పార్వతిని చూచి ఇట్లు పలికెను. "నేను నిత్యము ఏ దేవుని ధ్యానించుచున్నానో ఆ దేవుడు భూలోకమున అవతరించనున్నాడు. అతనికి తోడ్పడుటకై దేవతలు వానరాకారములలో జన్మించబోతున్నారు. నా ప్రభు కైంకర్యమునొనర్చుటకు నేను కూడ భూలోకమున అవతరించనున్నాను. రావణుడు తమ భక్తుడగుట వలన అతని వధించు కార్యములో శివుడు తోడ్పడుట తగునా అని పార్వతి ప్రశ్నించెను. శివుడు భూలోకమునకు వెళ్లినచో తానావియోగము భరింపజాలనని పార్వతి వాపోయెను. అపుడు శివుడు తాను వేరొక రూపంతో రాముని సేవించుచు, కైలాసములో ఉండి కూడ పార్వతికి ఆ లీలలన్నీ చూపగలనని చెప్పెను. రావణుడు తన పదితలలతో దశరుద్రులను మాత్రమే అర్చించె ననియు అజైకపాద రుద్రరూపమగు తన ఏకాదశ రుద్రరూపము నర్చించ

కుండిన కారణమున తానిపుడా అంశమున వాయుదేవుని ద్వారా అంజనా గర్భమున ప్రవేశించి జన్మింతునని తెలిపెను.[20]

గార్ధభనిస్స్వనుడను రాక్షసుడు (కొందరితనిని గాలాసురుడుగా పేర్కొనిరి) శివుని గూర్చి తపమొనర్చి అనేకములైన వరములు పొందెను. స్త్రీ పురుష సంపర్క స్పర్శచే అవతరింపకున్నట్టి స్త్రీ శక్తిచే మాత్రమే తాను మరణించునట్లు వీడు కోరిన వరములలో నొకటి. లోకకంటకుడైన వీనిని సంహరింపబూని విష్ణువు శివునిచేరి వానిని వధించుటకుపాయము కోరెను. అపుడు శివుడు "వాడు నా భక్తుడు. నా కవచము వానిని రక్షించుచున్నది. కావున వానినెవరును సంహరింపజాలరు." అని పలికెను. శివకవచమున్నను వాని దుష్కృత్యములవలన దాని ప్రభావము శిథిలమైనది కావున వానిని తాను సంహరింపగలనని విష్ణువు తెలుపగా శివుడు పంతముపూని వానిని విష్ణువు వధించినచో తాను కింకరుడై విష్ణువును సేవింపగలనని పందెము పెట్టెను. మహావిష్ణువు ఆ రాక్షసుని చేరి తన జగన్మోహినీ రూపమున వానిని మోహింప జేసి, వానిని మద్యపాన మదోన్మత్తుని గావించి తానొక తోడేలు రూపమొంది వానిని వధించి వాని తలను తెచ్చి శివునకు చూపెను. శివుడంత తన ఓటమి నంగీకరించి, తన మాటప్రకారం నారాయణుడు రామావతారమెత్తినపుడు తాను ఆంజనేయుడై జన్మించి రామునికి సేవచేయ గలనని పలికెను. త్రిపురాసుర సంహార కాలమున విష్ణువు బాణమై శివునకు తోడ్పడినందున శివుడాంజనేయుడై విష్ణువునకు రామావతారకాలమున తోడ్పడినట్లు మరియొక కథ.[21] హనుమంతునిలో శివుని అంశ ఉన్నట్లే అతని తోకలో పార్వతి అంశ ఉన్నట్లు డాక్టర్ ఆర్. లక్ష్మణమూర్తిగారి అభిప్రాయము.[22]

డాక్టర్ మల్లాది గోపాలకృష్ణశర్మగారు శ్రీమద్రామాయణ వైభవమను గ్రంథమున మరియొక విశేషము చెప్పియున్నారు. శివునకు విష్ణువు తన జగన్మోహినీ రూపము చూపగా శివునకు వీర్యస్ఖలనమయ్యెను. దానిని శివుడు సప్తఋషులకిచ్చెను. ఋషులును పరమేశ్వరుడు ప్రేరేపింపగా ఆ పరమేశ్వర ధాతువును అంజనాదేవియందు ఆమె శ్రోత్రము ద్వారా ప్రవేశపెట్టిరి. చెవి ద్వారా ప్రవేశించిన ఆ వీర్యము వలన అంజన గర్భము ధరించి పుత్రుని పొందెనను కథ శివపురాణ శతరుద్రీయ సంహితలో కలదని వారు తమ గ్రంథములో తెలిపియున్నారు.[23]

ఈవిధంగా తెలియవచ్చు విశేషములను బట్టి అంజనాదేవి గర్భము ధరించి అంజనేయుని పుత్రునిగా పొందుటలో పలురకముల కథలు వ్యాప్తి లోనికి వచ్చినట్లు స్పష్టము. 1. శివతేజమును అంజన భక్షించినందున ఆమె గర్భవతి యగుట. 2. శివతేజమును వాయుదేవుడు అంజనను స్పృశించి ఆమె కిచ్చుట. 3. అంజనతో సురతమొనర్చి తనలోని శివతేజమును వాయువు ఆమెలో ప్రవేశపెట్టుట. 4. సప్తఋషులు అంజనాదేవి శ్రోత్రము ద్వారా శివతేజమునామెలో ప్రవేశపెట్టుట. 5. సద్యోగర్భమున అంజనకాంజనేయుడు జన్మించినట్లును, 6. నవమాసములు మోసిన తర్వాత జన్మించినట్లును, 7. ద్వాదశ మాసములు మోసిన తర్వాత జన్మించినట్లును కథలు వ్యాప్తి లోనికి వచ్చినవి. ప్రతి కల్పమున చతుర్యుగములలో ఆంజనేయుని కథ పునరావృత్తమగుట వలన ఈ కల్పనల బాహుళ్యమునకు స్థానమేర్పడియుండ వచ్చును. సప్రమాణముగా సత్యముగ్గడింపవలెననిన సర్వభాషాసాహిత్యముల లోని కల్పనలనన్నింటిని ప్రత్యేకశ్రద్ధతో పరిశీలింపవలసియుండును.

కుమారస్వామి జన్మక్రమమునకు ఆంజనేయస్వామి జన్మక్రమమునకు చాలా పోలికలున్నవి. శివతేజము శివసతిద్వారా కాక ఇతరత్రా ఫలించి షణ్ముఖుడు జన్మించినట్లే శివాంశతో జన్మించిన అంజనేయుడుకూడ అట్టి జన్మమునే పొందెను. మన్మథుడు, అగ్నిదేవుడు, షాణ్మాతృకలు కుమారస్వామి జననమున ప్రాధాన్యము వహించినట్లే ఆంజనేయుని జననమున భూదేవి, అగ్నివాయువుల ప్రాధాన్యమున్నది. శివునితేజమతని భార్య వహింపలేకుండుట ఒక విశేషమైతే, అంజన భరించుట ఇంకొక విశేషము.

పురాణములలో వర్ణింపబడిన విషయములలో లోకోత్తరులగు వ్యక్తుల జన్మాది విషయములు విచిత్రముగా కన్పించును. ఇట్టి ప్రజోత్పత్తిని గూర్చి విష్ణుపురాణమున గల విషయములు గమనార్హములు. "స్త్రీ పురుషుల మిథున క్రీడ ఎనిమిది రకములు. స్మరణం, కీర్తనం, కేళి, ప్రేక్షణం, గుహ్యాభాషణం, సంకల్పం, అధ్యవసాయం, క్రియానిర్వృత్తి. పురుషులకు ముఖ్య రేతస్థానమైన బీజములోని రేతస్సును ప్రాణాయామ బలముచే యోగులు ఆ శక్తిని పైకి లాగుచుందురు. ఆ కారణముచే వీరికి స్ఖలనముండదు. ఇట్టివారు తాము మనో బలము చేతనే తమలోని రేతస్సును స్త్రీల గర్భములందు చేర్పగలరు– దర్శనం, స్పర్శనములతో వారు అట్లు చేయగలరు. మనసుయొక్క శక్తిచే,

దర్శనశక్తిచే, స్పర్శశక్తిచే అట్లు చేయలేనివారు దేహసంపర్కము చేతనే అట్లు చేయవలసియుండును. కాని, అత్యంతమగు తపస్విజనులు, సిద్ధులు, సంకల్పము చేత, స్పర్శనంచేత, దర్శనంచేత ప్రజోత్పత్తి చేయగలరు.[24] అవతారమూర్తులగు వామన, పరశురామ, రామ, కృష్ణాదులు; కుమారస్వామి, గజాననుడు, భీష్మ ద్రోణ కర్ణాది వీరులు; క్రీస్తు, రామకృష్ణ పరమహంస, మహర్షులు, ఆళ్వార్లు మొదలగువారి జనన విషయములలో చిత్రవిచిత్రములు జగద్విదితమే అయినా జనులు వానిని తార్కిక దృష్టితో కాక విశ్వసించెడి దృష్టితో స్వీకరించుచున్నారు. ప్రాకృత అప్రాకృత విషయముల మధ్యగల అంశములను స్పష్టముగా తెలియజాలమని మానియర్ విలియం గారను ఆంగ్ల పండితుడు తెలిపియున్నాడు.[25] (In Indian Epics, the boundaries between the natural and the Supernaturul, between earth and heaven, between the divine, human and animal creations are singularly Vague and undefined, troops of deities and individual personages appear on the stage on every occasion. Gods, men and animals are everchanging places. The myths of Indian Epics are still closely interwoven with present Indian Faith) కావున కన్యాత్వం భంగంకాకుండా కుమారులను కని తల్లులగుట, పాతివ్రత్యభంగం లేకుండా బహు భర్తృత్వమనుసరించుట, వివాహోత్పూర్వమే సంభోగానుభవము పొంది కూడ పతివ్రతలుగా గుర్తింపబడుట, పుట్టుకతోనే ఆభరణాలు, కవచాలు కల్గియుండుట, సద్యోయౌవనము, సద్యోజ్ఞానము పొందుట, వేదాలను వల్లించుట వంటి విశేషములు సాహిత్యమున కొల్లలు. ఆంజనేయుని అసాధారణ జనన విశేషముల గూర్చి శ్రీ కే.సి. అర్యర్ అను పండితుడు ఈక్రింది మాటలలో సమర్థించియున్నాడు.

"It is held by some that 'VAYU" ravished Anjana in the forest. Others who believe that great and divine beings are born in a way different from the normal process of human or animal creation uphold the view that 'VAYU" passed into Anjana's body through her ear. This is not a laughing matter. The passing of 'VAYU' into Anjana's body through her ear and making her pregnant has a deeper significance Even, these days, the TANTRIKS and YOGIS

can effect a humber of psychological, physical, mental and spiritual changes in a person by blowing mantras into his ears. Secondly, ear is believed to be the purest of all bodily parts. Ear is meant for hearing sound (శబ్ద) which emanates from ether or Sky (The purest of all the five elements) This accounts for the unusual birth of HANUMAN, the embodiment of chastity and purity [26]

"శిల్పమూ, (కళ) మతమూ మానవ జీవితంలో అత్యంత ప్రాక్తనమైన అనుభూతులకు ప్రతిబింబాలు. కవులూ, శిల్పకారులూ మతాన్ని పరిపుష్ట మొనర్చియున్నారు. పురాణ వృత్తాంతములను కథలుగా కవి విశదీకరించగా, అందలి దేవతలకు, నాయకులకు రూపాలను శిల్పులు ప్రసాదించారు. భావించడమొక కళ అయితే విశ్వసనీయమగు భావమే మతము. అందువలన మతాన్నీ, కళనీ వేరువేసి చూ కకాలము రసానుభూతిలో, మతవిశ్వాసములో దర్శింపదగిన అంశము అనిర్వచనీయమై మానవహృదయమందు నిగూఢమై యుండును. అందువలన హనుమజ్జనన సంబంధమగు అలౌకిక విషయములు శాస్త్రీయసత్యమువలెకాక సారస్వతశిల్పకళామతవిశ్వాస స్పర్శగల అంశములుగా గుర్తించుట అవసరము.[27]

## 3. ఆంజనేయుని జనన స్థలము:

ఆంజనేయుని జన్మస్థలమును గూర్చి యే గ్రంథములో కూడా విపులముగా లేదు. ఆంజనేయుని ఒక పొదరింటిలో (లేదా గుహ) అంజన ప్రసవించి నట్లు శ్రీమద్రామాయణము. వేంకటాచలమున అంజనాదేవి ఆంజనేయుని ప్రసవించినట్లు పరాశరసంహిత తెలుపుచున్నది. వేంకటాచలమందలి అంజనాద్రిలో ఆంజనేయుడు జన్మించినట్లు ఆనందరామాయణము. కాని యీ అంజనాద్రి పంపాసరోవర సమీపమున నున్నట్లు శ్రీ యస్. సి. డే అను పండితుడు తమ HISTORICITY OF RAMAYANA" అను గ్రంథ ములో పేర్కొనియున్నారు. ఈ పంపా ప్రాంతము నేటి కర్ణాటక రాష్ట్ర మందలి హంపీ ప్రాంతమేనని యిచట ఋష్యమూకమను పర్వతముకూడ ఉండుట దానికి బలమును చేకూర్చుచున్నదని కొందరి వాదము. 'పుంజిక

స్థలము'న అంజన కుమారుని కనినట్లు సమీరకుమార విజయ సాక్ష్యము. కాని తెలుగువారు ఆంజనేయుడు రాయలసీమలో తిరుపతి-తిరుమల ప్రాంత మండలి అంజనాద్రిలోనో వేంకటాద్రిలోనో జన్మించియుండునని నమ్ము చున్నారు. తిరుపతి నుండి హంపి వరకు గల ప్రాంతములో ఆంజనేయ దేవాలయముల సంఖ్య అధికముగా నుండుట; ఇచటి వారు ఆంజనేయులు, అంజి, హనుమంతు; అనుమంతు, సంజీవరాయుడు, సంజీవయ్య, సంజీవి, సంజీవమ్మ యిత్యాది పేర్లు పెట్టుకొనుట – ఈ రెండు కారణముల పేర్కొను చున్నారు. ప్రాచీన భౌగోళిక ప్రదేశముల గూర్చి ప్రామాణిక స్వరూపము నిర్దేశింపబడువరకు ఆంజనేయుని జన్మస్థలమును గూర్చి సులభముగా తెలుప జాలము. ఈ అంశమునే శ్రీ కే. సి. ఆర్యన్‌గారు

It is very defficult to say anything decisi'vely about HANUMAN'S birth place. The tribals of Madhya Pradesh believe that HANUMAN was born in 'ANJAN' Village in GUMLA - PRAMANDAL, of Ranchi District. Countless legends related to HANUMAN'S life are woven around the old temples scattered ali over this region. The inhabitants of KARNATAKA, bellieve their land to be HANUMAN'S birth place. The ruins of Pampa and Khiskhinda, are still to be seen in Hampi of Bellary District.'[28]

## 4. జననకాల విశేషములు:

శ్రీమద్రామాయణమున ఆంజనేయుని జననకాల విశేషములగూర్చి స్పష్టమైన అంశము లేదు. ఇక పరాశర సంహితలో ఇతడు వైశాఖమాసమున కృష్ణ పక్షమున దశమి శనివారమునాడు పూర్వాభాద్ర నక్షత్రయుక్త వైధృతీ యోగమున జన్మించినట్లు కలదు. ఆశ్చర్య రామాయణమున కూడ ఇట్లే ఉన్నది. శ్రీ దివాకరుని వేంకటసుబ్బారావుగారును ఈ సమయమునే పేర్కొనియున్నారు. ప్రసిద్ధ పంచాంగ రచయితలగు బ్రహ్మశ్రీ ఓరుగంటి వేణుగోపాల వేంకట సుబ్రహ్మణ్య సిద్ధాంతి, బ్రహ్మశ్రీ గౌరిపెద్ది రామ సుబ్రహ్మణ్య సిద్ధాన్తి, శ్రీమదాసూరి మరింగంటి వేంకట పీతాంబరాచార్య సిద్ధాన్తి హనుమజ్జయంతిని వైశాఖ బహుళ దశమిగానే పేర్కొనియున్నారు.[29]

చైత్ర శుద్ధ ఏకాదశి మఖా నక్షత్రమున ఆంజనేయుడు జన్మించినట్లు ఆనంద రామాయణము. శ్రీ తులసీదాసుగారు 'ఉత్సవసింధు' అను గ్రంథమాధార ముగా ఆంజనేయుని జననము కార్తీక కృష్ణ చతుర్దశి మంగళవారం స్వాతీ నక్షత్రయుక్త మేషలగ్నమున జరిగినట్లు తెలిపియున్నారు. ఇవికాక జనావళిలో ప్రచారములోనున్న సమయములు కూడ కొన్ని కలవు. 1. చైత్ర శుద్ధ పూర్ణిమ మంగళవారం, 2. కార్తీక కృష్ణ చతుర్దశి ఆదివారము, 3. మార్గశిర శుద్ధ త్రయోదశి శనివారం అశ్వినీ నక్షత్రయుక్త వృశ్చికలగ్నము, 4. మార్గశిర బహుళ దశమి. సిద్ధాంతుల గణనలోని తేడాలవల్లనూ ఆంజనేయుని కథను గూర్చి కల్పములలో వచ్చిన మార్పుల వలననూ ఈ అభిప్రాయము లిన్ని వెల్వడియుండవచ్చునని శ్రీ ములుకుట్ల నరసింహావధానులుగారు, శ్రీ కుంట ముక్కల రామారావుగారు భావించి యున్నారు. మొత్తముమీద హనుమంతుని జననకాలము గూర్చి యిన్ని వాదములున్నను దక్షిణ భారతదేశమున వైశాఖ బహుళ దశమి శనివారము కాగా ఉత్తర భారతమున చైత్ర శుద్ధ పూర్ణిమ మంగవారం ప్రచారములో నున్నది.[30]

ఆంజనేయుని జనన సంబంధమగు విచిత్ర విశేషాదులు. 1. శ్రీమద్రా మాయణమున తెలుపబడని కొన్ని అంశములు హనుమంతుని గోత్రమును గూర్చి, రూపమును గూర్చి కొన్ని అద్భుతాలను పరాశర సంహితాదులు తెలుపుచున్నవి. హనుమంతుడు కౌండిన్యసగోత్రుడని పరాశర సంహితతో పాటు శ్రీ రామాయణ సారోద్ధారము కూడ తెలిపియున్నది. ఈ అభిప్రాయ మునే శ్రీ దివాకరుని వేంకట సుబ్బారావుగారును తమ కిష్కింధాకాండమున తెలిపియున్నారు.[31] ఆంజనేయుడు పుట్టగానే పూలవానలు కురిసెననియు, స్వర్గమున దేవదుందుభులు మ్రోగెననియు, దేవగంధర్వులు నృత్యము చేసి రనియు, సిద్ధులు చారణులు స్తోత్రము చేసిరనియు, వనమున వాయువులు సుఖముగా వీచెననియు, నదులు నిర్మలోదకములై సవనియు మునుల త్రేతాగ్నులు మూడును ప్రదక్షిణాకార జ్వాలలతో ప్రకాశించెననియు రాక్షసుల కిరీటాగ్రములలో పొదిగిన రత్నాలు అకారణంగా క్రింద పడిపోయినవనియు రాక్షసాంగనల గర్భస్థశిశువులు వణికిరనియు పరాశర సంహిత వర్ణించినది.[32] సమీరకుమారవిజయముననను ఇట్లే ఉన్నది.

మొనసెన్ సురగోముఖ వాద్యతతుల్
నెఱసెన్ మలయానిల లోలగతుల్

విఱిసెన్ బలు కావిరి నల్దెసలన్
గురిసెన్ విరులగ్గురు లగ్నమునన్[33]

తన గర్భమున శివతేజము పెరుగుచుండుట గుర్తించిన అంజనాదేవి "తనయా! 'ఉదయింపుము' అని ఆదేశించెను. అపుడా ఉదరస్థ శిశువు 'జననీ, నగ్న శరీరముతో నేను జన్మింపజాలను." అని బదులు పలికెను. అంత ఆమె శివుని ప్రార్థించి అతని కవచమును శిశువున కిమ్మనెను. శివుడు తన వజ్ర కవచము నీయగా దానిని ధరించి ఆంజనేయుడు జన్మించెను.[34] ఈ కథకు ఆధునికులింక కొన్ని విశేషముల జోడించి యున్నారు. గర్భస్థ శిశువు రామ నామస్మరణ చేయుచుండగా అంజన 'నాయనా, నేను ఈ గర్భభారమును భరించలేను. త్వరలో బయల్పడుము" అని కోరగా ఆ శిశువు 'అమ్మా' నేనందరి శిశువులవలె జన్మించువాడనుకాను. నాకు దివ్య పీతాంబరము, మాణిక్యకుండలములు, సువర్ణ యజ్ఞోపవీతము కావలెను. అపుడు అంజనాదేవి తాను అంధురాలగుట వలన తానవి సమకూర్చజాలనని అందువలన ఆ శిశువు నకే ఆభరణములు కావలయునో వానితోనే జన్మింపుమని బుజ్జగించెను. అపుడు ఆంజనేయుడు వైశాఖ బహుళ దశమి శనివారము పూర్వాభాద్ర నక్షత్రయుక్త వైధృతీయోగమున మధ్యాహ్నవేళలో మాణిక్య కుండలములతో, దివ్య పీతాంబరముతో, స్వర్ణమాలికలతో, సువర్ణ యజ్ఞోపవీతముతో, మణి నూపురములతో ధ్వజ వజ్రాంకుశ ఛత్ర పద్మ రేఖలతో గూడిన పాద పద్మములతో, గొప్ప భుజములతో, దీర్ఘవాలముతో, బ్రహ్మ తేజః పుంజ వదనారవిందముతో జన్మించెను.[35] మఱియొక కథ ఏమనగా, పూర్ణగర్భవతి యైన అంజన ప్రసవము కానందున బ్రహ్మాది దేవతలు వచ్చి అంజన గర్భస్థ శిశువును బహిర్గతమగుమని కోరగా ఆ శిశువు 'ఓ బ్రహ్మాది దేవతలారా, నాకు మీరు మూడు వరముల నిచ్చినచో లోకములోనికి రాగలను. హేమకాంతులు తేజరిల్లు రోమములు నా శరీరమంతా వ్యాపించియుండవలెను. నాకు అంద మైన వరదట్టి కావలయును. నాకు వెండిజందెమమరియుండవలెను. నేను పుట్టుసరికి ఈ వరములు నాకు సంక్రమింప పుట్టిన పిమ్మట ఆ వరముల స్మృతి నాకు లేకుండా ఉండవలెను." అని తెలుపగా, బ్రహ్మాదులందుకంగీక రించి అనుగ్రహించగా ఆంజనేయుడు జన్మించెను.[36]

## 5. ఆంజనేయుని రూపవిశేషములు :

శ్రీమద్రామాయణోత్తర కాండమున ఆంజనేయుని రూపము "వరిగింజ కొనముల్లు వంటి వన్నెగలవాడని తెలుపబడియున్నది. ఇతని తోక వాసవ ధ్వజ నిభమైనది.[37] పరాశరసంహితలో ధ్వజ వజ్రాంకుశ, ఛత్ర పద్మరేఖలతో గూడిన పాదపద్మములతో, గొప్ప భుజములతో, దీర్ఘ వాలముతో బ్రహ్మతేజఃపుంజ విలసిత వదనారవిందము కలిగి మహాబల సంపన్నుడై, విష్ణుభక్తి తత్పరుడు, నిగ్రహానుగ్రహ సమర్థుడు, వేదవేదాంగ తత్త్వజ్ఞుడు, మహా మహిమాన్వితుడు, బ్రహ్మవేత్తలలో అగ్రగణ్యుడు, సర్వశుభలక్షణ సంపన్నుడు అగు ఆంజనేయుడు జన్మించెను.[38] ఉత్తర రామాయణములో వర్ణితమగు రూపమునే సమీరకుమారవిజయమున తిమ్మన వర్ణించియున్నాడు.

నిడుద వాలము వాని నెల బొల్పు తలనిల్పు
బలువేల్పు తుల వేల్పు బలిమి వాని
బచ్చ చూపులవానిఁ బగడంపు జిగిసొంపు
బెగడింపు మై చాయ బెడగువాని
నొంటి జందెము వాని నొఱపుంచు నెఱమించు
మఱపించు బంగారు మౌంజి వానిఁ
గుండల ద్యుతి వాని గురుహార హరహీర
శర శారదాకీర్తి గరిమవాని

మంచి మది వానిఁ గ్రొంబట్టు పంచెవాని
మంచు మలనొంచు దిటువావరించువాని
వడుగుఁ బాపని విన్నారి బుడుత నొకని
గాంచె నావేళ నంజనా కాంచనాంగి.[39]

("లలిత సౌదామినీతులిత దేహమువాని" ఆ 5. ప 95. కంకంటిపాపరాజ ఉత్తర రామాయణ పద్యము చూడదగును.)

హనుమంతుడు పంచముఖుడని, కామరూపుడని తెలియుచున్నది. 'హనుమంతుని పాత్రచిత్రణ' అను శీర్షికలో దీని వివరములను చూడదగును.

పుట్టిన పుత్రునకు కపిదంపతులు నామకరణమొనర్చినట్లె కావ్యములోను లేదు. అంజనాదేవి పుత్రుడగుటవలన ఆంజనేయుడనియు కేసరి సుతుడగుటచే

కేసరినందనుడనియు రుద్రాంశమున జన్మించుటచే రుద్రకుమారుడనియు వాయుపుత్రుడనియు వ్యవహరింపబడినాడు. శ్రీ కాళూరి వ్యాసమూర్తిగారు 'రామరాజ్యము–కుశలవులు" అను గ్రంథమున వానరజాతి సంప్రదాయముల గూర్చి తెలుపుచు "వీరి జాతి మాత్రము వానరజాతి. వీరికి మానవుల తెలివి తేటలు బుద్ధిబలము కలవు. ఆయా దేవతల రూపము, వేషము, పరాక్రమము వీరియందు గలవు. వీరికి కామరూపత కలదు. కారణజన్ములైన వీరు వేదాభ్యాసము చేసిరి. ఉపనయనాది సంస్కారముల గావించుకొనిరి. వీరు తమ ప్రవృత్తియందు రెండు ధర్మములను స్వీకరించిరి. 1. వానరజాతి లక్షణం, 2. వానరజాతి విలక్షణం. వీరికి ఉపనయనం విలక్షణం; వివాహం విరోధం.[40] అంజనాకేసరులు తమ కుమారునికి నామకరణాది ఉపనయనాది కర్మల జేసియుండవచ్చునని యూహించుకొనవచ్చునేకాని ప్రత్యక్ష సాక్ష్యముల చూపుటకు వీలుకాదు. ఇంద్రుని వజ్రాయుధము తగిలిన పిమ్మట 'హనుమానుడ"ను పేరు కలిగినదేకాని అది తలిదండ్రులు పెట్టిన పేరుకాదు. హనుమానుడన్నా, హనుమంతుడన్నా ఒకరే. ఇతనిని దైవముగా నారాధించువారు అష్టోత్తరశతము, సహస్రము అగు ఎన్నో నామములతో ఇతనిని వర్ణించుచున్నారు.

అధ్యాయము 2.

# హనుమంతుని బాల్య యౌవన వృత్తాంతము

## 1. హనుమంతుని బాల్య యౌవనాదులు:

శ్రీమద్రామాయణోక్తం: కిష్కింధాకాండము ఉత్తరకాండములలో గల అంజనేయ చరిత్రలో హనుమంతుని బాల్య జీవిత విశేషములు కేవలము సూచితమే. ఏడవకుండా ఉండుమని చెప్పి, అంజనాదేవి ఫలముల దెచ్చుటకు వనమునకు పోగా ఉదయాద్రిపై పొడతెంచు 'జపాప్రసూన రుచిరకాంతి'తో నున్న భానుబింబమునుచూచి దానిని పండనుభ్రాంతితో పట్టుకొనుటకై శిశువగు అంజనేయుడెగిరెను. అపుడు గగనచరులైన గరుడ గంధర్వ యక్ష సిద్ధ సాధ్యులు నివ్వెఱపడుచుండగా ఆ పిన్నపాపనికి ఎండ తాకకుండా మిన్నేటి తమ్మి పుప్పొడి దుమారమొకటి వెనువెంటగా వెళ్లెను. బాలుడు దేనినీ గమనించ కుండా వెళ్లెను. అతని పాదతాడనానికి పాథోధులు చెదరినవి. తొడల రాయిడిచే గంధర్వాది నగరాలు ఛిన్నాభిన్నములైనవి. బాహువేగానికి వైమానికుల విమానము లొఅగిపోయినవి. వాలవిక్షేపానికి నక్షత్రాలు లాజలై తూలిపోయినవి. ఖేచరులు చీకాకుపడుచుండగా బాలుడా భానుని ఒడిసిపట్టెను. సూర్యసతి ఛాయ కరములు పిసికికొనగా, మౌనులు ఒదిగి యుండగా, పారిపార్శ్వకులు పారిపోగా భానుడతనికి వేడిమి తగులకుండా ఉండెను. ఆరోజు అమావాస్య అగుటచే రాహువు సూర్యుని గ్రహింపవచ్చి తనకుగల భయకారణమును ఇంద్రునికి విన్నవింపకొనెను. అపుడు ఐరావత ముపై ఇంద్రుడు రాగా భానుని వదలి తెల్లని పండని తలంచి బాలాంజ నేయుడా ఏనుగును పట్టబోయెను. అపుడింద్రుడు తన వజ్రాన్ని ప్రయోగించెను అది హనువందున తగిలినందున బాలుడు స్మృతితప్పి పూర్వాద్రిపై పడెను. తన పుత్రుడీ ఆపద నొందుటకు వాయువు ఆర్తితో ఆ బాలుని తీసికొని గుహాంతరమునకు చేరి లోకమున వాయువును స్తంభింపజేసెను. అపుడు జీవరాసులు, యాజకులు, దివిజులు, దురవస్థపాలై పరమేష్ఠికి విన్నవించగా

బ్రహ్మ వారి కొఱకై వాయువును చేరి అంజనేయుని లాలించి చైతన్యవంతుని చేసి వేల్పులందరిని అంజనేయునకు వరముల నియ్య ప్రోత్సహించెను. ఇంద్రుడొక అంబుజమాలికనిచ్చి తన వజ్రాయుధము వలన మరణము రాదని చెప్పెను. సూర్యుడు తన తేజమున నూఱవభాగమునిచ్చి విద్యాభ్యాసకాలము రాగానే వాక్పటిమ నొందు శాస్త్రమును నేర్పుదుననియు, ఏ శాస్త్రముననూ హనుమంతునకీడులేనట్లు చేతుననెను. వరుణుడు తన పాశములవలన నీటి వలన పదిలక్షల యేండ్లవఱకు చావునొందనట్లు వరమిచ్చెను. యముడు తన కాలదండము వలన మరణము నొందనట్లును రోగములు లేకుండునట్లును, యుద్ధభూమిలో దుఃఖ విచారము లేకుండునట్లును తెలిపెను. విశ్వకర్మ తనచే నిర్మితమైన అస్త్రశస్త్రాదులవలన చావులేకుండుటే కాక దీర్ఘాయువు కలుగు ననెను. బ్రహ్మ చిరాయువును, శత్రు భీప్రదత్వమును, మిత్రముదావహత్వ మును, దుర్జయత్వమును, కామచరత్వము, కామరూపము ఎదురులేని బలమును శక్తియును రామసేవను పొందునట్లనుగ్రహించెను.[41]

పరాశర సంహిత ప్రకారము: అంజనేయుడు జన్మించిన నాలుగయిదు రోజులలో అమావాస్య వచ్చెను. తల్లిని చూచి బాలుడు ఆహారము కోరెను. అంజన తన శిశువును లాలించి బాగా పక్వమునకు వచ్చిన పండ్లు ఎక్కడైనా లభించినచో తినుమని చెప్పెను. అపుడుదయించుచున్న భానుని చూచి దానిని పండనుకొని పట్టుకొనెను. సూర్యుని నోటకఱచు ఆ బాలుని చూచి యీ బలశాలి యెవడోనని విచారించి ఇంద్రుడు తన వజ్రాయుధము నాంజనేయునిపై విసరెను. ఆ ఆయుధమును అంజనేయుడు తన రోమముతో నడ్డెను. తన ఆయుధము వృథాయగుటజేసి ఇంద్రుడు బ్రహ్మాస్త్రము వేసెను. దానిని కూడ ఆంజనేయుడొక రోమముతో నడ్డెను. అది చూచి దేవతలాశ్చర్యపడిరి. అంత బ్రహ్మాది దేవతలు ఆంజనేయుని చేరి అతనిని ప్రార్థించిరి. "ఓ ఆంజనేయా! వాయుపుత్రా! రుద్రకుమారా! నీవు మహావీరుడవు. మహాబలవంతుడవు. దేవతలకు, మానవులకు, ఋషులకు మేలు చేయుటకే నీవు పుట్టితివి. సూర్యుని నీవు పట్టుకొనినందున వేదోక్తమగు క్రతు కర్మాది సేవలన్నియు నిల్చి పోయినవి. కావున సూర్యుని వదలుము." అని ప్రార్థించిన దేవతల మాట లాలకించి అంజనేయుడు సూర్యుని వదలెను. ఈ అద్భుతములను చూచిన ఇంద్రుడు చాపల్యము చేత క్రీడాసక్తుడై అంజనేయుని దవుడపై తన వజ్రా

యుధముతో కొట్టెను. వెంటనే బాలుడు శిలాతలమున పడి మూర్ఛితుడాయెను. అంత వాయువు అధికవేగముతో అందరి దేహములలోని వాయువును నిగ్ర హించెను. దానివలన లోకవ్యాపారములన్నియు ఆగిపోగా దేవతలు గంధర్వులు సిద్ధులు మహర్షులు త్రిమూర్తులు ఇంద్రుడు వాయువును చేరి నీ కుమారునకు మేము అనన్య దుర్లభములగు వరముల నిచ్చెదము. నీవు శాంతించి వాయు ప్రసరణ కావింపుమని ప్రార్థించిరి. ఆంజనేయునకు దీర్ఘా యువు బల పరాక్రమములు, ఆరోగ్యము, అజేయత్వము, విద్య, బుద్ధి, తపస్సు తేజస్సు, వాక్పటుత్వము, ప్రసన్నత, చతురత, ధైర్యము, విష్ణుభక్తి, దయా మయత్వము, పరస్త్రీ విముఖత మొదలుగా గల వరముల నిచ్చిరి. అంజ నేయుని ఆదరించి అతనిని చూచి బ్రహ్మ "నీవు విష్ణువు వలె దేవతల నుద్ధరించ గలవు. రామకార్య దీక్షామూర్తివై సంజీవనీ పర్వతమును తెచ్చి లక్ష్మణునకు ప్రాణములను ఇవ్వగలవు. సముద్రమును లంఘించి సీత జాడ తెలియగలవు. నీవు ఏ అస్త్రముచేతను జయింపబడవు. అయినను నా ప్రార్థనను ఆలించి ఒక్క క్షణము మాత్రము నా అస్త్రమునకు (బ్రహ్మాస్త్రము) కట్టుబడియుండు నటుల అంగీకరింపుము. నీవు ఈశ్వర తేజముచే జన్మించినందున ఈశ్వర తేజోద్భవుడవు. పార్వతీ గర్భమున సంభవించుటచే పార్వతీగర్భుడవు. అగ్నిచే ధరింపబడినవానివి కావున అగ్ని గర్భుడవు, వాయుపుత్రుడవు, అంజనాసూనునివి, కేసరి కుమారునివి, నీ హనువునకు వజ్రాయుధము తగిలి నది కావున నీవు హనుమంతుడవు అను పేరు వహింప గలవు. బ్రహ్మ విష్ణు మహేశ్వరాంశమున జన్మించితివి కావున త్రిమూర్త్యాత్మకుడవు. సర్వదేవతల అంశల నందినందున సర్వదేవమయుడవు. నిన్ను పూజించినచో అందరినీ పూజించినట్లే. ప్రతి గ్రామమునందును నిశాచరులు నశించుటకు వెడుగులు తొలగి శుభములు కలుగుటకు నీ నివాసము ఏర్పడగలదు." అని బ్రహ్మ పలికిన తర్వాత వారందరు అంతర్ధానమైరి.[42]

సమీరకుమార విజయము ప్రకారము: పొత్తిళ్లలో నుండిన హనుమం తుడు పోరుపెట్టి ఏడ్వగా అతనిని అంజనాదేవి యీ విధముగా లాలించి బుజ్జగించెడిది.

.... .... .... "రార, నన్

గన్నతండ్రి తపః ఫలాకృతి గౌరి నోములపంట, నా

చిన్ని ముద్దులకూన యించుకసేపు పోరిడకుండు మా
యన్న యాకలిదీఱఁ బండ్లు వనాంతరంబునఁ దెచ్చెదన్...."

ఈ విధంగా ఆంజనేయుని ఆదరించి పర్ణశాలలో ప్రవాళశయ్యపై శిశువు నుంచి తాను శీఘ్రంగా వచ్చెదనని పలికి అంజన అడవికి వెళ్లెను. అంత ఆంజనేయుడు ఆకలితో వాపోయి జనని వెనుక వేగంగా వెళ్లబోయి తూర్పు దిక్కున చూచెను. అప్పుడే ఉదయించుచున్న భానుబింబమతనికి అరుణారుణ ప్రభలతో ఆశ కల్గించెను.

తొట్టిన యాకటి బెట్టను
నట్టిట్టు గణింప నెఱుగకది ఫలమనుచున్
బుట్టిన దిట్ట తనంబున
నట్టె యెగసె గాడ్పుపట్టి యాకసమునకున్.

అతడావిధంగా ఘూర్ణిల్లెను. దిగ్గజాలు మూర్ఛనొందెను. బ్రహ్మచిత్తము భయోత్పాతాప్తితో క్షోభించెను. శరభమువలె గర్జించుచు వెడలు ఆంజనేయు డప్పుడు జగత్సంహార వేళలో వెడలు భీకర శూలాయుధునివలె నుండెను. అతని వాలచలనమునకు జడధి వ్రాతముల్ తూలలీలల తూలెను. నక్షత్రాలు లాజలై నిర్ఘాతకోటులు తొరగెను. త్రోవలు సురిగిపోయెను. గంధర్వ నగరము లన్నియు భిన్నాభిన్నములయ్యెను. వ్యోమ విహారులగు విమానము లన్నియు గణగణ మ్రోయుచు కూలిపోయెను. చూచుచున్న యక్ష రాక్షస ఫణి సిద్ధ సాధ్య దైవత నాయకులందరు అతనిని చూచి ప్రళయాగ్నియో, అంత్యకాల ప్రభంజనమో, విలయార్కుడో, భైరవుడో కావలయునని తలంచి అతని దుర్నిరీక్ష్య ప్రభాజవప్రతాపోగ్ర గతులకు మహాద్భుతము చెందిరి. ఎన్నడూ దర్శింపని యట్టి వీరుని దెబ్బకు ఇంక ఈ బ్రహ్మాండమేమి నిలువ గలదని తలంచువారు ప్రాణభీతితో, తిక్కమొగముతో పారిపోయిరి.

విచల ద్వాలముతోఁ దరంగితవళీ విస్పష్ట ఫాలంబుతో
రుచిమద్ఘర్మకణాన్వితాననముతో రోదోంతరోచ్ఛేద కా
ర్య చణా వార్య రవంబుతోఁ బవన తార్క్ష్యాశ్చర్యకృత్సత్వర
ప్రచురాహంకృతితో నతండు రవి బింబ ప్రాంతముం జేరగన్,

కుమారుడు సూర్యమండలం వైపు వెళ్తుండుట చూచిన వాయుదేవుడు భయపడి సూర్యతేజమువలన బాలునకాపద కలుగకుండా 'తామర చలువ తావుల నెరపి'

విసరసాగెను. చల్లగాలులు వీచుచు తన వెనుక తండ్రియగు వాయుదేవుడు వచ్చుసంగతి గమనించక, వెనుకా ముందూ చూడకుండా లక్షయోజనము లతిక్రమించి సూర్యమండలంలోనికి దూరుటకై పోగా సూర్యసతి ఛాయ కరములు పిసికికొనసాగెను. సూర్యుని పారిపార్శ్వకులు 'పాహి పాహి" అని భయముతో వణకుచుండగా లోకాలను గ్రంహించడానికి రుద్రుడే లయకాల రూపుడై వచ్చెనని యెంచి సూర్యునితో "స్వామీ మా నేత్రాలు గ్రుడ్డివై పోతున్నాయి; ఈతని గర్జల వలన మా చెవులకు చెవుడు వస్తోంది. మమ్ములను దయాదృష్టితో కాపాడండి" అని మొరపెట్టుకొనిరి. అపుడు దివాకరుడు 'ఈతడు అంజనా సూనుడు. సర్వలోక హితుడు. రుద్రాంశజుడై బాహు శౌర్యముతో కేవల శైశవబుద్ధితో నన్ను ఫలమనుకొని గ్రహించుటకై వచ్చు చున్నాడు. భయపడకుడు." అని ఊరడించుచుండగా బాలాంజనేయుడు భాస్కర బింబాన్ని పట్టుకొనెను. కనులపండువుగా ఉండే పండును కను గొన్నాను కదా అని కపికిశోరమానందించుచు పట్టబోగా అతనిపై వాత్సల్య ముతో సూర్యుడు వేడిమాపకుండా ఉండెను, అరుణ కమలాన్ని గజకిశోరము లాగినట్లుగా ఆ సూర్యబింబాన్ని లాగి దానిని యిటూ అటూ చూచి ముఖానికి దగ్గరగా చేర్చి

..........యొకటి నుంచి వేడియైనను వెడలం
బట్టికొని కేలఁగొట్టియుఁ
దిట్టియు వెసఁబోయి మఱియు

తెమలించసాగెను. అది పర్వమైనందున సూర్యుని గ్రహించుటకై రాహు వేతెంచుచుండగా బాలాంజనేయుడు భయంకరముగా గర్జించెను. అది విని రాహువు భయపడి పారిపోయి ఇంద్రునితో మొరపెట్టుకొనెను. "అయ్యా సూర్యుని యింకొకడెవడో పట్టుకొన్నాడు. ఇంక నేనెందుకు." అని వాసవునితో చెప్పగా ఇంద్రుడు రాహువునకభయమిచ్చి, వానితోగూడ ఐరావతముపై బయలుదేరి వచ్చి అంజనేయుని సమీపించెను. అంజనేయుని కత్తితో కొట్టుటకై తలంచి తన ఐరావతమును ఢీకొల్పెను. అది చూచి అంజనేయుడు 'ఓహో ఎర్రనిపండు బదులు తెల్లనిపండు దొరుకుతుందే" అని తెల్లని ఏనుగును పట్టబోగా అదికూడ భీతిచే వణకసాగెను. అపుడు ఇంద్రుడు తన వజ్రాయుధమును --

"ఝళిపించి మరుత్సుతుపై వ హనువు పగిలిన
నతడుదయాద్రిపయి వివశుడై నటులున్నన్....

దానిని వాయువు గమనించి తన కుమారునకు కలిగిన దుర్దశకు దుఃఖించి కోపము పూని 'జగజ్జన బాహ్యాభ్యంతర సంచారాన్ని" నిరోధించెను.

వనము నుండి యింటికి చేరిన అంజన పొత్తిళ్లలో పాపడు కనబడ నందుకు నేలపైబడి నిట్టూర్చి యే వన్యమృగమో తన కొడుకు నెక్కడికో ఎత్తుకొని పోయెనేమోనని 'విధి'ని దూషింపసాగెను. అంతలో ఆమె భర్త కేసరి ఆమె వద్దకు వచ్చెను. అతడు త్రికాలజ్ఞాని. జరిగిన విషయము నామెకు వివరించి ధైర్యము కలిగించి "గాడ్పు తన ధర్మాన్ని మాని స్తంభించియున్నం దున నీ కొడుకునకు సకల మహిమలు చేకూరగలవు" అని ఓదార్చెను. ప్రాణవాయువు స్తంభించినందున దేవతలందరు బ్రహ్మను చేరి తమ బాధను తెల్పిరి. అంత బ్రహ్మ వారిని వెంటనిడుకొని వాయువును చేరి అతనిని శాంతింప కోరెను. మూర్ఛలోనున్న తన పుత్రుని వాయుదేవుడు బ్రహ్మ పాదములపై పెట్టి నమస్కరించెను. బ్రహ్మ తన చేతితో బాలుని తాకగానే అంజనేయునికి చైతన్యము కల్గి లేచి చెరచెరలాడగా, బ్రహ్మ

"ఫలాకాంక్షా హృత బాలసూర్య
గిరి శంభద్ధైర్య"—

"రమ్మని నాయనా" అని అంజనేయు నెత్తికొని ముద్దాడెను. ఇది చూచి వాయువు సంతసించి తన పట్టు వీడి లోకమునకు ప్రాణమును ప్రసరింపజేసెను

అపుడు బ్రహ్మ సకల దేవతానీకమును చూచి 'ఈ బాలుడు అధ్యా లాత్మల సంభావింపగా శంభుడే ప్రాదుర్భావము చెందినాడు; లోకత్రయామోద ప్రోద్యుడు. ఇతనికి మనము వరములను ఇయ్యవలెను" అని పలికెను. వాయు దేవుని ప్రసన్నుని చేసికొనుటకై దేవతలందరూ అంజనేయుడు కోరుకొనకున్నా వరముల నిచ్చుటకుద్యమించిరి.

1. సూర్యుడు – తనతోడి తేజమును, వేదశాస్త్ర ప్రాప్తినీ
2. వరుణుడు – నీటిలో తన పాశముల నుండి నిర్భయ సంచారిత్వమునూ
3. యముడు – రోగాదులూ మృత్యువూ చేరకుండునట్లునూ
4. ఈశానుడు – తనచేగాని తన ఆయుధాలచేగాని గాసినొందనట్లునూ

5. కుబేరుడు – తన గదాహతికి భీతిల్లకుండుటేకాక సకల సమర విజయమునూ

6. విశ్వకర్మ – శస్త్ర భీతి నివారకమగు కర్ణకుండలములునూ

7. ఇంద్రుడు – తన వజ్రాయుధము వలన భీతి లేకుండునట్లునూ

8. బ్రహ్మ – దీర్ఘాయువుతోపాటు మునిశాపములు తగులకుండా ఉండే శక్తినీ

9. అగ్ని – తనచేత నశింపకుండునట్లునూ (ఈ వరము స। కు। వి గ్రంథములో లేదు.)

10. శివుడు – తన ఆయుధము దేనితోను బావకుండునట్లునూ (ఇదికూడ స। కు। వి।లో లేదు. 9, 10 అంశములు కంకంటి పాపరాజ కృత ఉత్తర రామాయణ మూలాధారముగా. ఆ 1, ప 179 మరియు ఉత్తరకాండము – మందరము. ప 819 – 825)

ఈ వరములు పొంది ఆంజనేయుడే యే కార్యములు సాధించునో, ఎట్టి ప్రభావమును పొందునో బ్రహ్మ వివరించెను. "ఇతడు కీర్తివిహారుడై, అజేయుడై, ఏకైకవీరుడై, అద్రిధీరుడై, జగదుదారుడై, ఆత్మ తత్త్వ విచారుడై అంతరింద్రియజేతయై అణిమాది సిద్ధులు తాను పొంది యితరులకు వానిని ప్రసాదించువాడై నిరర్గళ. మనోవేగముతో తలంచిన మాత్రమున బ్రహ్మాండమును చేరగలవాడై, నిత్య వైరాగ్య స్థితిలో నిష్కాముడై కామ రూపత కలవాడై అనివార్య శౌర్య ధైర్య దయాది సద్గుణముల కాకరమగు వాడై అద్భుతమగు క్రియలొనర్చువాడై అఘటనాఘటన మహిమ కలవాడై రామకార్యసాధకుడై, రాక్షసాంతకుడై లోకశ్రేయస్సు సాధించు నెన్నో మహిమల చూపగలవాడగునని" వివరించెను. ఈ సందర్భములో ఇంద్రుడు తన వజ్రఘాతమున హనువు తగిలి అజేయుడైన కారణమున ఆ బాలుడు హనుమంతుడను పేరుతో ప్రసిద్ధి పొందగలడని తెలిపెను. ఇన్ని వరాలను పొందుటకు బాలుని యెడ వాయువు ఆనందించి అతనిని స్వయముగా ఎత్తికొని తానే ఆ బాలుని అంజనా కేసరుల వద్దకు చేర్చి దేవతాదులతని కిచ్చిన వరముల తెల్పి వెళ్లెను. దానికి వారెంతో ఆనందించిరి. 'వజ్రాహతివేళలో

బాధపడుతూ నన్నెంతగా స్మరించితివోకదా నాతండ్రీ' అని అంజన పలికి హర్షాతిరేకంతో అతనిని చేరదీసి ధరాగత పరాగ క్రాంతమైన అతని ముఖాన్ని తన కన్నీటితో అభిషేకించెను.[43]

ఈ కథలగూర్చి యితర గ్రంథముల ప్రకారము ; ఇంద్రుడాంజనేయునకు స్వచ్ఛంద మరణమును వరముగా నిచ్చినట్లు 'గణపతి రామాయణసుధ' ఆంజనేయుడు భవిష్యద్బ్రహ్మ కావలసిన కారణమున్నందున సూర్యుడాంజనేయుని దహింపకుండెనని పెన్మెత్స సూర్యనారాయణరాజుగారి ఉత్తర రామాయణము. తన కుమారునకు అమరత్వము, అజేయత్వము సంపూర్ణ బలములతోపాటు శ్రీరామభక్తి, శ్రీరామ సన్నిధాన నివాసము వాయుదేవుడు వరములుగా కోరినందున బ్రహ్మ ఇచ్చినట్లు శ్రీ తులసీదాసుగారి రామచరిత మానస్.[44]

## 2. హనుమంతుడను నామవిశిష్టత:

హనుమత్ శబ్దమును వాల్మీకి వాడుటలోని ఔచిత్యమును చర్చించుచు తమ 'షోడశి రామాయణ రహస్యము'లో శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారు హనుమంతుడను పేరులోని విశేషముల తెల్పియున్నారు. ఇది అంజనేయునకు జననీ జనకులు కావించిన పేరుగా భావింప వీలులేదు. కుండలినీయోగ సాధకుడను అర్థము తెలుపుటకే ఈ హనుమత్ శబ్దము వాడబడినదని వారి అభిప్రాయము. "అంతరేణ తాలుకేయ ఏష స్తన ఇవా లంబతే సేంద్రయోనిః" అను తైత్తిరీయ వాక్యానుసారము హృదయమునుండి ఊర్ధ్వముగా ప్రవృత్త మగు సుషుమ్నానాడి తాలుకలమధ్య స్తనములవలె వ్రేలాడుచుండును. లోదౌడలు తాలుకలు, వెలిదౌడలు హనువులు. అనగా రెండునూ దౌడలే. కనుక 'హనుమత్' అనగా సుషుమ్నతో కూడిన యోగి అని తాత్పర్యము." ఈ విషయము దివాకరుని వేంకటసుబ్బరావుగారును సమర్థించియున్నారు.[45] "అజ్ఞానమును హననము (ఖండించుట) చేయునది కావున జ్ఞానమునకు 'హను" అని పేరు. ప్రశస్త్యార్థములో మతుప్ ప్రత్యయము చేరగా హనుమంతుడగును. అనగా ప్రశస్తమైన జ్ఞానము కలవాడని అర్థము.[46]

హనుమంతుని పేర్లను తెలుపు శబ్దములలో హనుమానుడు హనుమంతుడు, సుగ్రీవసఖుడు, వాయుసూనుడు, అంజనాసూనుడు, రామదూత, రామ

దాసు మొదలగు శబ్దములను గమనించినచో శబ్దమునకు అతని ఉత్పత్తిప్రకార మునకును గల సామ్యము విశదమగును.

1. హనుమంతుడు: హనువనగా దౌడ, శిరఃస్థానము నుండి క్రిందకు వచ్చి నోటిలో దౌడల కదలికలచే వినబడునట్లు వెల్వడునట్టి శబ్దమునకు హనుమంతం – హనుమత్ అని ప్రసిద్ధి. కావున శబ్దోత్పత్తితోగల సంబంధమును బట్టియే హనుమంతునకు ఆ పేరు.

2. సుగ్రీవసఖుడు; 'సు' అనగా మంచి. గ్రీవుడు అనగా మెడ గలవాడు, అనగా స్వాధ్యాయ ప్రవచనశీలియగు శ్రోత్రియుడు. శబ్దమును ఉదాత్తానుదాత్త స్వరితాలతో ఉచ్చారణాదక్షుడగు వేదాధ్యయన పరునకు అవసరమైన కార్యములో తోడ్పడువాడు కావున సుగ్రీవసఖుడు.

3. వాయుసూనుడు: అనగా వాయుదేవుని కుమారుడు. శబ్దము వాయువు నుండి పుట్టినది. సంకల్పమాత్రమున శరీరములో నుండు వాయువులో కదలిక కలుగును. ఆ వాయువుచే అభిహతమై మూలాధార స్థానము నుండి శబ్దము బయలుదేరి నాభిని, హృదయమును, కంఠమును దాటి తిన్నగా శిరఃస్థానము చేరును. అటుపై పోలేక కంఠమునుండి ముఖము నుండి వెలికివచ్చును. ఉచ్చారణాస్థానములబట్టి ఆ వాయువు వినపడెడి శబ్దముగా వెలికివచ్చును. ఈ శబ్దమే ఋషుల నోటి నుండి వచ్చినది.

4. అంజనాసూనుడు: అంజనాదేవి కుమారుడు ఆంజనేయుడు. శబ్దము కూడ శిరస్సువైపునకు ముందుకు సాగును. నోటిలో ఆయా వర్ణములు అభివ్యక్తమగు స్థానమునే వ్యంజన (వి+అంజన) అందురు. అనగా అంజనయందు శబ్దము జనించును కావున అంజనాసూనుడు.

5. రామదూత: భగవంతుని నామమగు 'రామ' శబ్దమును తత్సందేశమును జీవుల కందించు దూత కావున రామదూత.

6. రామదాసు: రామశబ్దమునకే పరతంత్రుడై రామునే వహించువాడు కావున రామదాసు.

ఇట్లు హనుమంతుని పేర్లన్నియు శబ్దమునకు సంబంధించి యున్నవి. హనుమంతుడనగా శబ్దస్వరూపుడు. భగవానుని తెలిసికొనుటకు శబ్దరూపమగు నామము వినా వేరొక మార్గము లేదు కావున శబ్దస్వరూపుడై భగవంతుని

మనకు అందించువాడే హనుమంతుడు. భగవద్దూతయై, భగవద్వాహకమై, భగవత్ప్రాప్తికి విరోధులగువారిని నిర్జించువాడై భగవత్పరతంత్రమైయుండెడి శబ్దమే హనుమత్ శబ్దము. కావున హనుమంతుడే మంత్రము; హనుమంతుడే గురువు.[47]

అం అనగా సర్వవ్యాపకమైన విష్ణువు. (అక్షరాణాం అకారోఽస్మి-గీత 10-33) జన = జనయతి = పుట్టించునది. కావున అంజనా అంజనకు సంబంధించినవాడు కావున ఆంజనేయుడు. అనగా సర్వవ్యాపకుడగు విష్ణుతత్త్వము నుపాసించెడివాడని అర్థము,[48]

## 3. ఆంజనేయుని బాల్యము:

శ్రీమద్రామాయణమును పరాశర సంహితయును ఈ విషయమును వివరించలేదు. బాలుడగు ఆంజనేయుడు మునుల అగ్నిహోత్రముల నార్పుచు కొయ్యమిల్లలు కుండలు పగులకొట్టుచు వారిని బాధించినందున మునులతనికి శాపమిచ్చినట్లు వాల్మీకి ఉత్తరరామాయణం. మునుల వల్కలాజినముల చింపుచు అల్లరి చేసినట్లు కంకంటి పాపరాజు కృత ఉత్తర రామాయణము. [49]

సమీరకుమార విజయము ప్రకారము: ప్రభాసతీర్థ పుంజిక స్థలమున తరుశాఖలలో హనుమంతుడు తిరుగాడెడివాడు. అతుల గతులతో గురు లీలలతో ఒక్కొక్కచో కనబడుతూ, ఒక్కొక్కచో కనబడకుండా వానర బ్రహ్మచారిగా చరించుచు శిష్టమార్గము వీడి ఎన్నో మర్కట చేష్టల కావిస్తూ మునుల వల్కలాజినముల వ్రచ్చి వారిని బాధించుచుండెడివాడు. మునులను తన శిశు లీలలతో బాధించుట తగదని అంజనాకేసరులు ఎంత వారించినా వారి మాటలు ఏనుగునకు కట్టిన నూలుపోగులవలె నిష్ప్రయోజనములగుచుండెడివి. స్రష్ట ఇచ్చిన వరముల వలన హనుమంతుడు శాపము పెట్టినచో అది పనిచేయదని ఎఱింగిన భార్గవకులులైన మునులు కొందరు అతని అల్లరిని భరింపజాలక అతనిని శాంతింపజేయు నాశయముతో "నేను ఇంతటి వాడనంచెఱుగకెప్పుడు నీతడుండుగాక" అని వారిలోవారే అనుకొనిరి. వారి భావనాబలం వల్ల హనుమంతుడు బలాహంకారములు లేక సాత్త్విక గుణ భూషణుడై సాధుతనము మీరగా నదిమాచి అంజనాకేసరు లెంతయో ఆనందించిరి.

తులసీదాసు రామాయణము ప్రకారం: మునుల కమండలములలోని నీటిని త్రాగుచు ఆశ్రమ వృక్షములను కూల్చుచు, కొండకొమ్ము లెక్కుచు మునుల బాధపెట్టుచున్నందున వారు ఆంజనేయుని చూచి "నీబలం నీకు జ్ఞాపకం చేసినప్పుడే నీవు గుర్తింపగలవు" అని అనుకొనిరి. బాలరాముడు హనుమంతుడు ఒకరితో ఒకరు కలిసి ఆడుకొనినట్లు తులసిదాసు పేర్కొని యున్నాడు. రాముడు బాలుడుగా నుండిన సమయమున ఒకనాడొకడు కోతి నొకదానిని తెచ్చి రాజద్వారమువద్ద ఆడించుచుండగా రాముడది చూచి తన కట్టి కోతి కావలెనని కోరెను. ఒక కోతిని దశరథుడు తెప్పించి యిచ్చినా రాముడు దానిని స్వీకరింపక ఏడ్చుచుండగా వసిష్ఠుడు రాజును చూచి "రాజా! కిష్కింధలో సుగ్రీవునివద్ద ఒక కోతి కలదు. నీవు దూతను పంపి ఆ కోతిని మర్యాదతో రప్పించుము." అని చెప్పెను. రాజదూతలు కిష్కింధకు వెళ్లి సుగ్రీవునకు తెలుపగా అతడు సంతోషించి దూతల వెంబడి మహావీరుడగు హనుమంతుని పంపెను. అంతఃపురమున ప్రవేశించిన హనుమంతుని రాముడు తన గుండెలమీద పెట్టుకొని ముద్దులాడి, కౌగిలించుకొని సంతోషించు చుండెను. హనుమంతుడు బాలవానరరూపుడై రాముని వెంటనంటియుండి రాముడాడుకొను స్థలములో తానును ఆడుకొనుచుండెను. ఒకనాడు రాముడు గాలిపటము నెగిరించెను. అది పైకి ఎగురుతూ పోయి స్వర్గానికి పోగా ఇంద్రుని కోడలగు జయంతసతి దానిని చూచి ఆశ్చర్యపడి దానిని పట్టుకొని దాచియుంచెను. రాముడిది గ్రహించి "ఎవరో మన గాలిపడగను దాచి యుంచినారు. వెళ్లి చూచి తీసికొనిరా." అని ఆదేశించగా హనుమంతుడు పైకి ఎగిరి జయంతుని భార్యను చూచి "తల్లీ గాలిపడగను విడిచిపెట్టుము" అని కోరెను. ఆమె 'ఈ గాలిపడగను ఎగురవేసిన వారిని చూడవలెనని యున్నది కావున దీనిని కట్టిపెట్టి యుంచితిని." అని తెలుపగా హనుమంతుడయోధ్యకు వచ్చి ఆ వార్త రామునకు ఎఱిగింపగా 'నన్నామె చిత్రకూట పర్వతమున చూడగలదు" అని తెలుపగా మరల స్వర్గమునకు వెళ్లి జయంతుని సతికి హనుమంతుడా సంగతి వివరించగా రామదర్శన భాగ్యసిద్ధి నెఱిగి ఆమె గాలి పటమును వదలెను. దానిని ఆంజనేయుడు రామునకు తెచ్చియిచ్చెను. విశ్వామిత్రునితో యజ్ఞ సంరక్షణార్థము రాముడు వెళ్లుచు 'నీవు వనమునకు పొమ్ము నేను అరణ్యమునకు వచ్చినపుడు నిన్ను కలుసుకొనగలను." అని ఆదేశించి

నందున హనుమంతుడు కిష్కింధకు తిరిగి వచ్చెను. ఇదే వృత్తాంతముగల కథ భరద్వాజ రామాయణమున కలదని శ్రీ దివాకరుని సుబ్బారావుగారి బాల కాండలో పేర్కొనియున్నారు. ఈ కథకు కొన్ని కల్పనలను చేర్చి శ్రీ 'హనుమాన్ లీలా తరంగిణి' కర్తగారును శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తిగారు తమ హనుమచ్చరిత్రలోను పేర్కొనిరేకాని ఏ ఆధారమును బట్టి వారది వ్రాసిరో తెలుపరైరి. హనుమద్రామ సమావేశము జరిగినపుడు వారు తమ బాల్యస్నేహ క్రీడాదులను స్మరించినట్లు వర్ణితము కాలేదు.[50]

అంజనేయుని అల్లరి మాన్పించు ఉద్దేశముతో బ్రహ్మ అతనిని విద్యలలో పరీక్షించుటకు తన లోకమునకు రప్పించెను. బ్రహ్మసృష్టి కార్య విధానమును హనుమంతుడు పరిహసింపగా బ్రహ్మ అతనిని చూచి నీవు నా అస్త్రమునకు ఏడు ఘడియలు (గం 2-48 ని) బద్ధుడవగుమని శాపమిచ్చినట్లు శ్రీమద్రామాయణాంతరార్థమను గ్రంథమున కలదు.[51]

## 4. హనుమంతుని విద్యాభ్యాసము:

వాల్మీకి రామాయణము ప్రకారం: హనుమంతుని విద్యాభ్యాసం గురించి అతని గురువును గూర్చి రామాయణమున ప్రత్యక్ష సాక్ష్యము లేదు. రామ సుగ్రీవ సమావేశమునకు పూర్వము హనుమంతుని వాక్యకోవిదత్వం రాముడు ప్రశంసించుచు ఋగ్యజు స్సామములను మూడు వేదముల నభ్యసింపని వానికి హనుమంతునివలె మాట్లాడుట చేతకాదనిన్నీ అతడు వ్యాకరణమెన్నోమార్లు చదివియుంటాడనిన్నీ అసందిగ్ధమూ అవిస్తరమూ అవిలంబితమూ అద్రుతమూ కాక ఉరస్థ్సానోద్గతంబులై కంఠమునుండి మధ్యమ స్వరముతో మాటలు వ్యక్తమైనట్లు శ్రీరాముడు లక్ష్మణునితో చెప్పినట్లు సుందరకాండలో కలదు. బృహస్పతితో సమానమగు తొమ్మిది వ్యాకరణములు అభ్యసించి, సూత్రవృత్తి, అర్థము, పదము, విశేషార్థము, ఛందస్సు ఇతర శాస్త్రాలు నేర్చినట్లు ఉత్తర రామాయణమున కలదు. కంకంటి పాపరాజు వ్రాసిన ఉత్తర రామాయణములో ఇంక కొంత వివరముగా నున్నది. విద్య నేర్పుమని తన వద్దకు చేరిన హనుమంతునితో సూర్యుడు "నా గమన వేగము వలన త్రోవలో నీకు ఏకాగ్రత కుదరదు కావున నావద్ద విద్యాభ్యాసము వీలుకాద"ని అనెను. అంత అంజనేయుడు చిరునవ్వు నవ్వి ఉదయాస్తాద్ర్యాదులపై పాదముల మోపి హరి

త్రివిక్రమ రూపము వలె నిండి, శ్రుతులు, శాస్త్రములు, పరిజ్ఞాన కళావిశేష ములు, నిరశనుడై దినకరుని కలకుటెండ సహించి చదివెను.[52]

"తమ్మిచూలికి నాతని వధూమణికిఁ
దగు గాక యొరులకు దరమె వ్యాకరణ
నిగమ శాస్త్రంబు లన్నియు నేర్వబోలు
నితని సల్లాపంబు నితని రూపంబు
నతుల లక్షణ లక్షితానురూపంబు"[53]

పరాశర సంహిత ప్రకారము: అంజనేయుడు బ్రహ్మచర్య నిష్ఠ పూనిన వాడై, తాను సర్వజ్ఞుడయ్యు, సమర్థుడయ్యు, లోకసంగ్రహమును దృష్టిలో నుంచుకొని సూర్యమండలమునకు చేరి సూర్యునికి నమస్కరించి తనకు వేదములు, వేదాంగములు, ఉపాంగములు నేర్పవలసినదిగా కోరెను. ఈశ్వ రాజ్ఞకు లోబడి సదా భ్రమించు తాను ఆంజనేయునకు బోధించుట కుదరదని సూర్యుడనెను. అపుడు హనుమంతుడు కోపముతో సూర్యుని మార్గము నడ్డ గించెను. సూర్యుడంత 'దీనికి పరిష్కారోపాయము నీవే తెలుపుము" అని కోరెను. అంత హనుమంతుడు సూర్యునికి అభిముఖముగా నుండి సూర్యుని చూచుచు వెనుకకు నడచుచు ఒక్కవారములో ఇంద్ర వ్యాకరణము నేర్చెను. అటు తర్వాత ఒక పాదము ఉదయాద్రిపై ఇంకొక పాదము పశ్చిమాద్రిపై నుంచి సూర్యునికెదురుగా నిలబడినవాడై సాంగోపాంగముగా వేదముల నభ్యసించి సర్వవిద్యావిశారదుడై తన గురువగు సూర్యుని సంతోషపరిచెను.[54]

సమీరకుమార విజయము ప్రకారం: అంజనాదేవి, కేసరి హనుమంతుని విద్యార్జనకై ఏ ప్రయత్నము చేసిరో తెలుపుటకాధారములు లేవు. బాలుడగు హనుమంతునికి వాలిసుగ్రీవులు మేనమామలని తెలిపి వారివద్దకు అతనిని అంజన పంపెను. వారిరువురూ అతనిని ఆదరించిరి. కాని వారిలో హనుమం తుడు సుగ్రీవునితోనే ఎక్కువగా గడపుచుండెను. ఒకనాడు తన విద్యా ప్రాప్తికై 'వియద్గతిన్జని" రవిని దర్శించి "తుభ్యం నమస్సత్యజ్ఞాన కళాత్మనే" అని నమస్కరించెను. "సంకల్పసిద్ధిరస్తు" అని ఆదిత్యుడతనిని దీవించి తన వద్దకేతెంచిన కారణ మడిగెను. "వేదశాస్త్రాగమాభ్యాసంబెప్పుడువేడ నప్పుడే యొనర్పం బూనిన వారౌట నే మీ సాన్నిధ్యముఁ జెందినాడ" నని హనుమం తుడు బదులాడెను. "నేను అనుక్షణ సంచారశీలుడను. స్వర్ణాద్రి చుట్టునూ

సముత్కటవేగముతో ద్రిమ్మరువాడను. మార్గలంపట క్లేశములతో నావద్ద విద్య నభ్యసించుట కష్టము" అని సూర్యుడు పలికెను. దానిని విని హనుమంతుడు వినయముతో తాను గమన వేగముతో సూర్యుని అనుసరించగలనని తెలిపెను. "నా వడిని నేనే పేర్కొనుట గర్వమనిపించవచ్చును కానీ 'పూర్వ పశ్చిమ గ్రావములందు పాదములుంచి మీ వెంబడి వెంది యుండునో, దేవర కంటే ముందు నడతెంతునో ఆనతీయు"డని కోరెను. సూర్యుడంత హనుడుంతుని పొగడి 'యీరేడు లోకాలలోని వియచ్చరులానందించునట్లు రెంమ కొండలందు పదముల ప్రతిష్ఠించి కన్పింపుమని" కోరెను. రవికి నమస్కరించి తన స్వైర ప్రచారముతో బలిని అనుగ్రహించిన త్రివిక్రమావతార రూపము వలె బ్రహ్మాండమును తన రూపముతో నింపెను. అపుడాతని రూపము సర్వదిక్కలితమై విస్తరించి యుండగా మునులు, ద్విజులు 'హరయే నమో నమోస్తుతే' అని నుతించిరి. హనుమంతుని విరాడ్రూపము గాంచిన వివస్వంతుడతని యెడ భక్తితో 'ప్రత్యక్ష రుద్రావతార। జనులు నన్నాదరించుటకు నీవు నన్నాశ్రయించుచున్నావే కానీ నేనా। నీకుపదేష్టను. నీ శక్తిని శంకించిన నన్ను క్షమింపుము" అని అనెను. తన నంగీకరించి త్రయీ ప్రపంచాన్ని కృపన్ వివరిపుమని హనుమంతుడు కోరి రవి బింబమున కెదురుగా నిజాకారముతో ప్రకాశించెను. ఘడియకు తొమ్మిదిలక్షలా డెబ్బది యోజనములు తిరుగు సూర్యునికంటే వేగముగా సంచరించుచు హనుమంతుడు సూర్యుని వద్ద పాఠములు నేర్చుటకుపక్రమించెను. పదక్రమ ప్రౌఢి, శబ్ద నియతితో ప్రత్యాహార నిపుణత, బహుస్మృతిపురాణార్థసంగతులు. నిరత సంగీతరత గళోద్ధురతతో విద్యలన్నింటిని లోకసంగ్రహేచ్ఛతో సాధించెను. ఇట్లు సర్వశాస్త్రములెఱిగి సామీరి సూర్యునకు ప్రాంజలించి తన ప్రణామమునే గురుదక్షిణగా భావింపుమని ప్రార్థించి మాతులుల వద్దకు వచ్చెను. ఈతని విద్యాభ్యాస సంస్కారముల గూర్చి శ్రీరాముడే ఇట్లు తెలిపియున్నాడు. "హనుమంతుడు ప్రాజ్ఞుడు, తజ్ఞుడు, ఉత్తముడు, సర్వజ్ఞుడు. కానిచో విలు నమ్ములున్న తపసి వాలకమును నమ్మని సుగ్రీవునికి నచ్చచెప్పి నాకు సుగ్రీవ సఖ్యము నేల కలిగింప గల్గును. ఇతడు విద్వజ్జనులలో విద్వచ్ఛిరోమణి. కవులలో ఉత్తమ కవివరుడు. గాయకశ్రేణిలో గాయకశ్రేష్ఠుడు. బలియురలో మహాబల సముద్రుడు, తపోనిధులలో తపశ్శాలి, యోగులలో పరమయోగి, ధీమంతులలో ధీమంతుడు, విరక్తులలో వైరాగ్యపరుడు, వీరులలో వీరాధి

పీరుడు. అప్రమేయుడు, జితేంద్రియుడు, వినయపరుడు, కార్యవిదుడు, సౌశీల్య నిధి. నిగర్వి, లోకజ్ఞుడు, ఆత్మశక్తిజ్ఞుడు, కామరూపధరుడు, కామదూరుడు.[55]

## 5. హనుమంతునికి వివాహమైనదా?

విద్యాభ్యాసానంతరం మాతులుల వద్దకు చేరిన తర్వాత హనుమంతుని జీవితవిశేషముల గురించి యే గ్రంథములోను వివరముగా లేదు. అతని దైనందిన జీవితమూ, యౌవనమూ, అతని ఆశలూ, అనుభూతులూ తోడి వారితోగానీ సమాజముతోగాని అతనికేలాంటి మమతానురాగాలు కలుగు చుండెనో ఏ మాత్రము తెలియవు. హనుమంతుడు బ్రహ్మచారియని కొందరు ఇతడు వివాహము చేసికొనెనని కొందరు తమతమ విశ్వాసాలకు తగినట్లుగా వ్రాసియున్నారు.

శ్రీమద్రామాయణము ప్రకారము: హనుమంతునికి వివాహమైనట్లుగానీ, అతనికి భార్య యున్నట్లుకాని రామాయణమున లేదు. ఈ గ్రంథమందలి పాత్రలలో ఎవరు గూడ హనుమంతునికి భార్య యున్నట్లు తెలుపలేదు. రావణ వధానంతరం అయోధ్యకు తిరిగి పయనించుటకు ముందు సీత శ్రీరాముని చూచి

"శ్రీమహిమాభిరామ విను చేసెద నేనొక విన్నపంబుఁ దా
రామహిళాది ముఖ్య కపి రాజ సతుల్ మఱి యన్యవానరీ
స్తోమము గొల్వ సమ్మదముతోఁ జనగోరెద నయ్యయోధ్యకున్[56]

అని కోరెను. తనకునూ, శ్రీరామునకునూ ప్రాణములు నిల్పి మహోపకార మొనర్చిన హనుమంతుని వంటి సన్నిహిత సేవా దక్షుడగు వానికి భార్యయే యుండినచో అమెను అయోధ్యకు తీసికొని రావలసినదిగా సీతకోరియుండెడిది.

పరాశర సంహిత ననుసరించి: విశ్వకర్మ తన కుమార్తెయగు ఛాయను సూర్యునకిచ్చి వివాహము చేసెను. సూర్యునితో కాపురము చేయు ఛాయ అతని కిరణముల తేజస్సును సహింపలేక తాను తన పతికడ నుండలేనని తన తల్లితో చెప్పెను. అమె ఈ విషయమును విశ్వకర్మకు తెలియజేసెను. వెంటనే అతడు సూర్యుని సానబెట్టి తక్కువ తేజస్సు గల వానినిగా చేసెను. సానపట్టునపుడా సూర్యుని నుండి వేరైన కిరణముల నుండి ఒక కన్య పుట్టెను. ఆమె పేరు సువర్చల. బ్రహ్మాది దేవతలామె సౌందర్యమున కాశ్చర్యపడిరి.

వారిలో కొందరు బ్రహ్మతో 'దేవా! ఈమెకు భర్త ఎవరో" తెలుపమని కోరిరి. అపుడు బ్రహ్మ "పరమేశ్వరుని మహా తేజమగు హనుమంతుడాకాశమున సూర్యుని పండు అనుకొని పట్టుకొనగలడు. ఆ హనుమంతుకీమె భార్య కాగలదు." అని తెలిపెను.[57] ఈ గ్రంథమును ప్రమాణముగా పెట్టుకొని హనుమంతునికి 'సువర్చల'తో వివాహము జరిపించిన కథలు తర్వాత వచ్చినవి.

పురాణములలో హనుమంతునకు వివాహమైనట్లుగా వర్ణింపబడలేదు. హనుమంతుని చరిత్రను విపులముగా వ్రాసిన పుష్పగిరి తిమ్మన తన 'సమీర కుమార విజయమున' హనుమంతునకు వివాహమైనట్లు తెలుపలేదు. అందుచే హనుమంతునకు వివాహమైనదను విషయము వివాదాస్పదమైనదిగా తోచును. ఇతనికి వివాహము జరిపించి "సువర్చల"ను భార్యగా కొందరు రచయితలు 'పరాశరసంహిత' ఆధారముగానే పేర్కొనియున్నారు. రామాయణ కర్తలగు వాల్మీకి కాని, అతని ననుసరించి ఎన్నో అవాల్మీకములగు కల్పనలను చేసిన రామాయణానువాదకులుగానీ హనుమంతుని వివాహవృత్తాంతము తెలుపలేదు. రంగనాథ రామాయణము, భాస్కర రామాయణము, నిర్వచనోత్తర రామాయణము. మొల్ల రామాయణములలో హనుమంతుడు వివాహముకాని బ్రహ్మచారిగానే కన్పించును.

ఇపుడు నిర్ణయించవలసిన అంశములలో (1) హనుమంతునికి వివాహమైనదా? (2) అయియున్నచో ఇతని భార్య సువర్చలయేనా? (3) ఈ సువర్చల కథ నిస్సందేహముగా నమ్మదగినదా? అనునవి ముఖ్యము - అందుకు ముందుగా సువర్చల వృత్తాంతమును తెలిసికొనుట కర్తవ్యము.

రామాయణముల ప్రకారము: రామాయణములో సువర్చల సూర్యపుత్రిగా కాక సూర్యపత్నిగా పేర్కొనబడినది. సీతాన్వేషణా పరుడగు హనుమంతుడు అశోకవనమున శింశపావృక్షమున దాగియుండగా రావణుడేతెంచి సీతను తనకు వశమగునట్లు మోహావేశముగా పలికి వెళ్లిపోతూ తన పరిచర జనమునుచూచి "ఎటులైనను హితబోధచేసి సీత మనసును నాయందు లగ్నమగునట్లు ప్రయత్నించుడు" అని ఆజ్ఞాపించిపోయెను. అంత వారామెకు రావణుని గొప్పదనమును, బల పరాక్రమాదులను తెల్పి ఎంతగానో ప్రయత్నించిరి. ఆమె అనుకూలముగా మాట్లాడనందున వారామెను బెదరించిరి.

అపుడు సీతాదేవి వారిని చూచి "రాక్షస స్త్రీలారా దరిద్రుడో, రాజ్యహీనుడో మరి ఎట్టివాడైనా సువర్చలకు సూర్యునివలె నా మగడే నాకు గొప్ప. సూర్యుడు తన వేడిమిచే తపింపజేయుచున్నను సువర్చల అతనిని విడిచిపోయి నదా! ఇంద్రునకు శచీదేవి, వసిష్ఠునకరుంధతి, చంద్రునకు రోహిణి, చ్యవను నకు సుకన్య, సత్యవంతునకు సావిత్రి, కపిలునకు శ్రీమతి, అగస్త్యునకు లోపా ముద్ర, సగరునకు కేశినీ, సౌదాసునకు మదయంతి, నలునకు దమయంతి ఎట్టివారో శ్రీరామచంద్రమూర్తికి నేనును అట్లే" అని జవాబిచ్చెను. వ్యాఖ్యాత యగు శ్రీ వాసుదాసుగారు తమ మందరమున ఈ సువర్చల సూర్యుని భార్య యని తెలుపుటకు విష్ణుపురాణగాథ నొకదానిని వివరించినారు. "కల్పాది యందు బ్రహ్మకు కొడుకు పుట్టి యేడ్చెను. ఏల యేడ్చెదవనగా నాపేరేమి చెప్పుమనెను. బ్రహ్మ "నీవు రుద్రుడవు" అనెను. అయినా వాడు నేడుగాసై యేడ్చెను. అప్పుడు భవ–శర్వ–ఈశాన–పశుపతి–భీమ–ఉగ్ర–మహాదేవయని వారికి పేర్లు పెట్టెను. ఆ యెనమండ్రను సూర్య–జల–మహీవాయు–వహ్ని–ఆకాశ–దీక్షితబ్రాహ్మణ–సోమ, దేహములిచ్చి సువర్చల–ఉష–సుకేశి–శివ–స్వాహా–దిశ–దీక్ష–రోహిణి యను నెనమండ్ర భార్యల నిచ్చెను. ఇందు చెప్పబడిన సువర్చల ఈమెయే."

భాస్కర రామాయణమున సువర్చల సూర్యసతిగానే సీత చెప్పెను.

సగరు కేశినివోలె సౌదాసు మదయంతి
గతి వసిష్ఠుని నరుంధతి విభాతి
నిను సువర్చల భంగి నింద్రుని శచి మాడ్కి
.... .... .... .... .... ....
.... .... .... ... .... ....
రామచంద్రు
గొలిచి యేను సమ్మతినుండి[59] .... ....

స్కందపురాణోక్తముగా: ఇందు సువర్చల దధీచి ముని భార్యగా పేర్కొనబడినది. ఇంద్రుని కొఱకై దధీచి దేహత్యాగము చేయుటకు ముందు తన భార్యయగు సువర్చలను పిల్చి తన వెన్నెముక దేవతలకు చెందిన తర్వాత శివభక్తుడగు తనతోపాటు ఆమెకూడ శివసాయుజ్యము చెందగలదని చెప్పెను. అప్పటికే గర్భవతిగా నున్న సువర్చల భర్తృదేహత్యాగానంతరం

పిప్పలాదుడనువానిని ప్రసవించి వానిని అశ్వత్థ వృక్షము నాశ్రయించి యుండు మనియు, ఆ వృక్షమునకు ప్రదక్షిణములు చేసినవారికి అభీష్టసిద్ధియగునని తెలిపి తన తనువు చాలించెను.[60]

ఆనందరామాయణములో: సువర్చల ఒక అప్సరస. ఈమె బ్రహ్మ శాపంవల్ల ఒక గ్రద్దయైనది. పుత్రకామేష్టిలో లభ్యమైన పాయసమును కైక స్వీకరింపక దానిని పారవైచగా ఆ పాయసమును ఈ గ్రద్ద తీసుకొని వచ్చి అంజనాదేవి వద్ద వేయగా దాని నామె భక్షించి ఆంజనేయుని పొందెను. కైక చేతి పాయసాన్ని తీసికొని వచ్చుట ఆమె శాపవిమోచన కారణముగా బ్రహ్మ తెలిపియుండెను. గ్రద్ద రూపం వీడి అప్సరస రూపము నొంది సువర్చల వెళ్ళిపోయెను.[61]

పైన పేర్కొనిన వృత్తాంతముల ననుసరించి సూర్యసతియగు సువర్చల, దధీచి పత్నియగు సువర్చల; అప్సరసయై శాపము వలన గ్రద్దయైన సువర్చల హనుమంతునికి భార్యగా పేర్కొనబడిన సువర్చల; మొత్తం నలుగురు సువర్చలా నామధేయలు గోచరించుచున్నారు. వీరు వేరువేరు వ్యక్తులయినచో బాధలేదుకాని ఒకరే అయినచో చిక్కువిప్పుట కష్టము. పూర్వాగాథాలహరి అను గ్రంథమున శ్రీ వేమూరి శ్రీనివాసరావుగారు ఒకచో సువర్చలను హను మంతుని భార్యగానూ, వేరొకచో పరమేష్ఠి భార్యగాను పేర్కొనియున్నాడు. సువర్చలకు పరమేష్ఠి వలన ప్రతీకుడను పుత్రుడున్నాడని ఆ గ్రంథసాక్ష్యము.[62]

కర్తవ్యమగు చర్చనీయాంశమును కొనసాగించులోగా సువర్చలను హనుమంతునకిచ్చి వివాహము జరిపించిన వారి రచనలలో వారు తెల్పిన అంశములను గూడ తెలిసికొనవలసియున్నది.

హనుమచ్చరిత్ర (చల్లా పిచ్చయ్యశాస్త్రిగారి కృతము): వీరు తమ కావ్య కథకు పరాశర సంహితయే మూలమని పేర్కొని యిందు సువర్చలాంజనేయ వివాహమును వర్ణించి యున్నారు. పార్వతీ పరమేశ పావకానిలాది దేవతలు అంజనా కేసరులు సూర్యునిచే ఏర్పాటుచేయబడిన విడిదిలో చేరరాగా పెళ్లి వేడుకలు మొదలయ్యెను.

కనకపుఁ బళ్లెరమునఁ గాళ్లు గడిగి క
న్యాదానమొసంగె ధన్యోస్మి యనుచు

కమేలి బాంధవుడు దత్కాంతయు నానంద
కంధి వీచిడోలికల నూగి
రనువుగా సభ్యుల కనులకు జెవులకు
పండువయ్యెను జగన్మండలికిని
హస్త మస్తక యోగమయ్యె జంటకు జీర
ధారణ శుభ ముహూర్తమున నయ్యె
తెరవీడె లోసిగ్గు తెలుగున సాప్తప
దీనంబు నడచెను దివ్యులలర
సూత్రధారణ ప్రేమ సూత్రధారణ దెల్పె
నక్షతారోపణ కుక్షత తత్వ
మెడిగించె............................63

శ్రీమద్రామాయణాంతరార్థములోని కథ: ఇందు సువర్చల కథ సహస్ర కంఠ రావణ వధా ఘట్టమున వచ్చును. ఆ రాక్షసుని ఎన్నివిధాల చంపినా వాడు చావనందుకు హనుమంతుడు బ్రహ్మను ప్రార్థించి వాని ప్రాణ రహస్యముల తెలుపుమని కోరెను. "క్రౌంచద్వీపములోని పర్వతమున గల ఒక గుహ వద్ద సువర్చల అనే రక్కసి కాపలా యుండును. అచట పంచద్వారములవద్ద కాపలా ఉన్న రాక్షసుల చంపి మాయాసౌధమున గల పంచదిశలందున్న పంచజ్యోతుల నార్పగలిగినచో సహస్ర కంధరుడు మరణించును" అని తెలిపెను. ఆ గుహవద్దకు హనుమంతుడురాగా సువర్చల అతనిని చూచి మూర్ఛితురాలయ్యెను. అతడి రాకకు కారణమాంజనేయునిద్వారా తెలిసికొని 'అంజనేయా! నీవు నాకోరిక తీర్చినచో నేను నీకోరిక తీర్తును. ప్రపంచంలో స్త్రీరూపం ధరించిన ప్రతిస్త్రీ నీలాంటి పురుషునే కల్యాణమై సుఖించాలి. కావున నన్ను నీ భార్యగా స్వీకరించి నాకానందము కల్గింపుము" అని తెలిపెను. దానికాంజనేయుడు 'లలనా' నేను అస్ఖలిత బ్రహ్మచారిని. పైగా స్ఖలితము లేనివాడను. మలమూత్రాలే లేనివాడను. నేను ధరించిన యీ ధట్టె నా శరీరము వ్యాపించియున్నది. నన్ను భర్తగా స్వీకరించి నీవేమి సుఖపడెదవు. నీకోరికను విరమించుకొనుము" అని తెలిపెను. దానికి సువర్చల "స్వామీ! నేను మీతో సుఖించకపోయినను నన్ను మీ భార్యగా స్వీకరించి ఏడు ఘడియలు నన్ను మీ వామభాగమున ఉండనిచ్చిన చాలునని" తెలిపెను.

ఇట్లామె కోరుటకు పూర్వకథ ఒకటి కలదని రచయిత పాతకోట రంగనాయకులు వివరించినారు. సువర్చల పూర్వజన్మమున సూర్యసుత. తన తండ్రివద్ద విద్యాభ్యాసము చేయు హనుమంతునీమె ప్రేమించెను. తన ప్రణయమునతనికి నివేదించగా గురుపుత్రి సోదరతుల్యగా పలికి హనుమ ఆమెను నివారించెను. కాని యౌవనస్థితిలో కామాంధురాలై అంజనేయుని అలింగనమొనర్చి బలాత్కరింపబోగా ఆంజనేయుడు దూరదూరము పోవుచుండ సూర్యుడిది గమనించి తన కూతురిని 'రాక్షసివై పోవుదువుగా'క అని శపించెను. ఆమె బాధతో శాపవిమోచనము కోరెను. నీవు ఏకోరికతో ఇతనిని నీవానినిగా చేసుకోదలచితివో ఆకోరికతో ఆత్మతృప్తి నొందిననాడు శాపవిమోచన యగునని సూర్యుడు తెలిపియుండెను. అందువలన సువర్చల తనకు దాంపత్యసుఖము లేకున్నా, కేవలము హనుమంతుని భార్యగా గుర్తింపబడినచో చాలునను తృప్తికై యత్నించెను. శ్రీరామకార్యార్థము వచ్చిన హనుమంతుడు రామునిపై భారముంచి ఆమెను తన వామ భాగము నలంకరింపుమని కోరెను. అంజనేయుని వామభాగమారోహించి క్షణముననే ఆమెకు రాక్షసీరూపము తొలగి దివ్యరూపం కలిగెను. (చూడుము పుట 239–అధ్యా.7– ) ఈ కథకు ఆధారగ్రంథమేదియో రచయిత పేర్కొనలేదు.[64]

హనుమాన్ లీలా తరంగిణి గ్రంథానుసారముగా: హనుమంతుడు సూర్యుని వద్ద విద్యాభ్యాసమొనర్చు సమయములో ఒకనాడు సూర్యుడు 'అంజనేయా, ఇంద్ర వ్యాకరణాది నవవ్యాకరణములలో అయిదు వ్యాకరణములను మాత్రమే నీకు చెప్పితిని. మిగిలిన నాలుగు వ్యాకరణములు గృహస్థులకు మాత్రమే చెప్పతగినవి. బ్రహ్మచారులకు చెప్పరాదు. నీవు బ్రహ్మచారివిగదా! అని వీలులేక మానివేసితిని. కాని, యిపుడొక పనిచేసిన నివియును చెప్పుటకు వీలగును. నాకీయవలసిన గురుదక్షిణగా నీవు నా కోర్కెను తీర్చుము. నా కుమార్తెయగు సువర్చలను వివాహమాడుము. నా కదియే గురుదక్షిణగా భావించెదను. నీవును గృహస్థుడవయ్యెదవు. మిగిలిన నాలుగు వ్యాకరణములను అభ్యసించుటకు నీకు అర్హత కలుగును. ఆమెకు నీవు భర్తవయ్యెదవని ఆమె జన్మించిననాడే బ్రహ్మ చెప్పియున్నాడు. నేటి కా బ్రహ్మ వాక్కు ఫలించుగాక'' అని తెలిపెను. అపుడాంజనేయుడు "స్వామీ నేను అస్ఖలిత బ్రహ్మచారిగా నుండవలెననుకొంటిని. నన్ను వివాహమాడుమనుచున్నారే.

నాకర్తవ్యమేమో మీరే తెల్పుడు" అని బదులు పలుకగా. "హనుమా, నీకు వ్రతభంగం కలుగకుండా వరము నిచ్చెదను. దానికాంజనేయుడంగీకరించి "స్వామీ! నావలన సువర్చలకు భర్తృదేహ సంపర్కముండదు. ఇందుకామె అంగీకరించునా?" అని సంశయింపగా సూర్యుడీవైనము సువర్చలకు తెలిపెను. సంపర్కము లేకపోయినను అంజనాతనయుడు తనకు భర్తయగుటయే చాలని ఆమె అంగీకారము తెలుపగా వారికి జ్యేష్ఠ శుద్ధ దశమినాడు కశ్యప గోత్రజుడగు సూర్యుడు తన కూతురగు సువర్చలను కౌండిన్య సగోత్రుడగు హనుమంతునకిచ్చి వివాహము చేసెను. వివాహానంతరం సూర్యుడు మిగిలిన నాలుగు వ్యాకరణములను ఆంజనేయునకు బోధించెను. అపుడు హనుమంతుడు "స్వామీ! రాబోవు కల్పములో నేను బ్రహ్మ నగుదును. నాకప్పుడు సువర్చలతో సంపర్కము కలుగును. అపుడు మా దాంపత్యము సుఖించును" అని తెలిపెను. ఈకథ ఏ మూలమునుండి గ్రహించిరో రచయిత పేర్కొనలేదు.[65]

సువర్చలా హనుమంతుల వివాహమును గురించి న్యాయ వేదాంత ప్రవర్తకులు శ్రీమదిత్యాది శ్రీమాన్ తి. కం. గోపాలాచార్యస్వామివారికి నేను ఉత్తరమును వ్రాయగా వారు తమ వేదాంత మాసపత్రిక యగు 'భక్తి నివేదన'లో ఈక్రింది సమాధానములనిచ్చియున్నారు. "హనుమంతుని మనకు పరిచయం చేసిన వాల్మీకి మహర్షి తన శ్రీమద్రామాయణములో హనుమంతుని వివాహ ప్రసక్తి తేనేలేదు. వాల్మీకికి తెలిసినంతవరకు హనుమంతుడు నిజముగా బ్రహ్మచారియే. త్రేతాయుగములో రామావతారానంతరం తెరమరగున ఉండి మరల ద్వాపరయుగంలో భీమసేనుడికి హనుమంతుడు దర్శనమిస్తాడు. అపుడుకూడ అతని వివాహప్రసక్తి భీముడుకానీ, వ్యాసుడుకానీ తేలేదు. పోతే, అసలు హనుమంతునికి వివాహం చేసుకొనే కోరిక ఉన్నట్లే తోచదు. మరి వాల్మీకి వ్యాసాదులకు ఆఖరుకు హనుమంతునికి కూడ తెలియకుండా ఆధునిక పురాణ కర్తలైన పెద్దలు ఈ సువర్చల అనే ఆవిడతో అతనికి సంబంధమున్నదని ఆరోపించి, తమ సరదా తీర్చుకొంటున్నారు. హనుమంతునికే తెలియని ఈమె పుట్టుక–చరిత్ర ఎపుడు ఎలా వివాహం జరిగిందో యివన్నీ ఆ పుక్కిటి పురాణకర్తలకే తెలియాలి." "ప్రపంచమంతా అంగీకరించిన విష్ణుపురాణం పరాశరులకృతి. పరాశర సంహితలోని శ్లోకాల రచన చాల పేలవంగా ఉండుటచే పరాశరకృతి గాదని భాషాభిజ్ఞులంతా

అంగీకరిస్తారు. శ్లోకములలోని భాషనటుంబి హనుమంతునికి స్త్రీ సంబంధం కల్పించడం హనుమంతునికి ఘోరమైన అన్యాయం చేయడమే. ఆ పాత్ర స్వభావానికది పరిపూర్ణంగా విరుద్ధం. "భావోనాన్యత్ర గచ్ఛతి" అని శ్రీరాముని తప్ప వేరొకదానిని దేనినీ తలంచుటకుగూడ నా మనస్సు ఇష్టపడుట లేదని ప్రతిజ్ఞ చేసిన హనుమంతుడు అందులకు పూర్తి విరుద్ధముగా తుచ్ఛమైన స్త్రీ సంబంధం కల్పించుకొనుటకు ఇష్టపడునా? రాబోయే కాలానికి అతడే బ్రహ్మ కాబోతాడట గదా అంచేత ఆ కాబోయే నాయకుని ఆనందింప జేయడానికి సాధనాలేమో ప్రాజ్ఞులు మాత్రం వీటిని శ్లాఘించరు"[66]

"పరాశర సంహిత వేదవ్యాసుని తండ్రియగు పరాశరుడు వ్రాసినది కాదు. ఈ గ్రంథము రామాయణ భారతముల తర్వాత వచ్చిన గ్రంథము. సువర్చలను హనుమంతుడు వివాహమాడినట్లు రామాయణమున లేదు.... కాని తంత్రశాస్త్రములలో సువర్చలాంజనేయ మంత్రమున్నది."[67]

ప్రశాంతినిలయం (పుట్టపర్తి)లో భగవాన్ శ్రీ సత్యసాయిబాబా గారితో ముఖాముఖి మాట్లాడు సందర్భమున సువర్చలాంజనేయుల వివాహము గూర్చి వారిని నేను వివరణ కోరగా వారు "సూర్యుని తేజస్సే సువర్చల. సూర్యుని వెంత హనుమంతుడు విద్యాభ్యాసం చేసినందున ఆ తేజస్సును హనుమంతుడు పొందినందున సువర్చలా సహితుడైన హనుమంతుడను ప్రతీతి వచ్చినది" అని తెలిపిరే కాని హనుమంతునకు వివాహమైనట్లు సమర్థించలేదు.

పరాశరసంహితను అంజనేయ చరిత్రమను పేరున అంధ్రీకరించిన "సాహిత్యవిద్యాప్రవీణ" శ్రీ అన్నదానం చిదంబరశాస్త్రి గారికి ఈ విషయమై నేనొక లేఖ వ్రాయగా వారిచ్చిన సమాధానము. "శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామికి, హనుమంతునకు బ్రహ్మచారి ఆరాధనలున్నంత మాత్రమున వారికి భార్యలు లేకపోలేదు. నారాయణుని లక్ష్మీనారాయణునిగా ఆరాధించినట్లు భూదేవితో కలిపి ఎక్కువగా ఆరాధన ఉండదు. అట్లే ప్రచురత బ్రహ్మచారిగా తప్ప, సువర్చల ఆయనకు భార్యయగుట యథార్థము. అసలు దేవతలకు శక్తులే వారి భార్యలు. బ్రహ్మచర్య నిష్ఠ గలవారికి శక్తి వర్చస్సే. వినాయకుని వలన వచ్చు శక్తి సిద్ధి, బుద్ధియే. బ్రహ్మశక్తి వేదవాక్కు-వాణియే. ఇక కుమార స్వామి శక్తి దేవసేనయే. ఇట్లు సమన్వయ మొనర్చుకొనదగును తప్ప వారి సాంసారిక జీవితముతో పనిలేదు" అని వ్రాసిరి.[68]

"రామరాజ్యం – కుశలవులు" అను గ్రంథమున శ్రీ కాళూరి వ్యాస మూర్తిగారీవిషయముగా చెప్పినది: "కారణ జన్ములైన వానరులు వేదశాస్త్రాభ్యాసము చేసిరి. ఉపనయనాది సంస్కారముల గావించుకొనిరి. వీరు తమ ప్రవృత్తియందు రెండు ధర్మముల స్వీకరించిరి. 1. వానరజాతి లక్షణము, 2. వానరజాతి విలక్షణము. వీరు మానవులనే అనుసరించి ఉపనయనాది సంస్కారముల గ్రహించినా వివాహ సంపర్కము గావించుకొనలేదు. వీరికి ఉపనయనం విలక్షణం. వివాహం విరోధం. వీరికి తాత్కాలిక దాంపత్యమే కాని ఉత్తమ మానవులట్లు స్థిర దాంపత్యము లేదు. వీరికి అగ్ని పరీక్షలు లేవు. వాలి తన మరదలగు రుమను సుగ్రీవుడు తన వదినయగు తారను పొందుట గమనార్హము, అంతేకాక వాలి రావణుల స్నేహము ఏర్పడిన సందర్భములో వారొనర్చుకొన్న సంధి ప్రకారము భార్య, పుత్రుడు, పురము, రాష్ట్రము, భోగము, అచ్ఛాదనము. భోజనము అవిభక్తములు.... హనుమంతునికి వానరకాంతలతో వివాహమైనట్లు ఎక్కడను వర్ణింపబడలేదు."[69]

పలు దేవాలయములలో హనుమంతుని బ్రహ్మచారిగానే ప్రతిష్ఠించుచున్నారు. ఇతడు అష్టోత్తర శతనామాది పూజాదికమున 'అజన్మ బ్రహ్మచారిగా-కుమార బ్రహ్మచారిగా" మాత్రమే పేర్కొనబడి యున్నాడు. అందువలన ఇతనికి వివాహము కాలేదనియు ఇతడు జితేంద్రియుడైన బ్రహ్మచారియనియు పలువురు విశ్వసించుచున్నారు. ఈ జితేంద్రియత, బ్రహ్మచర్యము హనుమంతుని ప్రభావానికి మూలమని తద్విరుద్ధముగా అతనిని గృహస్థునిగా భావింపరాదని వారి భావన. సుందరకాండమున సీతాదేవికి తనను గూర్చి తెలుపుకొను వేళలో హనుమంతుడు తాను సుగ్రీవుని సచివునిగా చెప్పుకొనెనేకాని తనకు వివాహమైనట్లు తెలుపలేదు. సీత సూర్యపతిగా సువర్చలను పేర్కొనిన వార్త వినిన హనుమంతుడు సువర్చల సూర్యపుత్రియను ఆమె మాటను సవరింపలేదు. శ్రీరాముని మహాభినిష్క్రమణ సందర్భమున హనుమంతుడు అతనితో స్వర్గమునకు పోకుండా రామచరిత మున్నంతకాలము తాను రామ నామ ధ్యాన తత్పరుడై లోకమున జీవింపవలెనని కోరియున్నాడేకాని తనకొక భార్య కలదనిగానీ, వారితో కలిసి సుఖజీవనాన్ని ప్రసాదింపుమనికానీ కోరలేదు. రామాయణ భారతాలలో స్వయముగా హనుమంతుడుగానీ అతనిని గూర్చి పలికిన పాత్రలుగానీ, అతని సహచరులుకానీ అతనికొక భార్య యున్నట్లు

తెలుపలేదు. కావున హనుమంతుడు వివాహము చేసుకొనలేదనియు అతడు బ్రహ్మచారి యనియు వారి నమ్మకము.

హనుమంతుడు గృహస్థేనని వాదించువారు కొందరున్నారు. "రామాయణంలో హనుమంతునకు భార్యలున్నట్లు తెలుపబడలేదు. అట్లే, నల, నీల, అంగదాది వీరులకును చెప్పబడలేదు కావున వారంతా గృహస్థులు కారని అనజాలము. రామాగమన వార్త భరతునకు తెలిపినపుడు సంతోషించిన భరతుడు హనుమంతునికి షోడశకన్యలను బహుమానముగా ఇస్తానని అంటాడు. కావున హనుమంతుడు బ్రహ్మచారి కాడేమోనని, అతడు గృహస్థేనని అభిప్రాయము."[70] (బలిచక్రవర్తి వామనునికి సిరులు, కరులు, వామాక్షులు.... ఏవికావాలో కోరమనినాడనగా అతడు గృహస్థు కాక బ్రహ్మచారియైనందుననే కదా! భరతుడుకూడ అట్లే అడిగియుండవచ్చును. బ్రహ్మచారికి వివాహార్థము కన్యనడుగుట ధర్మమే. అందువలన భరతుని దాన ప్రతిపాదన వలన సత్యము తేలుటలేదు)

ఆశ్చర్య రామాయణమున హనుమంతునకు భార్యను కల్పించినట్లు తెలుపబడియున్నది. "శౌనకాది మునులకు సూతుడు ఉర్మిళాదుల వృత్తాంతము తెలుపు సందర్భమున లక్ష్మీదేవి తన చెలియలగు వాసంతికతో శ్రీరామావతారమును గూర్చి తెలిపెను. శంఖముయొక్క భార్య, చక్రముయొక్క భార్య (వారి పేర్లు చెప్పలేదు) మాండవి, శ్రుతకీర్తి అనుపేర పుట్టుదురని తెలిపెను. శంఖచక్రములకు భార్యలుందురా అని అనుమానింపవచ్చును.... శంఖచక్రములకు భార్యలనగా తదధిదేవతల భార్యలని అర్థము. ఇట్లు దేవతామూర్తులకు భార్యాకల్పనము అంగీకరించినట్లే హనుమంతున కొక భార్యను కల్పించినట్లు భావింపవచ్చును."[71]

శ్రీ రామాయణ సారోద్ధారమున హనుమంతుని గృహస్థుడైన ప్రాజాపత్య బ్రహ్మచారిగా తెలిపియున్నారు. పరాశర సంహితలో ఆరు, పది, పదకొండు, పంద్రెండు, పదమూడు, ఇర్వది, ఇర్వదిమూడు పటలములలో హనుమంతుని ధ్వజదత్త హరిశర్మాదులుపాసించినట్లు కలదు. ఆయా భక్తులకు దర్శనమిచ్చిన హనుమ సువర్చలతో నున్నట్లు వర్ణింపబడియున్నది. కనుక ఇతనిని గృహస్థునిగా భావించు పద్ధతి రామాయణ కథాకాలము తర్వాత వచ్చి యుండవచ్చునేమో యని తోచును. శౌనక సంహితలో గూడ 'అగచ్ఛ

హనుమద్దేవ త్వం సువర్చలయా సహ" అనిన్నీ వాసరగీతలో 'మాతా సువర్చలాదేవి – పితా మే వాయునందనః" అనిన్నీ కలదు. కావున ఇతడు గృహస్థుడే అని శ్రీ ములుకుట్ల నరసింహావధానులగారి అభిప్రాయము. మరి యొక ఉపపత్తిని కూడ వారు చూపియున్నారు. సుగ్రీవుడు హనుమంతుని రాముని వద్దకు మొదటిసారి పంపునపుడు బ్రహ్మచారి వేషములో పొమ్మని కోరినాడు. అతడు గృహస్థుడుగా నున్నాడు. కనుకనే బ్రహ్మచారి వేషము వేయవలసి వచ్చినదని తలంప వీలున్నది. ఇట్లే సుందర కాండలో సీతాన్వేషణ సమయములో హనుమంతుడు రావణుని అంతఃపురములో సీతకై వెదకుచు ఎందరో స్త్రీలను చూచి "నేను పరదారలను చూచితినే" అని బాధపడినాడు. భార్య కలవాడే "పరదార" అని అనగలడు కానీ భార్యలేనివాడు పరదార అని వాడడు కావున హనుమంతుడు గృహస్థుడైన ప్రాజాపత్య బ్రహ్మచారి అని శ్రీ నరసింహావధానులగారి అభిప్రాయము. బ్రహ్మచారులు నాలుగురకాలని కాణ్వాయన స్మృతి.

1. ఉపనయనానంతరం ఉప్పుకారము లేని ఆహారము తీసుకొనుచు గాయత్రీ మంత్రోపాసన చేయువాడు గాయత్రీ బ్రహ్మచారి.
2. వేదాధ్యయనం పూర్తి అగువరకు బ్రహ్మచర్యం కలవాడు బ్రాహ్మ బ్రహ్మచారి.
3. ఒక సంవత్సరకాలము విడువక వేదాధ్యయనం చేసినవాడు, కానీ ఋతు కాలమునందు మాత్రము తన భార్యతో సంగమిస్తూ పరస్త్రీ విముఖుడైనవాడు ప్రాజాపత్య బ్రహ్మచారి.
4. మరణ పర్యంతం గురుకులవాసం చేస్తూ నిష్ఠగలవాడు బృహత్ బ్రహ్మచారి.

కనుక గృహస్థుడు ప్రాజాపత్య బ్రహ్మచారిగా పరిగణింపబడును. సుందరకాండలో హనుమంతుడు సీతకు రాముని గూర్చి తెలుపుచు 'బ్రహ్మచర్య వ్రతమున స్థితుడైనవాడు రాముడు' అని తెలిపియున్నాడు. రాముడు గృహస్థుడు కావున అతడు బ్రహ్మచారి కాడు. కాని స్మృతిప్రకారం ప్రాజాపత్య బ్రహ్మచారి కనుక హనుమంతుడట్లు తెలిపి యున్నాడు. ఇట్లే చూచినచో హనుమంతుడు గృహస్థునియు ప్రాజాపత్య బ్రహ్మచారి యనియు తెలియవలెను.[72]

ఈ నాలుగు రకాల బ్రహ్మచారులలో హనుమంతుడేరకమైన బ్రహ్మచారియో అనుమానమునకు తావు లేనట్లుగా నిర్ణయించుట కిష్టము లేక అతడు ప్రాజాపత్య బ్రహ్మచారియని చెప్పినచో వివాదము లేకుండునట్లుగా ఉన్నది. శ్రీ నరసింహావధానులగారి అభిప్రాయము - హనుమంతుడు గృహస్థుడైనచో అతని వివాహమెప్పుడు జరిగెనో, భార్య సువర్చలయేనా? అను అంశాలు నిర్ణయించాల్సియుండును. పరాశర సంహిత తప్ప మిగతా హనుమత్సంబంధ కావ్యాదులలోగానీ, రామాయణ భారతాదులలోగాని సువర్చలాహనుమంతుల ప్రసంగమేలేదు. రామకథ వలెనే హనుమంతుని కథ కూడ కల్పములు, యుగములు మారుటవలన, హనుమంతునకు ఆరాధ్యదైవత్వస్థానమేర్పడు కొద్దీ ఆయా కాలాలలోని కవులయొక్క వారి సమాజములయొక్క విశ్వాసములకూ, అవసరములకూ, తగినట్లుగా హనుమంతుని చరిత్ర విషయములో– అందులో ముఖ్యముగా అతని వివాహవిషయమున – అభూతకల్పనలు, విస్తరణలు, సవరణలు చోటు చేసికొనినవి. పైన తెలిపిన బహువిధ అభిప్రాయముల పరిశీలనానంతరము తెలియు సారాంశమేమనగా—

1. వాల్మీకిని ప్రమాణముగా పెట్టుకొని చూచువారు హనుమంతునికి వివాహమును అంగీకరింపలేదనియు వారాతనిని బ్రహ్మచారిగానే యెంచిరనియు స్పష్టము.
2. అవాల్మీకములగు కల్పనలు చేసిన గ్రంథాలను అంగీకరించినవారు హనుమంతునికి సువర్చలతోడి వివాహమునామోదించుచున్నారు.

వివాహితుడైనను బ్రహ్మచారి పదవాచ్యుడగుటలో దోషము లేదని నారద భక్తి సూత్రములతో పాటు శ్రీ సీతారామాంజనేయ సంవాదమను గ్రంథము స్పష్టమొనర్చుచున్నది. ఎందరినో వివాహమాడిన శ్రీకృష్ణుని కూడ బ్రహ్మచారిగా పేర్కొనినట్లే హనుమంతునికూడ చెప్పవచ్చును. "ఆత్మరతులైనవారికి బ్రహ్మచర్యము ముఖ్యము. ముఖ్య భక్తుడైనచో గృహస్థువుగానుండియు సదా బ్రహ్మచారిగానే యుండును. ఆ గృహస్థాశ్రమమతనికి నామమాత్రము."73

వివాహానంతరము "అక్షార లవణాశినే బ్రహ్మచారిణావధశ్శాయినే స్యాతాం" అను ఉపనిషత్ వాక్యానుసారము హనుమంతుని బ్రహ్మచారిగా భావించుటలో దోషము లేదు.

కాంతల నందఱ నా మర
కాంతరమున్ బరిహరించుటది మేలొండే
కాంతయు నిజ భార్యవ్రత
సంతుష్టిని జెంద బ్రహ్మచర్యంబే యగున్[74]

ఇప్పటి వఱకు లభించిన ఆధారములనుబట్టి హనుమంతుడు బ్రహ్మచారియే. అయితే, ఇతడు ప్రాజాపత్య బ్రహ్మచారియా లేక అవివాహితుడైన బ్రహ్మచారియా అను అంశముతోపాటు ఇతడు ప్రాజాపత్య బ్రహ్మచారియైన గృహస్థు అయినచో సువర్చలయే ఇతని భార్య అనెడి అంశము నిర్ద్వంద్వముగా ప్రకటించుటకు వీలులేదు. భవిష్యత్పరిశోధకులీ అంశము నింకనూ కొనసాగించిన కానీ సత్యము ప్రకాశింపదు. ఉపాసనా విధానములను మాంత్రిక తాంత్రిక విశ్వాసములను కడగా పెట్టి చూచువారికి హనుమంతుడు వివాహము చేసికొనని బ్రహ్మచారియనియే చెప్పవచ్చును. హనుమంతుని బాల్యానంతర జీవితమును గూర్చి నిండు యౌవనమును గూర్చి తెలిసికొనవలసిన అంశము వెలుగులోనికి వచ్చువరకు పై చెప్పిన అంశములను హెచ్చరికతో మాత్రమే గమనించుకొనవలయును.

అధ్యాయము 3.

## 1. హనుమంతుడు - శ్రీరామ సందర్శనము:

శ్రీమద్రామాయణానుసారము: విద్యాభ్యాసానంతరం హనుమంతుడు కిష్కింధలో తన మేనమామలగు వాలిసుగ్రీవుల వద్దనే యుండగా (గౌతమ శాపము ప్రకారము) వాలిసుగ్రీవులు కలహించుటకు పరిస్థితులు ప్రాబల్యము చూపెను. వాలి తన సోదరుడగుసుగ్రీవుని విరోధిగా తలచి కిష్కింధ నుండి ఏకవస్త్రముతో వెడలగొట్టెను. వీరి కలహమును పరిష్కరించుటకు హనుమంతుని కన్న దక్షత గలవారింకొకరు లేరు. కానీ హనుమంతుడు సుగ్రీవుడు పారిపోగా అతని వెంబడి వెళ్లెను. వీరి కలహమున కేవలమొక ప్రేక్షకుడుగా మాత్రమే హనుమంతుడాదిలో నుండెను. ఇచట వాసుదాసుగారు తమ వ్యాఖ్యానములో "హనుమంతుడు సుగ్రీవుని బంటు, స్వామి అజ్ఞ లేక ఏదియు చేయరాదు. స్వామియైన సుగ్రీవుడు వాలినిగ్రహము తనకసాధ్యమని బంటుతో చెప్పుట ప్రభువునకు న్యూనత. తనకై తాను వాలిని యెదుర్కొన్నచో సుగ్రీవుని విస్మరించునట్లుగ హనుమంతుని భావన. తన బలమునకు గూర్చిన ఎఱుక హనుమంతునకులేదు. హనుమంతునికి వెఱచియే వాలి సుగ్రీవుని భయపెట్టు చుండెనేకాని చంప ప్రయత్నించలేదు."[75]

పురాణాదులు పరాశరసంహితలో వాలిసుగ్రీవుల కలహములో హనుమంతుని పాత్ర యెట్టిదో తెలుపుటలేదు.

నిర్వచనోత్తర రామాయణము ప్రకారం: "వాలియు కీలియు వాయుజునకు సరికారని ఆత్మశక్తిజ్ఞుడై లోకాలను గెల్వబూనినచో హనుమంతు నెదుర్కొన గల వాడే లేడనియు, తన శక్తి తనకు తెలియనందుననే సుగ్రీవుని కొఱకై హనుమంతుడు వాలిని మర్దింపలేదు" అని అగస్త్యుడే శ్రీరామునకు తెలిపియున్నాడు.[76]

సమీరకుమారవిజయమాధారముగా: హనుమంతుడు తన మేనమామలలో చిన్నవాడగు సుగ్రీవునికే సన్నిహితుడుగా నుండెను.

"తనకు గురుడైన ద్వాదశాత్మ కుమారుఁ
డనుచు మైత్రిని బహుమైత్రి నలరజేసె"

మేనమామల వద్దకు పంపుచో అంజనాదేవి వారిని సమాన గౌరవముతో చూచునట్లుగా హెచ్చరించి యుండెను.

వారలలో సుగ్రీవుని
చేరువ హితమంత్రివై వసింపుము దమలోఁ
దారె డసిన సుగ్రీవునిఁ
గూరిచి యింద్రజునిఁ గూల్చకుము మామ సుమీ

వాలికి భయపడి సుగ్రీవుడు ఋష్యమూకాద్రికి పారిపోయెను. సుగ్రీవుని హనుమంతు డనుసరించెను. సుగ్రీవుని భార్యను వాలి అపహరించినను "అశక్త పోలికం దాళె మర్పుతుండతని దండన సేయక తల్లి యాజ్ఞచేన్." ఇప్పట్టున మామకు అతడు 'ఏడుగడ'యై యుండి అఖిల కార్యధౌరేయుడై యుండెను. హనుమంతుడనే ధైర్యతరి వలననే సోదరాగ్రహమనెడి అవమాన సాగరాన్ని; హనుమంతుడనే వాక్సుధాలహరి వలననే కాంతావియోగ శోకాగ్నిని; ప్రభాకర శిష్యుడగు పావని మైత్రి వలననే రాజ్యరాహిత్య దుఃఖతిమిరాన్నీ; కేసరి సుత సాంగత్యం వలననే పరాజయా రోగమనే గజాన్ని సుగ్రీవుడెదిరింప గలిగెను. కార్యాకార్య విధిలో ప్రధానిగా, శోక విధ్వంసనంలో ఆచార్యునిగా, చింతితార్థ ఘటనా సంపత్తిలో దేవునిగా ధైర్యోత్పాదనలో శక్తి దాయకునిగా హనుమంతుడాతని కాపాడి అతని బ్రతుకును నిలిపెను. సోదరుడగు సుగ్రీవుని సమయించుటకై వాలి ఎందరినో గూఢచారులను పంపెడివాడు. వారిని కనిపెట్టి సుగ్రీవుని రక్షించుటకై వారిని హనుమంతుడే తెగటార్చుచుండెను.[77]

ఇతర గ్రంథముల ప్రకారము: తన గురువగు రవికి గురుదక్షిణ ఇచ్చుటకు బదులుగా అతని పుత్రుడగు సుగ్రీవుని సేవించుటకు హనుమంతుడు పూనినట్లు శ్రీకృష్ణ రామాయణము.[78]

అంతరార్థ రామాయణములో: హనుమంతుడు సుగ్రీవునే చేరుటలో ఆధ్యాత్మిక రహస్యములున్నవని యీ గ్రంథ ముగ్గడించుచున్నది. "వలతే" అను సంస్కృత పదమునకు చుట్టుకొనునది అని అర్థము. అనగా మాయ. 'వాలి' అనగా మనస్సును చుట్టుకొని యుండు మాయ అనియే అర్థము.

ఇతడింద్రియముల కధిపతియగు ఇంద్రపుత్రుడు. దేహంలోని షట్చక్రాలలో విశుద్ధచక్రం గ్రీవస్థానమునకు సంబంధించినది. అదియే సుగ్రీవము. ఈ విశుద్ధ చక్రం ద్వారానే ఆజ్ఞా చక్రంలోకి సాధకుడు ప్రవేశిస్తాడు. ఈవిధంగా బుద్ధి యొక్క విశుద్ధ తత్త్వం అని సుగ్రీవ శబ్దమునకర్థము. ఇతడు సూర్యసుతుడు. ఓమ్ భూర్భువః తత్ సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియోయోనః ప్రచో దయాత్" అను గాయత్రీ మంత్రం ప్రకారం సూర్యుడు మన బుద్ధివ్యాపారాలలోని విశుద్ధతను ప్రబోదన చేసేవాడు. ఆదిత్యహృదయమున గూడ ధ్యేయః సదా సవిత్రమండలవర్తి నారాయణ" అని కలదు. కావున సుగ్రీవ పదానికి భగవద్విజ్ఞానం చేత కలిగే విశుద్ధ తత్త్వమని అర్థము. వాలికి భీతుడై సుగ్రీవుడజ్ఞాతంగా ఉండెననగా విశుద్ధతత్త్వం మాయావృతమైనది. మాయ, విశుద్ధతత్త్వం రెండును భగవంతుడినుండి పుట్టినవే కాన ఇవి సోదరులు. 'శఠేశాఠ్యం ప్రకల్పయేత్" అను సూత్రము ప్రకారము మాయా ప్రభావమునకు గురికాకుండుటకే శ్రీరాముడు చాటున ఉండి మాయారూపుడగు వాలిని వధించుట. రాజైన వాలిని విడచి సుగ్రీవునితో ఆంజనేయుడున్నాడనగా మనసుకు చెందిన మాయను విడచి విశుద్ధతత్త్వంతోనే బుద్ధి అంటి యుండునను అంతరార్థం గ్రహించాలి. ఆంజనేయుడనగా విశుద్ధ బుద్ధి తత్త్వమని అర్థము. అందు వలననే ఇతనిని "బుద్ధిమతాం వరిష్ఠః" అని వ్యవహరించుట.[79]

ఇంద్రుడు వాలికి కాంచనమాలనిచ్చెను. అది ప్రతివీరుల బలములో సగము హరించును. సూర్యుడు తన కుమారుడగు సుగ్రీవునికి తన శిష్యుడగు ఆంజనేయునికినిచ్చెను. కావున సూర్యుని యాదేశమే హనుమంతుడు సుగ్రీవ సఖుడగునట్లు చేసినది.[80]

## 2. హనుమద్రామ సమావేశము:

శ్రీమద్రామాయణము ప్రకారం: ఈ సన్నివేశమునకు వాల్మీకి రామాయణమున ప్రాధాన్య మధికముగా నీయబడినది. వ్యాఖ్యాతలు కూడ ఎన్నో నిగూఢ విషయముల గూర్చి తెలిపియున్నారు. నారచీరలు ధరించి మునివేష ములతో శస్త్రధారులై వచ్చు దాశరథులను చూచి అనుచర సహితుడైన సుగ్రీవుడు భయపడెను. అతడు పంపానది దక్షిణ దిశలోని పర్వత గుహల లోనికి తలదాచుకొనబోయెను. కాని వారిలో హనుమంతుడొక్కడు మాత్రము

భయమొందక తత్సమయోచిత కర్తవ్యమును సుగ్రీవునికి తెలిపెను. "కపీంద్రా, నీవేల భయపడుచున్నావు. ఇది ఋష్యమూకము కావున వాలి యిక్కడికి రాజాలడు. నీవిట్లు పిరికితనమూని నీ మర్కట స్వభావమును బహిర్గత మొనర్చు కొనుటయే. లఘుచిత్తత నీ బుద్ధి జ్ఞానేంగితములనూ, ఆలోచనా శక్తినీ పోగొట్టెనా! ఇట్టైన రాజు ప్రజలను పరిపాలింపగలడా? కావున సాధుతాసాధుతల నెఱిగి కార్యనిర్ణయ మొనర్చుము" అని పలికిన పావని మాటలకు సుగ్రీవుడు "ఈ చాపధారులను నేను పూర్వము చూచియుండలేదు. వాలి ఆలోచనా సరళి యెట్టిదో నాకు బాగుగా తెలియును. నన్ను నిర్మూలించ దలచియే వీరిని వాలి పంపినాడు. రాజులను నమ్మరాదు. కావున నీవు ప్రాకృతునివలె వెళ్లి వారి వృత్తాంతము తెలిసికొని రమ్ము. నీవు వారిని చేరి భాషించి వారి హావభావరూపాదులను గమనించి వారి స్వభావమును కనిపెట్టి వారు నిన్ను నమ్మునట్లు మాట్లాడుము. నీపై వారికి అనుకూల్యమున్నట్లు గమనించిన పిమ్మట ఆయుధపాణులై వారేల వనములలో తిరుగుచుండిరో హేతువడిగి వారి మనోనైర్మల్యమూ, వాగ్వైఖరీ మంచిదని తోచినచో అటుపై నీకేది యుక్తమో అట్లు చేయుము" అని తెలిపెను. ఈ కార్యభారము వహించి హనుమంతుడు బయలుదేరెను.

తాను నిజరూపముతో వెళ్లినచో కార్యానుకూలము కాదని తనలో తానే తలంచి సన్యాసి (భిక్షు) రూపములో చేరి "నిశ్చంచల వృత్తిమై వినయసంపద వారలకర్థి మ్రొక్కె"ను. వారిని చూచి సుమనోహర సౌమ్య వినయోక్తితో "అయ్యలారా, మీరు రాజర్షులతోను దేవతలతోను సమానముగా కనబడు చున్నారు. మీరేదో వ్రతము పూనిన వారి వలె నున్నారు. ఈ అడవిలో మీరు తిరుగవలసిన కారణమేమో! మీరు మంచి పరాక్రమవంతుల వలె నున్నారు. మిమ్ము చూచి మృగపక్షి సంతానములు పరుగెత్తుచున్నవి. నేనెన్ని మాటలు పలికినను మీరు నాకు బదులు చెప్పక చెట్లనే చూచుచున్నారు. సామ్రాజ్య సింహాసనారోహణా దక్షులగు మీరు నారచీరల నేల ధరించి యున్నారు. మీరెవరు? పరిఘోపమానములు, సుందరములు, ఆజానుపర్యంత మున్న మీ బాహువులు ఆభరణధారణా యోగ్యములు. ఈ సకలోర్విని పరిపాలింప యోగ్యులగు మీరేల దీనదశలో నున్నారు. మీ కనులు తామర రేకులను పోలియున్నవి. మీ విండ్లు అసదృశ వజ్రాయుధ తుల్యములు.

తూణీరములలోని మీ బాణాలు శత్రుజన ప్రాణాంతకములు. మీ కత్తులు పొడవై వెడల్పు కలిగి అపరంజి కాంతి కలిగి కుబుసము వీడిన సర్పముల వలె నున్నవి. మీ వృత్తాంతము తెలుప వేడుచున్నాను" అని హనుమంతు డెన్ని విధాల పలికినా వారు బదులు పలుకరైరి. అపుడు హనుమంతుడు వారి ఆలోచనలను పసికట్టి తనలో తాను కర్తవ్యము నూహించుకొని మర్మము విడిచి తనను గురించి తెలుపుటకు నిర్ణయించి మరల నిట్లు పలికెను.

"మహానుభావులారా, నేను సుగ్రీవుడు పంపగా వచ్చినవాడను. "కామ రూపధరుండ, కామ సంచారుండ, హరి తనూజు హితంబు నాత్మగోరి మస్కరి యాకృతి మారువేషము దాల్చి, ఋష్యమూకము నుండి యిటకు వచ్చినాను. నేను సుగ్రీవునికి సచివుడను. నా పేరు హనుమంతుడు. నేను వాయుపుత్రుడను" అని పలికి వారి సమాధానమునకై నిరీక్షించెను. వెంటనే శ్రీరాముడు సోదరుని చూచి "ఈతడు సామాన్యుడు కాడు. సుగ్రీవుని యనుంగు ప్రెగ్గడ. మన మెవ్వని తలంచుచున్నామో అతని నుండియే వచ్చియున్నాడు. మన మితని నమ్మవచ్చును.

నెయ్యంబుఁ దియ్యంబు నేర్పు దీపింప నీ
వాక్యజ్ఞునకుఁ బ్రతి వచన మిమ్ము
ఋగ్వేదమును జక్క నెఱుగని వాఁడు య
జుర్వేదధారణా శూన్య బుద్ధి
సామవేదమునఁ బ్రాజ్ఞత్వంబు లేని వా
డీరీతి భాషింప నేరఁడెపుడు
వ్యాకృతి యంతయు వల్లించె నిజముగ
నెన్నిమాఱులో యీతఁడింత సేపు

మాటలాడ నొక్క మాటయేనియు నప
శబ్దితంబు గాదు చక్షువులనొ
ముఖముననొ లలాటమున బొమలందునొ
దోషమొక్కఁడైన దోపదెందు

కొతుకులు లేక విస్తరము గూడక శంకకు సందులేక యా
ద్రుత మవిళంబితంబు నయి తొప్పులు పోవకురో గళైక సం
స్థితమయి మధ్యమ స్వరముచే నలరారెడి వీనివాక్కు సం
స్కృతమును సక్రమంబు శుభమెంతయు హృద్యమునై రహించెడిన్

ఉదాత్తానుదాత్త స్వరితములతో గూడిన యీతని వాణి శత్రువులనైన సంతోషపరప గలదు. ఈలాంటి దూతను సంపాదింపని రాజుకు పనులు నెరవేరజాలవు." అని పలుకగా అన్న ఆదేశానుసారముగా లక్ష్మణుడు హనుమంతునకు సమాధానమీరీతిగా నిచ్చెను.

"అయ్యా, పండితోత్తమా, మేము సుగ్రీవుని కొఱకు వచ్చినవారమే" అని తెలిపెను. హనుమంతుడు ఆనందించి వారి కథను సవిస్తరముగా తెలుపమని కోరెను. దాశరథుల జననమాదిగా ప్రారంభించి సీతాపహరణము వరకు గల తమ కథను లక్ష్మణుడు సవిస్తరముగా చెప్పెను. అంత హనుమంతుడు 'అయ్యా, మీ కథ తెలిసి యెంతయో ఆనందించినాను. సుగ్రీవుడుకూడ రాజ్యాన్ని, సతినీ పోగొట్టుకొని యున్నాడు. అతడు మీకు సహాయ మొనరింప గలడు. సీతాన్వేషణకార్యము మీకు సిద్ధింపగలదు. అతనిని దర్శింప పోదము రండు" అని ఆహ్వానించెను. అంత లక్ష్మణుడు రామునితో 'ఇతని మాటలు సత్యములుగా తోచుచున్నవి. ఇతని వర్తనలో మోసములేదు కావున ఆ వానరేంద్రుని దర్శింపపోవుదమా!" అని అడుగగా రాముడు అంగీకరించెను.

హనుమంతుడంత తన భిక్షురూపము వదలి వానరాకారమూని 'అయ్యిన వంశల నంసదేశమందునిచి" సుగ్రీవుని వద్దకు బయలుదేరెను. సుగ్రీవుడున్న మలయాద్రి చెంత వారిని దింపి వారివార్తను సుగ్రీవునకు తెలుపుటకై మరల భిక్షురూపము పూని వెళ్లెను. రామాదులయెడ సుగ్రీవునకుండిన సందేహములను తొలగించి "రాముడనఘుడు, మతిమంతుడు, మిత్రాయుతతేజుడగు తమ్మునితో కూడ వచ్చినవాడు మహాత్ముడు. ఇతడు సామాన్యుడు కాడు. సాక్షాత్ పరమాత్మయే. సత్యశౌర్యములు కల సూర్యవంశదీపకులు వీరు. ధర్మస్వరూపులు. పితృవాక్య పాలనా వ్రతదీక్షితులు. భార్యను రావణుడపహరించి నందున దుఃఖార్తుడై నీ శరణువేడుటకై వచ్చియున్నాడు. నీవు చేరి వారిని పూజింపుము" అని తెలిపెను.

రామలక్ష్మణులున్న చోటికి సుగ్రీవుని తీసికొనివచ్చి వారివద్ద నుంచగా హనుమంతుని ద్వారా వారికి స్నేహము కలిగెను. హనుమ తన భిక్షురూపము వదలి అరణులను మథించి నిప్పు పుట్టించి దానిని దాశరథుల మధ్య నుంచెను. అగ్నిసాక్షికముగా వారు మిత్రులైన తర్వాత కొమ్మనొక దానిని విరిచి సుగ్రీవుడు దానిమీద రాముడు కూర్చొనగా తానును కూర్చొనెను. ఇంగితమెరిగిన

ఆంజనేయుడు చందనశాఖ నొకదానిని విరిచి దానిపై లక్ష్మణుని కూర్చుండ జేసెను. శ్రీరామ సుగ్రీవుల యనంతర సంభాషణము, సీతాదేవి జారవిడిచిన ఆభరణములను సుగ్రీవుడు తెమ్మనగానే హనుమంతుడు తెచ్చిచూపుట, శ్రీరామ విలాపము, సుగ్రీవుడాప్త వాక్యముల పలుకుట, వాలిసుగ్రీవుల వైరవృత్తాంతము, వాలివధకై రామప్రతిజ్ఞ, రాముని బలమును గూర్చి సుగ్రీవుని అనుమానము, దుందుభి కళేబరాన్ని కొట్టిన సప్తసాలములను రాముడు కూల్చుట, వాలి సుగ్రీవుల పోరాటము, వాలివధ మొదలగు రామాయణాంతర్గత కథా సన్నివేశములకు లక్ష్మణునితో బాటు హనుమంతుడు కూడ ప్రత్యక్ష సాక్షిగా సుండెను.[81]

పద్మపురాణమునందలి కథ: రాముడు సీతా విరహతప్తుడై శోకించుచు సౌమిత్రి తొడపై తన తల ఉంచి ఋష్య మూకాద్రిలో ఒక వృక్షచ్ఛాయలో శయనించి ఉండగా ఆ చెట్టు కొమ్మపై రామునకు ఒక వానరుడు కన్పించెను. అతనితో రాముడే పరిచయ మేర్పరచుకొని సుగ్రీవ సఖ్యము కోరెను.[82]

రంగనాథ రామాయణ కథ: ఆంజనేయుడు వటువేషము ధరించి ఫల మొకటి గైకొని రామలక్ష్మణుల సన్నిధికి వచ్చెను. రాముడతని రూపురేఖా విలాసములను ఆభరణములను చూచి ఆశ్చర్యపడెను. లక్ష్మణునితో ఆ సంగతినే ముచ్చటించు చుండగా హనుమంతుడు వినెను. అపుడతనికి బ్రహ్మ తనకు చెప్పియుండిన పూర్వవృత్తాంతము స్మరణకు వచ్చెను.

"ఒనరంగ నీమేని యురు భూషణంబులు
కనుగొన్న యాతడే గతియును బతియు
అతడె విష్ణుండు అతడే నీగతి........"

ఈ మాటలు స్ఫురణకు రాగా హనుమంతుడు తాను కొలువ వలసిన దైవముగా శ్రీరాముని గుర్తించెను. ఇట్లే భాస్కర రామాయణము, అధ్యాత్మ రామాయణము, ఆనందరామాయణము, ఆశ్చర్య రామాయణము, గోవింద రామాయణము, శ్రీకృష్ణ రామాయణములలో నున్నది. హనుమంతుడు బ్రాహ్మణ వటువేషమున వెళ్లినట్లు ఈ గ్రంథములలో నున్నది. కానీ ఆశ్చర్య రామాయణము, ఆనంద రామాయణములలో ఒక విశేషమున్నది. శ్రీరామాదులు తమకు శత్రువులైనచో సంజ్ఞ చేసి తెలుపవలయుననియు తనకు మిత్రులైనచో చిరునగవు ద్వారా సూచింపవలెననియు సుగ్రీవుడు హనుమంతుని కోరెను.[83]

అద్భుతోత్తర రామాయణములో: హనుమంతునికి రాముని విశ్వరూప మద్భుతముగా కనబడెను. ఆ రూపమునతడు ఏడు పద్యములలో స్తుతించి శ్రీరామునకు సాష్టాంగ నమస్కార మొనర్చెను.[84]

ఆశ్చర్య రామాయణము ప్రకారం: వటువేషములో రాముని చేరి హనుమంతుడు "మీరు దేవతలా, అశ్వినులా, రుద్రులా, అని ప్రశ్నించెను. రాముడంత 'వానరోత్తమా, నీవు నన్ను ఇంకొకమారు చూచినచో నేనెవ్వరో నీకు తెలియును.' అని చెప్పి తన నిజరూపమతడు చూడగల దివ్యదృష్టిని యిచ్చెను. అంజనేయునకపుడు రాముని రూపంలో చతుర్దశ భువనాలూ కులపర్వతాలూ, సప్తసాగరాలూ, నక్షత్రాలూ, సూర్యచంద్రులూ భూమీ ఆకాశమూ, నదీ నదములూ, గ్రామాలూ, నగరాలూ, రాక్షసులూ, వానరులూ.... అన్నీ కనపడెను. "వానరా' అని తనను రాముడు సంబోధించి నందున తాను వానరుడను విషయము రామునకు తెలిసినదని గమనించి హనుమంతుడు వానరాకారము పూని సమీపవృక్ష మధిరోహించి తాను చూచిన విశ్వరూపమును గూర్చి 'యిది యింద్రజాలమో, భ్రమయో అని సంశయించు చుండెను. వృక్షాగ్రంలో నున్న వానరుని రాముడు గమనించెను. అతని దేహంలో చెవులలో గుప్తముగా నున్న సువర్ణకుండలములు, దేహానికున్న సువర్ణ కవచము గమనించి ఆ వివరములను తమ్మునికి తెలిపెను. ఆ వాక్యములు వినిన హనుమంతునకు బ్రహ్మ తనకిచ్చిన వాక్యములు గుర్తుకు వచ్చెను. "ఆంజనేయా! ఈ నీ కవచ కుండలములను ఇతరులు చూడజాలరు. ఇవి ఎవనికి కనబడునో అతడే శ్రీవిష్ణువని తెలిసికొనుము. అతనినే నీవు నీ ప్రభువుగా భావింపుము." అను నా వాక్యముల స్మరించి శ్రీరాముని చూచుట వలన తనకు గల్గిన చేతోముదమునే ప్రమాణీకరించుకొని వృక్షము నుండి దిగి శ్రీరాముని చేరి "స్వామీ! నేను మూఢుడనై అపకారము చేసితిని. నేను నీ దాసుడను. నీవే నా స్వామివి. నేను నీకు భృత్యుడను. నీ అజ్ఞానువర్తిని" అని తెలిపెను.[85] (విచిత్ర రామాయణమున కూడ ఈ కవచకుండల వృత్తాంత సహితమగు కథ కలదు.)

సమీరకుమార విజయము ప్రకారము: వాల్మీకి రామాయణముతో పాటు ఇతర రామాయణములలోని అంశములను స్వీకరించి పుష్పగిరి తిమ్మన ఈ సన్నివేశమును కడు రమణీయముగా పోషించియున్నాడు. బ్రహ్మచారి

వేషమున వచ్చు హనుమంతుని శ్రీరాముడు గుర్తించెను. సతివియోగ దుఃఖ తిమిరమున నున్న రామునకు హనుమంతుని రూపమొక ఆశాకిరణ మైనది. వెన్నెల కాంతిని పోలిన యజ్ఞోపవీతముతో, మెడఁగొన్న మౌక్తికావళులతో, పసిడి కెంజిగి పట్టుపంచెపై మొనయు మౌంజితో నవరత్నఖచిత కుండల ప్రభలతో, తళుకెక్కు చెక్కిళ్లతో, ఎఱ్ఱ తామరల వంటి హస్తములతో, బంగరు గోచితో, ముంజేతి బంగారు కంకణములతో తన చుట్టూ వున్న బయలు ప్రదేశాన్ని బంగారు మయమొనర్చుచు వచ్చు ఆ బ్రహ్మచారి రూపాన్ని రాముడు గమనించెను. కొండపై పాదములూది దిగి, మదబంధురసింధుర లీలతో ఒయ్యనొయ్యనేతెంచుచు రామాదుల సుప్రసన్న శుభ దృష్టులతో చూచుచు వచ్చుచున్న హనుమంతుని రాముడవలోకించి లక్ష్మణునితో "అదర ణీయుడీ వటుకులాగ్రణి జూడగ వేడుకయ్యెడున్"

ఉక్తి వధూ సతీశ్వరుల నొక్కడు గాకితడున్న నీ శుభ
వ్యక్తియు నీ విరక్తి విభవాద్యనురక్తియు నీ మహత్కళా
వ్యక్త ముఖాబ్జయుక్తి కలదా! యితనిం గని మాటలాడగాఁ
బ్రాక్తన జన్మ పుణ్య పరిపాక వశంబున గాక కల్గునే...."

అని పలికెను. "సోదరా, ఇట్టి ఘనుని నేనిదివరలో జూడలేదు. ఇతనిని చూచుకొలది నాలో దుఃఖము పోయి మోదము హెచ్చుచున్నది. ఈ చుట్టు ప్రక్కల చెట్లు హేమవర్ణమౌతున్నాయి. ఇతని రాకవల్ల యింకేమి విశేషాలు కల్గునో? అని పలుకు రాముని వద్దకు హనుమంతుడు సమీపించి 'కయిమోడ్పు లలాటము నందమర్చి సాష్టాంగ మొనర్చెను. క్షత్రియులై గృహస్థులైయున్న శ్రీరామ లక్ష్మణులకు హనుమంతుడు నమస్కరించెను. ఇట్లొనర్చుటకు కారణము తల్లిమాటా, బ్రహ్మవాక్కులే.

తన మేనమామల వద్దకు పోవుటకు ముందు ఆంజనేయుడు తన తల్లిని చేరి 'అమ్మా, సత్య దయాది ధర్మాలనూ, నిత్యబ్రహ్మచర్యత్వమునూ నాకు ఇచ్చిన ధాతకు నేను నమస్కరించి నా తనుమనముల నేలుకోగల విభుని తెలుపమని కోరితిని. అపుడు బ్రహ్మ "నీయెడలి నవ్యవిభూషణరాజిఁ గాంచు విష్ణువే నీకు గతియును ఇష్టఫలప్రదాతయు కాగలడ"ని తెలిపియున్నాడు అని చెప్పెను. అంత అంజన, "బ్రహ్మవాక్కు తప్పక ఫలించును. నీవటులే చేయు

మని యాదేశించి పంపియుండెను. హనుమంతుని చూచి లక్ష్మణునితో రాముడు—

బంగరు పట్టుగోచి నును పచ్చని ముంజియు నొంటి జందెమున్
ముంగయి కంకణంబు జిగి మోహన హారము కుండల ప్రభా
భంగ కపోలముల్ తరుణ భాను సమాన ముఖాంబుజంబు మీ
అంగ వటుక్రియన్ శివుడు రాడుగదా మన చింత దీర్పగన్.

—అనిన పలుకులను వినిన హనుమంతుడు తన స్వామిని గుర్తించియే అట్లు నమస్కరించెను.

అంత లక్ష్మణునిద్వారా శ్రీరామకథ విని అమృతాక్షరసంగ మెసంగగా రాముని చూచి—

"రావించెద సుగ్రీవుని
గావించెద మీకు బంటుగా ననిశంబున్
సేవించెద మీ పదములె
భావించెద మిమ్ము స్వామి భావమున నృపా"....

—అని పలికెను. ఆ తర్వాత తనను గూర్చి తన పుట్టుకను గూర్చి, బ్రహ్మ తనతో అనిన మాటల గూర్చి వారితో చెప్పి రాముని స్తుతించుచు "స్వామీ. లోకాలోకచరితక్రియల్ తెలియునంతటి దేవునకు ఒక క్రోతి ముంజిని, గోచిని కంకణములను ధరించుట విచిత్రముగా ఉండవచ్చును. కానీ, సర్వసాక్షి, చిన్మయమూర్తి పరమాత్మయైన మీయొక్క దివ్యరూపమును కనులార సేవించు భాగ్యమునకు అర్హుడనైతిని. మీ దర్శన మాత్రమున నాలోని అంధకారము తొలిగెను. మీ పాదసన్నిధిలో నామేను పావనమాయెను నా మనోరథము లీడేరెను" అని పలికెను. అంజనేయుని భక్తికి, అనురక్తికి ఆనందించిన శ్రీరాముడు తన అనుజుని చూచి "ఈ కపికుంజరుని మాటలు నవవ్యాకరణార్థ దీపకములు; శబ్దనిగుంఫనక్రియాస్తోకములు; విశుద్ధపదాస్పదములు; మనన శ్రవణ శోకహరంబులు. ఇట్టి గుణసుందరు నెందునైన కంటిమే. హనుమన్ముఖ ప్రసక్తవాణి యెంతటివారినైన వలపింపజేయును దాని రుచి, అర్థ గాంభీర్యము, కోమలత్వము, తిన్నదనము, చాతుర్యము అపశబ్దరాహిత్యము, రమ్యరీతి, సరసభావములను పేర్కొని ఆశ్చర్యము ప్రకటించుచుండగా హనుమంతుడు వారి వార్త సుగ్రీవునికి తెలుపుటకై బయలుదేరెను.

హనుమంతుడు సుగ్రీవుని చేరి "ప్రభూ, శోకసాగరంలో కడగానని నీకు దరిదాపు రాముని రూపమున లభించినది. నీవు వారి సాహాయ్యము పొందుము" అని తెల్పి మరల దాశరథుల వద్దకు వచ్చి సుగ్రీవునకు శ్రీరామదర్శన మనుగ్రహింప ప్రార్థించి వారినామోదింప జేసి నరవానరసఖ్యమునకు నాంది యొనర్చెను. శ్రీరామసుగ్రీవ స్నేహాన్ని పటిష్ఠపరచి, వాలి నిర్మూలనమునకు తోడ్పడి కిష్కింధ సింహాసనమును సుగ్రీవునకు దక్కునట్లు చేసిన హనుమంతుని నిర్వ్యాజ పరోపకార వైభవమును, సంధానోచిత వాగ్విధానమును, సత్యవ్రత సామర్థ్యమును అనన్య దృష్టములని శ్రీరాముడే పొగడెను. 'ఇతడా పద్భేది సామాన్యుడే" అని రాముడే మెచ్చుకొనినందున శ్రీరామవాక్యాను గుణముగా హనుమంతడాపన్నివారకుడయ్యెనని యూహింపవచ్చును.[86]

హనుమంతుడు శ్రీరామునివద్దకు వటురూపమున వెళ్లినట్లుగాను, భిక్షు రూపమున వెళ్లినట్లుగాను, సన్యాసి రూపమున వెళ్లినట్లుగాను పలురామాయణ ములలో పలుపలు విధములుగా నున్నది. "రూపంబది సంపూజ్యము తాపసు లకుఁగూడ గాన దానింగని యా భూపకుమారుల కడకిపుడే పోయెద" నని హనుమంతుడు తలంచినట్లు ధర్మసార రామాయణము.[87] ఇక ఆశ్చర్య రామాయణములో: 'వటువేషమనగా బ్రహ్మచారి వేషము. బ్రహ్మచారి అవధ్యుడు. మంగళప్రదుడైనను చంచలుడై యుండి తనకు ప్రయోజనము లేకపోయినను కుశంకలు చేయునట్టి వాడని తలంచియే సుగ్రీవుడు హనుమంతుని వటువేషమున వెళ్లమని కోరెను. వటు శబ్దమునకు భిక్షువు, సన్యాసి, అని తెలుపుట తగదు. సన్యాసి రాజునకు నమస్కరింపరాదు. భిక్షువు గృహస్థునకు నమస్కరింపరాదు. రాముడు క్షత్రియ రాజకుమారుడు. గృహస్థు కావున భిక్షు శబ్దమునకు పలువురు వ్రాసినట్టి వటువనియే స్వీకరించుట ఉచితము. హనుమంతుడు మనుష్య బ్రహ్మచారి వేషములో వెళ్లినాడని తాత్పర్యము.[88]

ఇట్లే దండక రామాయణమునను కలదు.[89] కవిసామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి శ్రీమద్రామాయణ కల్పవృక్షములో నున్న క్రమము: భిక్షుకాకారమున వచ్చి శ్రీరామలక్ష్మణుల జూచి హనుమంతుడు—

"మీర లెవ్వరు వినూతన దైవత మోహనాకృతుల్
మీర లెవ్వరు ప్రదక్షిణ యోగ్యులుదాత్త తేజసుల్
మీర లెవ్వరు మహా హేలా ప్రధానాకృతుల్"

—అని వారినడిగెను. వారిలో—

"రాము కన్నులఁ బరమేశ్వరత్వమనుజ
కన్నులను యోగిరాజ లక్షణముల"

‘—నాతడు చూచెను. హనుమంతుని మాటలు వినిన రాముడు—

దర్శన మాత్ర తర్పిత హృదంతర భావుడు–సాధుమూర్తి యా
దర్శ గతాత్మ బింబ కలితంబున నక్కపిరాజు జూపెనాన్
స్పర్శము చేత వాయు సుఖ శైత్యము దీపితమెట్లు భావనా
మర్శిత వాక్కుచే నుభయ మంజుల భావము దీప్తమయ్యెడున్

—అని తలంచెను.[90]

అద్భుతోత్తర రామాయణములో: ఇందులో శ్రీరాముడు శంఖచక్రగదా ధారియై వనమాలాలంకృతుడై శ్రీవత్సచిహ్నిత వక్షములతో పీతాంబరధారియై సనకసనందనాదులచే స్తుతింపబడుచు సూర్యప్రకాశముతో, శతచంద్రకాంతితో, వేయిపడగలుగల పాన్పుగా లక్ష్మణుడు విరాజిల్లుచుండగా హనుమంతునకు దర్శనమిచ్చెను. అ దివ్యరూప దర్శన భాగ్యమునకు హనుమ ఆశ్చర్య చకితుడై నిమేషమాత్రం కళ్లుమూసి శ్రీరాముని రూపమును పరమాత్మగా నెఱిగి తన హృదయమందు నిల్పి ధ్యానించెను. దర్శన భాగ్యమునేకాక హనుమంతునకు శ్రీరాముడు జ్ఞానసాంఖ్యాది యోగములతోపాటు పరతత్త్వం గురించి విపులముగా బోధించెను. శ్రీరాముని దివ్యరూపం అంతర్ధానంకాగా హనుమంతుడంత మానవాకృతులగు శ్రీరామ లక్ష్మణులను చూచెను. రామునిలో హనుమంతుడు పరమాత్మను దర్శింపగా, హనుమంతునిలో రాముడు శత్రు సంహార సమర్థమగు రుద్ర కర్మార్హ రూపమును గాంచెను. ఇదే కథ రామాయణ వచనమున కూడ కలదు. హనుమంతుని మూలముగా శ్రీరామునికి సుగ్రీవుని చెలిమి లభించుట. ఆచార్య మూలముగ భగవంతుడు చేతనునకు లభించుటయే. భగవానుడగు రాముడు సుగ్రీవుని శరణుపొందెనా? అని ప్రశ్నించువారికి జవాబుగా వ్యాఖ్యాత ఇట్లు తెలిపియున్నారు. "కర్మ పరతంత్రుడై శోకాకులులగు వారిని గాంచి పరమాత్మయే శోకాకులుడగు ననియు, ఆ ఉభయుల దుఃఖము ఆచార్య మూలముననే తొలగుననియు హనుమద్రామ సమావేశమందలి ధ్వని అని శ్రీ దివాకరుని వేంకటసుబ్బరావు గారు చెప్పియున్నారు.[91]

అన్యభాషాగ్రంథములలోని క్రమము: 1. కంబర్ కవిప్రకారం: హనుమంతుడు శ్రీరామలక్ష్మణుల జేరి 'తేజస్వులారా, భవ్యమై ఇష్టావాప్తి చేకూరుతన్' అని సంభావించి కుశల వార్తలడిగెను. అపుడు రాముడు 'నీవెవరవు? అని అడుగగా హనుమంతుడు "నేను సుగ్రీవుని మంత్రిని - హనుమంతుడను పేరు గలవాడను. వనచరుండన్ దాసుడన్ మీకడన్" అని తెలిపెను. వారి కథ విని వారు సుగ్రీవుని కలిసికొనుటకే వచ్చుచున్నారని తెలిసి "ఆహా! తపమాతడు పూర్వభవంబు నందు అనితర సాధ్యముగా చేసిన ఫలితమే కదా ఇది" అని పలికి "మీరలు విచ్చేయుట భాగ్యదేవత కృపన్ ప్రత్యక్షమౌటయే గదా। జనులు వాంఛాపూర్తికై యజ్ఞాది కర్మలు చేస్తారు. సుగ్రీవుని భయమును పోగొట్టుటకన్న వేరు ధర్మము లేదు" అని హనుమ పలికెను. విప్రవర్ణియై హనుమంతుడు తమకు నమస్కరింపదగదని రాముడనినపుడు హనుమంతుడు "కింకరుడు మర్కట కులజుండటంచు పలుకరుగదా!" అని తన నిజరూపము చూపగా, అతని మేరునిభ శరీరమునకు త్రిజగముల గొల్చిన అవతారమూర్తి యగు రాముడే దిగ్భ్రమ చెంది—

"తమ్ముడ కాంచితే విమలతత్త్వము సత్త్వము రూపుదాల్చిన
ట్లెమ్మగ మోక్షమె యొక కపీశ్వరు నాకృతి నొందు భాతిఁ దే
జమ్ముల పుంజమై వెలసె సమ్మతినిమ్మహనీయుఁ జేరి దుః
ఖమ్ముల నీగునట్టి యొడికమ్ము నెఱుంగగనయ్యె నియ్యెడన్

—అని చెప్పెను. హనుమంతుని ద్వారా తర్వాత రామసుగ్రీవ సఖ్యము నెరవేరినట్లు కంబకవి రామాయణమున కలదు.[92]

రామచరితమానస్ ప్రకారము: దూరమున వచ్చు రామ లక్ష్మణులను చూచి సుగ్రీవుడు హనుమంతుని పిలిచి 'ఆ మహాపురుషుల జూడుము. వారనేక కష్టముల బడినట్లు కనబడుచున్నారు. నీవు బ్రహ్మచారి రూపం ధరించి వారిని చూచిరమ్ము. వారి వృత్తాంతమంతయు వారికి తెలియకుండా నాకు తెలియ జేయుము. ఒకవేళ వారు వాలిచే పంపబడిన వారైనచో నీవు నీ ముఖమును వంచుకొని యుండుము. నేనది గ్రహించి యీ పర్వతము విడిచి పారిపోయెదను" అని చెప్పెను. హనుమంతుడు అట్లేచేసి తన స్వస్వరూపము వారికి తెలియకుండునట్లు శిరస్సు వంచుకొని యుండెను. అతడు వారికి నమస్కరించెను.

రాముని తేజము చూడలేక వారు బ్రహ్మర్షి రాకుమారులనియో, త్రిమూర్తు లనియో తలవంచి హనుమంతుడు నమస్కరించి యుండునేమోయని శంకించి నారు తులసిదాసుగారు (చౌపాలు 1 విశ్రామము 1 కిష్కింధకాండ) హను మంతుడు వారిని మూడు ప్రశ్నలడిగెను. శ్యామల శరీరమును, పచ్చని శరీరమును గల మీరెవరు? మీరేల వనములో తిరుగుచున్నారు? మీరు త్రిమూర్తులైనచో మూడవ వాడేడి? కాక, మీరు నరనారాయణులా! అని అడిగెను. రాముడే స్వయముగా తన కథ చెప్పగా, హనుమంతుడతని పాదాలపై పడి ప్రణామ మాచరించెను. అపుడు హనుమంతుడనుభవించిన సంతోషము చెప్ప శక్యము గాదు. అతని శరీరము పులకరించెను; ఆనంద బాష్పములు స్రవించెను; ముఖమునుండి మాట వెలువడలేదు. నిలువుగ్రుడ్లు పెటుకొని శ్రీరాముని దివ్యమంగళ విగ్రహమునే చూచుచుండెను. ఆనంద ముతో రామునిచూచి హనుమంతుడు "ప్రభూ, నేను స్వల్పుడను. బుద్ధిహీను డను. నాకు జ్ఞానము లేదు. అందుచేత మిమ్మట్లు ప్రశ్నించితిని. సామాన్య మానవులవలె మీరు నా పూర్వోత్తరముల నడుగుటయా? నేను మీ మాయకు లోబడియుంటిని. కనుక మిమ్ము గుర్తు పట్టలేదు. (బాలకాండ 5వ విశ్రామము చౌపాలు 227లో శ్రీరాముడు హనుమంతుని వీడునపుడు మరల వనమున కలుసుకొనుమని చెప్పియుండెను.) నేను మందమతిని. మీమాయకు వశ్యుడను అని ఎన్నియో విధముల పలికి బ్రాహ్మణరూపము విడిచి వానరరూపముతో రాముని చరణములపై వ్రాలెను. స్వామిలోని వాత్సల్యమంతయు హనుమ శరీరముపై వ్యాపించెను. అతడు కపట రూపము ధరించి యుండినంత వరకు రాముడు అతనిని తాకలేదు. స్వస్వరూపము చూపగానే రాముడతనిని లేవనెత్తి నిలువబెట్టి కౌగిలించుకొనెను. శ్రీరాముని ఆనందాశ్రువులు అంజనేయుని దేహమును తడిపి చల్లబరచెను. అపుడు రాముడు "హనుమా! సంకోచింప కుము. నీవు లక్ష్మణుని కన్నా నాకు రెండింతలు ప్రియుడవు. లక్ష్మణుడు నా సేవకుడు. నీవు మా యిర్వురికి సేవకుడవు" అని పలుకగా హనుమంతుడు వారికి సుగ్రీవుని వృత్తాంతము తెల్పి వారిని తన భుజములపై ఎక్కించుకొని సుగ్రీవుడున్న కొండపైకెగిరి వారిని చేర్చి వారికి మైత్రిని సమకూర్చెను.[93]

హనుమద్రామ సమావేశ సంబంధి విశేషాంశములు: భిక్షురూపం ధరించి వచ్చిన హనుమంతునకు శ్రీరామదర్శనంతో అతని జ్ఞాననేత్రం వికసిం

చెను. అందువలన తాను యతివేషములో నున్నను నమస్కారము చేయును. (రామాయణమున) సంక్షేప రామాయణమున వాల్మీకి కవి 'పంపాతీరే హను మతా సంగతో వానరేణేహ" అని వ్రాసిన శ్లోకమును విశదపరచుచు శ్రీనమ్మాళ్వార్లు ప్రసాదించిన 'తిరువాయ్ మొషి" లోని "వైకంపూంగళి" అను పాశురములో 'హ" శబ్ద ప్రయోగ సార్థకతను విశదపరచుచున్నదని పేర్కొని నారు· "సన్యాసి వేషం కొన్డు వన్దు.... అను వ్యాఖ్యానము ప్రకారము సన్యాసి వేషంలో దివ్యదంపతులకు ఎడబాటు కల్గించిన రావణుని వలె కాక ఆ దివ్య దంపతుల సంశ్లేషము కూర్చువాడుగా హనుమంతుడు వచ్చెను. కావున హనుమద్రామ సమావేశము సీతావిశ్లేషమందాశ్వాసహేతువని తెల్పుటకే 'హ' శబ్దమును వాల్మీకి వాడెను. "అభరణత్తుక్కు అళఘు కొడుక్కుం పెరుమాళ్" ఇత్యాది పాశురముల వ్యాఖ్యలో రాముని అభరణ విరహితుడుగా హనుమ దర్శించినంతనే దృష్టిదోషం తగులకుండా అభరణములు ధరించవలసిన స్వామి యగు రాముడేల అభరణాలు లేకుండా కనిపించెనో అని బాధపడెను.[94]

శ్రీరాముడు భూషణముల వీడి కనిపించుట శత్రువులను సమూలముగా చంపుదునని సూచన చేయుటకేనని శ్రీ దివాకరుని వేంకటసుబ్బరావుగారు భావించియున్నారు.[95]

## 4. కిష్కింధా రాజకీయములు-హనుమంతుని మంత్రాంగము:

రామబాణహతిచే వాలి పడిపోగా కపిసోదరుల కలహమునకు తెర పడెను. కొన ఊపిరితోనున్న వాలికై దుఃఖించుచు తార ప్రాయోపవేశ మొనర్ప సంకల్పించెను. అపుడాంజనేయుడామె ప్రయత్నమును విరమింప జేయుటకై కేవలము సందర్భోచితమైన బోధ చేయుటయేకాక వానరరాజ్య సుస్థిరతకై రాజనీతిజ్ఞతను ప్రదర్శించెను. తారతోపాటు అంగదుని సహకారము కూడ సుగ్రీవునకు లభించునట్లొనర్చుటలోను, కపిసోదరుల కలహము వారిలో పగను, ద్వేషాన్ని జ్వలించునట్లుకాక పశ్చాత్తాపానికి పరస్పరావగాహనకు పనికి వచ్చు పలుకులను సార్థకముగా పలికి ఘనకార్యమును సాధించినాడు హను మంతుడు. తారకు బోధించిన మాటలలో అతని అధ్యాత్మిక పరిజ్ఞానము వాక్పుణ్యము వ్యక్తమైనది. "తారా, దేహధారులు తెలిసిచేసినా, తెలియక చేసినా, సుకృత దుష్కృతకర్మల ఫలితములను అనుభవింతురు. వాలి నేడు

తన కర్మఫలమునే అనుభవించుచున్నాడు. దీనికై నీవు సుగ్రీవునికాని, రాముని కాని నిందింపవలసిన పనిలేదు. దేహము నీటిబుగ్గకు సమానము. నీకోసం నీవేడ్వవలయును గానీ యితరులకై కాదు. ఈ లోకమున ఎవ్వరికెవ్వరు? జీవపుత్రవగు నీవు సహగమనము చేయరాదు. దుఃఖము నీ తెలివిని హరించెనా? 'భూతలములు పుట్టుట, గిట్టుటా అనిత్యమైనవి. గతించు వాలికై హితకరమగు కార్యములను నీవు జరిపించవలయును గదా. ఔర్ధ్వ దైహిక శుభకామివగు నీవు రోదించరాదు బ్రతికిన రోజులలో వాలి బాగానే బ్రతికినాడు. వానరుల నేలినాడు. ఆత్మీయులను, మిత్రులను పెక్కువిధాల మన్నించి లోకమందనుభ వింపదగిన వాటినన్నియు అనుభవించి వెళ్లినాడు. కావున అతనికై దుఃఖింప కూడదు. ఇపుడీ రాజ్యానికి నీవే దిక్కు. నీమీదనే భారమంతా ఉన్నది. అంగదుని యౌవరాజ్య పదవిలో నిలిపి నీవు చూడాలి. గతించినదానితో మనకు నిమిత్తము లేదు. భవిష్యత్తులో నీకుమారునకు ఏ కష్టమూ రాదు. కావున ప్రకృతము నాలోచింపుము." అని చెప్పుచు ఓదార్చసాగిన తరుణమున కొనయూపిరితో నున్న వాలి సుగ్రీవుని పిలిచి తనవలన కల్గిన బాధలను మరచిపోయి రాజ్యాన్ని పాలించుకొనుమని తెలిపి తారను, అంగదుని సుగ్రీవు నికి అప్పజెప్పి క్రోధరహితుడై ప్రశాంతముగా ప్రాణముల వదలెను. హను మంతుడు తారకు బోధించిన పలుకులకు వాలి ఆమోదముద్ర పడుటతో జరుగవలసిన కార్యముల జరిపించుటకు తార ఆమోదించెను. వాలి మరణించు టకు పూర్వము తారకును, అంగదునకును హితమును బోధించుచు పలికిన పలుకులు, వాలి మరణము, తారావిలాపము, సుగ్రీవుడు సోదరునికై దుఃఖిం చుట, తారకు శ్రీరామునకు జరిగిన సంభాషణము, వాలికి ఉత్తరలోకక్రియలు మొదలగు అంశములకు హనుమంతుడు ప్రేక్షకుడుగా నుండి అన్నియు సక్రమముగా జరుపుటకు తోడ్పడెను.

సోదరునకు పుణ్యలోకప్రాప్తికై తడిబట్టలతో కర్మలనొనరజేసి దుఃఖ భారముతో నున్న సుగ్రీవునకు కర్తవ్యమును బోధించి వానరరాజ్య పట్టాభి షేకము జరుగుటకై హనుమంతుడే ప్రయత్నించెను. రాజనీతి చాతుర్యముతో, సందర్భోచిత వాగ్వైఖరితో శ్రీరామునితో హనుమంతుడు "స్వామీ, మీ అనుగ్రహము వలన, ఎట్టి వానరునకు పొందుట కసాధ్యమైనదీ, ఘనమైనదీ యగు పితృపైతామహమయిన వానర రాజ్యాన్ని సుగ్రీవుడు పొందెను. మీ

రనుమతించినచో నగర ప్రవేశము చేసి పవిత్ర స్నానముచేసి పట్టాభిషిక్తుడై అటుతర్వాత మిమ్ము రత్నమాల్యములతో నర్చింపగలడు. కావున మీరు కిష్కింధకేతెంచి, వానరులనందరినానందపరచి సుగ్రీవుని వానరరాజ్యాభిషిక్తు నొనర్పవలసినదిగా కోరుచున్నాను" అని తెలిపెను. రాముడంత తనకు నగర ప్రవేశము నిషిద్ధమని తెలిపి సుగ్రీవుని పట్టాభిషేకమునకనుమతించి తాత్కార్య భారము హనుమదాది వీరులే వహింపనాదేశించి శరదృతువున కార్తీకమాసము వఱకు తాను ప్రస్రవణ గిరిలోనే యుందుననియు వానరులానందముగా కాలము గడపి రావణవధాయత్నమునకై తర్వాత తనను చేరరావలసినదిగా తెలిపి వారు కిష్కింధకు వెళ్లుట కనుమతించెను.

సుగ్రీవ పట్టాభిషేక కార్యములన్నియు జాంబవంతాది తోడి వానరులతో కలిసి హనుమంతుడు నిర్వహించెను. అధికారప్రాప్తితో భోగలాలసుడై రాచ కార్యముల విస్మరించి చరించు సుగ్రీవునికి హితబోధ చేయుటకై హనుంతుడే చొరవ చూపెను. రామకార్యమును విస్మరించినచో విపత్కరమగునని గుర్తించియే హనుమంతుడు సుగ్రీవుని చేరెను. తనను ఆప్తునిగా స్వీకరించి తన మాట తప్పక స్వీకరించునను నమ్మకముతో అతనికి హితకరమూ, యథార్థమూ, నీతియుక్తమూ, సామయుతమూ, ధర్మయుతమూ నగు మాటలను చెప్పుటకు పూనెను. సుగ్రీవునే సేవించుచున్నను ప్రస్రవణగిరిలో నున్న రాముని కార్యములను మరువక సుగ్రీవునికి కర్తవ్యమును నిర్దేశించుటలో హనుమంతుని కాలధర్మతత్త్వజ్ఞత, హిత పథ్యయథార్థ నయోక్తి చాతుర్యము, మాధుర్యము మెచ్చదగినవి. 'వానరరాజా, రాజ్యము పొందితివి, కీర్తి లభించినది కాని మిత్రకార్యము మాత్రము నెఱవేరక మిగిలియున్నది. ఇపుడు నీవాకార్యమును నెరవేర్చాలి. కాలమెరిగి యెవడు మిత్రకార్యములకు తగినట్లు వర్తించునో వానికి రాజ్యము, కీర్తి, ప్రతాపములు పెరుగును. ఎవనికి కోశబలము సేనా బలము మిత్ర సుహృద్బలము లుండునో వాని రాజ్యమే పరిపూర్ణాభివృద్ధి గాంచును. నీవు సదాచార సంపన్నుడవు. సన్మార్గప్రవృత్తుడవు ప్రతిజ్ఞచేసిన ప్రకారము మిత్రకార్యము నెరవేర్పుము. మిత్రకార్యమొనర్చువానికి కీడు కలుగదు. అకాలమున కార్యమారంభించినచో ప్రయోజనముండదు. సీతాన్వేషణ కార్యము ఘన బాధ్యత. ఇప్పటికే కాలాతీతమైనది. పతీవియోగ బాధాతప్తుడైనను రాముడు నీ మనస్సుననుసరించి పోవునేకానీ కాలాతిక్రమణ

మైనట్లు నీతో అనడు. అతడున్నతవంశ జాతుడు. అప్రమేయ ప్రభావుడు. మనకాప్తుడు. ముందు నీకార్యమాతడు నెరవేర్చినాడు. ఇపుడు నీవు ప్రత్యుప కార మొనర్పవలయునుకదా! కావున సీతను వెదకుటకు వానరుల నాజ్ఞా పింపుము. రాముడే మనలను ప్రేరేపించుటకు ముందే మనకై మనమే ఈ ప్రయత్నము నారంభించినచో కాలాతిక్రమణ దోషము కలుగదు. ఏ ఉప కారము చేయనివారికికూడ తోడ్పడునట్టివాడవునీవు. నీకు రాజ్యశ్రీని కలిగించి మహోపకార మొనర్చినాడు కావున అతని కార్యము నీవు నెరవేర్చి అతనికి ప్రీతిని కల్గించుట యుక్తము. సైన్యములకాజ్ఞ ఇవ్వక ఏల జాగు చేయు చున్నావు? రాముడు సురాసుర మహోరగుల గూడ తన శక్తితో స్వాధీన పరచుకొనగలవాడు. నీవొనర్చిన ప్రతిజ్ఞ నీవే నెరవేర్చవలయుననియే నిరీక్షించు చున్నాడు. తన ప్రాణాలను కూడ లెక్కపెట్టకుండా వాలిని వధించి నీకు సహాయము చేసినవాడతడు. అతని భార్యను వెదకుటకై ప్రయత్నించుము. దేవాసుర గంధర్వాదులే రామునకొక లెక్కలో లేనివారనగా క్షుద్రరాక్షసు లొక లెక్కా? రామునకుపకారమొనర్చుట నీ విధి. భూమ్యాకాశాదులలో, నీటిలో, నిప్పులో ఎదురులేక సంచరింపగల వానరకోటి నీ అధీనములో నున్నది. వారిలో ఎవరేపనిని చేయాలో, ఎలా చేయాలో నీవే నిర్ణయించాలి. వారిని ఆజ్ఞాపించాలి." అని హనుమంతుడు ప్రబోధించగా అతని ప్రభుభక్తి రామదైవతకార్య తత్పరతకు సుగ్రీవుడానందించి నీలుని పిలిపించి సైన్య సమీకరణ మొనర్పవలసినదిగా ఆజ్ఞాపించెను. అంగదుడు జాంబవంతుడు మొదలగు వానరశ్రేష్ఠులను ప్రబోధించి రావలసినదిగా చెప్పి సుగ్రీవుడు మరల సుఖలాలసతో అంతఃపురమున ప్రవేశించెను. సుగ్రీవుడట్లు వెళ్లగా అతడు రామాగ్రహమునకు గురియై కష్టపడునని తలంచి అట్టి దుస్థితి సుగ్రీవునికి కలుగకుండా తాను కనిపెట్టియుండవలెనని హనుమంతుడు భావించెను.

సుగ్రీవుని అలసత్వమును గమనించిన రాముడు లక్ష్మణుని సుగ్రీవుని హెచ్చరించుటకై పంపెను. మద్యపానమత్తుడై మదనక్రీడాలోలుడైన సుగ్రీ వునికీ వార్త తెలుపుటలో అంగదుడు విఫలుడు కాగా లక్ష్మణుని ఉగ్ర రూపము చూచి వానరులంతా వణకి పోతుండగా వాయుపుత్రుడు సుగ్రీవునిచేరి అతని మత్తు వదిలించి కర్తవ్యమును బోధించెను. 'రాజా, వర్షాకాలము పోయి శరత్కాలము వచ్చినందున సీతాన్వేషణమును గూర్చి నీ కర్తవ్యమును గుర్తు

చేయుటకే రాముడు సౌమిత్రిని పంపియున్నాడు. అతడు పరుషంగా మాట్లాడినా నీవు హితమని సయింప దగునేకానీ ఎదిరించి మాటలాడవద్దు. వెంటనే కొలువు తీరి సచివులతో ఆలోచించుము. దోషము నీ యందున్నది. అందుకు తోడు తిరస్కారము గూడ చూపినచో అది మరింత దోషమగును. 'అంజలి పరమా ముద్రా క్షిప్రం దేవప్రసాదిని' అని పండిత వాక్యము. కావున సౌమిత్రికి మ్రొక్కి సభలోనికి ప్రవేశపెట్టుటకు అంగదునే నియోగింపుము" అని చెప్పిన హనుమద్వచనముల విని సుగ్రీవుడు అంగదుని లక్ష్మణుని తెచ్చుటకై పంపెను. సభలోనికి అంగద లక్ష్మణులు చేరులోగా సుగ్రీవునకు హనుమంతుడింకనూ కొన్ని విషయములను విశదమొనర్చెను. "కపీంద్రా, ప్రభువు మేలుకోరు మంత్రులు హితము వచింపవలయును కావున భయము విడిచి "కలతెఱగు" తెలుపుచున్నాను. రాముడు నిన్నాశ్రయించినందున అతడసమర్థుడని నీవు తలంచుచున్నావేమో! అతనికి కోపము వచ్చెనా దేవ రాక్షసాదులతో జగత్తునే వశపరచుకొనగలడు. అతడు మునుపు నీకు చేసిన ఉపకారమునకు నీవు 'మారు మేలు సేయ దలకొనుము' రామాజ్ఞ మీరుటకు నీవు మనస్సులో తలంచవద్దు. నీ హితము కోరి నేను చెప్పిన ప్రకారం చేయుము. నీవు పుత్ర మిత్ర బాంధవ సహితంబుగా రాముని వద్దకు వెళ్లి నిలువుము. భర్త వద్ద భార్య ఏవిధంగా నిలుస్తుందో ఆవిధంగా నీవు రామునికి రెండు చేతులూ జోడించి అతనికి దాసుడవై నిలువుము." అని హనుమంతుడు తన రాజనీతి పరిజ్ఞానమును విశదపరచుచు సూక్ష్మాతి సూక్ష్మాంశములను సుగ్రీవునికి విశదీకరించి బోధించినందున సుగ్రీవుడు తన కర్తవ్యమును చక్కగా నిర్వహించెను. అంజనేయుని ఆలోచనా సరళికి తగినట్లుగా తారను ముందుగా పంపి సౌమిత్రిని శాంతపరచుటా, సుగ్రీవ సౌమిత్రీ సంవాదమూ, నరవానర మైత్రీపునరుద్ధరణ ప్రయత్నమూ, వానర సైన్య సమీకరణమూ సుగ్రీవుడు సాధింపజేసెను.

పరాశర సంహితలోగానీ, పురాణాదులలోగానీ హనుమంతుడు తెర మరగున నుండి కావించిన ఈ కార్యములుగ్గడింపబడలేదు. వాల్మీకిననుసరించి ఆంధ్రీకృత రామాయణములలో నున్నదానిలో అధికాంశములేమియు లేవు. సమీర కుమారవిజయమున కూడ ఈ సన్నివేశము లేదు.

— —

అధ్యాయము – 4

# సీతాన్వేషణము

## అన్వేషణ:

సుగ్రీవుని ఆజ్ఞానుసారము అంగదుని నాయకత్వమున బయలుదేరిన వానర బృందములో హనుమంతుడు, జాంబవంతుడు, నీలుడు, సుహోత్రి, గజుడు, గవయుడు, సుషేణుడు మొదలగువారితో కలిసి సీతనన్వేషించుటకై దక్షిణ దిశకు వెళ్లెను. ఆ వానరసైన్యమునకు అంగదుడే నాయకుడైనా సుగ్రీవుడు హనుమంతునే పిలిచి "ఓ వానరోత్తమా, నీటిలో, నిప్పులో, నింగిలో, నిర్జరలోకములో నీకు అనివార్యమగు గతి కలదని నాకు తెలియును. సురాసుర దేవ గంధర్వ నర నాగ సంఘములు నీకు తెలియును. గిరి సాగర భూమండలాదులలో నీకు తెలియనిది లేదు. బలంలో, వేగంలో తేజంలో నీవు నీ తండ్రితో సమానము.

ఓ కపిలోకనాథ భవదున్నత తేజము చేతఁ జూచినన్
నీకు సమంబు భూతమవనీస్థలి లేదు, బలంబు బుద్ధి య
స్తోక పరాక్రమంబు గుణదోష విచారణ శక్తి దేశ కా
లైక సదానువృత్తియు నయజ్ఞ తిరంబుగ నుండు నీ యెడన్.

కావున, హనుమా, సీతను సాధించి మరలఁ దేరనుపాయంబీవె చేయవలె'నని కార్యభారాన్నంతటిని సుగ్రీవుడు హనుమంతునిపై పెట్టెను. హనుమంతుడే కార్యసాధన చేయగలడను నమ్మకము సుగ్రీవుడు చూపినందున రాముడు కూడ హనుమంతుడే సీతను వెదకుటలో సఫలమగునని సంతోషించి, తన నామాంకితంబగు ఉంగరమును తీసి హనుమంతున కిచ్చి 'కపీంద్రా, సీతాదేవి నిన్ను చూచి అనుమానముకానీ, భయముకానీ పొందకుండాను నీవు నావాడవని నమ్ముటకునూ ఈ ఉంగరము తోడ్పడును. దీనిని గైకొని కార్యసాధన కావింపుము. నేను నీ బలాన్ని ఆశ్రయించి యున్నాను. నీ పరాక్రమం కొద్దీ ప్రయత్నించి సీతాదేవి లభించునట్లు చేయుము' అని పలుకగా అంజనేయుడా

ఉంగరం 'చేకొని మూర్ధమునన్ ధరించి" రామునకు నమస్కరించెను. సీత జాడ తెలిసికొని వచ్చుటకు సుగ్రీవుడు వారికొక నెల గడువు నిచ్చెను.[96]

ఇతర రామాయణముల ప్రకారం: భాస్కర రామాయణమున ఈ సన్నివేశమిదే రీతిగా నున్నను "రఘుసంతానము నా ప్రాణంబులు మానుగ గలుగంగ జేయుము మారుత పుత్రా" అని సుగ్రీవుడు హనుమంతుని కోరుట అధిక విశేషము. ఇక ఆనంద రామాయణములో రాముడు తన ముద్రికను ఆంజనేయునకిచ్చి 'రహస్యముగా దీనిని సీతకప్పగించుము' అని చెప్పి తన మంత్రం ఆంజనేయున కుపదేశించెను. చిత్రకూటమున సీత చెక్కిళ్లపైన, నుదురుపైన పత్రావళులను తిలకమును తాను ఎట్లు రచించెనో మున్నగు రహస్యములను తెలిపి సీతకు నమ్మకమేర్పడుటకై ఆ విశేషములను తెలుపుమనెను. ఆంజనేయుడు రామునికి నమస్కరించి బయలుదేరి రామమంత్రం లక్షమార్లు జపించి, లక్షమార్లు వ్రాసి లంకాయానమునకు తగిన సామర్థ్యమును పొందెను.[97]

సమీరకుమార విజయము ప్రకారము: ఈ కార్యమున సీతాన్వేషణ సన్నివేశము సంక్షేపముగా నున్నది. వానరవీరులను ఆజ్ఞాపించిన తరుణమున శ్రీరాముడు హనుమంతుని పిలిచి—

నావిధమంతయున్ జనకనందనతో వివరించి తొల్త దు
ర్జీవనముద్ధరించి మఱి సీత శుభస్థితి నాకుఁ దెల్పి మ
జ్జీవ విధాయివై మరలఁ జేయుము తండ్రి వివాహ కార్య లీ
లావిధి నీ దయన్ రఘుకులంబు పునర్జననంబుఁ జెందగన్....

అని అలిపెను. సీతకిమ్మని తన ముద్రికనిచ్చెను. ఆంజనేయుడా ముద్రికను

"........భక్తిఁ గై
కొని శిరసావహించి కనుగోనల నుంచి ప్రసాదమయ్య, నే
జని త్రిజగంబులన్ వెదకి జానకి గన్గొని కాని యూరకే
నినుఁ బొడగానరానిదియె నిక్కము స్వామి యటంచు"

మ్రొక్కి వారిని వీడ్కొని సుగ్రీవ లక్ష్మణులచే వంద్యమానుడై సహచర వానరులతో సాగి పర్వతములూ, నదులూ, గహనములూ, గ్రామములూ, పట్టణములూ, నగరములూ వెదకుటకై వెళ్లెను.[98]

వేదరామాయణము ప్రకారం: ఈ కథను శ్రీ దివాకరుని వేంకటసుబ్బ రావుగారు రామాయణము–కిష్కింధకాండ వచనములో వివరించియున్నారు. వానరులలో హనుమంతుడుత్తముడని రాముడు గ్రహించి వానరులారా, మీలో వాయుపుత్రుడగు ఆంజనేయుడు దేహధరుడు, అగ్రేసరుడు మిత్రకార్య నిర్వాహకుడని గ్రహించి నాకార్యార్థ మతని స్తుతింపుడు. ఈతడు సూర్య దేవుని పండుగా భావించి తన సంకల్పము సంపాదించుకొన్నవాడు. నదులూ, సముద్రాలూ, వృక్షములూ, గిరులూ, బడబాగ్ని, కల్పాన్తాగ్ని, కాలాగ్ని రుద్రాదులు నక్షత్రమండలము బ్రహ్మాండమునందు గలవు. అట్టి బ్రహ్మాండ మందున్న వస్తుజాతము నంతను సశబ్దముగా నావరించి యున్న రుద్రకర్మార్థ మగు హనుమద్రూపం ఆహ్వానించెను. ఈతడు మహాత్ముడు ఈతని దౌడలు ప్రపంచసంహారము కావింపగలవు. అవి ఒకటినొకటి యంటకుండా చరించు చుండును. ఎప్పుడును నోరు తెరుచుకొనియుండును. దవడలతో నమలకయే నిశ్వాసవేగముననే సర్వమాతని కుక్షిని చేరును. వానర రూపుడైనందున శిరము చాల చిన్నది. కన్నులు లోతుగా గుంటలు పడియున్నవి. హనువుల కదలపకయే జల ఫలాదులను జిహ్వా పొడవుగా చాచి భక్షించును. ఆర్గురు దేవతలు ఈతనికి దూతలచే భోజన పాత్రములను అన్నాది పదార్థములచే నింపి పంపుచున్నారు. గంధర్వాది దేవతలు జోహారు లొనంగుచు బద్ధాంజలులై యున్నారు. హనుమంతుడు మిక్కిలి రహస్యమగు సీతాదేవి సందేశమును తెలిసికొనగోరి భూసంచారము చేసెను. ఆమె ఆత్మయే రావణు నిగ్రహింప భూమధ్యభాగమున గుప్తస్థానమున నివసించుచున్నదని గ్రహించెను. హనుమ సీతను దర్శించుట, వారల సంభాషణమును గ్రహించి రాముడు అంజనేయుని పిలిచి, కపిసత్తమా నా అంగుళీయకము నా నామాక్షరములతో గూడిన దాని నొసగుచున్నాను. సీతకు రహస్యముగా నొసగుము. ఈ కార్యమునకు నీవే ప్రధానుడవు. నీ బలమెల్ల నేనెరుగుదును. నీకు శుభమగుగాక అని అనెను. అంత హనుమంతుడా అంగుళీయకమును గ్రహించి శిరమునందుంచుకొని శ్రీరామ పాదములకు ప్రణమిల్లి "ప్రభూ, నా శరీరము అరంగుళములు. నా తోక పంద్రెండంగుళములు. నా బాహువులను చూడుము. సముద్రమును నేనెట్లు దాటగలను. దక్షిణ సాగరమునందు రాక్షసులున్నారు. వారినెట్లు వారింపగలను. అపుడు రాముడతనిని పిలిచి రహస్యముగా ఆదరమున అతని కుడిచెవిలో 'శ్రీరామ' అను మంత్రా (క్షరముల) నుపదేశించెను. అంత

హనుమంతుడాత్మవిక్రమము గలవాడై శ్రీరామప్రభూ, లంకానగరము నిచటికే కొనివత్తునా; లేక అందలి సైన్యమునెల్ల నాశనము కావింతునా; సముద్రము నరికట్టుదునా; ఆజ్ఞాపింపుమనెను. దానికి రాముడు సంతసించి 'హనుమా, నీ మాటలచే నీ తేజస్సుయొక్క మహత్వము వెల్లడియగుచున్నది. సీత ప్రాణములతో నున్నదో లేదో ఎఱిగిన గానీ ఎట్టి పరాక్రమమును జూపినను ప్రయోజనము లేదు. సీతను దర్శించుట వరకే నీకార్యము. ఆమెను దర్శించి కృతార్థుడవు గమ్మని సూచించెను. రాబోవు లంకా దహనాది కార్యములలో సీతానుగ్రహముతో అగ్నిని అంజనేయునకు ప్రసన్నుని కావించుటకై రాముడట్లు చేసెను.[99]

రామచరితమానస్ ప్రకారము: అంగదుడు తన పినతండ్రిని చూచి 'హనుమంతునకు సప్తసాగరాలూ, సప్తపర్వతాలూ తెలుసు. ఇతడు సరసుడు, బుద్ధిమంతుడు; సీతను వెదకుటకు పోవలసిన వానర, సైన్యమును సంఘటితపరచు బాధ్యత హనుమంతునకు అప్పగించుము.' అని తెలుపగా సుగ్రీవుడట్లే హనుమంతునాదేశించెను. హనుమంతుడు రోహితాద్రి, వ్యాహారగిరి,అంజనాద్రి, నీలాద్రి, హిమాద్రి, వింధ్యాద్రి. అర్జునాద్రి, రుద్రగిరి మేరుగిరి, ధవళగిరి మొదలైన గిరులలో, కదళీవనములో, బదరికాశ్రమములో గల వానరవీరుల నందరిని సమావేశపరిచెను. అంగదుడూ, హనుమంతుడూ శ్రీరామునకూ సుగ్రీవునకూ పాదాభివందనముల జేసి కదలిపోయిరి.[100]

## 2. కడలిని చేరువరకు కపులు పడిన కష్టములు:

ఈ విషయములు శ్రీమద్రామాయణమే విపులముగావించినది. ఇతర గ్రంథములలో సంక్షేపముగా మాత్రమే కలవు. సుగ్రీవుని సూచనల ప్రకారము హనుమదాదులు సీతకై వింధ్య పర్వత ప్రాంతములలో వెదకిరి. అవుడు మార్గశిర మాసమారంభమై యుండెను. కండువ మహర్షి ఆశ్రమ ప్రాంతములో భీకరాకారుడగు రాక్షసుడొకడు వానరులను మ్రింగవచ్చెను. వానిని అంగదుడు చంపెను. అంతలో వారి కొక బిలము కానరాగా, ప్రవేశించుట కశక్యముగా నున్నదానిని చూచి కపులు భీతిచెందుచుండగా అంజనేయుడప్పుడు వారికి కర్తవ్యము తెలిపెను. "ఇప్పటికి ఎన్నో దుర్గమ ప్రదేశములలో మనము సీతకై వెదకియున్నాము. ఇంతవరకూ మనకామె జాడ తెలియలేదు. మన

కెంతో బడలికయైనది. ఆకలి దప్పులధికమైనవి. ఈ బిలము నుండి నీటితో తడిసిన చక్రవాకములు, హంసలు, బెగ్గురు పక్షులు బయటకు వచ్చుచున్నవి. ఈ గుహలో బావియో మరి తటాకమో ఉన్నది. బిలద్వారమున పచ్చని చెట్లున్నవి. కావున మనమిందులో ప్రవేశించి వెదకుదము" అని తెలిపెను. అపుడు వారు కాంతి గూడ ప్రవేశింప వీలులేని గాఢాంధకారమయమైన ఆ బిలమున ప్రవేశించిరి. అట్లు బహుదూరము పోగా డస్సియున్నవారికి వెలుతురు కనిపించెను. అట్లు పోగా, వారికొక రమణీయమైన వనమును, అందు బంగారు భవనమును కనిపించెను. ఆ భవనములో తపోదీక్షలో నున్న ఒక తాపసి వారికి కనబడెను. ఆమెను చేరుటకు భయపడిన కపులు దూరముననే ఉండిరి.

ఈమారుకూడ అంజనేయుడు బాధ్యత తానే పూని ఆ వృద్ధురాలిని సమీపించి ఆమెకు నమస్కరించి "ఓ వృద్ధురాలా, ఈ బంగారు బిలమూ, మణిమండప సౌధములూ ఎవరివి? నీవెవరవు? మేము మార్గాయాసమొంది ఆకలిదప్పులచే పీడింపబడి, జలాదులుండునని తలంచి ముందువెనుక లాలోచింపక ఈ బిలములో ప్రవేశించినాము. దీనిని చూచి ఆశ్చర్యముతో దిక్కు తెలియక దుఃఖించుచున్నాము. ఇచట శుచికర భోజ్య పదార్థములు, బంగారు చెట్లు, ఫలావళులు, రజితగృహములు, బంగరు కిటికీలు విమానములు, బంగరు కమలములు, కచ్ఛపమీనములు గల కొలనులున్నవి. ఇవి నీ ప్రభావ నిర్మితములా? పూర్వము మరి యెవరి తపమువలన నైనా ఇది యేర్పడినదా! ఇది మాకు తెలియదు కావున సవిస్తరముగా తెలుపవలసినది" అని ఆ తాపసిని ప్రార్థించెను.

ఆ తాపసియే స్వయంప్రభ. ఆమె తన వృత్తాంతమునూ మయునిచే నిర్మింపబడిన అచటి భవన విశేషములను బిలమందలి వైచిత్రిని తెలిపి తన అతిథ్యముతో వారి ఆకలి దప్పుల తీర్చి వారా బిలమందేల ప్రవేశించిరో తెలుపమని కోరెను. అంత హనుమంతుడామెకు సీతారాముల కథను తెలిపి సీతాన్వేషణలో తామా బిలమున ప్రవేశించినట్లు వివరించెను. అచటి ఫలముల తినుటకనుమతించిన ఉపకారమునకు ప్రత్యుపకారమేమి చేయవలయునో అని పావని ప్రశ్నించెను. తనకేలాటి ప్రత్యుపకార మక్కర లేదని స్వయంప్రభ చెప్పెను. అంత ఆంజనేయుడు "తల్లీ, నీకు ఋణపడి యున్నాము. ఇపుడు నీవే మాకు దిక్కు. సుగ్రీవుడొసగిన వ్యవధి దాటినది. మేమిక్కడనే చిక్కు

కొనిన సుగ్రీవుడు విధించు శిక్షకు పాత్రులము కాక తప్పదు. మమ్మెట్లైన ఈ బిలమునుండి బయటకు చేర్పుము" అని ప్రార్థించెను. ఆమె తన తపో మహిమచే వారిని వింధ్య పర్వతస్థ పశ్చిమ సాగరతీర ప్రాంతానికి చేర్చి వారి సెలవు పొంది వెడలిపోయెను. అచటి మామిడిచెట్లు పుష్పించి యుండుట వారు గమనించి శిశిర ఋతువు వచ్చినట్లుగా గుర్తించి కాలాతిక్రమణమైనందున సుగ్రీవుని దండనకు గురి కాక తప్పదని భయపడసాగిరి. వారి పరిస్థితిని గమనించి అంగదుడు తమకు ప్రాయోపవేశమే కర్తవ్యమని పలుకగా, వానరు లందరు తమ కర్తవ్యమును చర్చించిరి. అపుడు తారుడు అంగదుని సమర్థించు తామెల్లరు మరల స్వయంప్రభ తపము చేయు బిలములో ప్రవేశించినచో సుగ్రీవుని దండన భీతి లేక జీవింప వచ్చునని చెప్పెను. వానరులా మాటల కామోదము తెలిపిరి. కాని అంజనేయుడు మాత్రము వారి నిర్ణయము దోష యుక్తమైనదని పలికెను. అయిననూ అంగదుడాతని పలుకులను నిరాదరించి తన పినతండ్రి దుర్గుణము వివరించి ప్రాయోపవేశ నిర్ణయమును పునరుద్ఘాటించెను. అంగదునితో వాదమును పెంచక మౌనముగా నుండి, తర్వాత అంగదుడు సుగ్రీవునకు ప్రతిద్వంద్విగా వానర రాజ్యము నెట్లు స్థాపించినను అది వారిని రక్షింపజాలదనిన్నీ, జాంబవంతునితోపాటు తనవంటి వానర ప్రముఖులు సుగ్రీవుని వదలి రాజాలమనిన్నీ, వానరులు చపలచిత్తులగుట వలన కళత్రపుత్రాదుల వియోగము నోర్చి జీవింపజాలరని వారి ప్రయత్నము నెరవేరుట దుర్లభమని స్పష్టపరిచెను. కాని అంగదునే అనుసరించు వానరులు ప్రాయోపవేశమునకే సిద్ధపడిరి.

వింధ్య పర్వత ప్రాంత గుహవద్ద వానరులు దర్భలు పరచుకొని ప్రాయోపవేశ మొనర్చుటకై అంగదుననుసరించగా అంజనేయుడు మౌనముగా నుండెను. ఆ గుహ సమీపములోనున్న సంపాతి అను గృధ్రరాజు వారిని చూచి ఆహారార్థమై వారిని చంపుటకు వచ్చెను. వానరుల ప్రసంగములో సీతారాములకథ, జటాయువధ వినిన సంపాతి తనకు నిశాకరమహర్షి యిచ్చిన శాపమును తెలిపి తానెప్పుడు సీతారాముల వృత్తాంతము వినునో అప్పుడు తనకు రెక్కలు వచ్చునని మునివాక్యము తెలిపుచుండగానే అతనికి రెక్కలు వచ్చెను.

సంపాతికి రెక్కలు వచ్చుట తమకు శుభసూచకముగా భావించి అతని ఆశీస్సులపొంది వానరులు దక్షిణ సముద్రతీరము చేరిరి. సంపాతి వచనము

ప్రకారము లంకలో సీతనన్వేషించుటకు సముద్రమును తరింపవలసి యున్నందున వానరవీరులు తమతమ లంఘన సామర్థ్యము నుగ్గడింపసాగిరి. లంకకుగల నూరుయోజనముల దూరముగల సముద్రమును దాటుటకు జాంబవంతుడు తనకు తొంబది యోజనముల వరకు వెళ్లగల శక్తి మాత్రం కలదనెను. అంగదుడు తనకు నూరు యోజనముల నెగురగల శక్తి యున్నను తిరిగి వచ్చుటకు శక్తి చాలదనెను. అంత వానరులు మరల తమకు ప్రాయోపవేశమే శరణ్యమని తలంచగా జాంబవంతుడు "మన బృందమునకు అంగదుడు నాయకుడు. ఇతడు యువరాజు. సేవకులుండగా రాజు స్వయంగా కార్యభారం పూనరాదు. వారిమాట కర్తవ్యంగా"దని పలికెను. ఆ తర్వాత ఏకాంత ప్రదేశమున మౌనముగానున్న అంజనేయునిచేరి సాగరలంఘనమునకై సామీరిని ప్రోత్సాహపరచుటకై ఇట్లు పలికెను. "వానరవీరా! నీవు సర్వశాస్త్ర విదుడవు. మేము ఏవేవో ఆలోచనల చేయుచుండగా నీవేల మౌనము పూనితివి? బల పరాక్రమములలో రామలక్ష్మణ సుగ్రీవులకు సమానమైనవాడివి. పక్షీంద్రునితో తుల్యమైన జవసత్త్వములుగల నీవు లోకమునందలి వారికన్నా ధీ బల పరాక్రమ ధైర్యాదులలో మిన్నవైకూడ నీ శక్తినే నీవు ఎఱుగవా! నీవు కారణజన్ముడివి. పుంజికస్థల అను అప్సరస అంజనగా జన్మించి కేసరి పత్నియై వాయుదేవతా ప్రసాదమున నిన్ను పొందినది. పసిబాలునిగా నున్నప్పుడే నీవు ప్రభాకరబింబమును పండని పట్టబోయిన వీరునివి. బ్రహ్మాది దేవతల వరముల పొందినవాడవు. ఆపదలోనున్న మమ్ము కాపాడవలసిన బాధ్యత నీదే" అనియు, మరియు

ఈవన సర్వసద్గుణ సమేతుడవో ప్లవగాగ్రణీ ధరన్
లావున దూరలంఘనకళా విభవంబున నీవ మేటివిన్
నీవలె నేగ నేదియును నేరదు భూతచయంబులందు నే
డీవెస నీ విజృంభణము నేపును జూపగదయ్య మారుతీ

అని ప్రేరేపించగా జాగరితుడైన హనుమంతుడు తన మేనుపెంచి తన బల పరాక్రమాది శక్తులదెల్పి విజృంభింపబూనెను. అపుడాంజనేయుని ముఖము ఎఱ్ఱగాకాలిన పెనమో, ధూమవిరహితమగునగ్నియో అనునట్లుగా నుండెను. అది చూచిన వానరులతనిని పొగడిరి. పర్వతగుహలో సింహము విజృంభించు విధముగా తోకను జాడించుచు పెరుగసాగిన అతని రూపమునకు వానరులా

శ్చర్యమొందిరి. వానరబృందస్తోత్రమునకు పులకరించిన శరీరముగలహను మంతుడు అచట తనకన్న పెద్దవారగు వానరవీరులకు నమస్కరించి తన శక్తి సామర్థ్యములనిట్లు వివరించెను.

వానరవీరులారా వినుడు. నా తండ్రి వాయుదేవుడు, అగ్నిసఖుడు. పర్వతశిఖరముల పెల్లగించగల బలాఢ్యుడు. నేనాతనికి దీటైనవాడిని దాటుటలో నాకు సమానుడెందునూలేడు. నేను కొంచెమైన విశ్రమించక మేరు పర్వతానికివేయిమార్లు ప్రదక్షిణమొనరించగలను. హ్రదకాంతార గిరియుక్తమౌ లోకాలపై సముద్రములోని నీళ్లనుచల్లి కప్పివేయగలను. నా గమనవేగము వలన పుట్టిన గాలికి సముద్రములోని మహాగ్రాహములనాకాశమున కెగురునట్లు కావింపగలను. ఆకాశసంచారియైన గరుత్మంతునికి ప్రదక్షిణ మొనరింతునా! ఉదయభానునిచేరి ఆయన అస్త్రాద్రి చేరులోగా నేనే అతనికన్నా ముందే ఆ గిరినిచేరి అతడు ఆకాశమధ్యానికి చేరులోగా ఎదురు రాగలను. ఆకాశ గోచరమగు భూతములనెల్లను వేగములో మీరగలను. సముద్రం శోషింప జేయుదునా! కొండను చేతితో పిండిచేయనా! నా ఊరువుల వేగానికి నీరధియే నా వెంట వచ్చునట్లు చేయనా! నన్నేమని భావించినారో! నేను ఆకాశానికి ఎగిరినచో లతావృక్షాదులలోని పుష్పాలన్నీ నా వెంట కొట్టుకొని రాగలవు. అపుడది స్వాతీనక్షత్ర సహితమగు ఆకాశంవలె నొప్పును. నా వేగము మీరు కూడ చూడగలరు. మేఘాలు చెల్లాచెదరై గిరులు చలించుచు, సముద్రాలు క్షోభించుచుండును. నిముషాంతరంలో నేను ఆకాశంలో నిరాలంబంగా ఎగుర గలను. త్రివిక్రమావతారుడగు విష్ణువవలె నా ఆకారము భయంకరమై యుండును. సీతాదేవి కనరాలేదను చింత మానుడు. నేను నా బుద్ధిబలంతో చూచి వచ్చెదను. నేనధిక వేగంతో వేయి యోజనాలైనా దాట గలను. ఇంద్రబ్రహ్మాదుల గెలిచి అమృతభాండమునైనా తేగలను. లంకనే నేను పెల్లగించుకొని రాగలను." అని చెప్పు హనుమంతుని మాటలలాలకించు వానరులాశ్చర్యపడుచుండగా. జాంబవంతుడు మరల హనుమంతునితో నిట్లనెను. "అంజనేయా, వానరుల దుఃఖమును పోగొట్టుచున్నావు. నీవు ప్రయత్నించు కార్యం నెరవేరాలని వీరు శుభముల పలుకుచున్నారు. ఋషుల, కపివృద్ధుల, గురువుల అనుగ్రహముతో నీవీ సాగరమును తరింపుము. నీవు తిరిగి వచ్చు వరకు మేము ఏకపాదమున నిల్చి యుండెదము. కాన ఈ

వానరులందరి ప్రాణాలు నీ చేతిలో నున్నవి." అని ప్రోత్సహించు జాంబవంతుని వాక్యాలాలకించి తానెగురుటకు పూనబోవుచు వానరులను చూచెను.

"వానరులారా, నేను పైకెగురుచో ఈ భూమి నా వేగమును భరింపజాలదు. ఈ మహేంద్రగిరి గొప్ప రాళ్లతో నిండి స్థిరమైన శిఖరముల కలిగియున్నది. ఇది నా వేగము సహింపగలదు." అని చెప్పి ఆంజనేయుడు దానిని అధిరోహించెను. అపుడాతని పాదతాడనముచే నలిగిన ఆ పర్వతశిఖరములు సింహముచే కొట్టబడిన మదగజముల వలె నుండెను. దాని శిలోచ్చయములు జలముల స్రవించెను. అందలి మృగపక్షి జంతు సంతానములు భయముతో పారిపోసాగెను. మధుపానాసక్తులగు నాగ, గంధర్వ, విద్యాధర మిధునములు ఆకాశమున కెగిరిరి. పక్షులు ఒకటితో నొకటి ఢీకొట్టుకొనుచుండగా, గిరి రంధ్రములలో నుండి సర్పములు సగము బయటకు వచ్చి పడగలు విరిచి నిట్టూర్పులు పుచ్చుచుండుటచే అవి ఆ కొండకు కట్టిన ధ్వజములవలె నుండెను. అప్పుడే లంకాపురమును తాను మానసికముగా చేరినట్లుగా భావించుచు హనుమంతుడు సముద్రమును లంఘించుటకుద్యుక్తుడయ్యెను.[101]

భాస్కరరామాయణము ప్రకారం: మూలములో నున్నట్లే ఇందున్నను ఆంజనేయుడధిక ఆత్మవిశ్వాసముతో పలికిన పలుకులు విశేషము.

అరుదారం బదివేల యోజనములుద్యచ్ఛక్తిమై దాటెదన్
ధరణీ పుష్కర చక్రముం దిరిగెదన్ దంభోళి వీర్యత్వరం
గర యుగ్మంబున ఋష్యమూకమును లంకాద్వీపముం బట్టి స
త్వరభంగిం గొనివచ్చి యిచ్చటనే సీతారాములం గూర్చెదన్.[102]

శ్రీమద్రామాయణ కల్పవృక్షమున ఈ సన్నివేశమున జాంబవంతుని పలుకులింకను రమణీయముగా నున్నవి.

బలముచే బుద్ధిచేత సత్త్వంబు చేత నధిక
తేజస్సు చేత నీ యంత వాడు
వెలగు త్రైకాలికంబైన సృష్టియందు
గాన రాడయ్యె మేలుకో కపిమహేశ.

.... .... .... .... .... ....

.... .... .... .... .... ....

ఉదయత్సూర్యుని దొట్టి యస్తమయ సూర్యుండైన దాఁకన్ సదుల్
చదువన్ దోఁజన మిన్ను నందెవనికో సాధ్యమ్ము దానట్టి నీ
కిది యేపాటిది గోఁటిమీది పని మమ్మో యల్ప వారాశియం
దదయత్వంబున ముంపకే సకలవిద్యాభారతీ మారుతీ[103]

సమీరకుమారవిజయమున: సంక్షేపముగా నున్నను సారవంతముగా నున్నది. వానరసైన్యము తిరిగితిరిగి సాగరతీరము చేరిన తర్వాత కపులు కడలిని దాటలేక అడలి తమతమ అలవుల లెక్కించుకొనుచో జాంబవంతుడు హనుమంతుని చేరి "ఘనసత్త్వ సత్వర క్రమ నిరూఢి మొదలగు గుణములలో సముద్రుని వంటి దానివైన నిన్ను ఈతడు ప్రతిఘటించుచున్నాడు. వీనిని భంగమొందించి నీకీర్తిని విస్తరింపుము" అని కోరెను. అందుకాంజనేయు డంగీకరించి—

"................... కపులార దుస్తరమైన తో
యనిధిం దాటెద లంక మీటెదఁ దృణప్రాయంబుగా జానకిం
గని వే వచ్చెదఁగానకున్న జలధుల్ గాలింతు భూలోక మె
ల్లను దూలింతు నుడుప్రకాండమిల ద్రావలన్ వంతు నాకాశమున్"

—అని పలికి వెంటనే బాహాస్ఫాలనమాచరించి, నిజరూపాన్ని పెంచి, తోకను మస్తకాగ్రమున హత్తించి, తేజస్సుతో మెరిసి వార్ధిని జూచుచు గరుడ వాయు వేగములతో మించి రాముని ధ్యానించి ఎగురుటకై సమీపగిరి నెక్కెను. ఆ శిఖరాగ్రభూమిని త్రొక్కిపట్టి రెండు చేతులను దక్షిణపు దిశగా సారించి అతడు చివుక్కున దాటగా, తన కూతురును చూడగా వాంఛించిన భూదేవి అనుసరించెనో అనునట్లు భూ పరాగం వెంట నంటెను. అపుడు పర్వతాలెన్నో భగ్నమయ్యెను. అవనిజ నన్వేషింపబోవు నాంజనేయున కాహారముగా దగు ఫలముల నందించవలె నను తలంపుతో కొన్ని చెట్లు లేచి దశాస్యుని భయము వలన ముందుకు పోజాలక అతని గమనానిల ప్రభావమునకు క్రింద పడినవి. హనుమద్వీరుని సింహగర్జనలకు అచటి గిరులు "సురలార, సీత జాడ తెలుసు కోడానికీ, రావణుని గర్వం అణచడానికీ హనుమంతుడు వెళ్లుచున్నాడు కావున ఇక మీరు భయముల నొందకండి అని" అనునట్లుగా ప్రతిధ్వనించినవి.[104]

'రామచరితమానస్'లో: "నీవు శ్రీరామ కార్యసాధనకే జన్మించితివని" జాంబవంతుడనగానే హనుమంతుడు కొండంతవాడై సముద్రం లంఘించడానికి త్వరపడెను.

## 3. సమీరకుమారుని సాగరలంఘనము:

వాల్మీకి మహర్షి యీ ఘట్టమును విశదమనోహర భంగిని విపులముగా వర్ణించి యున్నాడు. ధరాత్మజాతపదమును వెదకుటకై గురుచరణ మార్గమున పోదలంచిన హనుమంతుడు తాను పోవలసిన మార్గాన్ని మెడ నిక్కించి చూచెను. తన కార్యమందలి పరమోత్కృష్టత నూహించుచు ఆ పర్వతమందలి పచ్చికపట్టులలో నిటునటు పచరించసాగెను. పక్షులనదలించుచు మృగపక్షి సంతతుల బెదరించుచు తిరిగెను. అపుడతని కర, పాద, తాడనల వలన చెట్లు నేలకొరిగెను. వివిధ వర్ణ ధాతుకోటితో నతిశయించు నానావిధ అలంకారయుతులగు యక్ష కిన్నర సుపర్వనిభ, అహి, నిర్ఝరీవిసరములతో హృదయంగమమగు నా కొండపై మడువులోని ఏనుగుల మధ్య విచ్చలవిడి సంచరించు గజరాజువలె తిరిగెను. తన కార్యసాఫల్యమునకై సూర్యునకు, ఇంద్రునకు, వాయువునకు, బ్రహ్మాది దేవతలకు నమస్కరించెను. మరల తూర్పువైపు తిరిగి సముద్రాన్ని దాటుటకై తన శరీరాన్ని పెంచడానికి ప్రారంభించెను. మేను పెంచి కాళ్లతోను చేతులతోను ఆ కొండ నూగించెను. దానివలన అందలి చెట్లు పూలను జలజల రాల్చగా అది పూల పర్వతమా అనునట్లుండెను. మావటివానిచే కొట్టబడిన మదగజము మదజలమును విడిచినట్లు ఆ కొండ నీటి వంకలను ప్రవహించెను. అతని తాకిడికి సువర్ణరజతాది లోహములు గల రాళ్ల రేఖలను కనబరచెను. అగ్నిజ్వాలలనుండి పొగలు వెల్వడునట్లు మణిశిలల నుండి గొప్పగొప్ప రాళ్లు వెల్వడెను. గిరి కంపించగా అందలి భూతతతి వికారధ్వనితో రోదించగా ఆ స్వరము భూమ్యాకాశాలు నిండెను. వాతాత్మజుని పీడనమునకు నలిగిన పర్వతమందలి సర్పములు నలిగి స్వస్తికాది చిహ్నములు గల తమ పడగల విప్పి ఆ కొండరాలను కోపించి కరువగా వాటి విషాగ్ని సెగల కవి వేయి ముక్కలయ్యెను. విషఘ్నములగు నగ్గిరి యోషధులా విషముల నణచలేకపోయెను. ఆ పర్వతము తత్సంబంధిత పృథివ్యప్తేజో వాయ్వాకాశంబులతో గూడ పగులునేమో నను భయముతో ఋషులు ఆకాశమును చేరిరి. భయార్తులై విద్యాధరులు తమ కాంతలు వెంటరాగా విలువైన తమ ఆహారపానీయములను పాత్రలతోను, తమ ఆయుధములను అక్కడనే వదలి ఒడలెరుంగక ఆకాశానికెగిరిరి. వారందరు అపుడు "అప్ర

మేయుడగు అంజనేయుడు రామార్థమై దుష్కరమగు సముద్రలంఘన కార్యము నకు పూనుకొనెను" అను మాటలు వినబడెను.

ఎగురుటకుద్యుక్తుడైన హనుమంతుడు తన వెంట్రుకలను విదిర్చెను. మేఘమువలె గొప్ప ధ్వనితో గర్జించెను. వెంట్రుకలతో నిండి గుండ్రముగా నుండు తన తోకను పక్షీంద్రుడు పాముల విదిల్చినట్లు విదిలించెను. ఆ తోక అతని వీపుపై గరుత్మంతుడు పట్టుకొన్న పామువలె మెరయసాగెను. ఇనుప గుదియల వంటి తన బాహువులను స్తంభింపజేసి, భుజములు, మెడ, ముడుచు కొని, మోకాళ్లు ముందరివైపు వంచి, పాదాలనొకటిగా చేర్చి ముడుచుకొని చెవుల ముక్కించి, పెదవులు బిగించి నడుము లోపలికి తీసుకొని, కంటిరెప్పలు పైకెత్తి దూరమునందు దృష్టి నిలిపి పర్వతమునందు కాళ్లు బిగదన్ని, శ్వాస బిగించి తన కార్యాన్ని తలంచి తనకున్న బలపరాక్రమము నంతయు పూని కుప్పించి యెగయ బూనినవాడై తనకు సమీపముగ నున్న వానర ప్రముఖులతో

చెచ్చెర వాయువేగమగు శ్రీ రఘురామ శరంబునట్లు నేఁ
జొచ్చెద లంక నందు నృపసుందరి గన్పడకున్న నాకముం
జొచ్చెద నిట్లె నందు సతి జూడమి గల్గినఁ గట్టి రావణుం
దెచ్చెద నెట్లులైన నృపుదేవిని దోడ్కొని వచ్చెదం జుఁడీ.

అని పౌరుషముగా పలికి సెలవొంది చివాలున ఎగసి పోసాగెను. (సుందర కాండము 1వ సర్గలో వాయుపుత్రుని వ్యోమయాన వర్ణనను చూడదగును.)

ఆకాశమున పోవు అంజనేయుడపుడు అద్భుత దర్శనుడయ్యెను. అప్పుడతని నీడ పరిమాణము పదియామడల వెడల్పును ముప్పది యామడల నిడివిని కలిగి సుందరముగా కనబడెను. ఆధారమేదియు లేక ఆకాశమున పోవు హనుమంతుడు రెక్కలున్న పర్వతమువలె కానవచ్చెను. హనుమంతుడు గమించు మార్గమందలి సముద్రము ఆ క్షణములో నడుమ పల్లమై ఈవల ఆవల ఎత్తుగా నుండు తొట్టివలె చూపట్టెను. రామకార్యార్థియై పోవు అతని సాహసమును జూచి దేవ గంధర్వాదులు పుష్పవర్షము కురిపించుచు స్తుతించిరి. అతనికి సూర్యుడు తన వేడిమిని చూపడయ్యె. వాయువు అతనికి అనుకూల ముగా వీచెను.

తనకు సగరుడొనర్చిన మేలును స్మరించి ఆ వంశీయుడగు రాముని కింకరునకు తోడ్పడుటకై సముద్రుడు తనలో నుండిన మైనాకుని సంబోధించి యిట్లు పలికెను. "సువర్ణ శిఖరములు కల ఓ మైనాకుడా, ఇక్ష్వాకు వంశస్థులు నాకు పూజ్యులు. నీకును అట్లేకదా. రామకార్యార్థమై పావని యిపుడు ఆకాశమున ఎగురుతూ పోవుచున్నాడు. ఇపుడతడు మనకు అతిథి. అతనిని సత్కరించుట మనవిధి. నీవు యథేచ్ఛగా ఎటు కావలసినచో అటు పోగలవానివి. నీవు పైకి లేచినచో నీ శిఖరాలలో విశ్రాంతికై హనుమంతుడు కొంతసేపు నిల్చి తర్వాత తన ప్రయాణము కొనసాగింప గలడు. కావున శీఘ్రముగా పైకి లేచి రమ్ము" అని పలుకగా మైనాకుడట్లే అని తన బంగారు శిఖరములతో పైకి లేవగా 'ఆకాశము మొత్తము బంగారు కాంతితో నిండెను. సూర్యకాంతి నిభమైన ఆ శిఖరములు తన కవరోధముగా లేచుచున్నవను భావముతో హనుమంతుడు హుంకరించి తన రొమ్ముతో ఢీకొట్టగా మైనాకుడు విలపించుచు శోషిల్లెను. ఆ దెబ్బకు కొంతదూరం కొట్టుకొనిపోయి, హనుమంతుని జవసత్త్వములకు సంతసించి మానవాకారము పూని హనుమంతు నుద్దేశించి "మహాత్మా, అనన్య సాధ్యమైన నీ సాహసమును నేనేమని పొగడగలను? నీ బలము, నీ వేగము అద్భుతము. నావంటి పర్వతాన్నే అవలీలగా త్రోచినావు. ఎవరికినీ చేయనలవికాని పనిని నీవు సాధింపనున్నావు. నీవు నా శిఖరములందు కొంతసేపు విశ్రమించి నీ అలసట తీర్చుకొనుము. సగరుని మేలును స్మరించిన సాగరుడు తద్వంశీయుడగు రామునికి మేలొనర్పదలచి నీవాతని భృత్యుడవైనందున నీకు తోడ్పడదలచి యున్నాడు. నీవు నా శిఖరములపై వ్రాలి, సేదదీరి, నాలోని కందమూలముల భక్షించి ఆతర్వాత నీప్రయాణము సాగించి నన్ను ధన్యత నొందింపుము. తాను పండితుడైనా, తన కడకతిథిగా వచ్చిన మూఢునైనా పూజింప వలెనని శాస్త్రవాక్యము అట్టిచో నీ వంటి ధర్మజ్ఞుడు దొరికినచో పూజింపకెట్లుండదగును? అదీగాక, నీవు దేవతలలో మేటి యగు వాయుదేవుని పుత్రుడవు. నిన్ను పూజించినచో నీ తండ్రిని పూజించిన వాడనగుదును. అంతేకాక, నిన్ను పూజించుటకింకొక కారణము గూడ కలదు. కృతయుగములో పర్వతములకు రెక్కలుండి అవి విచ్చలవిడిగా సంచరించుచుండెడివి. ఆకాశమున వెళ్లుచో దేవ ఋషి గణములు అవి తమపై పడునేమో అని భయపడుచుండగా ఇంద్రుడు వాటి రెక్కలను తన వజ్రముచే

ఖండించెను. ఆ దెబ్బ పొందకుండా నీ తండ్రియగు వాయువు నన్ను సముద్రమున పడవేసి నాకు రెక్కలు పోకుండునట్లు రక్షించెను. అందువలన సముద్రునితో పాటు సమీరుడు కూడ నాకు పూజార్హుడై యున్నాడు. కావున సముద్రునితో కలిసి అందించు మా ఆతిథ్యము నంగీకరించి మా మైత్రిని ధన్యమగునట్లు చేసి సేదదీరి వెళ్లుము" అని ప్రార్థించెను. అపుడు హనుమంతుడు "పర్వతోత్తమా, నీ ఆదరణ వాక్యముల వలననే నాకు ఆతిథ్యము లభించినట్లైనది. కార్యము పూర్తి అగువరకు నేను త్రోవలో నెచ్చటను నిలువనని ప్రతిన చేసి యున్నాను. చేయవలసిన పని యెంతో ఉన్నది. ప్రొద్దుండగానే నేను లంకకు చేరాలి. సముద్రమధ్యంబున నేను నిలువరాదు." అని పలికి తన చేతితో ఆప్యాయముగా మైనాకుని స్పృశించి అనుజ్ఞవేడెను. అంత సముద్రమైనాకులతనికి 'కార్యసిద్ధి యగుగాక' అని ఆశీర్వచన మిచ్చిరి. అంత హనుమంతుడు తన ప్రయాణము సాగించెను. రామకైంకర్య నిష్ఠా దీక్ష గల పావని ఆతిథ్య విశ్రాంతి రూప వాక్యములకు లొంగక, నిద్రాహార విశ్రాంతులెఱుగక కార్యసాధనకై గట్టి మనో నిర్ణయముతో సాగిపోవుటను చూచి ఋషులును, సిద్ధులును అతనిని మెచ్చుకొనిరి.

హనుమంతుని బలపరాక్రమముల తెలియగోరి నాగమాతయగు సురసను పిలిపించి దేవతలూ ఋషులూ ఇట్లామెతో పలికిరి. "సముద్రముపై ఒంటరిగా సాహసించి పోవు పావనికి దైత్యరూపమున అడ్డుపడవలసినది. ముహూర్త మాత్రమాలస్యము" అని అనినవారి ఆదేశానుసారం సురస పెద్దకోఱలతో, ఆకాశానికి సరివచ్చు నోటితో ఎఱ్ఱని కన్నులతో అతిభీకర వికార రూపము ధరించి హనుమంతుని దారికి అడ్డు పడెను. ఆమె హనుమంతుని చూచి 'వానరేంద్రా! నిలువుము. దేవతలు నిన్ను నాకాహారముగా కల్పించినారు. నన్ను మీరి నీవు పోజాలవు. నేను నిన్ను మ్రింగబోవుచున్నాను. నీవింక ముచ్చటలు మాని నానోట పడుము' అని చెప్పగానే హనుమంతుడు ఆమె నిజమైన దైత్యాంగన కాదని ఆత్మతో నిర్ణయించుకొని ఆమెకు నమస్కరించి సీతారాముల వృత్తాంతమూ తాను వెళ్లబోవు కార్యావసరము తెల్పి రామరాజ్యమందున్న ఆమె కూడ రామకార్యమునకు తోడ్పడుమని ప్రార్థించెను. సురస ఆమోదము రానందున 'తల్లీ, సీతజాడ తెలిసి వచ్చి నీకు ఆహారమయ్యెదను నన్ను నమ్ముము' అని పలుకగా, 'ఓరీ, నన్ను అతిక్రమించి పోవుట కెవ్వరికిని

సాధ్యముకాదు. నాకట్టి వరము దైవప్రసాదము. కావున నీవు నాకాహారము కమ్ము" అని నూరుయోజనములంత విశాలముగా పెంచిన తన నోరుతెరచెను. అంత మారుతి బొటనవ్రేలి యంత రూపము ధరించి ఆమె నోట ప్రవేశించి ఆమె నోరు మూయులోగా ఈవలకు వచ్చి, ఆకాశమున నిల్చి "అమ్మా, దాక్షాయణి నీకున్న వరమునకు తగినట్లు నీనోట పడినాను. నా నమస్కార ముల గ్రహించి నాపై కనికరించి సీతను వెదుకబోవు నా ప్రయత్నమునకు మేలు కలుగునట్లు నన్ను అనుగ్రహింపుము" అని పలికినంత సురస సంతో షించి తన భీకర రూపము వీడి నిజరూపము గ్రహించి 'నాయనా, రామకార్యా ర్థమై నీవు యథేచ్ఛగా వెళ్లుము. నీకన్నీ సుకరముగా నెరవేరగలవు" అని పలికి ఆమె వెళ్లిపోగానే దేవతలు హనుమంతుని యీ సమయోచిత ప్రజ్ఞకు సంతోషించి పొగడిరి. అంత నిరాధారమగు అంబరవీథిలో ఆంజనేయుడు తన సాగరలంఘనమును కొనసాగించెను.

ఆ సముద్రములో 'సింహిక' అను ఒక రాక్షసి పైనపోవు హనుమంతుని చూచి తన కిన్నాళ్లకు ఆహారము దొరికినదను సంతోషముతో నీటిలో పడిన హనుమంతుని ఛాయను పట్టి లాగెను. 'ఎదురుగాలికి గొప్ప ఓడ ఈడ్వబడి నట్లు ఈ పరాక్రమము నెవరో అడ్డగించుచున్నారు" అని ఆంజనేయుడు గ్రహించి పైకి, క్రిందికి, ప్రక్కలకు చూచెను. మహాకాయము గల సింహిక అతనికి కనపడెను. సుగ్రీవుడు తనను హెచ్చరించిన ఛాయాగ్రాహి అను అంగారక గ్రహముగా దానిని గుర్తించి దానిని నిర్జించు ఉపాయమాలోచింప సాగెను. దాని రూప తత్త్వముల నెఱుంగ గోరి ఆంజనేయుడు తన కాయము పెంచెను. ఈ సంగతి గమనించి ఆ రాక్షసికూడ తన నోటినీ, దేహాన్నీ పెంచసాగెను. అప్పుడు హనుమంతుడు దాని ఆయువుపట్లను గమనించెను. సూక్ష్మరూపము పూని నోటిద్వారా శరీరమున ప్రవేశించి దాని జీవస్థానము లను తన వాడియగు గోళ్లతో వ్రచ్చి అది తన నోరు మూసేలోగా వెల్వడి తన శరీరమును పెంచెను. లోన గుండెలు నలియగా అది స్మృతి తప్పి నీటిలో పడి చనిపోయెను. ఆకాశసంచారులగు దేవతాదులు ఆంజనేయుని యీ సాహసమును మెచ్చి పొగడి మంగళాశాసనమొనర్చిరి.

అవలి తీరమునకు చేరువ యగుచో నూరు ఆమడల దూరమున అతనికి అడవుల గుంపు కనబడెను. లంకాద్వీపమందలి మలయ పర్వత వనరాశి

ఆకాశము నుండియే ద్యోతకమయ్యెను. నదులు సాగరమును చేరుట కనిపించెను. దిగబోవుచు మారుతి తన దేహము ఆకాశమావరించి పెరిగి యుండుటను గమనించెను. అట్టి తన రూపమును వేగమును రాక్షసులు చూచి హాహాకారములు చేసినచో కార్యభంగమగునని తలచి విశ్వరూపాన్ని విరమించిన వామనుని వలె తన దేహాన్ని తటాలున చిన్నదిగా చేసెను. శిఖరములతో, మొగలి పొదలతో, నారికేళ వృక్షములతో గూడియున్న లంకాద్వీపాన్ని చూచి త్రికూట పర్వత శిఖరస్థమగు ప్రాంతముపై వ్రాలెను. అతడు దిగు చుండగా జింకలు పక్షులు భయపడినవి. ఆ పర్వత శిఖరముపై నుండి అమరావతీ పట్టణమును పోలిన ఆ లంకను హనుమంతుడు చూచెను.

ఇట్టులు నూరామడ యొక
పెట్ట వడిందాటి బాహు విక్రమపరుడై
నిట్టూర్పైనను విడువడు
కొట్టబడడు గాసిఁ గీశకుంజరుడంతన్.[105]

పరాశర సంహితలోను పురాణములలోను హనుమంతుని సాగర లంఘనమే వర్ణితము కాలేదు. ఆనందరామాయణమున వాల్మీకి కవి రచనలో లేని విశేషమొక్కటి కలదు. ఆతిథ్యము స్వీకరింపవలసినదిగా మైనాకుడాహ్వా నించినపుడు "స్వామికార్యము నెరవేర్చుదనుక నేను భోజనముగానీ విశ్రాంతిగానీ తీసుకొననని హనుమంతుడు తెల్పినట్లున్నది.[106]

శ్రీమద్రామాయణ కల్పవృక్షము ప్రకారము: కథలో వాల్మీక కథాను సారియే యైనను సురస మారుతికి విఘ్నమొనరించుటకు కారణమును శ్రీ విశ్వ నాథ సత్యనారాయణగారు సెలవిచ్చినారు. "హనుమంతుడు లంకలో జొచ్చుచో నది వేళాదుష్టమైనదని తెలిసికొనిన దేవతలు ముహూర్తంబు తామా లస్యంబు ఘటింపనెంచి నాగమాత సురసను నియమించిరి.[107]

వాల్మీకి భగవానుని సుందరకాండములోని హనుమంతుని కథలో వేదాంతపరమైన ఎన్నో అర్థములను నిగూఢ విషయములను, సాంకేతిక అంశములను గూర్చి ఎన్నియో గ్రంథములు పలువురు ప్రముఖులు వ్రాసి యున్నారు. శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యులుగారి "సుందరకాండము– తత్త్వదీపిక" శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి "సుందరకాండం ఎందుకు

సుందరము" ఇత్యాది గ్రంథములలో ఆయా విషయములు విపులీకరించి యున్నారు కావున వానిని నేనుట్టంకించుటకు పూననైతిని. హనుమంతుడు 'గురుచరణ' మార్గమున పోయెనని తెలుపుటలో! "కుండలినీ శక్తికి చరణం అను పర్యాయపదమున్నందున ఆ పదమువేత అంతటా సంచరించు మార్గము (సుషుమ్నామార్గ) మని అర్థము. వాచ్యార్థము ఆకాశమని శ్రీ జి. శేషేంద్రశర్మ గారి అభిప్రాయము. అట్లే హనుమంతుడు సముద్రముపై ఎగురబోవుచో వాయువునకు ఒకమారుకాక రెండవసారి కూడ నమస్కరించుటకు హేతువు ఏమనగా, ఇంద్రియపాలకుల స్తుతించుట ఉపనిషత్ ప్రార్థనలో ముఖ్యము తర్వాత శాంతిపాఠములో

నమస్తే వాయోత్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి
త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి"

అనిచెప్పుటయే.[107]

సమీరకుమార విజయములోని కథ వాల్మీకి ననుసరించి యుండి క్రొత్త అంశమేదియు తెలుపుట లేదు.

రామచరితమానస్‌లో తులసిదాసుగారు వాల్మీకి చెప్పినదే చెప్పినను హనుమంతుడు రామబాణమువలె సముద్రముపై వెళ్లెనని వాల్మీకివలెనే చెప్పి, రామబాణపు గుణముల వివరించెను. అది అపజయము లేనిది, అడ్డులేనిది, వాయువేగము కలది అని తెలిపెను.

హనుమంతుడు సముద్రముపై నాకాశమార్గమున నూరు యోజనముల దాటెను. నేటి కొలతల ప్రకారం ఇది యెంత దూరమో చర్చించుచు శ్రీ వావిలి కొలను సుబ్బారావుగారు తమ 'మందరమున' ఇట్లు అభిప్రాయము నుగ్గడించి యున్నారు. "ఇప్పుడు సింహళ ద్వీపమునకు మన దేశమునకు నడుమ సముద్రము వెడల్పు అరువది మైళ్లే యున్నది. నూరు యోజనము లెక్కడ? అరువది మైళ్లెక్కడ? అని సందేహము కలుగవచ్చును. యోజనము కొలత నిష్కర్ష లేనిదై యున్నది. కొందరు ఆరుమైళ్లు, కొందరు ఎనిమిది మైళ్లు, కొందరు రెండున్నరమైళ్లు కొలతలు చెప్పుచున్నారు. ఇట్లే క్రోసు, క్రోశం అనునవి కూడ నేడు మైలు అనగా వేయిన్ని యేడువందల అరువది గజములు. ఈ పరిమాణము నాడు లేదు. కనుక యోజనమున కిన్ని మైళ్లని నిర్ధారింప

వీలులేదు. ఇప్పుడు సముద్రము మీది దూరము అరువది మైళ్లే యున్నను రామాయణకాలమున సముద్రము ఇంత మాత్రమే కాదు. ఇప్పటి మధురకు కొంచెము దూరములోనే నాడు సముద్రముండినది. సముద్రభాగము విశేషముగా పూడి యిప్పుడు నేల యైనదని శాస్త్రవేత్తలు వ్రాసియున్నారు. ఇప్పటి రామనాథపురమునకు దక్షిణభాగమంతయు పూర్వం సముద్రముగానే యుండెను. కావుననే సుగ్రీవుడు వానరబృందమును పంపుచో "పాండ్య కవాటావనిం బరికింపుడీ అని చెప్పి వెంటనె 'వననిధి తీరముంగదిసి" అని చెప్పెనుకానీ అడవులని కాని, కొండలని కాని చెప్పినవాడు కాడు. మరియొక విశేషము. ఇప్పటి మలయాళ దేశమగు తిరువాన్కూరు సముద్రములో మునిగి యుండెననియు పరశురాముడు కోరగా సముద్రుడా ప్రదేశమునాయన కిచ్చెననియు పురాణములలో కలదు. రామాయణములో చెప్పబడిన త్రికూటము, లంబ పర్వతము, సువేల అనునవి లంకకు దక్షిణ భాగంబున నున్నవి కాని ఉత్తర భాగంబున లేవు. కావున ఇప్పటి లంక యందలి ఉత్తర భాగములు కూడ సముద్రమున మునిగియుండవలెను. ఈ పర్వతము చుట్టూ సముద్రము చెప్పబడెనేకానీ, నేల, గ్రామము లున్నట్లు వాల్మీకి చెప్పలేదు. సువేల అను పదమే సముద్రతీర దేశమని తెలుపుచున్నది. లంకయందలి యిప్పటి ఉత్తరపు రేవునకు త్రికూటమునకు నూరుమైళ్లు పైగా నున్నది. కావున హనుమంతుడు దాటినది రెండు వందల యేబది మైళ్లని యేర్పడుచున్నది. (109 యోజనములనగా 250 మైళ్లు)[108]

అధ్యాయము – 5

# 1. లంకలో హనుమంతుని సాహసకార్యాలు – నగర ప్రవేశము:

శ్రీమద్రామాయణ సుందరకాండములో నున్నంత విస్తృతంగా పరాశర సంహితాదులలో నివి వర్ణింపబడలేదు. సమీరకుమార విజయకర్త కూడ క్రొత్త విషయమేమియు తెలుపలేదు. మహర్షి రమణీయముగా నొనర్చిన వర్ణనలతో నిమిత్తము లేకుండా హనుమంతుని చరిత్రకు సంబంధించిన అంశములను తెలిసికొనుటయే కర్తవ్యము. హనుమంతుడు తీరమున దిగి కొండలు, రాళ్లు, వనసీమలద్వారా వెళ్లి సుగంధ యుక్తమగు లంకానగరో ద్యానములను చూచెను. లంబ పర్వతమెక్కి త్రికూటాద్రిపై నున్న లంకా నగరాన్ని చూచెను. దానికి సముద్రము పెట్టని అగడ్త. సైన్యములచే ప్రాకారములు రక్షింపబడు చుండెను. ఆ సంగతి గుర్తించిన మారుతి మన సులో ఆలోచనలెన్నో కలిగెను. "భవిష్యత్ కర్తవ్యము. ప్రకారం వానర సేన ఎట్లీ సాగరం దాటి రాగలదో? వచ్చినను వారికి ప్రయాసయేకాని ప్రయోజనముండదు. లంకను, రామునీ తలంచినచో రామునికి కూడా ఇది సులభసాధ్యము కాదేమో ననిపించును. అతిక్రూరులగు రాక్షసులయెడ సామ మార్గము పనికిరాదు. ఐశ్వర్య శోభితులైన వీరియెడ దానమార్గముపయోగ కారి కాదు. బలిష్ఠులగు వీరియెడ భేదోపాయము పనిచేయదు. యుద్ధమొనర్చి నను వీరిని గెలుతుమను నమ్మకములేదు. నీలుడు, అంగదుడు, సుగ్రీవుడు మాత్రమే ఇక్కడికి రాగలరు. మా నలుగురితో సాధ్యమగునదేమియును లేదు" ఇట్లాలోచన పూర్తికాగానే ఆ భావనలో నేదో దోషమున్నట్లుగా హనుమ కనిపించెను. "సీతాదేవి జీవించి యున్నదో లేదో తెలిసి ఆమె జాడ తెలిసిన తర్వాతకదా లంకను సాధించు ఉపాయమాలోచించుట. దీనికి ముందే ప్రమా దముల నూహించుకొనుట తగదు." అని తనకు తానే మరల సమాధాన మూహించెను. "నగరులోనికి ప్రవేశించుట నా ప్రథమ కర్తవ్యము. అదెట్లొ నర్చవలెనో? నేనేవిధంగా చేసినా, అది రామకార్యము నెరవేర్చునదిగా

ఉండాలి. ఈనా నిజరూపంతో వెళ్లినచో వారు నన్ను పోనీయరు. దైత్యులను వంచించి లోనికిపోయి సమయోచితమగు వేషములలో రాత్రివేళలలో మాత్రమే నేను నాకార్యాన్ని చక్కబరచుకొనవలెను." అని హనుమంతుడు తలంచెను. పలుమార్లా నగరాన్నిచూచి నిట్టూర్పు విడచెను. కార్యసాధనను గూర్చి తత్సాధనాన్ని గూర్చి ఎన్నో తలంపుల నతడు పొందెను. "ఈ కార్యాన్ని ఎలా సాధించాలి? రావణునికి తెలియకుండా సీతను ఎలా కలుసుకోవాలి? దూతయైన వాడు దేశకాల జ్ఞానము లేక ప్రవర్తింపరాదు. పండితమానియైనవాడట్లు చేసి యజమాని కార్యమును చెడగొట్టినాడను నిందను పొందును. కావున నేనేమి చేయాలి? ఏవిధంగా ప్రవేశించాలి? దానికి తగిన సమయమేది? తగినవేష మేది? నేను రాక్షస రూపమున వెళ్లినచో వారు గుర్తింపగలరు. ఏ రూపము ధరించి వెళ్లినా వారు దానిని కనిపెట్టగలరు. అసలు గాలి కూడా వారి అనుమతి లేనిదే లంకలో ప్రవేశింపజాలదు. కావున నేను చీకటి పడు వరకు ఇందే చాటుమాటున ఉండి తర్వాత పిల్లకోతి రూపమున (గుజ్జు ప్లవంగ రూపము) నగరమున ప్రవేశించి రాక్షస గృహములలో సీతను వెదకెదను. ఇప్పటికిదియే నా కర్తవ్యము" అని నిర్ణయించుకొని మనస్సు స్తిమిత పఱచుకొని కార్యరూపమున దానిని నెరవేర్చుటకై సూర్యాస్తమయమునకు నిరీక్షించెను.

ప్రదోషకాలమున పిల్లియంతటి రూపం ధరించి శిఖరము దిగి లంకలో ప్రవేశించెను. నగరరక్షకులగు వారి కంటపడక గుప్తవారుడై ప్రాకారము చేరెను. చంద్రకాంతి హనుమపై పడుచుండెను. రామలక్ష్మణుల బలమున కీ నగరమొక లెక్కగాదను భావమాతనికి కలుగగా ధైర్యముతో సాగిపోవు నతనికా నగరము రత్నవసనోపేతయై, కోష్ఠాగారములనెడు శిరోలంకృతయై యంత్రాగారములనెడు స్తనములు కలదియై శోభించు ఒక స్త్రీవలె కన్పించెను.

హనుమంతుడు సాగిపోవుచుండగా లంకా నగరాధిదేవత అతనిని చూచెను. భీప్రదమైన వికారరూపముతో లంకిణి అతనిపైబడునట్లు వచ్చి గర్జించుచు "ఓరీ నీవెవడవు. నా చేతిలో దెబ్బలు తిని చావకముందే నీ వృత్తాంతము తెల్పుము. రావణ రక్షితయగు దీనిలో ప్రవేశించడానికి దేవతలకే సాధ్యపడదు. నీవు కోతివై ఇక్కడికెందుకు వచ్చావో చెప్పుము అని భీకరముగా ప్రశ్నించెను. దాని వికారమగు నోరు, భయంకరమగు చూపులు

భీకరాకారములను చూచి ఆంజనేయుడు దానితో "నేను నాకథ తర్వాత చెప్పెదను. ఈ ఘోరాకారముతో నీవు ఇక్కడ ఎందుకున్నావో ముందు నాకు తెలుపుము" అని పలికెను. ఆ లంకిణి "ఓరీ నేను రావణుని కింకరిని. ఈ నగర రక్షణ బాధ్యత నాదే. నన్ను జయించికానీ నీవీ లంకలో ప్రవేశింప జాలవు. కావున నీ వృత్తాంతము చెప్పుము" అని కోరెను. అంత మారుతి "నేను ఈ లంకానగరాన్ని, యిందలి వనములు, ఉద్యానవనములు, అడవులు. భవనములు చిత్రవిచిత్రములు చూచి పోయెదను" అని చెప్పుచున్నంతలో ఆ రాక్షసి గట్టిగా అరచి, అరచేతితో హనుమంతుని కొట్టెను. హనుమంతుడు కూడా గర్జించి తన ఎడమచేతి ముష్టితో దాని నొక పోటు పొడిచెను. ఆ పోటుకు దాని అవయవాలు విలవిల లాడగా కళ్లు తేలవేసి అది నేలకొరిగి పోయెను. స్త్రీని వధించుట యుక్తము కాదని హనుమంతుడు కనికరించి యూరకుండెను. అంత ఆ రాక్షసి మెల్లగా లేచి హనుమంతుని చేరి 'గర్వ చ్యుతమైన చూపులతో, డగ్గుత్తికతో "నన్ను చంపకుము. నీవు మహానుభావు డవు, మహాబలుడవు. పరాక్రమములో నన్ను జయించినావు. ఈ నగర ప్రతిష్ఠా సమయమున బ్రహ్మ నాకొక వరమిచ్చి యున్నాడు. అది ఏమనగా, 'ఏనాడు వానరుడొకడు వచ్చి నన్ను గెల్చునో ఆనాడే యీ లంకకు చేటు కల్గును' అని. ఆ వాక్యము ఫలించు వేళ వచ్చినది. నీవు లంకలో ప్రవేశించి యథేచ్ఛగా విహరింపుము. నీ యిష్టప్రకారము నీ ప్రయత్నములను చేయుము. నందికేశ్వరుని శాపముచే దుర్బలుడైన రావణునిచే పరిపాలింపబడు ఈ లంకలో పతివ్రతా తిలకమగు సీతను వెదకి కొనుము"—అని లంకిణి తెలుప గానే సంతోషించిన హనుమంతుడు సింహద్వారము ద్వారా కాకుండా వేరొక మార్గమున కోట ప్రాకారము లంఘించి దూకి తన ఎడమ పాదమును శత్రు పురమున మోపి దిగెను.[109]

పరాశరసంహితలో: హనుమంతుడు లంకిణిని నిర్జింపగా దాని సోదరి విషావి స్వరూపిణియగు కర్కటి హనుమంతుని చంపుటకై వచ్చెను. అపుడు ఆంజనేయుడు దాని చేతిలోని వజ్రదండమునే తీసుకొని దానిని వధించెను.[110]

సమీరకుమార విజయమున ఈ సందర్భము కేవలము సూచనా మాత్రముగా నున్నది. కోటవాకిటిలో కోలాహలమంతా తగ్గి గుబిక హెచ్చ గానే, దైత్యకాంతల పలవరింతలు సాగగానే, దంపతుల కూరుకుల

యార్పులు సెలగగానే పౌరజనుల రూపుల వివశత హెచ్చగానే ఆంజనేయుడు ఉత్తర ద్వారంలో ప్రవేశించెను. అచటికి ఎడపొచ్చి వచ్చు లంక బింకమడవి పెంపుమీరి నిశాపాలికల కేళికా గృహ పాళికలలో అతడు సీతను వెదకెను.[111]

రామచరితమానస్: రామాయణములో తెల్పినట్లు పిల్లియంతటి రూపముతోగాక హనుమంతుడు పిల్లిలాగానే ప్రవేశించినట్లు తులసీదాసు రచించిరి. "పిల్లి చీకటిలో గూడ చూడగల శక్తి కలది. అట్టి శక్తితో హనుమ సాగెనని భావించుట శ్రేయస్కరము." ఇంకొకచోట కవి మశకమంతటి రూపము మారుతి ధరించెనని కూడా తెలిపియున్నాడు.[112]

## 2. అంతఃపుర భవనాలలో అన్వేషణ:

అతివైభవముతో నొప్పు లంకానగర వైభవమును ఆంజనేయుడతి జాగరూకుడై దర్శించెను. (వాల్మీకి కవి సుందరమగు వర్ణన జగద్విదితము) రాజమార్గంలో బరాబరులు వేయువారిని, వివిధ వర్ణ రూప విచిత్రావయవ నిర్మాణం గలవారిని బహువిధ భీకర శస్త్రధారులను హనుమంతుడు చూచెను. రావణుని యింటి ముంగల హెచ్చరికగా నుండు మూలబలమును (Reserve Force) చూచెను. ముత్యాల తోరణాలతో కృష్ణాగరు గంధములతో నొప్పు రావణుని అంతఃపురములోనికి ఎవరికినీ తెలియకుండా హనుమంతుడు ప్రవేశించెను. అప్పుడు ఆకాశమధ్యాన చంద్రుడు తన వెన్నెలలను సర్వత్రా వ్యాపింపజేస్తూ ఆవులమందలో తిరుగాడు శ్వేతవృషభము వలె నుండెను. ఆ వెలుతురులో హనుమంతుడు రకరకముల దృశ్యముల చూచెను. విచిత్రమగు శబ్దములను వినెను. భర్తలకై తత్తరపడు స్త్రీలు వారికై నిరీక్షించుచుండిరి. భర్తృసన్నిధి నున్నవారు వారిననుసరించుచుండిరి. రాముడు వర్ణించిన రూపమునకు తగిన మానవాకారముగల స్త్రీని, ఆభరణములను ఆనవాలుగా చూచి నిర్ణయించుకొనుట తన విధి కావున హనుమంతుడు తన దృష్టినాకర్షించు దిశలో గల విషయముల నన్నింటిని నిశితముగా పరిశీలింపసాగెను. వీణానాదాల మధ్య రాక్షస స్త్రీ పురుషులు వివిధాలాపములతో, ఆక్షేపణలతో కాలము పుచ్చుచుండిరి. రొమ్ములు విచ్చి దేహము లెఱుగక కూర్కెడి స్త్రీలు, స్త్రీల దేహములపై ఒక చేయి ఒక కాలు వేసి పడుకొనిన పురుషులు, ముచ్చటలాడు జంటలు, చందనాది లేపముల నలదుకొనువారు, భర్తలపై కోపగించిన

వారు భర్తలను రతికై ప్రార్థించు స్త్రీలు హనుమంతున కాయా హర్మ్యములలో అగపడిరి. వారు అనేకాకారములలో నుండిరి. అందమైనవారిని, పతివ్రతలైన వారిని, సిగ్గుచే ఆవరింపబడినవారిని, ప్రేమరసమధికముగా గలవారిని, భర్తల ఒడులలో కూర్చున్నవారిని, భర్తృకార్యాసక్తులగువారిని, విరహోత్కంఠలను రతిప్రౌఢలను, పైట జారినవారిని, రతిశ్రమచే కరగిపోయిన మకరికాపత్ర రచన గలవారిని, చెదరిన ముంగురులవారిని ఆ పడకటిండ్లలో ఎందరినో పావని చూచెను. సీత ఎట్లుండునోయని హనుమంతుడూహించుకొనుచు ఆమె రామ విరహ కృశాంగియై యుండుననుకొనెను. తనకు తెలిసిన అభరణము లను ధరించిన మానవాంగన వారిలో కనరానందున వాయునందను డధికమగు వ్యథ నెందెను.

సీత కనబడనందున హనుమకు దుఃఖము కలుగసాగెను. కామరూప ధరుడై ఇంకొకమారు లంకలో వెదకుట కుద్యుమించెను. దేదీప్యమానమైన రావణుని గృహమును చేరెను. తత్సమీపస్థ ఉద్యానవనములు, ప్రాసాదములు అతడు పరీక్షించెను. ప్రహస్త, మహాపార్శ్వ కుంభకర్ణ విభీషణాది ముప్పది నాలుగు రాక్షసవీరుల భవనములలో సీతను వెదకెను. రావణుని గృహములో ప్రవేశించగానే బహువిధ అయుధ ధారులగు స్త్రీలను రకరకాల ఆకారం గలవారిని హనుమంతుడు చూచెను. ఆ భవనమందలి రత్నకాంతులతోపాటు రావణుని దీప్తి కూడ అంతటా వ్యాపించుచుండెను. శోభాయమానముగా నున్న ఆ భవనములో సీతను కాపలా కాయువారుందురేమోనని హనుమ చూచెను. ఆమెను తానిదివరలో చూచియుండలేదు కావున మనోగతుల చేతను ఊహచేతను మాత్రమే ఆమెను గుర్తించవలెనని హనుమంతుడు తలంచెను. అచటి ప్రాకులపై నుండి సౌధములపైకి ఎగురుతూ రావణుని పుష్పక విమానమును చూచెను. బంగారుతో నిర్మితమై సుందరమై చిత్రవర్ణ శోభితమై పర్వత శిఖరమువలె, మేఘమువలె అది భాసించుచుండెను. సగము ఆమడ వెడల్పును, ఆమడ నిడివిని కలదై ఆ భవనముల మధ్యలో అదియొక శ్రేష్ఠ మైన భవనమో యనునట్లుండెను. దానిలో రావణుడు కాపురముచేయు పెక్కు మేడలు గల నగరుండెను. రెండు దంతాలున్నవి, మూడును, నాలుగును దంతాలున్నట్టి యేనుగులందుండెను. రావణుడు బలాత్కారముగా తెచ్చిన స్త్రీలందుండిరి. సర్వదిక్పాలకులను జయించి తెచ్చిన సంపద అచట కనిపించు

చుండెను. బంగారుమెట్లు, ఇంద్ర నీలాదిమణులతో గూడిన కిటికీలు కలిగి వివిధాహారపదార్థపరిమళముల పర్వముచేయుచుండెను. వినుటకింపైన ధ్వనుల చేత వీనులకు (విందైన ధ్వనులచే వీనులకు) కనుటకింపైన రూపములచే కన్నులకు, తాకుట కింపైన వానిచే చర్మమునకు, సువాసనలచే నాసికకు, నోట నీరూరించు వానితో నాలుకకు తల్లివలె ఆ నగరు హనుమంతునకు పంచేంద్రియ సుఖము నిచ్చెను. రావణుని తేజముతోపాటు కదలక ప్రకాశించు అచటి దీపములు ఆశ్చర్యపరిచెను. వేలాది స్త్రీలు మద్యపానముచే సొక్కి నిద్రించుచుండిరి. వారిలో పద్మినీ, హస్తినీ జాతుల స్త్రీలుండిరి. కొందరు మద్యపానము చేసి రత్యాసక్తిచే పరవశలై యుండిరి. పుష్పభూషణాదులతో పాటు వారి అవయవములనాచ్ఛాదితములై స్థితి తప్పియుండెను. నిద్రించు చున్నవారిని చూచినను సాధారణ పురుషులు మదనవికారము నొందగల్గునంత మనోహరముగా వారగపడుచుండిరి. నిద్రలో వారప్రయత్నముగా చేయు చేష్టల హనుమంతుడు చూచెను.

రావణుని భార్యలందరు వానికి చుట్టునూ దగ్గరగా శయనించియుండిరి. ఆ స్త్రీలను చూచిన హనుమంతుడు "అయ్యో సీతాదేవి కూడ వీరివలె తన నాథుని చేరియుండినచో రావణునకు పుణ్యము కలిగి యుండును గదా!" అని తలంచి, వెంటనే పశ్చాత్తాపముతో 'అయ్యో, అయోనిజ, పతివ్రతా అయిన సీతను రాక్షసాంగనలతో పోల్చితినే!" అని బాధపడెను. సువర్ణ, స్ఫటిక, దంత, వజ్ర, వైడూర్యములతో చేయబడిన రావణుని తల్పమునతడు చూచెను. వివిధాలంకారములతో సరిగవస్త్రములతో నతడు నిద్రించుచుండెను. పెద్దగ బుసకొట్టుచున్న వానిని చూడగానే హనుమంతుడు తబ్బిబ్బుపడి యిట్టి పాపాత్ముని సమీపించితినిగదా అని చింతించెను. అతని చెంత అతని భార్యలు పరుండి యుండిరి. వారిలో కొందరు సొమ్ములూడినవారు, చీరలూడినవారు, బొట్టుచెదరినవారు, కాటుక కరిగినవారు ఉండిరి. వేరొక ప్రత్యేక తల్పముపై నిరతిశయ సౌందర్యవతియగు మండోదరిని చూచి "హా చూచితి సీతను" అని సంతోషముతో భుజములు తట్టుకొనుచు తోకను ముద్దిడుకొని గంతులు పెట్టి, స్తంభములెక్కి లోలోననే గానముచేసి మనస్సులోనే ఆనందముతో నూగి పోయెను. క్షణములోనే అతనికి సంశయము కలిగెను. "ఈమె సీత ఎట్లగును. భర్తకు దూరమైయున్న స్త్రీ యిట్లు నిద్రపోగల్గునా! ఆహారము తినునా!

సౌమ్ములు ధరించునా! ఈ రావణుని అంతఃపురములో ఆనందముతో నుండ జాలునా! కావున ఈమె సీతకాదు." అని నిర్ణయించుకొని ఆచోటు వదలి పానశాలల వద్ద సీతను వెదకెను. అచట జింకల, పందుల, దున్నపోతుల పక్షుల తదితరముల మాంసాదులు, పలుపుష్పములతో తయారు చేయబడిన సారాయము గల పాత్రలుండెను. అచట ఎందెందు చూచినా సీత జాడ తెలియ నందున హనుమంతుడు దుఃఖించెను. స్త్రీలను, వారి అవయవములను వారి నిద్రాస్థితిని చూచిన దోషమును గూర్చి హనుమకు ధర్మాధర్మ విచికిత్స కలిగెను. కార్యనిశ్చయవశమైన బుద్ధితో అతడిట్లాలోచించెను. "సీతను స్త్రీల లోనేకదా వెదుకవలయును. స్త్రీలను చూడవలెనను తలంపుగానీ, చూచినందు వలన మనోవికారము కానీ నాకు కలుగలేదు. ఇంద్రియ వ్యాపారమునకు మనస్సే మూలకారణము. నా మనస్సు చంచలత నొందక స్థిరముగా నున్నది కావున దోషము లేదు" అని నిశ్చయించుకొనెను. అచట సీత కనరానందున మరల అంతఃపురమున వెదకుటకై అంజనేయుడుద్యమించెను.

"లతా గృహములలో, వివిధ మండపములలో సీతకై వెదకితిని కాని ఆమె కనరాలేదు. ఇంతకూ ఆమె బ్రతికియున్నదో లేదో" అను తలంపతనికి కలిగెను. రావణుడామెను చంపినాడేమోనను అనుమానమతనికి కలిగెను. కామాసక్తుడై తెచ్చినవాడు ఆమెను చంపినచో ఏలాభము పొందడని అతని కనిపించెను. వికృతాకారలగు రాక్షసస్త్రీల వలన ఆమెకేమైనా ప్రమాదము కలిగెనేమో ననుభావన అతనిలో కలిగెను. సీతనుగూర్చి అతనిలో పలువిధ ములగు తలంపులనివార్యముగా కలుగసాగెను. "ఎన్నిచోట్లనో వెదకితిని. ఆమె కన్పించలేదు. నా కృషియంతా వృథాయేనా! వానరుల ముందు పౌరుష వచనములు పలికి వచ్చితినికదా! నేను ఏ వార్తను తీసికొని సుగ్రీవుని వద్దకు వెళ్లవలెనో? సీత కనరాలేదని చెప్పుట యుక్తమా! కిష్కింధకు వెళ్లకుండా ఇక్కడనే ఎంత కాలమని యుందును. గడువులోగా నేను వెళ్లనిచో రావణునిచే హనుమయే చంపబడియుండునని వానరులు తలంపగలరు. కార్యము సాధించ కుండా వెళ్లినచో జాంబవంతుడు అంగదాదులు నన్ను "ఛీఛీ" అని అనగలరు. కనుక నేను వ్యర్థుడనై పోరాదు. ఇక్కడ నేనుండరాదు. ధీరుడు ఆపదలో ఉత్సాహరహితుడు కాక ప్రయత్నము చేయాలి. రావణుని చిత్రాలయములు, తోటలు, కేళివిలాస భవనాలు, వీథులు, సందులు, ఇంకనూ ఇతర ప్రదేశము

లలో సీతను వెదకుటయే యిప్పటి నా కర్తవ్యము. నేలమాళిగలు నాలుగు మార్గాలు కలియు కూడలులు ఇదియది యనక అంతటా వెదకెదను" అని నిర్ణయించుకొని హనుమంతుడపుడు వెదకినచోటికేపోయి వెదకి వచ్చుచు, ఎగురుచూ, దూకుచూ, ప్రాకుచూ, రావణుని అంతఃపురంలో బెత్తెడంత ప్రదేశాన్ని కూడా వదలకుండా ప్రాకారాలూ, అరుగులూ, దిగుడుబావులూ, కొలనులూ అన్నీ వెదకెను.

అయినను సీత కనరాలేదు. "రాక్షసుని యింటిలో సీత ఉన్నదని సంపాతి చెప్పినమాట తప్పగునా! రావణాపహృతయగు వేళలో సీత సముద్రమున పడినదేమో. లేక భర్తృవిరహమున ప్రాణత్యాగమొనర్చి యుండునా. లేక రావణుడామెను రహస్య ప్రదేశములో నుంచెనా. సీతాదేవి కనబడలేదని శ్రీరామునకు తెలిపినచో రాముడు ప్రాణముల విడుచుట నిజము. అది చూచి లక్ష్మణాదులు సుగ్రీవుడు ప్రాయోపవేశము చేయకుందురా? సుగ్రీవుడు మరణించినచో తార సహా మరణించును. వారిలో అంగదుడుకూడ చనిపోవును. వానరులందరు దుఃఖముల పాలగుదురు. కావున నేను సీతజాడ తెలియవరకు కిష్కింధకు తిరిగి వెళ్లకుండా ఉన్నచో నా రాకకై ఆశతో వారు ఎదురు చూచుచుందురు. సీతాదేవిని చూడకుండా వెళ్లుటకంటే నేనిక్కడనే యుండి ఫలమూలాశనుడనై వానప్రస్థునిగా నుండెదను. లేదా పక్షులు, జంతువులు మొదలగువానికాహారముగా నైపోవలెను. అహా! సీతాదేవిని కాపాడ దలచిన జటాయువుదెంత అదృష్టము. అతనిది వీరమరణము. అట్టి అదృష్టము నాకు లేదు. రామకార్యసాధనలో నేను మరణించుటే మేలు. అగ్నికాహుతి యగుదునా! లేక నీటిలో మునిగి మరణింతునా! కాదు కాదు చనిపోవుట మంచిది కాదు. చచ్చి యేమి సాధించగలము? సీత జాడ తెలిసినా, తెలియకున్నా, ఆ రాక్షసుడగు రావణుని పట్టి చంపినచో మేలుగా నుండును గదా! రావణుని చంపుట నా కర్తవ్యముకాదు. అది రాముని కర్తవ్యము. వానిని పట్టుకొని యజ్ఞ పశువుగా ఈడ్చుకొని వెళ్లి రాముని యెదుట పెట్టుట మంచిది. ఆనాడు సంపాతి వచనముల విని రాముని నేనిక్కడకు తీసికొని వచ్చి యుండినచో సీత కనరానందున రామక్రోధాగ్నికి మేమంతా బలియయ్యేడివారమేకదా! అందువలన ఆహార నియమము పూని ఇంద్రియ నిగ్రహముతో నేనిందే ఉండెదగాక. వ్యర్థుడనై పోకుండుట వలన వానరులూ, రాజపుత్రులూ నాకై నిరీక్షించుచు జీవించి యుందురు" అని పలువిధముల చింతించుచున్న హను

మంతునకు అశోకవనము దృగ్గోచరమయ్యెను. అందులో సీతను వెదకియుండ లేదు. అక్కడికి వెళ్లి వెదుక దలంచి ఆంజనేయుడు సీతారామలక్ష్మణుల కున్నూ, రుద్ర ఇంద్రయమ వరుణ దైవములకున్నూ, రవిచంద్రులకున్నూ, అశ్వినులకు, మునులకున్నూ మనసులోనే అంజలించి బయలుదేరెను.

ఆ వనము పరిశుద్ధముగా నుండి బాగుగా పరిరక్షింపబడునట్లు తోచి నందున అందులోనే సీత ఉండునని పావని అనుకొనెను. వసంతర్తు సూచనతో వృక్షములన్నియు పుష్పశోభితములై యుండెను. అతి చిన్నదైన తన దేహ ముతో ప్రాకారమునుండి చెట్లలోనికి గంతులేయగా అందలి పక్షులకు నిద్రా భంగమై అవి కూసెను. పక్షుల రెక్కల అదిలింపునకు పూలన్నియు రాలగా అవి హనుమంతునిపై పడెను. భూతకోటికై వచ్చిన వసంతుడో అనునట్లు వాతాత్మజుడుండెను. గాలి మబ్బులను చిమ్మినట్లుగా చెట్లతీగల గుంపులను చిమ్ముచూ హనుమంతుడు సాగెను. వజ్రాలు తాపిన భూములు, బంగారమూ వెండితో వెలయించిన స్థలాలూ, బావులూ, బావులకు బంగారు మెట్లు స్ఫటికపు తిన్నెలు, బావులవద్ద హంస, సారస, చక్రవాకాది పక్షులను హనుమంతుడు చూచెను. అచట సెలయేళ్ళు పారుచుండెను. అచట నొక పెద్ద శింశపావృక్ష మును హనుమంతుడు చూచెను. అగ్నిని పోలు ఆ చెట్లనుండి క్రొమ్మెరుంగులు హనుమంతునిపై ప్రసరించెను. గాలి తాకిడికి ఆ చెట్లకు కట్టిన చిరుగంటలు మ్రోగుచుండెను. ఈశ్వరారాధన నిమిత్తమై నదిలో పరిశుద్ధురాలగుటకై సంధ్యాకాలమున అచటికి సీత తప్పక రాగలదని ఆశించి ఆంజనేయుడా శింశుపా వృక్షము నందే దాగుకొని యుండెను.

ఆకాశమును తాకుచు సహస్ర స్తంభములతో రమణీయమైన మేడ అంతలో నతనికి కన్పడెను. దానికి తప్తకాంచన వేదికలు ప్రవాళ సోపాన ములు ఉండెను. అచట పెద్ద స్కంధముగల ఒక చెట్టు చుట్టును రాక్షసస్త్రీలు పరివేష్టించి యుండిరి. వారి మధ్య ఒక స్త్రీ అతనికగపడెను—మాసినచీరతో, దీన వదనముతో కృశించిన శరీరముతో, మీదమీద వెల్వడు నిట్టూర్పులతో గుర్తింపరాని దేహకాంతితో నున్న ఆమెయే — సీతయగునో కాదో అని బాగుగా పరిశీలింప సాగెను. అట్లు పరిశీలన మొనర్చు పావనికి ఆమె ఎన్నియో రీతుల తోచెను. శుక్ల పక్షాది యందలి చంద్రరేఖవలె కృశించినదై, ధూమా వృతమగు అగ్నిజ్వాలయై కమలములులేని కొలనులాగా భూషణ విరహితయై,

లేడిని చుట్టుకొని యున్న వేటకుక్కలవలె రాక్షసాంగనలతో పరివేష్ఠింప బడినదై, దుఃఖించునదై, సందిగ్ధమైన స్మృతివలె, చెడిన సంపదవలె, విశ్వాసములేని శ్రద్ధవలె, ప్రతిహతమైన ఆశవలె, విఘ్నయుకల సిద్ధివలె, కలుషించిన బుద్ధివలె, చెడిన కీర్తివలె, శిథిలమైన విద్యవలె, లోపింపబడిన ఆజ్ఞవలెనున్న ఆమెను చూచి సీతయే కావచ్చునని హనుమంతుడు అనుమానించెను.

ఆమెయే సీత అగునో కాదో ప్రమాణీకరించి నిర్ణయించుటకా సాక్ష్యములు చాలవని ఇంకనూ కొన్ని ఋజువులకై ఆంజనేయుడు చూడసాగెను. "రావణుడపహరించుకొని పోవునపుడు ఆర్తనాదము చేయుచు మాకు కనబడిన రూపమే ఈమె రూపము. ఈమె కూర్చున్న చెట్టువద్ద చెట్టుకు కట్టిన ఆభరణములు శ్రీరాముడు మాకు చూపిన ఆభరణముల వలెనే యున్నవి. విమానము నుండి నాడామె జారవిడిచిన ఆభరణములన్నియు ఆమె ఎడమవైపు ధరించినట్టివి. అట్లామె ఒక ప్రక్కవే వేయుట దేనికనగా ఎవరైనా తనను వెదకుచు వచ్చినపుడు రెండవ ప్రక్క ఆభరణములానవాలుగా గుర్తింపగలరని ఆమె భావించియుండును. నాణెముగ పనిచేసిన కమ్మలు, హస్తాభరణములు, పాదాభరణములు నల్లబారి మురికిపట్టియున్నవి. ఆ ఆభరణముల ధరించుబోట ఏర్పడు ముద్రలు నాకు కన్పించుచున్నవి. ఈ సాక్ష్యములను బట్టి ఈమెనే సీతగా అనుమానించుచున్నాను. శ్రీరాముడు సీత మేనిలో ఇంకనూ కొన్ని ఆభరణములున్నవని చెప్పియున్నాడు. ఆనాడు మేము చూచినవి కాక వేరుగానున్న ఆభరణములను ఈమె ధరించి యున్నది. రామునకు మేమందించిన ఆభరణములు ఎడమప్రక్కవి. ఇక్కడ కన్పించు ఆభరణములు కుడివైపునకు చెందినవే. అంతేకాక ఈ ఆభరణములను చెట్లకు వ్రేలాడ కట్టి యుండుటకు కారణము లేదు. తనను వెదకుకొనుచు వచ్చువారికై ఇవి ఆమె వ్రేలాడదీసినది. ఆనాడు ఆభరణములను వస్త్రమున మూటగట్టి జారవిడచినది. నాడే బంగారువన్నె ఉత్తరీయమును చూచితిమో ఆ వన్నెగల వస్త్రమే యీామె ధరించియున్నది. చిరకాలము దానినే ధరించుటచే అది కాంతిహీనమై యున్నది. ఆ వస్త్రమే ఇది. కావున ఈమె సీతయే." అని హనుమంతుడు దృఢాభిప్రాయము పొందెను.

సీతను సందర్శించినంతలోనే హనుమంతునిలో సీతారాముల అనురాగమూ, సీతాదేవి ప్రస్తుత దయనీయస్థితీ గూర్చి హృదయపుట భేదకములగు

భావములనేకము ప్రవహించినవి. "ఈమె రాముని దేవేరి. విప్రయోగ కర్శితయై యున్న ఈమె రాముని సౌందర్యమునకు తగిన అవయవ సౌష్టవము కలిగి యున్నది. ఇట్టి యీమెను ఎడబాసికూడ రాముడు దేహమున ప్రాణము లుంచుకొనుట దుష్కరకార్యము. ఈనాడీబాధకు సీతను గురిచేసిన రాముడు క్రూరచిత్తుడు. జింకను తెచ్చుటకై ఈమెను వదలి వెళ్లుట కతనికెట్లు మనసు వచ్చెనో? తన అస్త్రవిద్యతో ఉన్నచోట నుండియే దానిని కొట్టియుండవచ్చును గదా. ఈమె లేకున్నా ఇన్నాళ్లు రాముడు మరణింపక జీవించియున్నాడే? అయ్యో, నాకు నా ప్రభువును కించపరచునట్టి తలంపులు కలిగినవికదా! నా ప్రభువును సామాన్యునిగా భావించితినే? సీతా విముక్తిలోని కష్టములనెన్ని నేనట్లు భావించితినేకాని నాప్రభువగు శ్రీరామునికి ఈ రాక్షసులెంత? సర్వ జగద్రక్షకుని సతికి యీనాడీ పాట్లు పడుట తప్పదాయెకదా! కాలమతిక్ర మింప ఎవరికి తరము"....అని సీతారాముల యెడ భక్తితో సామీరి దుఃఖిం చుచు భావించెను. దాశరథుని పరాక్రమమును నమ్మినదై గుండెదిటవుతో, నిర్భరముగానున్న సీతాదేవి స్తవనీయ కావుననే ఈమెకు రాముడు తగినవాడు. వీరి సాముద్రిక లక్షణముల తుల్యతయే ఆ అంశముల నిరూపించుచున్నది. ఇట్టి ఉత్తమురాలికా ఇంతటి కష్టము. ఈమె కొఱకే గదా వాలిని రాముడు వధింపవలసివచ్చెను. ఈమె కొఱకే కదా కబంధుని చంపుట; ఇట్లే విరాధ ఖరత్రిశిరస దూషణాదులూ జనస్థాన నివాసులగు రాక్షసులందరూ రామ బాణహతులైరి కదా! ఈమె కారణముననే కదా సుగ్రీవునకు వానరరాజ్యము దొరకెను. ఈమె కోసమే కదా సముద్రుడు నాచే లంఘింపబడెను. ఈమె కొఱకు రాముడు త్రిలోకాలను దహించినా అది యుక్తమే అగును. ఆత్రైలోక్య రాజ్యాధిపత్యము సీతలోని ఒక కళకు సరిపోదు. ఇట్టి యీమెనే మరల రాముడు పొంది సుఖించాలి. రామసంప్రాప్తి తప్ప ఈమె కింకేదియును సుఖము నీయజాలదు. చక్రవాకమును బాసిన చక్రవాకివలె కష్టపరితాపములతో కూడుకున్న ఈమె విరహాగ్నిలో క్రుంగి పోవుచున్నది. ఇపుడిక్కడ రాక్షస వనితలు మేల్కొని యున్నారు. అదనుచూచి సీతతో ప్రసంగించుటకై యత్నిం చెదగాక" అని హనుమంతుడనుకొని ఆ వృక్షమునందే దాగికొని రాక్షసాంగ నల తీరును గమనించుచు నిరీక్షించెను.

హనుమంతునకు చంద్రుడు తన కాంతితో ఎంతయో సహకరించెను. సీతనూ, ఆమెను చుట్టుకొనియున్న రాక్షసస్త్రీలను అతడు బాగుగా చూచెను.

ఏకాక్షీ, చెవులులేనిదీ, ఒక్క చెవిగలదీ, నిడుపాటిమెడకలదీ, వ్రేలాడు చెవులు కలదీ, విచిత్రమైన ముక్కులు కలవారూ, భీకరముగా వికారముగా కనబడు రాక్షసస్త్రీలనతడు చూచెను. వారి క్రూరవాక్యమును సరకుసేయని సీతనాతడు చూచెను. దుఃఖతప్త, పతివ్రతా కాంతిహీనయైయున్న ఆమెను తాను చూడ గల్గుట రామలక్ష్మణుల అనుగ్రహ ఫలముగా భావించి మనసులోనే వారికి నమస్కరించెను. ఆ చెట్టులోని గుబురైన ఆకులమధ్య అణగి మణగి సమయా నుకూలతకై అతడు నిరీక్షించెను.

రాత్రిగడచి తెల్లవారబోవు సమయమున రావణునకు మేల్కొల్పగా పాడిన సుప్రభాతాది మంగళవాద్యముల శబ్దములు వినవచ్చెను. సర్వలక్షణ సమన్వితుడై భూషణాద్యలంకార సహితుడై రావణుడు సీతను చూచుటకై అశోకవనవాటికకే తెంచెను. వానిని బాగుగా చూచుటకై చెట్లకొమ్మలమాటున ఒక అనువైన స్థలమునకు చేరి హనుమంతుడచట దాగుకొనెను. రావణుని గాంచి సీతాదేవి భీతిచే వణకుచు తన తొడలచే కడుపును, చేతులచే వక్షఃస్థలాన్ని కప్పుకొనుచు దుఃఖమొందుట హనుమంతుడు చూచెను. రావణుడు సీత ఎదుటకు వచ్చి తన మనోభావముల నావిష్కరించుచు తనకామె వశమగుటకై పలువిధముల తన గొప్పతనమును చెప్పుచు ఆమె అనుగ్రహమునకై ప్రార్థించెను. నిరలంకారయై నిరశనవ్రతములతో క్రుంగక తనతో కలిసి సర్వ భోగములననుభవింపుమని కోరెను. తపములో, బలపరాక్రమములలో, విత్తములో, కీర్తిలో రాముడు తనకొక్కదానిలో గూడ సాటిరాడనియు రాముని నమ్మియుండుట వలన ఆమె కష్టపడవలసియుండునని పలికెను. ఒక తృణము విరిచి వానికెదురుగా వేసి సీత వానికి హితవాక్యముల బోధించుట హనుమ గమనించెను. గడ్డిపోచకన్నా హీనముగా వానిని చూచు సీత పలుక బోవు మాటలయెడ హనుమ శ్రద్ధాళువై యుండెను. "ఓయీ రావణా, పాపా త్ములు ముక్తిని కోరినట్లుగా నీవు నన్ను ఆశింపవలదు. నీ భార్యలపై నీ మనసు నుంచుము. పుణ్యమైన వంశమున పుట్టి పూజ్యుడగు పురుషోత్తముని చేపట్టి పతివ్రతనగు నేను నీ మాటలకు లొంగుదానిని కాను. నేను పరసతిని సాధ్విని నీవు సాధుధర్మాన్నీ సాధుమార్గాన్నీ అనుసరించుట మంచిది." అని చెప్పుచు సీత వాని ముఖమును చూడకుండా వానికి తన వీపు ఎదురగునట్లుగా తిరుగుచు పలుకుట హనుమ గమనించెను. "ఓయి రావణా! స్త్రీలకు పాతివ్రత్యమే

అనుసరింపదగిన ధర్మము. నీ భార్యలు నీకెట్లో లోకములోని యితర స్త్రీలు వారి భర్తలకంతే కదా! స్వకాంతా సంబంధాన్ని వదలి పరకాంతా వ్యామోహ మున పడినవాని బుద్ధి, పుణ్యం, ఐశ్వర్యం, ఆయుస్సు, సంతానము నాశన మగును. రాజువై చేయరాని పనులు చేసే నీకు బుద్ధి చెప్పువారీ లంకలోనే లేరా? లేక వారు చెప్పుచున్ననూ వారి మాటలు నీవు వినుట లేదా? నీ ఒక్కని పాపం వలన నీవేకాక ఈ లంకమొత్తం శీఘ్రంగా నాశనమగును. నీకీ నడవడి కను ప్రోత్సహించు నీ కుహనామిత్రుల వలన కీడొందగలవు. సూర్యునికి సువర్చల ఎట్టిదో శ్రీరామునికి నేను నిత్యానపాయినిని. వైభవముల ఆశజూపి నీవు నన్ను మోసగింపజాలవు. నా నాథునకును నీకునూ పోలికయా! భర్త దూరమై విలపించుచున్న నా వద్దకు నా భర్తనుతెచ్చి నీ అపకీర్తి కళంకమును తొలగించుకొనుము. రాముని నీవు శరణు వేడినచో ఆ దయాపూర్ణుడు నీ కభయ మొసంగ గలడు. కానిచో రాముని చేతిలో నీవు చచ్చుట సత్యము. నీకు వరములనిచ్చిన దేవుళ్లయొక్క ఇంద్రాదులయొక్క ఆయుధాలు వృథాయై పోయినచో పోవచ్చును. కాని రాముడలిగినచో అతని బాణాగ్ని నిన్ను దహించి తీరును. రాముడొంటివాడని తలంతువేమో. మీ రాక్షసోరగముల పాలిటికి ఆ రాముడు గరుత్మంతుడే. బలిని ఒంటరియైన వామనుడు దమింపజేయలేదా! ఆ మహనీయుని బలపరాక్రమాదుల తెలుసుకొనక నీవు అతనిని ఎదిరింప జూచుట పులులవాసన పసిపట్టగానే పారిపోవు కుక్కలాంటిదే. నీవు కైలాస ములో దాక్కొన్నా రామబాణాగ్ని నిన్ను దహించి తీరుతుంది." అని సీత పలికిన పిమ్మట రావణుడు ఆ మాటలనెల్ల పెడచెవినిపెట్టి బెదిరింపు మాటలతో ఆమెను తన మార్గమునకు త్రిప్పుకొన ప్రయత్నించెను. "సీతా, నీవు నీ నోటికి వచ్చినదెల్లా పలుకుచున్నావేకాని నా ప్రార్థనలను వినవైతివి. నీ పలుకులకు నా కెంతయో కోపము వచ్చినను నీ మీద కోరిక వలన ఊరుకొన్నాను. నీకు (12 నెలలు) ద్వాదశ మాసములు గడువు ఇచ్చి యున్నాను. అందులో పది నెలలు పూర్తి అయినవి. ఈ రెండునెలలలో నీవు మనసు మార్చుకొని నా దానివి కావాలి. లేనిచో నీ మాంసమును నా ఉదయకాల భోజనములోనికి చేర్పింతును." అని రావణుడతిక్రూరముగా పలుకగా రాక్షసస్త్రీలు భీతిల్లిరి. కొందరు దేవతాస్త్రీలు తమ కనుసన్నలలో, పెదవి విరుపులతో వానికి లొంగ వలదని సీతకు సైగలు వేయుట హనుమంతుడు చూచెను. అవి చూచిన సీత ధైర్యము వహించి "ఓరీ నేను రామపత్నిని ఇంతవరకు నీవు ఎన్నో అనరాని

మాటలనియున్నావు. ఆ పాపఫలము నిన్ను తరుముకొని వచ్చును. దొంగవలె సన్యాసి వేషమున వచ్చి నన్ను తస్కరించి తెచ్చినావు. నా నాథునికంటబడినచో అతని బాణాగ్ని రుచి తెలిసెడిది. కామముతో చూచు నీ కన్నులు నేలబడకుండా వున్నవే? నీ నాలుక పీలికలు కాకుండా ఉన్నదే? నిన్ను నేనే భస్మము చేయ గలదానను. కాని నా వల్లభుని ఆనతి లేనందున, నా తపోదీక్ష పొల్లు కాకుండు టకున్నూ వూరకున్నానే కానీ చేతకాక కాదు. నీవు నన్నేమీ చేయజాలవు. నిన్ను నాశనము చేయుటకే విధి నిన్నిట్లాడిస్తోంది." అని పలికెను. ఆ మాటలు విని కోపించి ఆమెను చంపుదునని బెదిరించి యింకనూ తన శౌర్యపరాక్రమా దుల పొగడి ఆమెను కాపలాకాయు రాక్షసస్త్రీలనుద్దేశించి సీతను మార్చు ప్రయత్నములు చేయునట్లాజ్ఞాపించి మరల ఉద్రేకముతో ఆమెను చేరబోగా ధాన్యమాలిని అడ్డుపడి మనసునకామించని సతిని పొందుటలో సౌఖ్యములేదని బోధించి అతనిని గృహోన్ముఖుని చేసెను.

ఆ రాక్షసస్త్రీలు సీత మనసు మార్చుటకై యత్నించిరి. అందులో ఏకజటి, హరిజట, వికట అనుస్త్రీలు తమ అనునయ వచనములకామెలో స్పందన లేనందున బెదరింపులతో రావణుని భర్తగా పొందుటలోని గొప్ప తనమును, రాముని హీనతను తెలుపగా ఆ మూకకు సీత తన పాతివ్రత్యమున కనువగు రీతిని సమాధానించుట హనుమంతుడు వినెను. చండోదరి, వికట, ప్రఘస, అజాముఖి క్రూరవాక్యములతో ఆమెను తినివేయుదుమని బెదరించిరి. తన దురవస్థకు సీత ఎంతో దుఃఖించి 'మీరు నన్ను చంపి తిందురా! అట్లే కానిండు నన్నింత బోధించిన ఈ రావణునకు నాశనము దాపురించినది. ఈ లంక పాడుపడిపోవు సూచనలు కనవస్తున్నవి. ఇది కాలిపోయి కాంతి హీనము కాగలదు. ఇచటి స్త్రీలకు వైధవ్యము రాగా వారు విలపించుట నేను వినురోజు దగ్గరగుచున్నది. నాకు రెండునెలల గడువుగూర్చి మీరు ఆలోచించు చున్నారే కానీ మీకు రాగల గండం గుర్తింపకున్నారు.' అని తెలిపిన ఆమె మాటలను తమ రాజుకు విన్పించుటకై కొందరు వెళ్లగా కొందరామెను నిందించుచుండిరి.

అక్కడికి సమీపముననే త్రిజట అను వృద్ధరాక్షసి నిద్రించుచుండెను. ఆమెకంతవరకు జరిగిన విషయములు తెలియవు. ఆమె ఒక కలకాంచి నిద్ర లేచెను. రాక్షసస్త్రీలు సీతను నిందించుచున్నందున ఆమె వారిని చేరబిలిచి తన

స్వప్నవృత్తాంతము తెలిపెను. "సీత సాధ్వి - రామపత్ని - దశరథుని కోడలు - ఇప్పుడు మీరామెను నిందింపకుడు. ఈ ఉషఃకాలవేళలో నాకొక కల వచ్చినది. దాని ఫలితము ఈ రాక్షసులు సమూలముగా నాశనమగుటయే. రాముడు తెల్లని పుష్పములతో లక్ష్మణసమేతుడై లంకకు వచ్చుట; సీతారాముల కలయిక - వారికి దివ్యగంధర్వనాగాదుల సేవలు; దేహమంతా నూనె రాసుకొని రావణుడు ఎఱ్ఱని బట్టలు ధరించి ఒక త్రాచే ఈడ్వబడుట; విభీషణుడు తెల్లని వస్త్రాలతో, పూలమాలతో ఏనుగునెక్కి మంత్రులతో పరివేష్ఠింపబడియుండుట; కుంభకర్ణ ఇంద్రజిదాదులు రకరకాల దురవస్థల పాలగుట, ఇత్యాది విశేషముల నామె తెలుపగా రాక్షస స్త్రీలు భయపడిరి. "ఇన్నాళ్లు మనమామెను క్రూర వాక్యములతో బాధించినాము. ఇప్పుడు పశ్చాత్తాపముతో ఈమెనే శరణు వేడెదము. రావణుని నమ్మినచో మనకు దుర్గతి తప్పదు. కావున ఈమెనువదలి మీరువెళ్లడు" అని త్రిజట తెలుపగా వారు వెళ్లిపోయిరి. ఈ సన్నివేశము హనుమంతునికానందము కల్గించెను.

రాక్షసస్త్రీల మాటలువిని సీత తన దుర్దశకు దుఃఖించి రాముడు గడువులోపల రానిచో తనను రావణుడు చంపి తినునని తలంచి తాను ఉరి పోసికొని చచ్చుటమేలని భావించి చెట్టుకొమ్మను చూచుకొనబోయెను. అంతలో ఆమెకు శుభశకునములు పొడచూపినందున ఆమె హర్షకలితకాగా రామ చంద్రుని సందేశము నామెకందించుటకదియే తగిన సమయముగా హనుమ గుర్తించెను. ఇప్పటివరకు జరిగిన సంఘటనలవలన ఆమెయే సీత అని తెలిసిపోయినను ఆమె సాముద్రిక చిహ్నములు, ఆమె పాతివ్రత్య స్వభావము మరింత నమ్మకమతనికి కల్గించెను.

సీతతో సంభాషణ మారంభించుటకు పూనుకొనుటతోనే హనుమంతు నిలో నెన్నియో తలంపులు కలిగెను. "ఏ సతి రత్నము కొఱకు వానరులు బయలుదేరిరో ఆమెను చూడగల్గితినిగదా! ఇంకను ఈమెతోపాటు ఎన్నో సంగతులు తెలిసికొనగల్గితిని."

వారుడనై యోగ్యుడనై
వైరి బలాబలము తెలుగ మతినౌ నే
నారసి యసుర విశేషము
లీ రావణు బలము పురము నెఱిగితి నెల్లన్.[113]

"ఈమెకు ధైర్యవచనముల తెల్పి, బోధించి, చేయబోవు మరణ ప్రయత్నమునుండి విరమింపజేయాలికదా! ఇందరు రాక్షసులుండగా నేనీమెతో ఎట్లు భాషించగలను? అలస్యంచేస్తే ఈమె ప్రాణాలు తీసుకొనునేమో? ఈమెతో మాట్లాడకుండా వెళ్లినచో రామునకేమని బదులు చెప్పగలను? సీత జాడగురించిచెప్పి సాక్షాత్తుగా శ్రీరామునే తేగల్గినచో బాగుండును. కాని మేము వచ్చులోగా ఈమె ప్రాయోపవేశము చేసినచో చేసినయత్నము వృధా యగునుకదా? అల్పశరీరుడనగు వానరుడనై మనుజునివలె నేను సంస్కృత ములో మాట్లాడినచో ఈమె భయపడి నన్ను రావణాసురునిగానే తలంచవచ్చు. ఏమియును పలుకకుండా ఈమె నోదార్చుటెట్లు నెరవేరును? నేను మాట్లాడినచో ఏరీతిగా మాట్లాడవలెను – ప్రాకృతములో మాట్లాడినచో రాక్షసులకది అర్థము కాదు. మనుష్యులభాష మాట్లాడినచో కోతినై మనుష్యభాష మాట్లాడుచున్న రాక్షసమాయగా భావించుకొని కామరూపధరుడైన రాక్షసులలో నన్నొకనిగా గణించును. అంతేకాక ఆమె భయపడి, అరచినచో రాక్షసులువచ్చి నన్ను పట్టి చంపుటో లేక రావణునివద్దకు లాక్కొని వెళ్లుటయో చేయుదురు. నాకు రాక్షసులతో యుద్ధమేరీతిగావచ్చినా అది కాలహరణమునకు తోడ్పడును. నన్ను వారుగుర్తించినచో సీతకేదైనా ప్రమాదమును వారు కల్గింపగలరు. లేదా, వారామెను రహస్య ప్రదేశములో దాచు ప్రయత్నమైన చేసెదరు. ఒకవేళ యుద్ధములో నేను రాక్షసులను చంపగల్గిననూ ఆ బడలికతో సముద్రమును దాటి పోలేకపోయినచో మేలు కలుగదు. కావున శంకకు చోటిచ్చు పనులను నేను చేయరాదు. బాగుగా ఆలోచింపనిదే నా కర్తవ్యమును తొందరపడి నిర్ణయించరాదు. పలుకరింపనిచో కల్గు ప్రమాదము, పలుకరించినచో వచ్చు అనర్థములు ఎన్నో ఉన్నవి. ఇట్టి సందర్భాలలో దేశకాల జ్ఞానౌచిత్య విరహిత మైన చర్యకు పూనిన దూత తన కార్యమును చెరచుకొనును. కాగల కార్యము దూత అసమర్థత వలన చెడవచ్చును. ఇంతవరకు నేను సాధించినదేదియు వృథాకాకుండా సీత నన్ను చూచి భయపడకుండా, నా మాటలను ఆసక్తితో వినునట్లుగా చేయుటకు తగిన మార్గమును నేను నిర్ణయించుకొనాలి." అని ఆంజనేయుడాలోచించి—

కార్యనిశ్చయము నీ కరణిని గావించె
నా రూపమును జూపకా రఘూత.

మునిని కీర్తించెద వనజాతలోన
భయపడకుండెడు పగిది గాగ
రఘుకుల గ్రామణి రాముని విదితాత్మ
ధర్మసహిత శుభదంబు లైన
మధుర వాక్యములను మానుగ నమ్మిక
పుట్టునట్టి భంగిఁ బొగడువాడ
వెలది యెంత మట్టు విశ్వసించునో దాని
నెఱిగి యవల కార్యమే నొనర్తు.[114]

—అని నిర్ణయించుకొని హనుమంతుడామెను చూస్తూ ఆమెకు మాత్రమే వినపడేలాగున ఆ చెట్టు కొమ్మలలో నుండి మధురమైన వాక్యములలో దశరథ మహారాజుతో ప్రారంభించి సీతాపహరణము వరకు గల రాముని కథ నంతయు తెలిపెను. సీతాదేవి దానిని వినుచుండుట గమనించి రామసుగ్రీవ స్నేహము, సీతాన్వేషణయత్నము, సంపాతివచనములాధారముగా సముద్రమును లంఘించి తాను వచ్చినట్లుగా పలికి రాముడు వర్ణించిన సీతను అదే వర్ణరూప కాంతి గుణయుక్తను తన పూర్వ పుణ్య వశమున దర్శింప గలిగితి నని పలికెను.

ఆ పలుకులు వినరాగానే సీతాదేవి శింశపావృక్షములోని కొకమారు తేరిపారచూచెను. తెల్లని వస్త్రముతో పింగళ వర్ణముతో పచ్చని కన్నులతో నున్న కోతిని చూచి చలించి తద్దర్శన ఫలముగా ఏ కీడు మూడునోయని పరిపరివిధాల భావించసాగగా అంజనేయుడు వినీతవేషముతో ఆ వృక్ష మండలి క్రింది కొమ్మమీదికి దిగి చేతులుజోడించి శిరమున కీలించి సీతాదేవినే సంబోధిస్తు మధురవాక్యములతో 'అమ్మా! నీవెవరవు క్లిష్టకౌశేయము ధరించి చెట్టు కొమ్మనే ఆధారముగాకొని ఎందుకున్నావు? దుఃఖించుచు కన్నుల నీరేల కార్చుచున్నావు? నా మీద అనుగ్రహించి చెప్పుము తల్లీ, దేవాసుర నాగ గంధర్వ యక్ష రాక్షస కాంతలలో నీవెవరవో? మరుద్వసు రుద్రగణములకు చెందినదానవా? చంద్రుని విడిచి నేల చేరిన రోహిణివా! వసిష్ఠుని విడిచియున్న అరుంధతివా! నీ శుభలక్షణముల చూడగా నీవు మానవకాంతవో! దేవతవో! నీకు శుభమగు గాక. నీవిట్లు దుఃఖింప వలసిన కారణమేదియును లేదు. నీ తండ్రి యెవరో, తోబుట్టువు లెవరో, నీ నాథుడెవరో, నీ సుతుడెవరో తెలు

ప్రము. రూపమును బట్టి నిన్ను దేవతగా భావించునాకు నీ నిట్టూర్పులు రాజ చిహ్నములు గల నీ పాదాలు నేల తాకు చున్నందున నీవు మనుష్య కాంత వనే నమ్మకము కలుగుచున్నది. మంగళకరమైన నీ లక్షణములు చూచుచుం డగా నీవు క్షత్రియ స్త్రీ వనియు చక్రవర్తియైన వాని పట్టమహిషివనియు తోచు చున్నది. దండకారణ్యములో సంచరించుచుండగా రావణుడు ఎత్తుకొని వచ్చిన సీతాదేవివి నీవేనా! శ్రీరాముని సతివి నీవేకదా! నీ వృత్తాంతమంతయు సాకల్య ముగా చెప్పినచో నీకు శుభమగుగాక " అని హనుమంతుడు పలుకగానే సీతా దేవి అతనిని చెట్టుకొమ్మ నాశ్రయించియున్నట్లుగా గమనించి తాను దశరథుని కోడలననియు, జనకపుత్రియై, రామపత్నియై అరణ్యములకు వచ్చుటకు గల కథనంతయు తెలిపి తనకు రావణుడు రెండు నెలల గడువు నిచ్చియున్నట్లును తాను శ్రీరాముని రాకకై ఎదురుచూచుచున్నట్లునూ చెప్పెను.

అపుడాంజనేయుడామెను చూచి ' అమ్మా నేను రాముని దూతను. అతని సందేశము నీకందింప వచ్చియున్నాను. తమ క్షేమములను తెలిపి నీ క్షేమము నెఱుంగకోరి నన్ను పంపెను. లక్ష్మణుడు నీకు తన ప్రణామముల నర్పించినట్లు తెలుపమన్నాడు. ' అని పలుకగానే మైథిలి " నాయనా, దేహత్యాగ మొనర్ప కుండా ఉండినందుకు ఫలితం ఇప్పుడు పొందినాను. రామలక్ష్మణుల కుశల వార్త వినినందుకు నాకెంతో ఆనందమైనది " అని పలుకుచుండగనే హను మంతుడు ఈమెకు నాపై నమ్మకం ఏర్పడినదని తనలోనే రూఢి చేసుకొని ఆమె దుఃఖమునుపశమింప జేయతలంపుతో చెట్టుదిగి మెల్లగా ఆమెను సమీ పింపబోవగా, సీతకు వెంటనే రావణుడే మాయావానరాకారమున వచ్చినాడను సందేహము కలిగెను. ఆమె తాను వానితో మాట్లాడితినికదా అని చింతించి నేలకూలిపోయెను. కొద్దిలో ఆమె మూర్ఛ నుండి తేరుకొని చూచెను. ఆమెకు హనుమంతుడు నమస్కరించుచు నిల్చియుండెను. అతడు రావణుడు కాదను భావన ఆమె పొంది —

.... .... .... " మదిదోఁచె నిన్గనన్
భావము నందు బ్రీతి ప్రభవంబగు చున్నది, రామదూతవేన్
వావిరి మేలు నీకగుత వర్ణన సేయుము మత్ప్రియంబు లో
నా విభురామచంద్రుని గుణంబులవంత ముదంబు నాకగున్ " 115

— అని పలికెను. ప్రవాహవేగము ఏటిగట్టును హరించినట్లు నీసౌమ్యాకారము నా మనస్సును లాగుచున్నదని పలుకుచు మరల లోలోపల అనుమానముకలిగి మౌనము వహించెను. ఆమె చిత్తస్థితిని గుర్తించిన మారుతి ఆమె సందేహమును తొలగించుట తన ప్రథమ కర్తవ్యముగా భావించెను.

శ్రీరాముని వర్ణింపుమని ఆమెకోరినందున ఆయనను వర్ణించినచో ఆమెకు విశ్వాసము కలుగునని యెంచి అంజనేయుడు 'తల్లీ రాముడు కుబేరునివలె రాజాధిరాజు, విష్ణువువలె మహాపరాక్రమశాలి, శత్రు భీకరుడు, మధురభాషణుడు, సత్యశీలి, కాంతిమంతుడు, మన్మథాకారుడు, మహారథుడు, యుక్త విషయములలో కోపించువాడు – అట్టి రాముని మోసపుచ్చి ఆశ్రమము నుండి నిన్ను దొంగలించి తెచ్చిన రావణునకు కలుగు దుర్గతి నీవు చూడగలదానవు ఆ రాముడు స్వయముగా పంపగా వచ్చిన దూతను నేను. వాస్తవముగా నేను దూతను కానేమోనని నీవు అనుమానింపకుమమ్మా. నీ వియోగము వలన పరితపించు రాముడు నీక్షేమమడిగినాడు. లక్ష్మణుడు, సుగ్రీవుడు తక్కినవారందరు నీ క్షేమవార్తకై తహతహలాడుచున్నారు. నీ జాడ తెలియగానే వారంతా వచ్చి రావణుని నిర్జింప యత్నింపగలరు. నీవు నన్ను ఎవరని భ్రమించుచుంటివో ఆ రావణుని మాత్రం నేనుకాను. నీవు అనుమానించక నా పలుకులను ఆలకింపుము" — అని ప్రార్థించెను ఆ మాటలకు సీత ధైర్యం వహించి శ్రీరామచంద్రులకు హనుమంతునితో పరిచయమెట్లయ్యెనో, నరవానర మైత్రి ఎట్లు ఘటిల్లెనో తెల్పి శ్రీ రామలక్ష్మణుల రూపురేఖలు వాని శుభాంశములు తెల్పుమని కోరెను.

సీతకోరినదే తడవుగా హనుమంతుడానందించి " అమ్మా, నీవు నన్ను నమ్మి నీ మౌనవ్రతాన్ని మాని నీ భర్తయొక్కయు నీ మరిదియొక్కయు రూప చిహ్నములను, ప్రశస్త గుణాదులను చెప్పుమని కోరినావు. ఆ రాఘవుల రూప గుణాను కీర్తన మొనరించు అదృష్టమును నీవు మా దాసుడనగు నాకు కల్పించినందుకు నా భాగ్యమే భాగ్యము. (శ్రీరామలక్ష్మణుల రూపగుణాదుల వర్ణన వివరములకు సర్గ ౩౫ చూడదగును) రాముడు పద్మపత్ర విశాలలోచనుడు; అఖిలసత్త్వమనోహరుడు; రూపదాక్షిణ్యనిరూఢుడు, తేజమున సూర్యుని, ఓరిమిలో పుడమిని, బుద్ధిలో బృహస్పతిని, కీర్తిలో ఇంద్రునికి సమానుడు. జగద్రక్షకుడు, ఆశ్రితరక్షకుడు కులధర్మము కాపాడువాడు. మనస్సునకేది హితమో

దానిని తానుచరించి మార్గముచూపి తర్వాత ఇతరులెట్లు నడచుకొనవలెనో తెలియజేయువాడు; బ్రహ్మచర్యవ్రతనిష్ఠుడు, సాధులకుప్రాపు, శీలధనుడు, నీతి యుక్తమగు ప్రవర్తన గలవాడు, వేదవేదాంగాలు ధనుర్వేదమూ తెలిసినవాడు వెడల్పుమూపురములు గలవాడు, నిడువగు బాహువులు గలవాడు, మేఘచ్ఛాయ వర్ణమువాడు; అట్లే లక్ష్మణుని రూపమును, రామసుగ్రీవ సఖ్యమును, సీతా సంబంధమగు శ్రీరామవిరహము, సీతాన్వేషణాయత్నములు, సంపాతివచన ములు, సాగరలంఘనము మరల వివరముగా తెలిపెను. సీతకు తన మాటల యందు ప్రత్యయమేర్పడినదని గుర్తించి, అమ్మా! నేను లంకానగరంలో రాత్రిపూట కామరూపధారినై సూక్ష్మరూపమున ప్రవేశించి ఎల్లెడల వెదకినాను ఎట్టకేలకు నిన్ను కనుగొనగల్గినాను. నేను అంజనాకేశరుల పుత్రుడను, వాయు దేవుని వరమున జన్మించినవాడను, నన్నునమ్ముము, హనుమంతుడే సముద్ర మును లంఘించి సీతను చూచెనను యశమును పొందితిని. ఇదిగో, రాము డిచ్చిన రామాకింతమైన ఉంగరము, దీనిని చూచి నీవు విశ్వసింప వలసినది. ఇంక నీకష్టములు తొలగిపోవుగాక. నీవు శ్రీరాముని తప్పక కలిసికొనగలవు తల్లీ" అని ఆమె నమ్మునట్లుగా పలికెను.

అంజనేయుని వాక్యముల విశ్వసించి సీతాదేవి ఆ ఉంగరమును స్వీక రించి స్మృతితరంగముల నోలలాడి హనుమనెంతయో స్తుతించెను.

జలనిధి యోజనశతము గోష్పదముగా
లంఘించి యొక్కెడ లంకఁజొచ్చి
తీవే శూరుండవు నీవే సమర్థుండ
వీవే ప్రాజ్ఞుఁడవు కవీంద్రచంద్ర
సామాన్య వానరువిగా మది నమ్మగ
జాల రావణుదన సంభ్రమంబు
సంత్రాపమును లేమి సముఖి భాషింపగఁ
బావని తగుదువు ప్రాణనాథు
డైన శ్రీరామునకు దూతవగుట జేసి
పంపఁడతఁ డపరీక్షితుఁ బవన తనయ
యందు లోపల వాకొంకకంపునపుడు
పటు పరాక్రమవంతుని బంపుగాని.[116]

—అని శ్రీరాముని, తత్సంబంధుల కుశలమడిగి "దూతగా వచ్చిన హనుమా! నా నాథుని వార్తకొఱకై మేనిలో ప్రాణాలుంచుకొని యున్నాను" అని పలికెను. రామపరతంత్రుడగు ఆంజనేయుడింకను రామనామగుణ సంకీర్తన మొనర్చుచో వినదలచినదై సీత మౌనము పూనెను.

మారుతి అంతట "ఇన్నాళ్ళు మీ జాడ తెలియనందున రామప్రభువు రాకుండెను. నా ద్వారా మీ వార్త తెలియగానే వచ్చి మిమ్ము కాపాడును. నావలె సముద్రాన్నిదాటి నీ నాథుడు రాజాలడేమోనను విచారము నీ వొంద కుము. అవసరమునుబట్టి ఆ సముద్రాన్నే స్తబ్ధమొనర్చి, ఎవడడ్డగించినా వచ్చి రాముడు తప్పక ఆ రావణుని కూల్చును" అని మేరునగవింధ్యాది పర్వతములలో మాకు ఆహారమగు ఫలములమీద, దుంపలమీద ప్రమాణముచేసి తెలుపుచున్నాను. త్వరలో నీవు నీ నాథుని చూడగలవు. ఆయనయొక్క అరతి, నిద్రలేమి మొదలగు మదనావస్థల నే నేమని వర్ణింపను? నీ విరహమున ఆయన కృషించియున్నాడు. నీకై దుఃఖించుచున్నాడు. నిన్ను రక్షించు ప్రయత్నములోనే యున్నాడు" అని ఆమెకు ధైర్యమధికమగు మాటలనే హనుమంతుడు చెప్పెను.

అమృతములో విషమును కలిపినట్లున్న ఆ పలుకులలో శ్రీరాముని దుఃఖమునుగూర్చి వినజాలక, తనను రక్షించుటకు గడువు రెండునెలలే వున్నందున ఆలోగావచ్చి తన పరాక్రమముతో రాక్షసులవధించి తనను కాపాడు సమయమునకై ఎదురుచూచుచున్నట్లు సీత పలికెను. ఈ పలుకులు వినిన హనుమకును ఒక ఆలోచన కలిగెను. "అమ్మా! శ్రీరాముడువచ్చి రక్షించు వరకు నీకు దుఃఖము భరింపరానిదై యున్నచో నిన్ను నేను నా వీపుపై ఎక్కించుకొని సముద్రమునుదాటి నీ భర్తదగ్గరకు చేర్పగలను.—

నీ వొకతివేల లంకను
రావణునిన్ మోచికొనుచు రయమున, బోవం
గా వలతిని జేర్చెద నిపు
డే విభుకడ హవ్యమగ్ని యింద్రునకు వలెన్.[117]

—నా మాటలను నీ వుపేక్షింపకుము. నే నీ లంకకెట్లువచ్చితినో అట్లే నిన్ను తీసికొని పోగలను. రాక్షసులందరొక్కటై వచ్చినా నన్నాపజాలరు" అని

సీతాదేవి బాధను తీర్పలయునను భక్తిత్రివ్రతవలన తొందరలో హనుమంతుడు పలుకగానే సీతాదేవి "నీవు నీ వానరబుద్ధిని చూపితివికదా! నీ మాటలు నాకు వింతగానున్నవి. ఇంత చిన్న ఆకారముగల నీవు నన్ను మోసికొని పోవుటయా?" అని అనుమానము వ్యక్తపరచెను.

ఆమె అనిన మాటలు తనకవమానకరమైనవిగా తలంచి, తన సంగతి తెలియనందున ఆమె అట్లు సందేహించినదని తనకు తానే సమాధానపరచుకొని ఆమె నమ్మునట్లు చేయుటకై తన నిజరూపాన్ని చూపడానికై నేలమీదికిదూకి శరీరాన్ని పెంచి విరాడ్రూపమెత్తెను. అతని రూపాన్ని దర్శించిన వెంటనే సీతాదేవి "ఓ కపీశ్వరా! నీ బలగర్వ సమున్నతి, వాయువేగము, వనదహనోరు తేజము చూడగల్గితిని. నీవు కేవల కోతిమాత్రుడవుగావు. నీవు ఒంటరిగా సముద్రాన్ని లంఘించి వచ్చుటలోనే నీ సామర్థ్యము తెలిసినది. నీవు నన్ను మోసుకొని పోగలవాడవని నాకు నమ్మకమున్ననూ నా నాథునకు కార్యసాధనకై వీలు కల్పించుట నా కర్తవ్యము అని పలుకుచు సీతాదేవి ఇంకను కొన్ని ప్రబల కారణములను జూపి సున్నితమైన మార్గమున హితవాక్యములతో అతని వీపుపై కూర్చొని వెళ్ళుటకు నిరాకరించెను. మరియు సీత పరాత్పరుడగు నా పతినితప్ప అన్యోపాయముల నే నాశ్రయింపను. నా రక్షణభార మతనియందే యున్నది" అని పలుకుటను విని హనుమంతుడు తన రూపమును చిన్నదగునట్లుగా నొనర్చి సాధ్వీశీలమునకువితమగు రీతిని భాషించి నందుకామెను బహుధా ప్రశంశించుచు "తల్లీ! నీవు అబలవగుటవలన నీ కట్టి సందేహము, పిరికితనమూ ఉండుట సహజమే. తప్పించుకొనిపోవు నుపాయమును నేను చెప్పిననూ నీవు నీ నాథునే ఉపాయముగా భావించినావు. కాన నీవు ఆయనకు తగిన భార్యవే. నీకు మేలొనర్పవలయునని నే నట్లంటినే కాని నామాటలో దోషమెన్నవద్దు. నీవు నాతో రాజాలనిచో శ్రీరామునకు నీ అభిజ్ఞగా దేనినైనా ఇమ్ము" అని హనుమంతుడు కోరెను. అపుడు సీత శోకించుచు చిత్రకూటమున జరిగిన కాకాసురుని వృత్తాంత విషయముల నన్నింటిని తెలిపి, తనకు చిన్న అపకారమొనర్చిన కాకిపై బ్రహ్మాస్త్రము సంధించిన పతి తనకెంతో కీడుతలపెట్టిన రావణుని నిర్జించుటకేల రాకున్నాడో అని పలికి, రామలక్ష్మణులకు తన సందేశముల తెలిపి తన కొంగున దాచియుంచిన శిరోమణినితీసి దానిని తన గుర్తుగా రాముకీయుమని హనుమంతున

కిచ్చెను. భక్తితో హనుమంతు డా చూడామణిని గ్రహించి దానిని తనవ్రేలికి ఉంగరముగా ధరించి ఆమెకు ప్రదక్షిణమాచరించి నమస్కరించెను. సీతా సందర్శనానందముచే దైహికముగా అచటనే యున్నను హృదయములో శ్రీరాముని చేరినట్లే హనుమ భావింపసాగెను. తిరిగి వెళ్ళుటకై హనుమంతు డుద్యుక్తుడగుటను చూచిన సీత "హనుమా! ఈ నా శిరోమణిని రామునకు నీవు ఇచ్చినంతనే ఆయన నన్నూ, నా తల్లినీ, నా మామగారగు దశరథుల వారిని స్మరించును. ఆయనను ప్రోత్సాహపరచుటలో, రామునికర్తవ్యములో, ఏదేది ఎట్లొనర్చవలయునో నీవే ఆలోచించి నా కష్టము తీర్చుభారము వహిం పుము" అని కోరెను అట్లే చేయుదునని ఆంజనేయుడు ప్రతిజ్ఞచేసి ఆమెకు సాష్టాంగ ప్రణామముచేసి శ్రీరామాదులవద్దకు పోవుటకై పయనమయ్యెను. అతని ప్రయాణత్వరను చూచిన సీత మరల దుఃఖమొంది "నాయనా! రామాదు లందరి కుశలము నడిగితి ననుము. నన్నీ శోకసాగరమునుండి తరింపజేయు కర్తవ్యమునకు రాముని సమ్మతింపచేయుము. నా నాథుడువచ్చి నా ప్రాణాలు పోకపూర్వమే రక్షించుటకు వాబాపుణ్యము కట్టుకొనుము. సాహసవంతుడ వగు నీవు సందేహమున కెడమీయని మాటలుచెప్పి అతనిని ప్రేరేపించి, ఉత్సాహపరచి, రాక్షసులపై తన పరాక్రమమును ప్రయోగించునట్లుచేయుము" అని పలికెను.

ఆంజనేయుడంత శ్రీరాముని పరాక్రమమును పొగడి తప్పక రాముడా మెను రక్షించునని చెప్పి రామునిశక్తికి ఆమెయే మూలమని పలికి నిశ్చింతగా నుండుమనికోరెను. సయుక్తికమై, సత్యమై, సుభాషితమైన అతని పలుకులను మెచ్చుకొని హనుమంతుని మరల మరల చూచుచు 'హనుమా నీకు ఆమోద మైనచో ఈ ఒక్కరోజు నీవు ఇక్కడనే ఎక్కడనైనా చాటుమాటుగా వుండి, అలసట తీరిన తర్వాత రేపు పోరాదా! నీవు ఇక్కడనే ఉన్నచో నాలోగల దుఃఖం కొంచెం తగ్గినట్లనిపించును. నీవు పోగానే మరల నాకు ప్రాణసందేహ స్థితియేవచ్చును. నిన్ను చూచునపుడు నేను పొందిన శాంతి, నీవు పోగానే పోయి మరల నాకు పరితాపము కల్గును. నీవు వానరభల్లూక సైన్యముతో రాముడు రాగలడని చెప్పియున్నావు. కాని, వారు సముద్రమునుదాటి ఎట్లు రాగలరో అను సందేహము నన్ను పీడించుచున్నది. వాయుదేవుడు, గరుత్మంతుడు, నీవు యీ ముగ్గురు తప్ప వేరొకరీసాగరాన్ని దాట జాలరే! నీకు తెలియని కార్య పద్ధతులు లేవు. నీవు ఒక్కడవే ఈ పనిని సాధింపగలవు. మరియొకరీ కార్య

మును వేయజాలరు. నీవే ఈ కార్యమొనర్చినచో ఆ కీర్తి నీకే దక్కునుకానీ నాకుకాదు. రాముడే వచ్చి రావణుని చంపి నన్ను అయోధ్యకు తీసుకొని వెళ్లినచో అదినాకు కీర్తికరముగదా" అని సహేతుకముగా సీతపలుకగా అంజనేయుడామెహితకరమైన వాక్కులను మెచ్చి ఆమె అనుమానమును నివృత్తి చేయుటకై పూనెను. 'సాధ్వీమణీ! నీవు సంశయింప వలసిన పనిలేదు. సుగ్రీవుని సైన్యములోని వానర భల్లూకములలో గొప్ప వీరులున్నారు. వారు దేవతాసమానులు. దిక్కులందును, ఆకాశములోను మనోవేగముతో సంచరింపగలవారు. ఎంతటి కఠినకార్యమునైనా చులకనగా వేయగలవారు. జలధిపరివేష్ఠిత భూమండలమునే పరివేష్ఠించి రాగలట్టివారు. నాకంటేగొప్పవారు, నాతోసమానమైనవారు ఎందరో వీరులందున్నారు. నాకన్నా హీనమైనవాడొక్కడుగూడ అక్కడలేడు. నేను వచ్చియే నిన్ను చూచితిననగా ఇంక వారే ఇటకు వచ్చియుండినచో ఎంత సాధించెడివారో? అంతేకాక ఇందొక రాజనీతి రహస్యముగూడ కలదు. శత్రు ప్రదేశములకు పంపునపుడు ప్రభువు సామాన్యునే పంపునుగానీ ఉత్తములను పంపడు. కావున నావలెనే ఇతరవానరులు ఇక్కడికి వచ్చుటలో సందేహింప నక్కరలేదు. నీవు దుఃఖపడునవసరములేదు. నేనువెళ్లివారికి చెప్పగానే వానరు లొక్కగంతులో లంకను చేరగలరు. సూర్యచంద్రులవలె ఆ రామలక్ష్మణులు నా వీపుపైనెక్కి నీ ఎదుట వాలగలరు. వారు తమ అమోఘ శస్త్రాస్త్రములచే లంకను పొడి పొడిచేసి రావణుని చంపి నిన్ను ఈ ఆపద నుండి తప్పింపగలరు. పుత్రకళత్ర బంధుమిత్ర సహితంగా రావణుడు నేలబడుట చూచి నీవు ఈ దుఃఖసాగరాన్ని దాటి సమ్మోదముతో నీ విభుని పొందగలవు. అంత వరకు కాలము గడుపుచు రోజులను లెక్కించుచు ఉండుముతల్లీ. అని ఆమె నూరడించెను. పయనమై సాగి మరల ఆమెకు ధైర్యవచనంబులతెల్పి 'నేనువెళ్లి వార్తనందించుటయే ఆలస్యముకాని రామునికర్తవ్యమునందించే ఆలస్యముండదుసుమా' అని సెలవు తీసికొనెను. అట్లుపోనున్న హనుమను చూచి సీత—

నీ ప్రియసూక్తులు నిండుముదంబిచ్చె
వాడిన మడికిని వానయట్లు
శోకంబుచేఁజాల శుష్కించి యుండు నా
యవయవంబుల చేత వాసదీర
నెట్టు లాత్మేశునే స్పృశియింప గలవో నీ
వట్లు సేయుము వటువట్లు దోలగ 118A

— అని పలికి "కాకాసురుని కథయేకాక మరియొక గుర్తును కూడ నీకు తెల్పు చున్నాను. అరణ్యసంచారములో నాస్వేదబిందువులకు నుదుటి తిలకము కరిగి పోగా అపుడు నానాథుడొక బండపై మణిశిలతో రాచి నా నుదుటి తిలకము దిద్దెను. దీనినికూడ నీవు ప్రత్యభిజ్ఞగా తెలుపుమని" కోరి శ్రీరామాదుల కర్త వ్యమునింకొకమారు గుర్తుచేసెను. ఆమె మాటలన్నింటిని వినిన హనుమంతుడు ఆమె అనుమతి పొంది ప్రయాణమునకు తగినట్లుగా దేహమును పెంచబూనెను "నీకు మార్గము నిర్విఘ్నమై శుభకరమై యుండుగాక" అని సీత అతనిని దీవించెను. హనుమంతుడంతట ఆచోటు వీడి తాను లంకలో చేయవలసిన కార్యశేషమేదేని కలదేమోనని తనలో తాను తర్కింపుకొనసాగెను.[118B]

పరాశరసంహితలో ఆంజనేయుని సాగరలంఘనాది విశేషములు లంకలో సీతను దర్శించిన విధమును గూర్చి ఏమియు లేదు. ఇతర రామా యణములు వాల్మీకిలోని అంశములనే పేర్కొనినవి. జానపదులను సంతోష పరచుటకో లేక కొన్ని హాస్యసన్నివేశములను కల్పించుటకో ఆధునికులు కొం దరు హనుమంతునిచే కొన్ని కోతిచేష్టలను చేయించినట్లు కల్పించి యున్నారు. అవి ఆంజనేయుని పాత్రను కించపరచునవిగను అతని శీలమునకు మచ్చ తెచ్చునవిగను ఉన్నవి. దీనికి ఉదాహరణము ఆనందరామాయణమే. (అవి యేవన, లంకలోని దీపాలను ఆర్పివేయుట, నిద్రించురావణాదివీరుల వస్త్రము లూడదీసి వారిని నగ్నదేహుల చేయుట, రావణుని మీసములు గడ్డమును కాల్చుట; నగ్నంగాపరుండిన రాక్షసాంగనలకు నీటికుండలను కట్టుట; భటు లను తోకతో బెదరించుట; రావణుని భార్యయగు మండోదరి శయ్యపై విభీష ణుని సతుల వస్త్రాలుంచుట; విభీషణ పత్నుల వద్ద మండోదరి వస్త్రాలుంచుట; గయుడను రాక్షసుని బట్టలను మండోదరి శయ్యపైవేయుట; అది చూచిన రావణుడు మండోదరినుపేక్షించి గయుని వధించుట; ఇత్యాదులు.)[119]

శ్రీపాదవారి శ్రీకృష్ణరామాయణం: ఆంజనేయుడు లంకలోచొచ్చి విభీష ణుని ఇంట సూక్ష్మరూపమున దాగియుండెను. విభీషణుడు తన భార్యకు రామాయణకథను వినిపించుచు హనుమంతుడు లంకకు వచ్చుననియు అతనిచే లంక దహింపబడుననియు, రావణుని రాముడు వధించుననియు, తెలిపిన మాటలను ఆంజనేయుడు వినెను. [120] సీత అశోకవనమున నున్నట్లు హనుమ అనుమానించుటకు కారణమొకటున్నది. సీతకు అనసూయ ఇచ్చిన అంగరాగ పరిమళము వలన హనుమంతుడటూహించెను [121]

"షోడశి రామాయణ రహస్యములు" లో శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ గారు సీతను దర్శించిన హనుమంతుడామెను సందిగ్ధమైన స్మృతివలెను, శ్రద్ధ వలెను, సిద్ధివలెను, ఆజ్ఞవలెను వాల్మీకికవి వర్ణించిన పలుకులలోని [చూడుము పుట. 117] విశేషముల తెల్పియున్నారు. లలితాసహస్రనామములో ఆమెకుగల నామములలో స్మృత్యైనమః, ఆజ్ఞాయైనమః; ప్రతిష్ఠాయైనమః, మహాసిద్ధ్యై నమః అనునవికలవు. సీత సాక్షాత్ పరదేవతయని హనుమ గుర్తించెనని తెలుపుటకే మహర్షి అట్లు వర్ణించిరి.[122] అనితెలిపెను.

శ్రీమద్రామాయణ కల్పవృక్షం: సీతను గుర్తించుటలో కవిసామ్రాట్ గారు సన్నితమైన కవితా మార్గంలో ప్రశంసనీయముగా కొన్ని కారణముల కల్పించియున్నారు. సీత ధరించియుండిన పాతచీరను చూస్తూనే అమె నతడు సీతగా నిర్ణయించుకొనెను.

చీరచించి నగలు చేరిచి మూటగా
గట్టి నాడు విడిచెఁ గమలనేత్ర
నాడు గ్రొత్తచీర నేడు ప్రాతబడ్డది
యదియ యిది యటన్నయట్లు తోచు

నీరజపత్రనేత్ర కమనీయ తపస్యముదాద భావనా
వారిధి వారి సంభవ ప్రభావరఘూద్వహు భార్యయేయగున్

.... .... .... .... ....

ఈమె వైదేహియేయగు నీమెదేహ
మున్నయట్లుగ లేనట్లునుజ్జ్వలించు
సరససౌదామనీ సుభాసభాసమాన
ధృతవిరాగిత్వకృత విశాదృతి వెలంగు.

.... .... .... ....

.... .... .... .... వాలి
వధమునందున నేదొ లోపమనిపించు
సీతరూపంబు సంశయచ్ఛేది యయ్యె
ఈయమకై యాయన మరి
వేయని దేమంటుమండు సృష్టి సమస్తం

బేయమ కాపద కలిగిన
మాయించును దీవ్రవాపమంత్రా హుతులన్

చేతమునందుఁ బూర్వమున శ్రీ రఘురాము నెఱింగినట్లుగా
నేతలపోసినాడ నిపుడీయమ గాంచినయంత సర్వమ
జ్ఞాతముగాఁగనుండె నను సంగతి నాకెఱుగంగ నయ్యెడున్
సీతనెఱుంగకుండ రఘుశేఖరు డర్ధము కాడు పూర్తిగా.[122]

సుందరమందారము ప్రకారం: సీతకు రామసందేశము వినిపింపటకై వచ్చిన హనుమ పడినపాటు ఈ గ్రంథము విశదీకరించుచున్నది. సునిశిత ముగా సున్నితముగా సాధింప వలసిన కార్యములకు కావలసిన ప్రజ్ఞ, యుద్ధ రంగమున చూపు శౌర్యసాహసాదులకన్న మిన్నగా నుండునట్టిది. ఆ ప్రజ్ఞ ఆంజనేయునిదే.

శ్రీరామచంద్రుడే వెట్టుదిగి వచ్చినన్
దైతేయుడంచు సీతమ్మ శంకించు
ఎట్లు మాట్లాడవలె ఈ సతీమణితోడ
ఎట్లు నమ్మింపవలె ఈ జానకీమణిని
ఈ వార్ధి లంఘనము ఇంత కష్టముకాదు
మాట్లాడకేగుటయు మర్యాదకాదు
రామప్రసంగమ్ము రామసంకీర్తనము
నొనగూర్చు చుండుటే ఒక సుగమమార్గము.
జనని సందేహభావ జనితవాక్య
వహ్ని సెగలకు మారుతి వదనసుమము
వాడిపోయెను బాష్పప్రవాహ ముబికె
మాట డగ్గుత్తికపడె 'అమ్మా' యటంచు
అనబోకు అనబోకు అమ్మ అంతటి మాట
గుండె నింతింతగాకోసి పెట్టెద చూడు
నను నమ్మదే తల్లి నా జానకీమాత
వేదాంత పరిపూత విశ్వమంగళగీత
నను నమ్మకుండేను నా తనువు వీల్చెదను
నా తనువులో రామనామామృతమెపారు

నను సమ్మ కుండేసు నా తనువు త్యజియింతు
ప్రభువునే తనువులో ప్రత్యణువువినుతింతు.[123]

సీతకు ఆంజనేయుడు రామాంగుళీయకము నీయగానే ఆమెకు దానిని చూచుట పెళ్ళిరోజుకన్నా సుఖదాయకమయ్యెను. ఆమెకు హనుమంతుని శైశవ రూపము కనిపించెను. "నీవు నూరు యోజనాల సముద్రము దాటితివి. నీవు పరాక్రమవంతునివి. బుద్ధిమంతునివి. నీకు రావణుని వలన భయములేదు. నీవు సామాన్య వానరునివి కావు. నీ యోగ్యత తెలిసియే రాముడు నిన్నిటకు పంపినాడు. నీశక్తి అద్భుతము. నీవు మహాయోగివి. రామునకు ఏకాంత భక్తుడవు. నీతో సంభాషించుట ఔచిత్యమే." అని హనుమద్రామాయణమున నున్నట్లు శ్రీ ది।వె। సుబ్బరావుగారు తమ సుందరకాండమున తెలికి యున్నారు.[124]

సమీరకుమారవిజయము: ఇందలి కథాంశమున వాల్మీకి కల్పనమును సవరించెనా అనునట్లు హనుమంతుడు సీతను తన వీపుమీద ఎక్కించుకొని పోయెదనని యేప్రతిపాదన చేయనట్లున్నది. సీతకు తన విశ్వాద్రూపము ఆమె కోరినందున చూపినాడు. పరులకదృశ్యుడై అసురనాథుని విలాస గృహములలో, తత్పరిసర ప్రదేశాలలో చూచి సీత కానరానందున ఇలా తలపోశాడు

ఏలిక దొడ్డ వాడనని యెల్ల కవుల్ విన సన్నుతించినన్
వాలిక తోక పెంచుకొని వచ్చితి నిక్కము జూచి వచ్చెదన్
బాలికనంచు నా ప్రతిన భంగముగా సతిఁగాననన్యిష

జ్వాలిక వంటి వార్త యిక స్వామికి నేమని విన్నవించుదున్ అని మరల అజాండకర్పరముల క్రిందు మీదు చేయుదునా! హేమాచలాన్ని అణగ ద్రొక్కుదునా। తారావ్రజాన్ని పూలపోలిక నేల రాయుదునా? దిగ్గజముల తొండములు త్రుంచి వేయుదునా। అని భావించి తానలా చేస్తే బ్రహ్మరుద్రేంద్రాది దివిజనాయకులు సీతజాడ తెలిపెదరని అలుకతో హర్మ్యశిఖరాగ్ర మెక్కెను. అంతలోనే అతనికి శింశుపావృక్షము కనిపించెను. దాని నీడలో రఘునాథుని స్మరించుచున్న మానినిని చూచెను. 'హా! రఘురామా మోహపుం బట్టపు దేవికిట్టి వెత పాటిలెనే' అని అనుకొని సాశ్రునేత్రుడయ్యెను. అంతట రావణుడక్కడికి వచ్చి మదనవశకర్తియై పలికిన పలుకులు విని వానిని చంప నుంకించి ఆరోషాన్ని తన శేముషీజలంబుచే దూలించి నిగ్రహించుకొనెను. రావణుడు వెళ్లిన తర్వాత త్రిజటాస్వప్నవృత్తాంత కథనానంతరం నిశాచరాం

గనలు నిదురింపగా మారుతి అశోఖి శాఖలదిగి సీతకు ప్రమదంబున సమస్క-రించి తాను రాముని బంటుననీ మారుత వరప్రసాదుడై అంజనానందనుడుగా జన్మించినట్లు చెప్పెను. తనను చూచి నమ్మినచో రాముడిచ్చిన ముద్రికను కను గొనమని యిచ్చెను. ఆ ఉంగరాన్ని చూచి సీత ఆనందించి తన ప్రాణములు హనుమంతుడు నిల్పినందుకు

"నీకు దీవన వినానాచేతగాదొండు సత్యాకల్పంబుగ వృద్ధిబొందు మిక నీవాకల్ప పర్యంతమున్ కాకుస్థాన్వయ రక్షణ" .... .... అని వరమిచ్చెను. "బంటునైన నన్ను వినుతించుదేల" అని పలికి రామునికి ప్రత్యభిజ్ఞకై చూడా మణిని కోరెను. సీత అంతట, 'నీవు నీ నిజరూపాన్ని చూపినచో శిరోమణి'నిత్తు నని పలుకగా హనుమంతుడంత తన మేను పెంచి బృహద్రూపము చూపెను. ఆ రూప మామెకు ఇంపు, అరుదు, వెఱపు కలిగించగా

"విపులాకారుడవై జగత్త్రియమావేశించు సర్వాత్మునిన్ గపి సామాన్యునిగా దలంచితిని జక్కంజూడగా శక్యమే అని అతనిని నుతించి యథావిధముగా సూక్ష్మరూపము ధరింపుమనికోరెను. అతడు మామూలు శరీరము ధరింపగానే సీత అతనికి తన శిరోమణిని యిచ్చెను. స్వీకరించిన హనుమంతుడు

"అమ్మా! నీ ముదశ్రు వర్షమ్మునకాది గర్జయగు రామధనుర్గుణ ఘోష ణంబు కాగ"లదని ఆమెకు ధైర్యం చెప్పి వీడ్కొని వచ్చెను.

అన్యభాషాగ్రంథములు: రామచరితమానస్ ప్రకారం. సీతను వెదకుచు హనుమంతుడు శత్రువులు శయనించి యుండగా చూచుట శుభప్రదమని అంతః పురములలో సంచరించెను. లంకలో తిరుగుచుండగా అచట విభీషణుని యింటిపై శ్రీరామనామాక్షరములతడు చూచెను. ఆ గృహాంగణమున తులసీ బృందావనముండెను. అది చూచి హనుమంతుడు తనలో తాను ఆలోచించు కొనెను. అప్పుడా మందిరములో విభీషణుడు రామనామము స్మరించుచుండెను అతడు సత్పురుషుడని హనుమంతుడు గ్రహించి సంతోషించి 'నాసందేహము నితనితో చెప్పినచో బాగుండు'నని నిశ్చయించి బ్రాహ్మణరూపం ధరించి విభీష ణునితో ప్రసంగించుటకు సిద్ధముగానుండెను. విభీషణుడే అతనికెదురేగి 'బ్రాహ్మణవర్యా, మీ వృత్తాంతము తెలుపుడు. మిమ్ము చూచిన నాకు ఆనం దము కలుగుచున్నది. మీరు రామదాసులా! అయినచో మీదర్శనము నాకు గొప్పభాగ్యము. "అని అనెను. హనుమంతుడు శ్రీరామునికథ తన వృత్తాం

తము తెలిపెను. అపుడు విభీషణుడు" స్వామి రెండుదంత పంక్తుల మధ్య నాలుకలాగా నేనీనగరంలో ఉన్నాను. నేను దీనుడను. దిక్కులేనివాడను, నన్ను రాముడు కటాక్షించునా! అని అనగానే, "ఆర్యా, కులీనతలేనిహీనజన్మ మైన నాకంటే వానరమునే ఆదరించిన రాముడు నిన్ను ఆదరింపకపోడు" అని తెల్పి అతనిద్వారా సీత వృత్తాంతమెరింగి అశోకవనముకడకు వెళ్లెను.

సీత అశోకవనములో దుఃఖించుచుండగా జాలిపడిన హనుమంతుడు శింశుపావృక్షము నెక్కి శ్రీరాముని ఉంగరము జారవిడిచెను. ఆ ఉంగరమును చూచి సీత ఆశ్చర్యపడుచుండగా ఆంజనేయుడు రామకథ గానము చేసెను. అది విని, సీత 'తమ్ముడా, నాకు ప్రత్యక్షము కారాదా' అని అనెను.[125]

నిద్రించుచున్న మండోదరిని జూచునపుడు ఆనందముతో హనుమచేసిన పని జాతి, ధర్మప్రకోపముగా ఒక ఆంగ్ల పండితుని భావన. [It is his apish rashness - ALIOS WVRM][126]

సీతను తన వీపుపై మోసుకొని వెళ్లగలనని చెప్పినపుడు సీత నీ కోతి బుద్ధి చూపావుకదా అని అనిన పలుకులు హనుమంతుని కించపరచినందునే అతడు తన విరాడ్రూపము చూపెనని శ్రీ శ్రీనివాస శాస్త్రిగారి అభిప్రాయము– He felt a little piqued. He flet that for the first time he was insulted grossly. In this matter he failed but was in he end glad to have failed for SITA Convinced him that that was the right course.[127]

## 3 సీతాసందర్శనానంతర కర్తవ్యము గూర్చిన ఆలోచన

వాల్మీకి రామాయణ ప్రకారము: తన తర్వాత కర్తవ్యమును గూర్చి హనుమంతుడిట్లు రాజనీతి సంప్రదాయానుసారమాలోచించెను. "సీత జాడ తెలుసుకొని ఆమెతో మాట్లాడుట అను పని నెరవేరినది. రావణకథ రాముని కర్తవ్యముగా సీత తెలిపినందున రామ రావణయుద్ధమనివార్యము. అట్లే రావణుని బలాబలములు వాని అభిప్రాయములు తెలియవలసియున్నది. నేనేదో ఒక నెపము పెట్టి రావణుని సైన్యాన్ని యుద్ధానికీడ్చి వారిలో కొందరిని వధించినచో ఈ రాక్షసులు కొంత పొగరు తగ్గి మెత్తబడగలరు. సీతా సందర్శన

మొక్కటే నాకు లక్ష్యముగా ప్రభువు నిర్ణయించినను దానికంగభూత ములగు ఇతర కార్యములను గూడ నాయంత నేనే నిర్ణయించుకొని చేయుట దూతగా నాధర్మము. ఎంత చిన్న పనినైనా దానిని నెరవేర్చుటకైయుండు ఉపాయములన్నీ వెదకి నిర్భయముగా కార్యము నెరవేర్చాలి. రావణాదుల బలసంపదల గూర్చి రామాదులు నన్ను ప్రశ్నించినచో వారికి నేను తగిన సమాచార మందియ్యవలెను. బలములో నాకూ. రాక్షసులకూగల భేదము తెలిసికొని నేను వెళ్ళినచో నిజమైన బంటు నను యశమును పొందుదును. అహంకరించియున్న రావణునకు నా బలము చూపుటకూడ అవసరము. రాముడు ఒంటరివాడనీ, ఏ సహాయము లేనివా డనీ తలంచు రావణునకు సుగ్రీవుని సైన్యపరాక్రమాదుల స్వరూపము రుచి చూపించుట నా కర్తవ్యము. ఈ రావణుని ఉద్యానవనము నందనవనమువలె నున్నది. నేను దీనిని విరచినచో నిజముగా రావణునకు నాపై కోపము వచ్చును. అంత వాడు నాపైకి సైన్యాదులపంపును. తప్పక యుద్ధముజరుగును. అపుడు వాని పరివారమును తప్పక నిర్జించగలను" అని భావించి అంజనేయుడు అశోకవనంలోని వృక్షాలను, లతలను, క్రీడా పర్వతములను, లతా గృహము లను నాశనమొనర్చి దావాగ్ని కాహుతియైన వనమా అని అనునట్లొనర్చెను. కూకటివ్రేళ్లతోగూడ పెకలించి నేలపాలు చేయునపుడు కీడును సూచించుచు పక్షులు అరచుచు పోవుటను, వృక్షాలు నేలకూలుచో 'దభీ' మను శబ్దములను వినిన రాక్షసస్త్రీలు తాము కావలియున్న సీతకేప్రమాదము కలిగెనో అని భావించి ఆమె దగ్గరకు పరుగెత్తిరి. వారినిచూచి హనుమంతుడు వారిని భయపెట్టుటకై, ఘోరమై భయంకరమై యుండునట్లు తన శరీరాన్ని పెంచ సాగెను. అతనిని చూచిన రాక్షసులు ఆ వానరమెవరో, ఏలవచ్చెనో, సీతతో ఏల భాషించెనో తెలుపుమని గద్దించి పలికిరి. అప్పుడు సీత పాముల జాడలు పాములకే తెలిసినట్లు రాక్షసులమాయలు రాక్షసులకే తెలియునని, వీడెవడో రాక్షసుడే యీ రూపమున వచ్చినాడేమోనని సీత చెప్పగానే కొంద రామె మాటలకు భయపడి రావణునకు విషయాన్ని విన్నవించుటకు వెళ్ళిరి. సీతాదేవి యుండు ప్రాంతమునుగానీ, ఆమె ఆశీనయైయున్న చోటుగల శింశుపావృక్షాన్ని గానీ ఏమియు చేయకుండా ఆమెను కాపాడినట్లు వ్యవహరించుచు హనుమంతుని శిక్షించుటకు రావణుడు ఎనిమిదివేలమంది సైన్యమును పంపెను.

వచ్చుచున్న ఆ రాక్షస సైన్యాన్నిచూచి వారితో తనకు యుద్ధము కలుగుచున్నందుకు సంతసించి తన తోకను జాడించి నేలమీదకొట్టి మహాధ్వని కలుగునట్లుగా అరచి ఇంకను పెద్ద రూపాన్ని ధరించి లంక అంతటా ప్రతిధ్వనించునట్లుగా భుజాస్ఫాలనమొనర్చెను. ఆ ధ్వనికే పక్షులు నింగికెగిరి గుండెలవిసి నేలపడినవి. హనుమంతుడు రామ లక్ష్మణ సుగ్రీవులకు జయహో నాదములుచేస్తూ—

దాసుడ సర్వసద్గుణ వితాన మనోహర రామమూర్తికిన్
గోసలదేశ వల్లభునకున్ హతశత్రుడ వాయుపుత్రుడన్
నాసరిగారు సంగరమునన్ దశకంఠులు వేవురేనియున్
వాసి యడంతు ఖ్రాల ద్రుమపాళుల నే హనుమత్సమాఖ్యుడన్.

—అని ప్రకటించెను. "ఈ లంకను మీరు చూచుచుండగనే నాశనమొనర్చి సీతాదేవికి మ్రొక్కి కృతార్థుడనై పోయెదను" అని అరచెను. రాక్షసులు హనుమంతుని దగ్గరకు చేరుటకు భయపడి దూరమునుండియే "ఆయుధముల ప్రయోగించుచు పాటుపడిరి. అపుడాంజనేయుడు ఉద్యానవనద్వారముననున్న ఇనుపగుదియను లాగి ఆ రాక్షసులపై వేయగా వారందరు నుగ్గునుగ్గయిపోయిరి. కింకరులు ఈ వార్త రావణునకు తెలుపగా అతడు ప్రహస్త పుత్రుడగు జంబుమాలిని పంపెను. జంబుమాలి పరాక్రమస్ఫూర్తితో ఆయుధ సామగ్రితో వచ్చుచుండగా హనుమంతుడు ఉద్యానవనమువదలి చైత్యప్రాసాద విధ్వంసమునకు పూనెను. ఆ ప్రాసాద మధిరోహించిన హనుమంతుడు రెండవ సూర్యుడో అనునట్లుగా ప్రకాశించెను. హనుమంతుని గర్జనలకు రాక్షస వీరులు మూర్ఛపోయిరి; పక్షులు నేలకూలినవి. 'దాసోఽహం కోసలేంద్రస్య' అను సూక్తిని వల్లించుచు చైత్యప్రాసాద స్తంభమునుపీకి దానిని రభసముగా త్రిప్పగా దాని రాపిడికి నిప్పుపుట్టి ఆ చైత్యప్రాసాదమంతయు భస్మమాయెను. ఆ స్తంభంచేతనే నూరుమంది రాక్షసులనుచంపి ఆకాశానికి ఎగిరి 'ఓ లంకా వాసులారా! వినుడు. నావంటివారు వేలమంది సుగ్రీవుని సైన్యములో నున్నారు. వారంతా సీతాన్వేషణలో నున్నారు. వారిలో కొందరు పదివేల ఏనుగుల బలము కలవారు కొందరు సహస్ర గజతుల్యులు; వాయువేగము గలవారు; నఖములు, దంతములు ఆయుధముగాగలవారు. వారినెల్ల సుగ్రీవుడు మీపైకి నడిపించును. మీరు నిష్కారణముగా రామునితో విరోధించినారు.

మీ ప్రభువు రావణుడే దక్కడనగా ఇంక మీరుందురా? అందరూ చనిపోవుట నిశ్చయము. "అని రాక్షసుల తేజోహీనుల చేయు మాటలనాంజనేయుడు పలుకుచుండగా జంబుమాలి అంజనేయునితో పోరాడుటకై వచ్చెను. గాడిదలు కట్టినతేరుమీద పెద్దవింటితో వచ్చిన జంబుమాలిని చూచి అంజనేయుడట్టహాస మొనర్చెను. వాడు పదిబాణాలు ఆంజనేయుని బాహువులలో ముఖములో నాటుకొనునట్లు వేసెను. అవి తగిలి నెత్తురు కారగా సూర్యకిరణములచే విక సితమైన శరత్కాల కమలములవలె అంజనేయుని ముఖముండెను. ఉగ్రుడై వాయుజుడు పెద్దబండ నొకదానినెత్తి వానిపైకి విసిరెను. వాడు దానిని ఖం డించి ఆయుధమ్ములతో ఆంజనేయుని బాహువులను, ఒక బాణముచే వక్ష స్థలాన్ని, పదిబాణాలచే స్తనప్రదేశాన్ని కొట్టెను. వానితాకిడికి నొచ్చియు హనుమ ఒక సాలవృక్షాన్ని పీకి గిరగిర త్రిప్పి వానిమీదికి వేయగా వాడు దానిని ఖండించెను అప్పుడు హనుమ పరిఘను మరల తీసుకొని త్రిప్పి వాని రొమ్ము తగులునట్లుగా గురిచూచి కొట్టెను. ఆదెబ్బకు వాని తల, చేతులు, ధనువు, రథము, గాడిదలు గుర్తింపరానివై చూర్ణమై పడిపోయెను. ఈ వార్త రావణునకు తెలిసెను.

రావణుడు మంత్రికుమారుల నేడుగురిని పంపెను. వారు అహమహ మికతో స్వర్ణస్యందనములధిరోహించి బాణవర్షమును ఆంజనేయునిపై కురిపిం చిరి. హనుమంతుడంత ఆకాశానికెగిరి పదనఖకుంతములతో వారిని కొట్టి, చీల్చి చంపెను. వధింపబడిన రాక్షస కళేబరములతో, యుద్ధ సామాగ్రి చూర్ణముతో, గజాశ్వముల ధ్వనులతో, రక్తపు ప్రవాహములతో లంక వికా రముకాగా యుద్ధమునకీమారింకెవరైనా రాగలరని భావించుచు హనుమ ఉద్యానవనతోరణ ప్రదేశమునకు చేరి వారి రాకకై నిరీక్షించెను.

పంచసేనాధిప పతనము: ఈవార్తవిని కొంత భీతిల్లిన రావణుడు విరూ పాక్ష, దుర్ధర, యూపాక్ష, ప్రఘస, భాసకర్ణులను అయిదు మంది సేనాపతు లను హనుమంతునిపైకి పంపెను. 'ఆకోతి సామాన్యమైనదిగా కనపడుట లేదు. దానిని ఇంద్రుడే పంపెనేమో—మీరు హెచ్చరికతో మీ పరాక్రమము చూపుడు' అని రావణుడు వారికి మెళకువలను తెల్పియుండెను. వారు ఉద్యానవనతోరణ సమీపమునకు వచ్చి మహాకాయుడు, మహామతి మహా వేగుడు, మహాబలుడు, మహాసత్త్వుడు, మహోత్సాహుడు అగు మహాకపినిచూచి

తాము తెచ్చిన ఆయుధములను ప్రయోగించిరి. దుర్ధరుడు నూరు బాణములను హనుమంతునిపై కురిపింపగా వానినెదుర్కొని హనుమంతుడు వాని తేరుపైకి దుముకగానే వాడును, వానితేరును, గుఱ్ఱములును నేలకొరిగెను. అది చూచి విరుపాక్షయూపాక్షులు హనుమంతుని రొమ్మును చీల్చుటకై ముద్గరము నెత్తగా చెట్టునొకదానిని వారిపైకి వాతాత్మజుడు వేసెను. దానినుండి కాపాడుకొనలేక వారు చచ్చిరి. అట్లే పర్వతమును పెళ్లగించి ప్రఘస, భాసకర్ణుల పైకేసి వారిని నిర్మూలించి హనుమంతుడు మిగిలిన సైన్యములో గుఱ్ఱములను ఎత్తి గుఱ్ఱములపై, ఏనుగులపై ఏనుగులను, భటులను భటులపై, రథాలపై రథాలను ఎత్తి విసరివేసి మొత్తం సైన్యాన్ని నాశనంచేసి తోరణద్వారము చెంత లయకాలుని వలె నుండెను.

అక్షకుమారవధ: పంచసేనానులు పంచత్వమొందగానే రావణుడు తన ఔరసపుత్రుడగు అక్షయకుమారునివైపు చూచెను. అదృష్టిమాత్రసంజ్ఞనే ఆజ్ఞగా స్వీకరించి యుగాంతకాలాగ్నివలె యుద్ధమునకు వచ్చి అక్షుడు ఆంజనేయుని సగౌరవముగా చూచి అతని జవసత్త్వాదులను తన బలాదులతో పోల్చుకొని 'యితనిని యుద్ధమున జయించుట కష్టము' అని తలంచి కోపించి హనుమపైకి వచ్చెను. దేవతల గుండెలదురునట్లు గొప్ప పోరాటము వారిరువురకు సాగెను. అక్షుని బాణాల వలన నెత్తురు కారుచు గాయపడిన హనుమ తన చూపులతోనే అక్షుని సేనలను, వాహనములను దహించెను. అది చూచి వాడు బాణములతో హనుమ బాహువులను భేదించెను. వాని శరసంధాన చాతుర్యమునకు సంతోషించి మెచ్చుకొని వాని కనుగప్పి వానికాపద గూర్చుటకు మనసురాక ఆలోచించుచుండగా వానిలో నేర్పు, తీర్పు, ఓర్పు అతిశయించుచుండుట గమనించి వానినుపేక్షించినచో తనకు అపకీర్తి కలుగునని యెంచి తన దేహము పెంచి తన అరచేతి ప్రహారములతో వాని వాహనములను నేలకూలదన్నెను. వాడంత నేలకు దిగి కత్తితో హనుమపైకిరాగా హనుమంతుడు వాని రెండు కాళ్లను పట్టుకొని గరుత్మంతుడు పామును విదిల్చినట్లు వానిని నేలపై మోదిమోది చంపెను. వాని కండలు, ఎముకలు, నెత్తురు భూమినంతటిని నింపి బడలిక తీర్చుకొనుటకై తోరణమందు ప్రళయకాలునివలె నుండెను.

ఇంద్రజిత్తుతోపోరాటము: అంత రావణుడు తన కుమారుడగు ఇంద్రజిత్తును చూచి 'కుమారా, ఇంతవరకు పోయినవారు తమ భుజపరాక్రమముతో

ఆయుధములతో వెళ్లిరి. బాహుబలానికిగాని, శస్త్రాస్త్రములకుగాని ఆ కోతి లోబడునట్లు తోచదు. నీకెన్నో అస్త్రములు తెలియును. నిర్జరుల నోడించిన చరిత్ర గలవాడవు. మాయవిద్యలు నీకు తెలియును. ఏ సందర్భమునకే విద్య ప్రయోగించ వలయునో జాకరూకతతో ప్రయోగించి యత్నింపుము. కాలము వృథా చేయక నీ శక్తిని వాని శక్తిని పోల్చుకొనుము. నీ రక్షణ భారము సేనమీద ఉంచి ప్రమాదమున పడకుము. సేన లెన్ని తాకిన ఆకోతి వాటిని త్రుంచ గల్గుచున్నది. వజ్రాయుధముతో వాని పైకి వెళ్లకుము. ముష్టియుద్ధము చేయకుము," అని పలువిధముల జాగ్రత్తలు చెప్పి రావణుడు పంపగా వాడు రథమున అంజనేయుని చేర వచ్చెను. ఆ రథనేమి ధ్వని, ధనుష్టంకారాదుల గమనించి పొంగి ఆంజనేయుడు సింహనాదము చేసెను. ఆ ధ్వనికి కొండలు బ్రద్దలగుట, మేఘములు చెదరిపోవుట, ఇంద్రజిత్తు చూచెను. వారిరువురి మధ్య ఘోరమైన యుద్ధము జరిగెను. వాని బాణాలు వృథాయగునట్లు వేగముగాచరించుచూ, ఒక్కొకసారి ఎదుటపడుచు మరొక్క సారి ఆకాశానికికెగురుతూ అంజనేయుడు పోరాడగా వారిలో పరస్పర తార తమ్యము వేర్పరుపలేనంతగా పోరు సాగెను. కార్యసాఫల్యమునకై ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమువేసి అంజనేయుని కట్టివేసెను. అపుడు బ్రహ్మ తన కిచ్చిన వరమును స్మరించి అతని ఆజ్ఞను మీరజాలక వారికి తాను చిక్కినను బ్రహ్మేంద్రవాయుదేవులు తనను రక్షింపగలరన్న విశ్వాసముతో నిర్భీతుడై కదలక మెదలక ఉండెను. అపుడాంజనేయుడు తనలోతాను ఈ విధముగా తలపోసెను. "ఈ రాక్షసులు నన్ను పట్టుకొని రావణుని వద్దకు తీసుకొని పోగలరు అక్కడ వానితో సంభాషించుటకు వీలగును అదియు మేలేకదా!" — అని భావించుచుండగా ఇంద్రజిత్తు సైనికులలో కొందరు అంజనేయునిపై పడి త్రాళ్లతో, నారచీరలతోకట్టివేసిరి. వారి చేతలకు హనుమంతుడు తన కోతి గుణము తెలుపు కూతలు పెట్టెను. బ్రహ్మాస్త్రమును అవమానించుచు త్రాళ్లతో ఆంజనేయుని తన సైనికులు బంధించుట వలన తన ప్రయత్నము విఫలమైనను దానినాకోతి తెలియకున్నదని ఇంద్రజిత్తు భావించెను. రాక్షసులు హను మంతుని కట్టెలతో కొట్టుచు, పిడికిళ్లతో పొడచుచు ముష్టిప్రహారము లొసంగుచు "తెచ్చామయ్యా కోతిని" అని అరచుకొంటూ రావణుని కొలువునకు లాగుకొని వెళ్లిరి.

# 4 రావణసభలో హనుమంతుడు.

రావణుని మణిమయ సభామండపమునకు 'రా, రా' ఇటు రా, రారా' అని హనుమంతుని రాక్షసులు ఈడ్చుకొనుచు వచ్చిరి. దూరమునుండియే అతనికి రావణుడు కన్పించెను. సూర్యునివలె ప్రకాశిస్తూ తేజోబలయుతుడగు రావణుడు క్రూరముగా హనుమంతుని చూచుచు తన సమీపస్థులగు మంత్రులతో 'వీడెవ్వడో మీరడిగి తెలుసుకొనుడు" అని ఆజ్ఞాపించెను. వారతనిని ప్రశ్నించిరి. "నేను సుగ్రీవుడు పంపగా వచ్చిన దూతను" అని బదులుచెప్పి హనుమంతుడు రావణుని నిర్లక్ష్యపరచు చూపులతో చూచుచు వానిని గూర్చి యిట్లు తనలో అనుకొనెను. "అహా ఏమి వీనిరూపము ఏమి వీనితేజము, ఏమి వీనిబలము, సమస్తరాజచిహ్నములున్న వీడు అధర్మకార్యాలొనర్పకుండినచో వీడు స్వర్గాన్నే పాలించేవాడేకదా! భూతదయారహితుడై దూష్యమైన కార్యములచేసి దానవుడైనాడు. ఇట్టి తేజోవంతునడ్డగించువారుందురా?" అని తల ఊపెను. హనుమంతుని చూచుచు రావణుడుకూడ తనలో "ఈ పింగాక్షుడగు వాడు వానరుడా! లేక కైలాసమును పెకలించు వేళలో నన్ను శపించిన నందియా! ఏమివీని తేజోబలవిశేషము! సాక్షాత్ బాణుడే కోతిరూపాన వచ్చెనా! "అని సందేహించెను. అంత రోషతామ్రాక్షుడై ప్రహస్తుని చూచి"దుష్టుడెవడో, లంకకు ఏల వచ్చెనో, ఎవరు పంపిరో, అశోకవనమునేల ధ్వంసమొనర్చెనో, రాక్షస స్త్రీల నేల తర్జించెనో అడిగితెలుసుకొను"మని కోరెను. అపుడా ప్రహస్తుడు అంజనేయునిచూచి ఎట్టి సంబోధన చేయక 'ఓయీ నీవు ఊరడిల్లుము. భయపడకుము. నిజము చెప్పుము. నీవు చెప్పేది నిజమైనచో నిన్ను వదలి పెట్టెదము. నీకు మేలే జరుగును. నిజము దాచితివో నీకు ప్రాణాలు దక్కవు. నీవు వానరదేహముతో ఉన్నావే కానీ నీప్రభావం అద్భుతంగా ఉన్నది. నిన్ను ఎవరు పంపిరి? ఇంద్రుడా, యముడా, కుబేరుడా లేక రావణుని జయింపగోరి ఆ విష్ణువే నిన్నిక్కడకు దూతగా పంపెనా? మారువేషమున వచ్చిన గూఢచారివలె ఏల లంకా నగరానికి వచ్చితివి! ఉన్నదున్నట్లు వచింపుము" అని ప్రశ్నించెను. హనుమంతుడతనిని సరకుసేయక రావణునే చూచి 'దనుజేంద్ర! నా వృత్తాంతము నిజము చెప్పెదను వినుము. ఇంద్రయమాదులు పంపగా నేను రాలేదు. కుబేరునితో నాకు ఏనాడును చెలిమిలేదు. మరి విష్ణుప్రేషితుడను కాను. నేను అచ్చముగా కోతిజాతివాడినే. నీ దర్శనమునకై ఉద్యానవన

మును పాడు చేసితిని. యుద్ధకాంక్షలో రాక్షసులు రాగా ఆత్మరక్షణమునకై వారితో పోరాడితిని. ఇంద్రాది దిక్పాలురు గూడ నన్ను అస్త్రములచే కట్ట జాలరు. నేనును బ్రహ్మచే వరములు పొందినవాడనే. బ్రహ్మాస్త్రమువేసియు నీ భృత్యులు నన్ను త్రాళ్లతో కట్టినందున అస్త్రబంధము లూడిపోయినను నిన్ను చూడదలచియే వారికి పట్టుబడినట్లుండి ఇక్కడికి వచ్చితిని. నేను శ్రీరామ చంద్రుని బంటును. సుగ్రీవుని ఆజ్ఞచే ఒక రాజకార్యముమీద వచ్చితిని. నీవు మేలైన నా పలుకులను శ్రద్ధగా వినుము. నీ తమ్ముడగు ఆ వానరరాజు నీ కుశలమడిగి యున్నాడు. నీకు ఇహపరసుఖదాయకమగు ధర్మోక్తిని చెప్పి పంపినాడు. దానిని వినుము." అని హనుమ సుగ్రీవునిచే చెప్పబడిన మాటలలో దశరథ మహారాజు పుత్రుడగు రాముని కథను సీతాపహరణమును వాలివధను సుగ్రీవ వానరప్రభుత్వమును తెలిపిన తర్వాత, మరల ఆంజనేయుడిట్లు చెప్పెను. "సుగ్రీవుడు వేనకువేలు వానరములను సర్వదిక్కులకు పంపి యున్నాడు. గరుడానిలవేగులగు వానరులెందెందరో కలరు. సీతాన్వేషణకై వచ్చినవారిలో నేనొకడిని. నేను వాయుకుమారుడను. నాపేరు హనుమంతుడు శతయోజనాయతమైన సాగరమునుదాటి నీ నగరానికివచ్చి నీ గృహములోనే సీతను చూచితిని. ఇదియంతయు సత్యము. ఎన్నో ధర్మశాస్త్రములను చదివిన వాడవై, తపోధనుడవై పరస్త్రీలను బాధించుట ధర్మమా? ధర్మచ్యుతితో సమూలముగా నిన్ను నాశనము గావింపగల అట్టి కార్యం నీవంటి ప్రాజ్ఞుడు చేయదగునా? సురాసురులలో ఎవరునూ ఆ రామలక్ష్మణుల బాణముల కెదురు నిలువజాలరు. రాముని కపకారము చేసినవారు ఈ ముల్లోకములలో ఎక్కడనూ సుఖపడలేరు. నీవు త్రికాలహితమును ధర్మబద్ధమునైన సుగ్రీవుని వాక్యములను వినుము. సీతను శ్రీరామునకిమ్ము. ఆమె జాడ తెలిసికొనుటయే నా కర్తవ్యమైనందున అనంతర కార్యములు శ్రీరాముడే ఆజ్ఞాపింపవలసి యున్నది. సీతాదేవిని నీవు స్త్రీమాత్రముగా తలంచినావు. ఆమె పగగొన్న కాలభుజంగి. ఆమెను గ్రహించుట విషాన్నమును గ్రహించినట్లే. నీవు తపస్సుచే గడించుకొన్న అవధ్యతావరములన్ని ఇపుడు నిన్ను రక్షింపజాలవు. సుగ్రీవుడు దేవదానవగంధర్వ నాగయక్ష రాక్షసులలోనికి చేరినవాడుకాడు. కావున నీవు బ్రతుకజాలవు. మానవుని పాపఫలము, పుణ్యఫలము రెండునూ ఒకేసారి అనుభవమునకు రాజాలవు. ఇంతవరకు నీ వొనర్చిన తపోరూప ధర్మఫలముల ననుభవించినావు. ఇకపై అధర్మ ఫలితములనే అనుభవింపబోవు చున్నావు.

జనస్థానములో పడిసిన రాక్షసులగాథలు, వాలివధ, రామసుగ్రీవ సఖ్యము అనునవి నీకు సుఖకరమైన సూచనలా! తలపోయుము—

"నేనొకరుండనే కడిమి నిర్మథనంబొనరింప నేర్తులం
కానగరంబు సర్వమును గాని వధింపడు రాముడవ్విధిం
దానె వధింతునంచు ప్రతినవన్ వచియించె"

—అందువలననే నిన్ను నేనేమియు చేయజాలకున్నాను. రామునకపకార మొనర్చి యింద్రుడే సుఖింపజాలడు. ఇక నీ వంటివాని సంగతి వేరె చెప్పాలా! ఇపుడు నీ వశములోనున్న జానకి ఎవరనుకొన్నావు? నీ లంకను సర్వనాశనము చేయుటకై వచ్చిన కాళరాత్రి. నీ మెడపై పడనున్న కాలపాశము. నీవు నిన్నూ, నీ లంకనూ కాపాడుకొనదలచినచో ఆమెను వదిలిపెట్టుము. యోగ్యపద్ధతి గ్రహింపుము. రాముని కోపాగ్నికి, సీత పాతివ్రత్యానికీ నీవూ, నీవారూ ఆహుతి కానీయకుము. నేను దూతగా వచ్చిన వానరుడను. రాముని దాసుడనై హితము బోధించినాను. నా పలుకులను స్వీకరించినచో నీకు మేలు కలుగును. సమస్త స్థావరజంగమ ప్రపంచాన్ని తన శక్తిచే సంహరించగలవాడు రాముడు, అంతేకాక దానినంతటిని మరల సృష్టింపగలవాడుకూడ. పరాక్రమములో విష్ణువైన అతనిని ఏకకాలములో ఎల్లప్రదేశములలో ఎవరూ జయింపజాలరు. అతడు జగన్నాథుడు. అతనికి ద్రోహముచేసిన నీవు ఏవిధంగా ఆలోచించినా బ్రతుకుట కష్టము. యుద్ధమున రామునిచే చావవలసిన వానిని బ్రహ్మరుద్ర మహేంద్రాదులు కూడా కాపాడజాలరు–" అని హనుమంతుడు నిర్భయముగా చెప్పిన మాటలు తనకు నచ్చనందున రావణుడు కోపముతో "ఈ కోతిని చంపుడు" అని ఆజ్ఞాపించెను.

అప్పుడు పండితుడైన విభీషణుడు తన అన్న కనేక విధముల హితోక్తులు తెలిపి దూతను చంపరాదనియు తగు దండన విధించవచ్చుననియు అందుకై శాస్త్రమున "దేహమును బాధించుట, తలగొరిగించుట, అవయవహీనునిచేయుట, కొరడాతో కొట్టుట, వాతలతో గుర్తులు వేయుట" అను పద్ధతులలో దేనినైనను ఆజ్ఞాపించవచ్చునని తెలిపెను. దూతను వధించినను అది విరోధిని నిర్మూలించుట కాజాలదనియు తన ప్రభువు ఆజ్ఞానుసారము పలికిన దూతను చంపుట నీతికాదనియు అందులోను కోతిని చంపుట రావణునివంటి వీరునికి తగదనియు బహువిధముల చెప్పగా రావణుడాలోచించి విభీషణుని మాటలను ప్రశంసించి

"ఈ కోతి చుట్టాలూ, స్నేహితులూ వీనిని చూచి నవ్వునట్లుగా వీనికి అవయవ విరూపతఘటించుటకై వీని తోకను కాల్చుచు మన నగరములో త్రిప్పుడు" అని దండన విధించెను. ఆజ్ఞ వెడలినదే తడవుగా రాక్షసులు హనుమంతుని తోక కాల్చుటకై పాతగుడ్డలుతెచ్చి నూనెతో తడిపి తోకకు చుట్టిరి. అపుడాంజనే యుడు తన శరీరమును పెంచ నారంభించెను. రాక్షసులు చెలరేగి తోకకు నిప్పు పెట్టిరి. ఆ తోకతోనే హనుమ వారిని కొట్టెను. కాని అంతలోనే అతడు మరల తన కర్తవ్యమును గూర్చి ఆలోచింపసాగెను. "నన్ను బాధించు ఈ రాక్షసులను చంపుట వలన నాకేమి ప్రయోజనము? నేనేమి చేసినా అది రామకార్యమునకు భంగకారి కారాదు. తలచినచో వీరినందరిని నేనొక్కడనే చంపగలను. పురజనుల వేడుకకై వీరు నన్ను నగరమంతా త్రిప్పెదరు. వీరి బాధల నేను సహించెదగాక. లంకను నేను రాత్రివేళలో మాత్రమే చూచి యున్నాను. ఇపుడు పగటివేళలో దానిని చూచి దుర్గరక్షణ విధానము గ్రహించి నచో అది ప్రభుహిత కార్యమగును. వీరి "చేష్టావిపరీతవర్తనల సర్వము తీర్చెద వడ్డీతోన్" అని హనుమంతుడాలోచించి వారు పెట్టు బాధలను సహించి మిన్నకుండెను. భేరికాహళాది వాద్యములతో తరలి రాక్షసులు హనుమంతుని తిట్టుచు కొట్టుచు వాడవాడలలో త్రిప్పసాగిరి. లంకలోని వీధులు, వాడలు, త్రోవలు, గూఢప్రదేశములు, సందులు, గొందులు అన్నియు సామీరి గమనించుచు వారి ననుసరించెను. హనుమంతుని శత్రుగూఢచారిగా వారు ప్రకటించుచుండ ఇండ్లలోని స్త్రీ బాల వృద్ధాదులందరును అతనిని సంతోష ముతో చూచిరి.

హనుమంతుడు లంకను దహించుట: తన తోకకు నిప్పువలన అపాయమే మాత్రం లేకుండుటేకాక తోకనుండి వచ్చు గాలికూడ చల్లగా నున్నందుకు ఆంజనేయుడాశ్చర్య పడెను. అది రామ మహిమగా నతడు భావించెను. సీతా మాత దయవలన అగ్ని నాకపకార మొనర్పకున్నాడని తలంచెను. రాక్షసుల వలన హనుమంతుని తోకకు నిప్పు పెట్టిరని తెలిసిన సీత అగ్నిని హనుమకు 'శీతోభవు'డగునట్లు ప్రార్థించినట్లు హనుమంతునకు తెలియదు. కాలుచున్న తోకతో సింహనాదంచేస్తూ లంకానగరద్వార గోపురమునెక్కి అచట అతడు తన దేహమును చిన్నదిగా చేయగా కట్టిన కట్లన్నియు వదలిపోయెను. మరల దేహాన్ని పెంచి తోరణాశ్రితమైన గుదియనుకొని కావలి రాక్షసులను చంపెను.

లిన వాలాగ్నిలో ఇండ్లు, మేడలు కాల్చి వేసెను. విభీషణుని మందిరమొక్కటి తప్ప తక్కిన పేరుగల రాక్షస నిలయములన్నియు కాల్చెను. పౌరులు, బాలురు, వృద్ధులు ఆర్తులై పరుగెత్తిరి. దగ్ధమైన భవనములలోని బంగారు వెండి మణి మాణిక్యాదులు కాలి వివిధ రంగుల దాల్చెను. పీనుగుల కుప్పలు జంతుకళేబరములు రాశిగా పడెను. ఆ భీభత్స దృశ్యము చూచినవారు అతడు ఇంద్రుడో, అగ్నియో, యముడో, సూర్యుడో, చంద్రుడో, రుద్రుడో అని భావించిరి. అతడొక అప్రాకృత వానరునిగాను విష్ణుతేజమే ఆ ఆకారమొందిన నట్లుగను భావించిరి. దివినుండి చూచు దేవగంధర్వాదులాంజనేయుని చర్యల కానందింపసాగిరి. లంకానగరం కాలి, మసియై బూడిదకాగా హనుమ రాముని చేరుటకై త్రికూటపర్వతాన్ని అధిరోహింపపోయెను.

ఆ పర్వతాన్నుండి సాగరతీరంచేరి వాలాంతాగ్ని చల్లార్చి ఆంజనేయుడు లంకానగరం వైపొకసారి చూచెను. వెంటనే అతనికి 'సీతామాత' గుర్తుకువచ్చి "అయ్యో! ఆవేశములో నెనెంత అకార్యమొనర్చితిని? సీతకేమి ఆపద కలిగెనో కదా! కోపమెంత పనిచేయించునోకదా! క్రోధ నిగ్రహము చేయలేనివాని కన్నియు అనర్థములే." అని తన దుడుకుతనమునకు పశ్చాత్తాపముతో క్రుంగి తన అకార్యము వలన స్వామికార్యము భగ్నమైనందుకు పరిహారముగా తన ప్రాణములను త్యాగమొనర్చుటకు నిర్ణయించుకొనెను. 'నేను అగ్నిలో పడుదునా! జలచరముల కాహారమగునట్లు జడధిలో దూకుదునా! ఎట్లాచేసి మరణించవలెనో తెలియక శోకించుచుండగా అతని శరీరమున భద్రశకునములు ద్యోతకమైనవి. సీతమహత్తు అతనికి గుర్తువచ్చి 'అగ్ని అగ్నిని దహింపగల్గునా! మహాపాతివ్రత్యశీల సంపన్నయైన సీతను అగ్ని దహింపజాలడు. నా వాలమునే దహింప సాహసింపని అగ్ని లక్ష్మణ భరత శత్రుఘ్నులకు పూజనీయమై రామునికి సతియగు సీతాదేవిని ఎట్లు దహింపగలడు.' అని ఆలోచించుచుండగా ఆకాశమందలి ఋషులూ, చారణులు లంకానగరమంతయూ భస్మమైనను సీత నిరపాయముగా నున్నదని పలుకుచుండుట వినినవాడై సంతోషించెను. దానివలన సీత క్షేమముగా నున్నదని గుర్తించి మరల ఆమెను ఒకసారి దర్శించి, క్షేమమడిగి తర్వాత తన తిరుగు ప్రయాణమొనర్ప నిశ్చయించుకొనెను.

వెంటనే అతడు శింశుపావృక్షముచేరి సీతామాతకు మ్రొక్కి—

.... .... తల్లి మదీయ భూరి పు
ణ్యాళి వశంబునం గుశలితాప్తి భరించెడి నిన్ను గంటి నా
యేలిన వాని కార్యతతులెల్లనుదీరె యథోచితంబుగన్.

—అని పలికెను. అప్పుడామె హనుమంతుని ప్రయాణత్వరను గాంచి అతనిని పొగడి తన విమోచనమునకై చేయవలసిన కర్తవ్యమును మరల గుర్తుచేసి రామునికి తెలుపుమని కొన్నిమాటలను తెలిపెను. శోకనివారకమూ ఊరడింపు చేయ దక్షమునూ అగు కొన్ని పలుకులను పావని ఆమెకుచెప్పి నమస్కరించి సెలవొంది బయలుదేరెను.[128]

పరాశర సంహితలో ఈ సన్నివేశములులేవు. ఇతర తెలుగు రామాయణములు చాలవరకు వాల్మీకి చెప్పినవే చెప్పియున్నవి. మొల్లరామాయణమున హనుమంతుడు—

"ఉన్నాడు లెస్సరాఘవుడు, రానైయున్నాడు నిన్నుగొనిపోనున్నాడు"
—అని తెలుపగా ఆమె నేనుపకారమేమియున్

"దవిలియొనర్పలేను వసుధాస్థలి వర్ధిలు బ్రహ్మకల్పముల్"
—అని దీవించినది.

ఆనందరామాయణములో: హనుమత్సందేశానంతరం సీత తన శిరోమణిని హనుమకు ఇవ్వగా దానిని తీసుకొని హనుమంతుడు "స్వామికార్యము చేసితిని. ఇంక ఏదైనా చిన్న చేష్టచేసి పోవలయును" అని నిశ్చయించుకొని సీతతో తనకు ఆకలి, దప్పి అగుచున్నవని తెలుపగా సీత తన చేతి కడియము తీసి "దీనిని విక్రయించి ఫలములనుకొని తినుము కాని వనమందలి ఫలముల నపహరింపకుము" అని అనెను. అప్పుడు మారుతి "తల్లీ ఇతరులిచ్చిన ఫలములను నేను భుజింపను. పరహస్తముల నుండి భోజన పదార్థములను గైకొనకుండు వ్రతము నాది. కావున నేనూరకయే పోయెదను" అని చెప్పగా సీతాదేవి "ఈ వనానికి యజమాని రావణుడు. నీకు సామర్థ్యమున్నచో ఇచట ఫలములను తినుము" అని అనెను. అంతట ఆంజనేయుడు "శ్రీరామమంత్రం శస్త్రమై నా హృదయమున నిల్చియున్నది. ఆ శస్త్ర ప్రభావమున రాక్షసులు నాకు తృణప్రాయులు." అని బదులు చెప్పెను. "అయినచో చెట్లనెక్కి కోయకుండా చెట్లనుండి రాలినవానిని తీసికొనుము" అని సీత చెప్పగా 'సరి'యని సామీరి

చెట్లనన్నింటినీ పట్టి కదల్చెను. సీతఉన్న ఇరుగుడు చెట్టు తప్ప తక్కిన వృక్షాలి నన్నింటిని పడగొట్టి నేలను బయలు గావించెను.[129A]

ఈ రామాయణములో ఇంద్రజిత్తుతో పోరాడిన సందర్భమున మరి యొక కల్పన కన్పించును. తనపైకి సైన్యముతో ఇంద్రజిత్తు రాగా, ఆ సైన్యా నికి ఆంజనేయుడు తన తోకతో ఒక ప్రాకారముకట్టి వారితో పోరాడెను. ఒక వృక్షాన్ని లాగి మేఘనాథునిపై వేయగా వాని అంగములు విరిగిపోయెను. వాడు అంత ఒక గుహలో దాగుకొనెను. అప్పుడు బ్రహ్మ ఆంజనేయుని సమీపించి నా అస్త్రమును గౌరవింపుము. లంకలో రావణుని చూచి వెళ్లుము" అని చెప్పెను. దానికి ఆంజనేయుడంగీకరించెను. అంత బ్రహ్మ ఇంద్రజిత్తు వద్దకువచ్చి "నీ పరాక్రమం ఏమయ్యె? బ్రహ్మాస్త్రంతో బంధించి నీ తండ్రి వద్దకు తీసికొని పొమ్ము" అని చెప్పెను.[129B]

రావణసభలో హనుమంతుని రావణుడే చంపరాగా "దూతను చంప రాదని" విభీషణుడు తన హితోక్తులతో వారించెను. పిమ్మట రావణుడు వీని తోకను కత్తిరించండి" అని ఆజ్ఞాపించెను. తక్షకులువచ్చి కొడవలి, రంపము మొదలైన ఆయుధములచే కోయనారంభించగా వారి ఆయుధములన్నియు వేయారు తునకలై నశించెను. ఆంజనేయుని రోమముకూడ తెగలేదు. దాని నెఱిగి రావణుడు మారుతితో "వీరులు తమ మృత్యువునుగూడ దాచుటలేదు. కాన నీతోక ఎట్లుపోవునో నీవే చెప్పుము" అని అనెను. అంత ఆంజనేయుడు తనకు చావులేదని తెలిపెను. సత్యమును చెప్పుమని రావణుడు మరల అడుగగా ఆంజనేయుడు తనలో "నా తండ్రి మిత్రుడగు అగ్ని భట్టారకునిచే నాకు భయము కలుగజాలదు. కనుక నా తోకకు నిప్పు పెట్టించుకొని లంకనే కాల్చి వేయుదునని" అనుకొని కపటముతో 'నాతోక నిప్పుచే కాల్చబడును. సందియము లేదు' అని పలికెను. అంత రావణుడు సేవకునితో "ప్రయత్నించి వీని తోకను నిప్పు ముట్టించి లంకలో కనబరచండి" అని ఆదేశించెను. రాక్షసు లంత నూనెలోముంచినజెల్లు, కసవు, గుడ్డలను తోకకు చుట్టుచు రాగా అది పెరుగసాగెను. వస్త్రముల అంగళ్లలోనుండు వస్త్రాలనన్నింటినీ తెచ్చి చుట్టిరి. రాజాజ్ఞచే ఇండ్లలోని స్త్రీ పురుషుల వస్త్రములన్నియు చుట్టబడెను. అందరును దిగంబరమూర్తులైరి. చివరకు పరుపుగుడ్డలు, బంగ్రోతుల గుడ్డలు, తలగుడ్డలు, మొలగుడ్డలు, సభవారివి, రాజరికము వారివి, రావణ మండోదరులవి, ధ్వజ

పటములు అన్నియు చుట్టిరి. సీతాదేవి వస్త్రమును కూడ తేవలయునని యత్నింపగా దాని నెరిగి ఆంజనేయుడు తన తోక పెంపును చాలించి పుష్ప పూర్తినింజూపెను. ఇంటింటను గుడ్డలకై గుమికూడి కొట్టుకొనుచుండిరి. నూనెకై, నేతికై, జిడ్డువిక్రేసన చాలునని తెచ్చి పోసిరి. రాత్రియైన దీపమునకు నూనెలేదు. బిడ్డలకు నెయ్యి సున్న. అపుడు హనుమంతుడు "యజమానుడగు రావణుడే ముందుకువచ్చి తన నోటితోనూదుచు నిప్పు ముట్టించినచో తోక అంటుకొనుననెను. రావణుడట్లేవచ్చి నిప్పు నూదెను. అంత వాని తలవెంట్రు కలు, గుడ్డలు, మీసములు కాలి వెలుగువత్తులు (మత్తాబులు అను పగలొత్తులు) అయ్యెను. రావణుడు తన ఇర్వది చేతులచే మోములను రుద్దుకొనుచుండగా రాక్షసులందరు పకపక నవ్విరి. అపుడు ఆంజనేయుడపహాస్యం చేయగా రావణుడు క్రుద్ధుడై వీని నావలకుగొనిపొండు" అని దూతల నాజ్ఞాపించెను. అంతవారు మారుతికి సంకెళ్లవేసి చక్కగాకట్టి, శ్రద్ధతో లంకతో అంతటా ఊరేగించుచు వాద్యములు మ్రోయించుచు శస్త్రధారులై కేకలువేయుచు వెంట బోయిరి. కపివీరుడు గంతులువేయుచు పగలు సర్వలంకనుచుట్టి అత్యంత సూక్ష్మరూపమునొంది 'సంకెళ్లు' వదల్చుకొనెను. ఆ వేళకు బ్రహ్మాస్త్రము యథాస్థాన గతంబయ్యె.

ఆంజనేయుడు లంకాగారము నాశ్రయించి ద్వారతోరణ స్తంభముతో నచటి పాలకులను సంహరించి ప్రాసాదంబులకు నిప్పు పెట్టెను. ప్రతి గృహ మందును కోలాహలమై అంద్రు నిద్రించు బిడ్డలను విడిచి ప్రాణరక్షకై తమ కురులును, వస్త్రములును కాలిపోగా ఇంటి వెలుపలకు పరుగెత్తిరి. రావణ ప్రాసాదమును, రావణసభను కాల్చి జనులను తోకతో సదలించెను. కాలు చుండు రాక్షసులు నోటికి చేతికి తాళమారంభించిరి. అప్పుడు రావణుడు కృద్ధుడై పదికోట్ల రాక్షసులతో వెడలి ఆంజనేయునితో యుద్ధమారంభించెను. అతని సైన్యాన్ని ద్వారతోరణ స్తంభముతో ప్రహరించుచు కోట్లాదివీరులను తోకతోచుట్టి గెడపి, వినోదముగా రావణుని తలమీద తోకనుంచి వాని చర్మమును కాల్చెను. తోకనిప్పుచే రావణుడు మూర్ఛితుడయ్యె. ఆంజనేయుడు శ్రీరామునికి కీర్తి కలుగవలెనని వానిని చంపలేదు. ఇది చూచి వచ్చిన ఇంద్ర జిత్తును చంపక లక్ష్మణునిప్రీతికై వదలెను. ఇట్లు లంకనంతను గాల్చి సముద్రతీరంచేరి జలజంతువుల బ్రోవనెంచి నీటిమీద తోకనుచాపి అలలచేతనే

దానిని చల్లార్చుకొనెను. పొగవలన తన గొంతులోచేరిన శ్లేష్మము నుమ్మి వేసెను. అంతలో అతనికి సీత క్షేమముగూర్చి తలంపు రాగా తానొనర్చిన అకృత్యమునకు తన ప్రాణత్యాగమే పరిష్కారమని యెంచి తన తోకతోనే ఉరి వేసుకొనబోవగా అశరీరవాణి సీత క్షేమముగా నున్నదని ఘోషించెను. అది విని ఆంజనేయుడు తన ప్రాయోపవేశ ప్రయత్నమును మాని ఆనందముతో మరల సీతను దర్శించుటకు పోయెను.[129C]

ఈ సన్నివేశమును (లంకాదహనం) అయ్యలరాజు రామభద్రకవి తన ప్రబంధోచిత శైలిలో వర్ణించుచు పొత్తులలో పిల్లలతో సాగిన బాలింతలను పతిహీనలైనవారి కష్టాలను విపులముగా వర్ణించినాడు.[130]

తత్త్వసంగ్రహ రామాయణము: తన వాలమునకు నిప్పంటించునెడ హనుమంతుడు బ్రహ్మమంత్రము నుచ్చరించినట్లును దాని వలన అతనికి కట్లు తెగిపోయినట్లును లంకాదహనానంతరం సముద్రములోనికిదిగి అగ్నిసూక్తము జపించినట్లును తెలుపబడి యున్నది.[131]

శ్రీమద్రామాయణ కల్పవృక్షము: రావణసభలో హనుమంతుని దండించుటలోగల విశేషములిందున్నవి. రావణుడు హనుమంతుని వధింప తలంచగా విభీషణుడు "దూతదుష్టతకు కశాభిఘాతం, శిరోముండనం, విరూపత, లక్షణ సన్నిపాతం దండనలు విధించదగును. అప్పుడు రావణుడు "బహుబాణ ఘాతంబుల నెత్తురుచిమ్ముచున్న యితని మేన కశాభిఘాతంబైనట్లే; వానరులకు మూర్ధజంబులేమి మౌండ్యంబులేదు; మౌండ్యంబందలి రహస్యంబు పతాకా నిర్మూలనంబు వానరులకు లాంగూలము తత్స్థానీయంబు. ఇంక నితని పుచ్ఛంబునకు గుడ్డలుచుట్టి నూనియపోసి నిప్పంటించి లంకాపురీ వీధులందితని త్రిప్పవలయు. లాంగూలము వినష్టమై లక్షణ సన్నిపాతంబుతోపాటు తక్కిన మూడు శిక్షలు జరిగినట్లగును" అని పలుకగా ప్రాడ్వివాకులు శిక్షా పత్రమును రావణుననుమతితో చదివిన వెంటనే రాక్షసులు శిక్షలనమలు చేసిరి. అతనిని వారు వీధులలో త్రిప్పసాగగా వారినాతడు సందులలోనికి లాగెడివాడు. వారు "ఈతడు దొంగగా రాత్రివేళ నగరమున ప్రవేశించెననియు, అక్షకుమారుని చంపెననియు ప్రభువతనికి మరణదండనవేయక బుద్ధి వచ్చునట్లు దండించెననియు ప్రకటించుచు—

పీనదేహుడితడు పిప్పళ్లజస్తా వి
ధాన బలిసినాడు వానరుండు
మొండిజాతి యెంత మొత్తిన నబ్బాయ
నండు నొప్పి యెదగనండు లిరిగి

—ఆ నిప్పువలన ఆంజనేయుడు బాధ ఎక్కువకాగా అతడు దానితో నూరు ముట్టించాలో జలధినార్పవలెనో అని మనసులో తర్కించుకొనుచుండగా అగ్ని అతనికంతలో చల్లనైనట్లు తోచెను. దానినతడు సీతామాహాత్మ్యముగా భావించెను. దహనకాండ పూర్తికాగానే సీత ఏమయ్యెనో అను భీతి కలిగి—

........నశోకవీధి చనిక్ష్మాసుత దూరమునందుఁగాంచి ద
గ్గరకునుపోవగా నొడలు కాలదొడంగినఁ జిత్రమయ్యె.......అతడా
మెకు దగ్గరగా పోవుకొలదీ వేడి ఎక్కువగు చుండెను. అంత అతడు
........యెటింగెబోయనలు డౌష్ణ్యము జానకియందుదాచి చొ
చ్చెను దనతోక యండిపట సీతకుఁజుట్టుననున్న రాక్షసాం
గనలును దవ్వుదవ్వగను గానగవచ్చి విభీతచిత్తలై....

—అని యెంచి శ్రీరాముని ధ్యానించి ఆమెను చేరగా అనలమతనికి శీతలముగా నుండెను.[132]

సమీరకుమార విజయము ప్రకారం: సీతను దర్శించిన తర్వాత ఆంజనేయుడశోకవనమును చెఱచుట, రాక్షసవీరులతో పోరుట, అక్షకుమారుని వధించుట మొదలగునవి యథా వాల్మీకముగా సూచితమైనవి. ఇంద్రజిత్ అతనిపై బ్రహ్మాస్త్రము ప్రయోగింపగా తనకు బ్రహ్మ ఇచ్చిన వరమునెంచి—

"తచ్ఛరముద్రోయం జాలియున్ ధాతృదేవత నీక్షించి, రావణస్థితిన్ గనన్వాంఛించియు ఆహుతభుజ్మిత్రసుతుడు కట్టుపడినట్లుండెన్ విలాసంబునన్" రావణసభలో 'నీవెవడవురా, నిన్నెవ్వరంపిరిరా' అని రావణుడు ప్రశ్నింపగా, తన వాలము తత్సభాంతరవేదిస్థితిదాల్పగా వానిని "ఓరిదశాస్యస్వామిద్రోహి నేను రామాధ్యక్షుని బంటును, వాయుపుత్రుడను సీతాదేవి క్షేమమారయుటకై వచ్చితిని. ఆమెను చూచితిని. నా భుజసామర్థ్యము నీకు కొంత రుచి చూపితిని నన్నెదిర్చి నిల్వగల బంటు మీలోలేరు. నీమేలుకోరి చెప్పుచున్నాను. నీవు నామాటవిని శ్రీరాముని శరణువేడుము. శివుని ధనుస్సు విరిచిన ఆ వీరునికి

సీతనిచ్చి నీవు బ్రతుకుము." అని చెప్పెను. దానికి వాడుకోపించి కోతిని వధింప నాజ్ఞాపింపగా విభీషణుని మాటల వలన వాలమును కాల్చవలసిన దండన లభించెను. ఈ వార్తవినిన సీత అగ్నిని ప్రార్థించగా అగ్ని ఆంజనేయునికి చల్లగా నుండెను. ఆ అగ్నితో ఆంజనేయుడు "సురలు ప్రద్రష్టగా, తన సింహ నాదములు శ్రుతిసూత్ర నికరముగా, రాక్షసులు బలిపశువులుగా, గృహదారు పటలము సమిధలుగా, తన కోపవహ్ని, ప్రతాపవహ్ని, లాంగూలవహ్ని అను త్రేతాగ్నులతో రామార్పణముగా పూర్ణాహుతివేసి సముద్రములో అవబృథ స్నానముచేసి తన విజయవార్త కపులకెరింగించుటకై వచ్చెను."[133]

రావణుడు హనుమంతుని చూచినపుడు
"నందీశ్వరుడో హరుడో సందేహమ్మగుచున్నది
భస్మాసురుడో ఏమో ప్రాణాలకు భయమయ్యె"—

—నని తలంచెనని సుందరమందారమున [134] వర్ణితము.

రావణుడు హనుమంతుని చూచినపుడు వాల్మీకి మహర్షి రచనలో రావణుడు అతనిని భీమరూపం, భీమవపుః, ఉగ్రః అని అతనిని పరాక్రమ మును స్తుతించుచు తనలో తాననుకొనెను. మహాభూతము, మహాబలపరిగ్రహము మహోత్సాహము, మహావేగము, మహాబలం, మహామతిం, మహాకాయం మహాసత్వం బలవికరణాయనమః బలాయనమః బలప్రమథనాయనమః సర్వ భూతదమనాయనమః అనునవి మహాన్యాస వాక్యములు. రావణునికి శివుని, నందిని తలపింపజేసెనని శ్రీ శేషేంద్రశర్మగారి వాక్యము.[135]

తన పాపకృత్యములచే లంక కరడు గట్టియున్నందున ఆంజనేయుని వాలాగ్ని స్పర్శచే లంకను పవిత్రీకరించుటకే రావణుడు అతని తోకకు నిప్పు పెట్టించెనని శ్రీమద్రామాయణాంతరార్థము.[136]

రామచరితమానస్‌లో: హనుమంతుడు లంకను కాల్చుచో కుంభకర్ణుని భార్య అతనిని సమీపించి "నాభర్త నిద్రిస్తున్నాడు. కావున మా ఇంటికి నిప్పు పెట్టవద్దు" అని కోరినట్లున్నది. హనుమంతుడు సీతవద్ద సెలవు తీసుకొనుచో సీత అతనిని చూచి "నీకు జరామరణములు లేకుండుగాక, సదా, నిన్ను నానాథుడు ప్రేమించుగాక" అని దీవించెను.[137]

# 5 హనుమంతుని పునరాగమనము.

తిరుగు ప్రయాణమును చేయబోవు వాయుపుత్రుడు అరిష్టాద్రిపై కాలు పెట్టినంతనే అతని పాదఘట్టనచే శిలలు పొడిపొడియైనవి. చెట్లు నేలకొరుగగా జంతుసంతతులు తత్తరలాడినవి. పిడుగుపడినట్లవి పడగా కొండగుహలలోని సింహములు గుహాంతరమునచేరి ఆకాశం పగిలిపోవునట్లు అరచినవి. పాముల తలలు రాలసందులలోపడి నలిగినవి. కిన్నర కింపురుష విద్యాధర యక్ష పన్నగ స్త్రీలు పురుషులు ఆ పర్వతము వదలి ఆకాశానికి ఎగిరిపోయిరి. పది యోజనాల వెడల్పు ముప్పైయోజనాల యెత్తుగల ఆకొండ పాతాళమునకు దిగబడి నిముషములో నేలమట్టమయ్యెను—

అంతరిక్షార్ణవమున మహాంబురాశి
నావతరియించు చందాన నవ్యలీల
నంజనానందనుండేగె నశ్రమమున

—అట్లు తిరిగి ప్రయాణము చేయుచు దారిలో మరల మైనాక పర్వతమును స్పృశించి, జ్యాముక్త నారాచమువలె మేఘాలలో పయనించి మహేంద్ర పర్వతం చూచి దశదిశలూ నిండునట్లుగా గొప్ప సింహనాదం చేసెను. తన వారిని చూడవలెనను కోరికతో తోకను విదిలించి జాడించగా ఆధ్వనికి ఆకాశము బద్దలై దూరమున అతని రాకను నిరీక్షించు వారికి వినబడెను. దానిని వినిన జాంబవంతుడు. అది హనుమ ధ్వనిగా గుర్తించి ఆధ్వనిని బట్టియే హనుమ కార్యఫలావాప్తి నొందెనని తోడివారికి తెలిపెను. అతనిని దర్శింప కుతూహలము గలవారు కొండశిఖరాలపైకిచేరి అనుకూల స్థానముల నుండి అతనిని వీక్షింపసాగిరి, తామక్కడచేరి ఎదురు చూచుచున్నట్లు హనుమకు తెలుపుటకై పూచిన చెట్లకొమ్మల నాడించిరి. వారంతా చూచుచుండగా హనుమంతుడు మహేంద్రగిరి నిర్ఝరమునబడె నిహతపక్ష శైలంబనగన్.” కోతులు అతనికి స్వాగతమిస్తూ తమ ఆనందానికి సూచకముగా ఫలమూలములను అతనికి కానుకగా అర్పించిరి. హనుమ ప్రహ్లాదము వెడలి జాంబవంతునకు, అంగదునకు, తదితర వయోవృద్ధులకు నమస్కరించెను. మొట్టమొదటి మాటగా “చూచితి సీతను” అని సంగ్రహముగా ముందు వారి కుతూహలమును తృప్తి నొందించిన తదుపరి అంగదుని చేతిని తన చేతిలోనికి తీసుకొని నడచుచు

మహేంద్రగిరిలో ఒక రమ్యప్రదేశమున వారిని ఆ సీనులగునట్లుచేసి సీతాదేవి వృత్తాంతము వివరించెను.

అంగదాదులాతని సాధనలోని దీక్షను వేగమును బలమును ధైర్యమును ప్రభుభక్తిని పలుమారు ప్రశంసించి ఆయాకార్యాదుల నతడెట్లు సాధించెనో మరల అడిగి వివరములకోరిరి. లంకాయానములోని తన అనుభవములను ఆంజనేయుడు విశేషాంశములతోసహా తన గంభీరవచో మాధుర్యముతో వివరించి రామానుగ్రహము వలన సీతామాహాత్మ్యము వలన తన ప్రయత్నము ఫలించినదని "నాదుచిత్తము సదా చింతించెడున్ జానకీ వనజాతాయుతలోచనా ప్రణవమై" అని నివేదించెను. రావణుడల్పుడని తలంప వీలులేదనిన్నీ ఇకపై కర్తవ్యము రామసుగ్రీవాదులదేననిన్నీ పలికెను. "నేనొక్కడనే రావణుని రూపుమాపగలను. మహాబలవంతులగు అంగద జాంబవంతులు కలిసి వచ్చినచో రాక్షసులనందరిని రూపుమాపవచ్చును." అని పలికి తాను కోసల రాజేంద్రుని దూతగా (భృత్యునిగా) ప్రకటించుకొనుట, లంకాదహనము, వానర దాశరథుల సఖ్యమునకు సీత ఎట్లు ఆనందించినదో, పరుషోక్తులాడు దశకంఠుని సీత ఎట్లు నిర్లక్ష్యముగా మాట్లాడినదో, వానిని శపింప సమర్థురాలై తన రక్షణభారము శ్రీరామునిపై ఉంచుట మొదలగు విషయములనన్నింటిని సంపూర్ణముగా తెలిపెను. ఆ ఆనందములో అంగదుడు "సీత జాడ తెలిసినది కావున మనం వెళ్లి ఆమెను తీసుకొనివచ్చు ప్రయత్నము చేయుద"మనెను. జాంబవంతుడతని ఆలోచనను మెచ్చుకొనిననూ ఇది రామునకుతెల్పి అతడెట్లు నిర్ణయించినచో అట్లు వర్తించుట మంచిదని పలుకగా హనుమదాదులందరు 'సరి' అని అంగీకరించి కిష్కింధకు బయలుదేరిరి. అచట మధువనమున ప్రవేశించి ఆనందముతో తేనెలానవలయునని కపులందరు కోరగా జాంబవదాదులందుల కంగీకరించిరి. వారాతోటలో విందులారగించు చుండగా తత్సం రక్షకుడగు దధిముఖుడు అడ్డుపలికి విఘ్నమొనర్ప రాగా అపుడు హనుమంతుడు వానరులతో "దధిముఖుడు మీదరికి రాకుండా నేను చూచెదను. మీరు తేనెల యథేచ్ఛగా నారగించుడు" అని అభయమిచ్చెను. యువరాజగు అంగదుడు ఆ సంతోష సమయమునకది తగినదిగాయెంచి అంగీకరించెను. దధిముఖుడువెళ్లి యీ వార్త సుగ్రీవునకుతెల్పి వారి యాగడములనాపుమని విన్నవించగా సకలము నూహించుకొని సుగ్రీవుడు వారిని ప్రవేశపెట్టుమని తెలిపెను. వానరులందరు

తుష్టిగా తేనెలాని, ఫలములదిని రాగా, హనుమంతుడు శ్రీరాముని చేరవచ్చుచు "నియత, ప్రాణయుక్త అయిన సీతను చూచితిని" అని కార్యసాఫల్యమును మూడు ముక్కలలో తెలిపెను. వానరులు హనుమంతుడేవేది ఎట్లు సాధించెనో పలుమారు పేర్కొనసాగిరి. సీతాసందేశమును శ్రీరామునకు తెల్పి ఆమె చెప్పిన కాకాసుర కథనుతెల్పి, శిరోమణిని రామునకిచ్చి సముద్రమును తరించి సీతను కాపాడుమని కర్తవ్యము సూచించెను. రాముడానందించి, సీత పరిస్థితికి దుఃఖించి ఆమె తనతో చెప్పిన పలుకులను సీతయే యెట్లు చెప్పెనో అట్లు చెప్పుమనికోరి అతనిచే పలుమార్లా సంగతులను వినెను. సీతాదేవితో తానే విధముగా భాషించినదీ, ఆమె పలుకులు, తన ఓరడింపు మాటలు అన్నియు తెలిపెను. "తమరువచ్చి రావణుని చంపి ఆమెను రక్షింపగలరను నమ్మకమామెకు కలుగునట్లుగా నేను చెప్పి వచ్చియున్నాను." అని తెలిపెను.[138]

హనుమను స్వామి సంభావించుట: శ్రీరాముడాతని ద్వారా సకల వివరములను వినినంతనే వానరాదులను చూచి "మన హనుమ గొప్ప కార్యములు చేసియున్నాడు. ఇవి దుస్సాధములు, వీనినితరులు సాధింపజాలరు. అట్లు చేయగలమని వారు సంకల్పించుటకు కూడ దక్షులుకారు. లంకాపురమున ప్రవేశించి ప్రాణములతో తిరిగి వచ్చుట హనుమ బలపరాక్రమములకు నిదర్శనము. ఆజ్ఞాపించినది సాధించుటయేకాక సుగ్రీవుడు తనకు సూచించకున్ననూ తన కనురూపమైన పౌరుషకార్యములనొనర్చి ఉత్తమ భృత్యామార్గమున కుదాహరణమై యున్నాడు. కార్యమును నెరవేర్చుటతోపాటు తదనుకూలమగు అశోకవనభంగము, అక్షసంహరణము, లంకాదహనము మొదలగు కార్యములు చేసియున్నాడు. లఘుత్వము నాపాదించు కార్యమేదియు చేయక సుగ్రీవునికానందము కూర్చెను. సీతను చూచి ఆమె నోదార్చి వచ్చుటయేకాక మా రఘువంశమునే నిల్పి మమ్ములను ఆత్మహత్యా ప్రయత్నమునకు పాల్పడకుండా చేసియున్నాడు. ఈతడొనర్చిన సాహాయ్యమునకు సమానమైన సంతోషమును హనుమంతునకు కలిగింపలేకున్నందుకు చింతించుచున్నాను. నాకున్న ధనమంతా ఇచ్చిననూ ఈ ఋణము తీరదు. "నా సర్వస్వమునర్పించునట్టి నా పరిష్వంగములోనికి రావయ్యా హనుమా" అని పలుకుచు రాముడు పులకితగాత్రుడై హనుమంతుని "నా అవయవంబులచేత నానదీర—

నెట్లులాత్మేశ నే స్పృశియింపగలనొ నీ

—వట్లు సేయుము" అని సీత పలికినదానికనుగుణముగనే హనుమంతుడెట్టి ప్రయత్నము చేయకనే సీతా వాక్యప్రభావము వలన అంజనేయునకు రామ లింగన భాగ్యము కలిగెను. అంజనేయుడంత పులకిత గాత్రుడయ్యెను.[139]

భాస్కర రామాయణమున: "రఘుకుల రక్షణ మెలవింగాలింపబుట్టి తీవుకపీంద్రా" అని రాముడు హనుమను ప్రవంసించెను.[140]

అధ్యాత్మ రామాయణము: హనుమంతుడు తాను లంకలో గాలించిన కార్యములను తెలిపి లంకనంతటిని వర్ణించెను. అచటి రక్షణ విధానమూ శతఘ్ను లెట్లున్నవో తెలుపుచు "రావణుని బలములో పాతికభాగము నాశన మొనర్చితిని. సువర్ణ ప్రాకారము పాడు చేసితిని. దుర్గములను శతఘ్నులను పడగొట్టితిని. ఇంక తమరివలన లంక పూర్తిగా భస్మమై పోగలదు. ఆ లంకకు ఉత్తరమున సువేలాద్రి, పశ్చిమమున పరలంక, దక్షిణమున నికుంభల, తూర్పున లఘులంక కలవు అని దాని ఎల్లలను అపసవ్యమార్గమున తెలిపెను. ఇన్ని కార్యములనొనర్చిన హనుమంతునిలో గర్వము కలుగకుండుటకై రాముడొక వినోదము చూపినట్లీ రామాయణమున కలదు. సీతా శిరోమణిని తీసికొని హనుమంతుడు తిరుగు ప్రయాణమునకు రానుండగా బ్రహ్మ అచటకు వచ్చి లంకలో హనుమ గావించిన కార్యములను ఒక లేఖగా వ్రాసి శ్రీరామున కిమ్మనెను. దారిలో దాహము కలుగగా హనుమంతుడొక ముని ఆశ్రమునదిగి తన చేతనున్న ముద్రికను గట్టునపెట్టి ఒక హ్రదమున దాహము తీర్చుకొన బోయెను. అపుడచటికొక పిల్లకోతివచ్చి ఆ ముద్రికను మునియొక్క కమండలువులో వేసెను. అంజనేయుడదిచూచి ముద్రికను తీసుకొనబోగా అందట్టివే అనేక ముద్రికలుండెను. తాను తెచ్చిన ముద్రిక ఏదో తెలియక తికమకపడి మునితో చెప్పెను. ఆముని అంత "ఎన్నో కల్పములు జరుగుచున్నవి. ఎందరో రాములు, ఎందరో సీతలు, ఎందరో హనుమంతులు వచ్చి పోయిరి." అందు వలన నీవు ఇపుడు వెదకికొనజాలవని చెప్పెను. అపుడు హనుమవెళ్లి యీ వృత్తాంతము రామునకే తెలుపగా "ఆ వినోదమును నేనే చూపితిని. నీలో గర్వము కలుగకుండా నేనట్లు చేసియున్నాను" అని రాముడు చెప్పగా అపు డాంజనేయుడు తాను సముద్రమును దాటుట, లంకలో వీరోచిత కార్యాలు చేయుట శ్రీరాముని కృపవలననేనని గ్రహించెను.[141]

సమీరకుమార విజయము ప్రకారం: హనుమంతుని మాటలను విని రాముడు తనకాతడు కావించిన ఉపకారమునకు "ఈ అనితరోద్యోగ ప్రతాప క్రియా సదుపాయ స్థితులెందునుం గలవే" "నీ శుభోదయము మా వంశరక్షణకే కదా అయినది. సముద్రమును దాటుటకు గరుడుడు పవనుడు సమర్థులేకాని దేవతలకే శక్యముకాని రావణుని నగరములో ప్రవేశించి శత్రువుల నిర్మూలించి ప్రభుకార్యము నెరవేర్చిన నిన్ను పొగడుట కా బ్రహ్మకు కూడ వీలుకాదు. దీనికి ప్రత్యుపకృతిగా నిన్ను కౌగిలించువాడినే కానీ నీకేమియు యీయలేనివాడను" అని రాముడు హనుమంతుని సత్కరించెను.

రామచరితమానస్ ప్రకారం: రాముడు "హనుమా, దేహధారులైన వారిలో నీవంటివాడు దేవమానవులలోలేడు. నీకేమి ప్రత్యుపకారం చేయగలను? నీ ఋణమున నుంటినికదా అని నేను విచారమున నున్నాను. అందువలన నీ ముఖము చూడలేకున్నాను." అని పలికెను. అదివిని హనుమంతుడు భక్తి పరవశుడై రాముని పాదములపై పడెను. రాముడతనిని లేవనెత్తి హృదయమున కాశ్లేషింపజేసెను. అపుడు హనుమ తనలో ఏ దురభిమానము లేనివిధముగా "మీరు సర్వజ్ఞులు. మా వానరులు శాఖామృగములు సముద్రము లంఘించుట, రాక్షసుల చంపుట. లంకను దహించుట – ఇవి మీ ప్రతాపము వలననే జరిగెను వీనిలో నా ప్రయోజకత్వము శూన్యము. మీ ముద్రికను చూచి జానకి శాంతించెను. ఆమె శోకాగ్ని లంకను దహించెను. ఆమె చూడామణి బలముచేత నేను పునః సముద్రమును లంఘించి మిమ్ము చూచితిని. నాకు సుఖదాయిని, నిత్యానపాయినియైన భక్తిని మీయందు ప్రసాదింపుడు." అని పలికెను.[142]

శ్రీరాముడు హనుమంతునాలింగన మొనర్చినంతనే ఆక్షణముననే అతడు జీవన్ముక్తి పొందెనని శ్రీ శ్రీనివాసశాస్త్రిగారి భావము. What more could Hanuman want; He attained his salvation at that movement (PP 288 Lectures on RAMAYANA By Rt Honourble Sri V. S. Sreenivasa Sastry, P. B. S. Viswathaiah 1968 Revised Edition.)

ఈ విషయము అంతరార్థ రామాయణమున కూడ ఉచితముగా సమర్థింపబడినది. భగవద్గీతలో "మనసస్తు పరా బుద్ధిరో౽బుద్ధేః పరతస్తుసః

(అధ్యా 3 – శ్లో 42) అను శ్లోకమున తెలిపినట్లు బుద్ధి ప్రకృతిని దాటితే పరమాత్మ గోచరించును. సముద్ర లంఘనానంతరం అంజనేయుని ద్వారా (సీత అనే) ప్రకృతి పరిశీలనము జరిగి (సీత–రాములనెడు) ప్రకృతి పురుషుల సమైక్యము జరిగినది. సాధన ద్వారా ఈ దశకు చేరినవానికి భగవంతునిలో ఐక్యమగుట (రాముని కౌగిలింత రూపముగా) ముక్తిని పొందుటయే. (పుట 90)

శ్రీ మద్రామాయణ కల్పవృక్షమున కూడ రామాంజనేయుల ఆలింగన విశిష్టత పేర్కొనబడినది. సీతమ్మ లేని సమయమున రామలక్ష్మణులను మాత్రమే చూచి వారి సౌందర్యమునకు వశుడైన హనుమంతుడు లంకలో సీతాదేవిని దర్శించి ఆమె కటాక్షము పొందనంతవరకు పరిపూర్ణస్థితి పొందలేదు. సీతాదేవి రావణునకు నీతి వాక్యముల చెప్పుచో శింశుపావృక్షములో నుండి వినిన మాటలలో హనుమంతుడు భగవత్స్వరూపము తెలిసికొన గలిగెను. తాను రామదూత, రామదాసు అని ఘోషించి మాతృదర్శనం పొంది అమెతో భాషించి తాను గ్రహించిన భగవద్రూపాన్ని వర్ణించి స్వస్వరూపజ్ఞానం భగవత్స్వరూపజ్ఞానం తల్లి అనుగ్రహంవల్ల పరిపూర్ణంగా పొందినందున భగవంతుని ఆలింగనము పొందుటకు యోగ్యుడైనాడు. (పు 82–84. సుందరకాండ శ్రీమద్రామాయణ కల్పవృక్షము)

అధ్యాయము–6

# రామరావణ యుద్ధమున హనుమంతుని పాత్ర

## 1. ఉపోద్ఘాతము :

రామరావణ యుద్ధమున హనుమంతుడెన్నియో కార్యములను నెర వేర్చెను. అందు కొన్ని అసాధ్యమైనవియు అద్భుతమైనవియు కలవు. వానితో పాటు అప్రధానమైన అల్పాంశములు కూడ కలవు. ఈయెడ హనుమంతుని ధైర్యసాహస పరాక్రమాది విశేషములు రాజనీతిజ్ఞత, ఆర్త రక్షణ పరాయణత, దైత్యాంతకత, రామసేవ, రామానుజసేవ మొదలగు ప్రధానాంశములనే పరిశీంచుట పరిశోధనధ్యేయము.

వాల్మీకి రామాయణము ప్రకారము లంకను చేరుటకు శ్రీరామాదులు వానరసేనతో నడచి వెళ్లిరి. ఆనందరామాయణము ప్రకారం శ్రీరాముని హనుమంతుడును, లక్ష్మణుని అంగదుడును తమ భుజములపై వహించి సాగిరి. సమీరకుమార విజయమున హనుమంతుడు రాముని 'మేనబాని' చేరినట్లున్నది.[143]

లంకాతీరమునకు చేరిన వెంటనే హనుమంతుని ప్రార్థన ననుసరించి రాముడు రావణుని చెరలోని దివిజగరుడ గంధర్వ కిన్నరకంజముఖుల చెఱ విడిపించినట్లు రామాభ్యుదయకథ.[144]

## 2. విభీషణ శరణాగతి

సాగరతీరమున విడిది పొందియున్న రాముని వద్దకు అర్థుడై రావణ సోదరుడగు విభీషణుడు వచ్చి రామునాశ్రయింపకోరెను. వానరులలో ప్రముఖు లగు సుగ్రీవ అంగద జాంబవానుడాదిగాగల కపుల అభిప్రాయమును రాముడు కోరెను. వారొక్కొక్కరు ఒక్కొక్క విధముగా చెప్పినను శత్రువు సోదరుడగు వానిని దగ్గర చేరనీయరాదను భావమునే ప్రతిపాదించిరి. అప్పుడు రాముడు ఆంజనేయుని అభిప్రాయమును కోరెను. తన అభిప్రాయము తెలుపుటకు ముందీ ఉపోద్ఘాతముతో ఆంజనేయుడిట్లు తన వాదము తెలిపెను—

మతిమంతులలో శ్రేష్ఠుడ
వతి కుశలుడవర్థముల మహావాగ్మివి ని
న్నతిరేకించి వచింపగ
శతముఖునాచార్యుడైన చాలడు రామా

—వాగ్వాదాలలో యుక్తియుక్తంగా మాట్లాడగల తర్కనైపుణ్యం నాకుందని చూపాలనిగానీ, ఇతరుల అభిప్రాయాల నణచి నా వాదం గెలిపించుకోవాలని గానీ, అందరికన్నా నేనే మిన్న అన్న గౌరవం పొందాలన్న కాంక్షతోగానీ, నా వచోవిజృంభణము నావిష్కరించుటకు సమయమనిగానీ, విభీషణుని మీద అభిమానముతోగానీ, నీవు నన్ను మెచ్చుకొని సన్మానించాలనిగానీ నేను నా అభిప్రాయాన్ని ప్రకటించడంలేదు. ఉన్నది ఉన్నట్లుగా చెప్పదలచితిని. నీ సచివులు పలికిన పలుకులలో దోషమున్నది. కావున వారి మాటలు గ్రహింపవీలులేదు. పరమర్మము తెలియుంగుటకై ప్రాగ్రూపమెత్తి కుమతులు రాగలరా? ఒకవేళ వేషము వేసికొని వచ్చిరని అంగీకరించినను వారి పలుకు లలో దుర్భావ సద్భావములను పరికింపలేమా! ప్రబలమైన లోని భావాన్ని దాచడానికి ఆకారవైఖరులలో బ్రహ్మకు కూడ సాధ్యం కాదు గదా! ఇతడు రావణుని తమ్ముడైనంతమాత్రాన నమ్మరాని యితనిని చంపవలెనను సుగ్రీవుని వాక్యమర్థమైనదా! రావణునివలె ఇతడకృత్యముల చేయలేదుగదా. ఈతడు శత్రువని అంగదుడనుట దయావిహీనతయే. దూతను పంపి ఇతని హృదయ రీతుల నెఱుంగవలెనను శరభుని మాట నీతికాదు. ఇతని రాక దేశకాల విరుద్ధ మను జాంబవంతుని పలుకులామోదింప పనిలేదు. ఆపన్నుడగువాడు వేళలను స్థలములను గమనించగల్గునా! అన్న పాపము వలన దైత్యవంశము నాశన మగుననియూ శ్రీరాముడే జయించుననియూ సమరమారంభింపకముందే వచ్చి నందున ఇతని దేశకాలజ్ఞత తెలియుచున్నది. ఈ విభీషణుడు సాధు. ఉపకారి, గోల, యీతని మాటలలో భేదమొక్కింత కూడా లేదు. అన్నకీతడుపదేశించగా అతని నీతులు నచ్చక రావణుడితనిని తన్ని తరిమివేసెననుట సంశయింప రానిది. నా అనుభవాన్నిబట్టి యీతని చిత్తము నేనెఱుగుదును. నన్ను వధింప వలసినదిగా రావణుడనుచుండగా నా మదికి హితముగా ధర్మాన్ని పలికిన వాడితడే. ఈతని స్వభావము ధర్మమయము, అంతేకాదు, రావణుని తమ్మునికే శరణాగతినిచ్చినచో జగత్తులో అంతకన్నా మీకు ప్రతిష్ఠ ఉండునా? కావున

తమరు రాజనీతి సూత్రానుసారమాలోచించి యితనికభయ మీయవలయును"—హనుమ ఈ అభిప్రాయమును వినిన రాముడు బాగుగా యోచించి తన నిర్ణయమునకు అనుకూలముగా పలికిన హనుమంతుని అభిప్రాయమును బలపరచుచు కేవలము హనుమంతుడు తెలిపినట్లుగా విభీషణుడు సుజనుడనిన్నీ, దుర్మార్గుడు కాడనిన్నీ తెలిపిన కారణములకన్నా తన శరణాగత పాలనాదీక్షకది తోడ్పడు చున్నందున విభీషణుని అంగీకరించుచున్నట్లు తెల్పెను. ప్రపత్తికి స్థలకాల నియమములతోగానీ దేశనియమముకానీ ప్రపన్నుని గుణశీలములతోగానీ నిమిత్తము లేదని తెల్పి తాను విభీషణునికి శరణాగతిని ప్రసాదించుటకు నిశ్చయించెను. రామవిభీషణ స్నేహసంధానమునకు (రామసుగ్రీవ సఖ్యమునాడు చూపిన ప్రజ్ఞవలె) హనుమంతుని కృషి నిర్వివాదముగా నిశ్శ్రేయసమైనది.[145] ఇందు హనుమంతుని రాజనీతి పరిజ్ఞానము, వాదప్రకటనాచాతుర్యము "నభూతో నభవిష్యతి"గా పొగడదగినవి.

ఆనందరామాయణం ప్రకారం: విభీషణునికి శరణాగతి ప్రసాదించిన తర్వాత రాముడు ఆంజనేయుని పిల్చి సముద్రతీరమున ఇసుకతో ఒక లంకను చేయించి విభీషణుని అందు ప్రవేశపెట్టి అతనినక్కడ లంకాధీశునిగా లాంఛన ప్రాయముగా పట్టాభిషేకము చేయించెను. రావణవధ జరుగువరకు దానిని సామ్రాజ్యముగా రామప్రసాదముగా స్వీకరింపజేసెను. హనుమంతునిచే చేయబడినందున దీనికి హనుమల్లంక అని ప్రసిద్ధి వచ్చునని రాముని వచనము.[146]

సమీరకుమార విజయమునగలకథ వాల్మీకి కథనే అనుసరించి యున్నది. హనుమంతుని వాదము సర్వవానరుల అభిప్రాయములను త్రోసి పుచ్చునదై రాముని ఆమోదము పొందెను—

కినుకన్ వాలి వధించి భానుజునిగిష్కింధాపురిం బట్టభ
ద్రుని గావించిన రీతిఁబంక్తి ముఖునిం దూలించి లంకాపురం
బనపాయస్థితి నిత్తురంచు నభయం బర్థింపరాబోలులే
మనలో నీ ఘనుడున్న దానవుల మర్మంబుల్ ప్రకాశంబగున్

—అను ఆంజనేయుని వాక్యాలనే రాముడామోదించెను.[147]

## 3. సేతు నిర్మాణము

వాల్మీకి రామాయణములో సేతు నిర్మాణ సన్నివేశము సంక్షిప్తముగా వర్ణింపబడినదే కాని అందు హనుమంతుడొనర్చిన కృషి ఎంతో తెలుపుటలేదు.

సేతు నిర్మాణమున వానరులందరు తనకు తోడ్పడునట్లుగా నలుడు శ్రీరాము నభ్యర్థించెను. అపుడు రాముడు వానరులనందరినీ రాళ్లను కొని తేవలసినదిగా ఆజ్ఞాపించెను. వానరులందరితో పాటు అంజనేయుడు కూడ ఇందుకు తోడ్పడెను.

పరాశర సంహితలో: 21వ పటలమున కపిలుని కథలో హనుమంతుడు తన భక్తుని దారిద్ర్యమును తొలగించుటకై అతని యింటి పెరడులోని నిధిని తానే స్వయముగా మోసి తెచ్చియివ్వగా కపిలుడు హనుమంతుడు తన దైవమై అంతటి హీనకృత్యమును చేయుటకు ఖిన్నుడు కాగా అపుడాంజనేయుడు "నేను మేరుపర్వతాన్ని కూడ సేతు నిర్మాణ సమయములో తేబోయినాను. కాని అందులో రామవిగ్రహము ప్రతిష్ఠించి యుండినందున దానిని వదలి మిగతా చిన్న కొండలనుమోసి తెచ్చి సేతువు నిర్మించు నలునకిచ్చితిని. ఆ రాళ్లబరువు కంటే ఈ నిధి బరువుకాదుసుమా" అని తెలిపెను. ఈ కథలో హనుమంతుడు వారధి నిర్మాణ సందర్భములో రాళ్లను సరఫరా చేసెనని తెలియుచున్నది.

సమీరకుమార విజయము ప్రకారం: సేతు నిర్మాణమున వానరులంద రితోపాటు పావనికూడ పాల్గొనినా వారందరికన్నా అధికమైన కృషి యితనిదే అని యీ గ్రంథసాక్ష్యము. హనుమంతుడు మలయద్రోణ హిమాద్రి మొదలగు గిరిశిఖరముల నుండి అసంఖ్యాకములైన శిలలను తన చేతులలో, పార్శ్వము లలో, తోకలో, భుజములపై సందు లేకుండా ఇరికించుకొని తెచ్చి యిచ్చెను. భారమైన శిలలను కపులు బహువారంబులు దెచ్చుచుండగా హనుమంతుడొక్క సారి లీలగా తెచ్చి యిచ్చుచుండెను. తన ప్రతి రోమములో రాళ్లను బంధించి ఝుంఝూ తిరస్కార మహాత్వరతో వచ్చుటను చూచి పర్వతపు దొంతులు పావనికి పూబంతులవలె నున్నవని ప్రేక్షకులనుకొనెడివారు. అఖండమైన గండోపల ప్రకాండంబులను ఒంటిగా తాకి గెంటేవాడు; తండోపతండాలుగా కొండతండంబులను నలునకందించేవాడు; గట్లను ఎడలించుచో అందుండు నెత్తములాడు వేల్పుభామినులు తడబడుచు విలాసక్రీడలలో నుండి హను మంతుని కొనియాడగా "కనికరంబున బయలుపడకుండుదురే – పొందు" అని హెచ్చరించేవాడు. కొండదిగువన వసించు వియచ్చరులిచ్చు దీవనలను ఆలించుచు గొప్ప కొండల నుప్పరంబెగయ మీటెడివాడు; భారముతో దూరము నుండి కొండశిలలను మోయజాలని కపుల ముందర రాళ్లను తానే

పెకలించి అందించేవాడు. ఎక్కడెక్కడ చెట్లూ, కొండలూ ఉన్నవో తానె వెళ్లి చూచేవాడు. ఎంతటి కొండనైనా అనాయాసంగా ఎత్తేవాడు. ఈ త్రిప్పటలో కపులు దప్పిక చెంది అలసిపోయినపుడు నిజభుజశిరః కరకక్ష వక్ష స్కంధా ద్యవయవ సంధుల సంధించిన ధరాధర వితానంబులఁగల కోనల ఫలంబులఁ జల్లని దొనల జలంబులు నిరూపించి యక్కడి కెక్కించుకొనగా వారక్కడి తేనియలం జొక్కి ఫలంబుల మెక్కి బడలికలు దక్కి పెక్కు భంగులం దన మక్కువ పేర్కొని కొండల డిగ్గనుటికి యొరకచనక చన శంకించిన వలసిన గిరుల లంకించి కొనుండని తాఁ దెచ్చినవి యొసంగెడివాడు. గిరినివహము లను మస్తమున దొంతులిడుకొని చేతితో పట్టకయే దింపెడివాడు. ముని దేవ విహారయోగ్య వనపర్వతాదుల జోలికిపోక తక్కినవానినే భారవాహుల కొప్పించెడివాడు. కొండలలో, తరులలో, రాళ్లలో ఎక్కడ చూచినా తానేయై కపిబలంబునకు బలంబుం బ్రాపునుం జూపుచు సకల సుకృత హేతువగు సేతువు నలునిచేత కట్టించినాడు."[148]

రామచరితమానస్ ప్రకారం: సేతునిర్మాణములో రాళ్లను హనుమంతుడు తెచ్చునపుడు గోవర్ధన పర్వతము బ్రాహ్మణరూపము ధరించి నన్ను శ్రీరాముని వద్దకు తీసుకొని వెళ్ళుము అని కోరెను. అనంగతి శ్రీరామునికి హనుమంతుడు తెలుపగా "ద్వాపరయుగములో మా దర్శనము కలుగువరకు వేచియుండుమని" తెలుపమనెను. ఆ వార్త తెలిపి అంజనేయుడాపర్వతమును వ్రజభూమిలో వదలివేసెను. (దీనినే శ్రీకృష్ణుడు వ్రేలితో నెత్తెను.)

శ్రీరాముడు విడిదిచేసిన తీరభూమినుండి నూరు యోజనముల సేతువును నిర్మించుటలో ఒకటవరోజు పదునాలుగు యోజనములు, రెండవరోజు ఇరువది, మూడవరోజు ఇరువది యొకటి, నాలుగవరోజు ఇరువది రెండు, అయిదవ రోజు ఇర్వదిమూడు — మొత్తం నూరు యోజనములను అయిదు రోజులలో నిర్మించిరి.[149]

## 4 యుద్ధరంగమున హనుమంతుని కార్యములు

శ్రీమద్రామాయణము ప్రకారం: యుద్ధకాండమున మహర్షి హనుమం తుని వీరోచితకృత్యములను విపులముగా వర్ణించియున్నాడు. ఇతర అనువదిత రామాయణములూ సమీరకుమార విజయమూ చాలావరకు ఆ అంశమునే

పేర్కొనినవి. యుద్ధ ప్రారంభమునకు ముందు రావణుడు శ్రీరాముని సైన్య సమీకరణమును తెలిసికొనుటకై ప్రాసాదమెక్కి శకునిద్వారా రాముని సైన్యములో ఎవరెవరెట్టివారో తెలిసికొనగోరెను. ఆ యా వీరుల నందరిని శకుడు వర్ణించి చెప్పుచు హనుమంతుని రూపమును విపులీకరించి వర్ణించెను. అతడు బాల్యమున సూర్యబింబమును పట్టబోవుట, హనుమంతుడను పేరేలవచ్చెనో తెలిపెను. వానరసేనలో అందరూ హనుమంతుని సదా స్మరిస్తూ ఉంటారని తెలుపుటకు 'హనుమంతుడు - హనుమంతుడు - హనుమంతుడు' అని మూడు మారులుచ్చరించి తెలిపెను. రాముని తర్వాత ఆ సైన్యములో హనుమంతుడే బహుజన పూజ్యుడను భావము శకుడు రావణునకు స్పష్టపరచెను.

యుద్ధ ప్రారంభములో హనుమంతుడు జంబుమాలిని ఎదుర్కొనెను. వాడు 'బాధసముజ్వల శక్తిని' హనుమపైకి విమ్మెను. ఆంజనేయుడనిల వేగమునుమించు మాడ్కి వాని తేరిమీద వ్రాలి చేతికొలది వానినొకదెబ్బ కొట్టగా వాడు క్షణములోచచ్చెను. హనుమ బలానికి ఆ తేరుకూడ కూలి పోయెను. ధూమ్రాక్షుని పరాక్రమమునకు తాళలేక వానరులు చెల్లాచెదరగు చుండగా హనుమంతుడొక గ్రావమునెత్తి వానిపై విసరెను. వాడు రథము నుండి దూకి తప్పించుకొనగా ఆ గ్రావముపడి వాని రథము గుఱ్ఱములతోసహా పిండియైపోయెను. ఇదిచూచి రాక్షసులు హనుమంతునిపైకిరాగా ప్రళయ కాల యమునివలె విజృంభించి కొమ్మలు బోదెలుగల చెట్టును త్రిప్పుచు వారిపై పడివారి తలలను ఫట్ ఫట్ మని పగులగొట్టి నెత్తుటివంకలు పారించెను. రాక్షసులు దుఃఖించుచుండగా ధూమ్రాక్షుడు ఆంజనేయు నెదిరింప రాగా మారుతి పర్వతశిఖరము నొకదాని నెత్తుకొని ధూమ్రాక్షునిపైకి కవియగా వాడు తన గదతో అంజనేయుని వక్షము పగులునట్లు వ్రేసెను. దానిని తప్పుకొని హనుమంతుడాశృంగాన్ని వేగంగా వాని నెత్తిపై పడవేసి వానిని చచ్చునట్లు చేసెను. అంత రాక్షసులు భీతిచెంది పారిపోయిరి.

అంగదునిపైకి రావణుడు అకంపనుడను వానిని పంపగా వారిరువురికి తుములయుద్ధము జరిగెను. వానరులతని తాకిడికి నిలువలేక బెదరుచుండగా హనుమంతుడు వచ్చి వాని నెదుర్కొనెను. వాయుపుత్రుని రాకతో వానరులు ధైర్యముపొంది పోరాడిరి. రాక్షసుడు హనుమంతుని బాణాలతో ముంచగా అంజనేయుడు తన తల ఒక ప్రక్కగావంచి ఆ బాణాలను లక్ష్యం చేయక

వాడుండుబోటికి ఉద్రేకముతో రాగా వాడు తొలగిపోయి దూరమునుండియే బాణాలు కురిపింపసాగెను. హనుమ వానిని తరుముకొనివెళ్లి ఒక కొండను సమూలంగా పీకి వానిమీదకు వేయబోగా వాడు తన బాణాలతో దానిని చూర్ణము చేసెను. అప్పుడాంజనేయుడు ఇసుమద్ది చెట్లను పీకి గిరగిర త్రిప్పి శత్రుభటాశ్వాదివర్గముపై ప్రయోగించగా వాడా చెట్టును ఖండించి హనుమంతుని వ్రణీకృత దేహునిగా చేసెను. కోపించి హనుమ మరియొక వృక్షమును లాగి గిరగిర త్రిప్పి రెండు చేతులతో వాని తలపై మోదగా వాడు నేలపైబడి మరణించెను. అకంపనుని హతమొనర్చిన హనుమంతుడు బలిని అణగద్రొక్కిన త్రివిక్రమునివలె ప్రకాశించగా రామలక్ష్మణ సుగ్రీవాదులు దేవతలును హనుమంతుని మెచ్చుకొనిరి.

అన్న అనుమతిపై లక్ష్మణుడు రావణునెదుర్కొన రాగా హనుమంతుడాదిక్కుచేరి 'నా వంటిబంటు ఉండగా మీకీశ్రమ ఉండరాదు' అని రావణుని యెదుర్కొనెను. వాడు వేసిన బాణములను తన తోకతో చెదరగొట్టి వాని రథము మీదికి దుమికి తన దక్షిణ బాహువునెత్తి, క్రూరమైన చూపుల చూచుచు వానితో 'నాగ, యక్ష, సుర, రాక్షసదానవ, పక్ష్యాదులచే చావకుండా నీవుండవచ్చునేమో కానీ వానరులచే నీకు చావు తప్పదు. ఇదిగో నా కుడిచేయి ఇన్నాళ్లుగా నిలుపుకొనియున్న నీ ప్రాణాలను చెదరగొట్టుటకై నాచేయి సిద్ధముగా నున్నది. ధీరుడవై చలింపక నిలులుము అని అనగానే రావణుడు కోపించి "వానరా, నీ బలమెంతో చూచెదగాక కొట్టుము. నన్ను కొట్టితివన్న కీర్తి పొందుము. నీవు కొట్టిన తర్వాత నీ శౌర్యమెంతో చూచి నిన్ను పరిమార్తును." అని అనెను. హనుమంతుడు 'నా చేతిబలమెంతో మునుపు చచ్చిన నీ కొడుకును స్మరించుకొని ఊహించుకోరాదా!' అని అనగానే రావణుడు అరచేతితో ఆంజనేయుని కొట్టెను. ఆ దెబ్బకు హనుమ మిగుల బాధపడి ముందు వెనుకకు పలుమారులాగి మరల తెప్పరిల్లి తీవ్రమైన కోపంతో చండ్రనిప్పుల బోలు చక్షులతో గాండ్రించు మోముతో అరుస్తూ రావణుని ఒక గుద్దు గుద్దెను. ఆ పోటునకు దశాస్యుడు కంపించి భూకంపమున భూధరము వలె వచ్చిపోవు ప్రాణముతో గాసిచెందెను. అదిచూచి వనచర ఖేచర మునీంద్రులు మిగుల సంతోషించి హనుమను పొగడిరి. రావణుడు తేరుకొని 'మేలుమేలు. మార్తుండనయైనను మెచ్చితి దండిమగడ' అని మెచ్చుకొనగా,

హనుమంతుడు 'రావణా ఏమిటికో నీవు మెచ్చుట. నా దెబ్బ తగిలికూడ నీవు చావకున్నావు. నా బలము కాల్పనా? "ఓరి మూఢుడా పోటులలోగూడ హెచ్చుతగ్గు లుండునుగదా. ఏదీ మరల నీవు నన్ను నీ భుజబలంకొద్దీ గ్రుద్దుము. అవల నేను నా భుజబలముకొద్దీ కొట్టెదను. అపుడు నా పోటు శక్తి నీ కర్థమగును" అని పలుకగా రావణుడు రక్తాక్షుడై తన శక్తికొలదీ హనుమంతుని రొమ్ముపై తన పిడికిటితో కొట్టెను. ఆ దెబ్బకు హనుమంతుడు చలింపనందున హనుమంతుడు కొట్టులోగా రావణుడు ఆపోటు వదలి నీలుని వద్దకు వెళ్లెను.

బ్రహ్మప్రసాదమగు శక్తిని రావణుడు లక్ష్మణునిపై ప్రయోగించి అతడు సొమ్మసిల్లి నేలకొరుగునట్లుచేసి అతనిని బందీగా తన నగరానికి చేర్చుటకై తన ఇరువదిచేతులతో లక్ష్మణుని ఎత్తుటకు ప్రయత్నించెను. వైష్ణవాంశమగు తేజస్సుతో కూడిన లక్ష్మణుని యేకొంచమైనను ఎత్తజాలక ప్రతిష్ఠకోసం పంగటించి పెదవులు బిగించి ప్రాణాలు బిగబట్టి కదలించబూనే యుండగా హనుమంతు డక్కడికి పరుగునవచ్చి వజ్రనిభమగు తన ముష్టితో తన చేవకొలది రావణుని రొమ్మున గ్రుద్దగా 'మోము గన్నుల వీనులందు నెత్తురులురలంగా దిక్కేదియు తోపక చేష్టలుదక్కి సోలి తన రథములో కూలబడెను. దెబ్బకొట్టుటకవకాశమీయక నీలునివద్దకు పోయిన రావణునికి తన దెబ్బ రుచిని హనుంతుడీవిధంగా చూపి లక్ష్మణుని వద్దకు చేరెను. వెంటనే లక్ష్మణుని తన బాహులలోనికి ఎత్తుకొని రాముని వద్దకు అతనిని చేర్చెను. సుహృదుడు పరమ భక్తికలవాడగుటవలన రావణునికి భారమైన లక్ష్మణుడు అంజనేయునికి తేలిగా ఉండెను. యుద్ధరంగమందలివారీ వింతనుచూచి మెచ్చుకొనిరి.

హనుమ కుంభకర్ణుల యుద్ధము బ్రహ్మాండముగా జరిగెను. కాని ఆ రాక్షసుడు సుగ్రీవుని బంధించుకొనిపోగా హనుమంతుడు కుంభకర్ణుని బారి నుండి సుగ్రీవుని విడిపించుటకై వానిని చంపదలిచియు, తన ప్రభువగు సుగ్రీవుడే తనకు తాను వాని బారినుండి బయట పడగలడని తలించి పోరు సాగించుచు వానరుల నుత్సాహపరచుచుండగా, సుగ్రీవుడు కుంభకర్ణుని ముక్కు చెవులను కొరికి తప్పించుకొని వచ్చెను. తన ప్రభువుపై తానుంచిన విశ్వాసమునకు అంజనేయుడానందించెను. ఈ యుద్ధమునకు పర్యవసానముగా మరణించినవారు లేరు.

అంగదునిపైకి దేవాంతక మహోదర త్రిపురాసులనువారు రాగా అంగదుడు యువరాజని యెంచి ఆంజనేయుడు దేవాంతకుని నడినెత్తిపై పిడికిలితో పొడిచి చంపెను. మహోదరుని నీలుడు మట్టుపెట్టెను. త్రిశిరుని ఆంజనేయుడెదుర్కొనెను. వానిపై చెట్లను వానవలె కురిపించగా వాడు వానిని ఖండించెను. వాని రథాశ్వములను ఆంజనేయుడు తన గోళ్ళచే చీల్చగా వాడు కోపించి శక్తి అను ఆయుధమును ప్రయోగించెను. దానిని మధ్యలోనే పట్టుకొని విరచిన హనుమపైకి త్రిశిరుడు కత్తితీసుకొని కొట్టుటకురాగా అది తనకు తగులకుండా వానిపైకి లంఘించి హనుమంతుడు తన అరచేతితో వానిని కొట్టెను. దానితో వాడు స్వాధీనతతప్పి నేలపడగా, వాని చేతి కత్తినేలాగి హనుమ వానిని వధింపబోయెను. వాడు హనుమంతుని రొమ్ముపై ముష్టిఘాతమివ్వగా ఆంజనేయుడు వాని కిరీటములను లాగి వాని మూడు తలలను కత్తితో నరికెను.

ఇంద్రజిత్తు విజృంభించి బ్రహ్మాస్త్రమువేసి వానరసేనను సారహీనమొనర్చెను. ధాతమీది గౌరవముతో రామలక్ష్మణులా అస్త్రమువలని బాధను సహించి యూరుకొనగా ఇంద్రజిత్తుమరల అనేక బాణముల వేయగా రామలక్ష్మణులతోపాటు వానరులనేకులు మూర్ఛపోయిరి. కొందరు కపులదిచూచి దుఃఖించుచుండగా విభీషణుడక్కడికిచేరి రామలక్ష్మణులు బ్రహ్మాస్త్రముపై గౌరవముతో కట్టుబడి యున్నారని తెలిపి ప్రముఖ వానరులను వెదకుచు జాంబవంతుని వద్దకు వచ్చెను. విభీషణుని కుశలప్రశ్నకు జాంబవంతుడులేచి 'అయ్యా, నాకు బాణపాతము వలన కనులు కనపడుటలేదు. అంజనాదేవి ముద్దుబిడ్డడు వాయుపుత్రుడగు హనుమంతుడు క్షేమముగా నున్నాడా?' అని అడిగెను. దానికి విభీషణుడు 'కపిశ్రేష్ఠా, తమరు దాశరథుల కుశలమడుగక హనుమంతుని గూర్చి అడుగుచున్నారు. తమకు రాజైన సుగ్రీవునిపైనగానీ, అంగదునిపైకానీ, రామలక్ష్మణులపైగాని ఆంజనేయునిమీద ఉన్నంతప్రేమ లేదెందుకో' అని ఆశ్చర్యముప్రకటించి కారణమడిగెను. అపుడు జాంబవంతుడు-

"హనుమంతుడు జీవించిన
మన సేనలు హతములయ్యు మనియున్నవగున్
హనుమంతుడు లేకుండిన
మనమెల్లను బ్రతికియున్న మ్రందినయట్లే"

—గమనమున వాయుతుల్యుడు పీక్యాతిశయమున అగ్నితుల్యుడు హనుమంతు డున్నబో 'బ్రతుకుమీద ఆశ బాధిస్తూనే ఉంటుంది' అని తెలుపుచుండగా హనుమంతుడే అక్కడకువచ్చి జాంబవంతుని పాదాలపైబ్రాలి 'అయ్యా నేను వాయునందనుడన'ని తెలుపగా, ఆ మాటలువిని మనసున సంకటపడుచు మరల తన తల్లికడుపున తాను పుట్టినట్టుగా నెంచుకొని జాంబవంతుడు హనుమంతుని చూచి సంతోషించి అతని బలపరాక్రమాదుల పొగడి వానరులను రామలక్ష్మణులను కాపాడుటకై సంజీవకరణిని తేవలసియున్నదని చెప్పెను. "నీవు సముద్రముదాటి చాలా దూరముపోయి హిమాద్రినిచేరి అందు ఋషభ శైలమునకు కైలాస గిరికి నడుమ కాంతిగలదై సర్వౌషధుల కలిగిన మూలికల కొండను చూచి అందు తమకాంతిచే దిక్కుల వెలిగించు మూలికలను నాల్గింటిని చూడుము. మృతసంజీవని (చచ్చినవారిని బ్రతికించునది) విశల్యకరణి (దేహమున నాటిన శస్త్రాదుల తీసి మాన్పునది) సావర్ణ్యకరణి (గాయములచే వన్నెమారినచోట మరల వన్నె వచ్చునట్లు చేయునది) సంధానకరణి (విరిగిన ఎముకల అవయవాలు మరల అతుకుకొనునట్లు శేయునది) అను వానిని తెచ్చి మనవారికి ప్రాణములనిచ్చి సంతోషపరచుము" అని కోరెను.

వెంటనే ఆంజనేయుడు ఆకాశమునకు ఎగురుటకై ప్రయత్నముచేయగా అతని పాదహతికి పర్వత శిఖరములు వణకినవి. చెట్లు నేలకొరిగినవి. ఇంటి ద్వారాలు విరిగినవి. గోపురాలు కూలిపోయెను. పట్టణమాతయు భయముచే "గొండ్లి" నృత్యము చేసినట్లయ్యెను. తన కార్యము నిర్విఘ్నముగా నెరవేరుటకై శ్రీరామునకు మనసార మ్రొక్కి, రామునికి ప్రియమైన కైంకర్యం చేయుటకు సంతోషముతో గూడిన ఉత్సాహముతో ముఖము వికసింపగా తోక పైకెత్తి మనస్సును కేంద్రీకరించి, వీపు వంచి, చెవులు కుంచించి వేగముతో కుప్పించి ఎగిరి వెళ్లెను. వైనతేయుని వేగముతో విష్ణు కర విముక్త చక్రంలాగా వెళ్లుచుండగా సముద్రములో అలలు తిరుగుడు పడెను. హిమగిరినిచేరి ఉన్నత శిఖరప్రదేశములను, మునిజనపుణ్యాశ్రమములను, బ్రహ్మకోశము, కైలాసము, హరిహయాలయము, హయగ్రీవుని పూజించిన స్థలము, బ్రహ్మకపాలము ఇత్యాది ప్రదేశములను చూచి ఋషభపర్వతము చేరెను. అక్కడ సహస్ర యోజనములు వెదుకగా ఆ మూలికలు తమను ఎవడో తీసుకొనిపోవుటకై వచ్చెనని గుర్తించి బయటపడకుండా మరుగున

నుండినవి. హరిజనకంత కోపము వచ్చెను. కనులెఱ్ఱచేసి పెద్ద స్వరముతో ఆ పర్వతాన్నుద్దేశించి "నగోత్తమా రామునిపై నీకు కరుణలేదా! ఏం నీ ఓషధులను దాచుకొనుచున్నావు? ఇదే నీ నిశ్చయమా? అట్లైతే అసిలో నాచేతిలో నీవేమగుదువో? ఇదిగో ఇప్పుడే నిన్ను పిండికొట్టెదను" అని ఘోషించి సకాంచనమై, సనాగమై, నానాధాతుయుతమై, ఘనతరశృంగమై ఇనసిభప్రకాశము గల ఆ శైలమును పాతులోగూడ పెల్లగించి ఆకాశానికి ఎగిరి, దేవతలు మెచ్చుకొనుచుండగా శీఘ్రంగా బయలుదేరెను. సూర్యకాంతిగల ఆ పర్వతము సూర్యశిష్యుడగు హనుమంతుడు దాల్చి సూర్యసంచార మార్గములో వస్తుండగా రెండవ సూర్యుడో అనునట్లుగా సహస్రారములుగల సుదర్శనమును ధరించిన విష్ణువులాగా ప్రకాశించుచు వానరసేనను చేరరాగా ఆ సంజీవనీ పర్వతమందలి మూలికలమీదుగా వచ్చినగాలి తగులుటచే వానరులందరు ప్రాణాలొందిరి. హనుమంతుడువచ్చు దిక్కుచూచి వారు సంతోషముతో కేకలువేయగా భీతితో రాక్షసులు కలతచెందిరి. ఆ కొండను వానరులమధ్య దింపి సుగ్రీవ జాంబవంతాదులకు నమస్కరించి విభీషణుని కౌగిలించి నిలువగా ఓషధుల వాసన తగిలి దాశరథులు స్మృతినొందిరి. చచ్చిన వానరులందరు లేచిరి. కార్యము తీరగనే ఆ కొండను ఆంజనేయుడు మరల యథాస్థానములో ఉంచి శ్రీరాముని సేవకై తిరిగివచ్చెను.[150]

సమీరకుమారవిజయము ప్రకారం: సమరములో ధూమ్రాక్ష రక్షోమేషము నడంచి తద్రుధిరాన్ని కాల్వలై పారునట్లుచేసి పావని అకంపనుని చంపెను. రావణుడు శక్తిబాణముతో లక్ష్మణుని మూర్ఛనొందింపగా అతడు నేలకొరిగెను. అతనిని లంకకు తీసికొనిపోవుటకై దేహము నెత్తలేక అలసిపోగా హనుమంతుడు రావణుని కనులముందరనే సౌమిత్రిని ఎత్తుకొని సురక్షిత స్థానమునకు చేర్చెను. రావణ శూలమును మట్టుపెట్టెను. త్రిశిరస దేవాంతకుల చంపెను. యుద్ధమున రామునకు వాహనముగానుండెను. వానరులందరు మూర్ఛపోగా సింధువులుదాటి గిరులుచేరి మందులుగల మూలికల తెచ్చి వారిని బ్రతికించెను.[151]

రామచరితమానస్‌లోగల విశేషము: మూర్ఛపోయిన లక్ష్మణుని లేవనెత్తి మోసికొని తెచ్చుటతో నూరుకొనక హనుమంతుడు లక్ష్మణుని చికిత్సకై లంకలోని సుషేణుడను వైద్యుని పిల్చుకొనివచ్చుటకు సూక్ష్మరూపమున

వెళ్ళెను. వాడు వచ్చునో రాడో అని శంకించి వానిని గృహముతోకూడ తెచ్చెను.[152]

## 5 హనుమను ఇంద్రజిత్తు మోసపుచ్చుట

నికుంభిలచైత్యమున యాగమొకటి చేయదలచి ఇంద్రజిత్తు దానికి విఘ్నములు కలుగకుండా వానరులను తాత్కాలికముగా దృష్టిమళ్లించు నుద్దేశముతో మాయసీతనొకదానిని సృష్టించి హనుమంతుడున్న ప్రదేశమున ఆమెను వధింపబూన వచ్చెను. ఆమెను చంపినచో సీతా మరణవార్త వినిన రాముడు యుద్ధము మానివేయునని వాని కుటిలాలోచనము. ఇంద్రజిత్తు ఆమెను చంప నుద్యుక్తుడుకాగా హనుమ ఆమె నొక ముహూర్తకాలము చూచి జానకిగా నిశ్చయించుకొని సంకటపడెను. వానినుండి ఆమెను కాపాడుటకై వానరసేనతో రాక్షసులపై బడెను. తక్షణమే సీత శిరోజములనుపట్టి వాడు కత్తితో ఆమెను నరుకబోయెను. అపుడు హనుమంతుడు "ఓరీ రామచంద్రుని ఇల్లాలును పరసతియునైన ఈమె కేశములను పట్టిన నీకు నాశనము తప్పదురా శంఠా, దురితాత్మ, కావలుడా, క్షుద్రశీలుడా, ఖలుడా, దయాహీనుడవై స్త్రీని జంప బూనితివి. ఈమె నీకేమి అపరాధము చేసినదిరా! ఇల్లు వాకిలి వదలి భర్తకు దూరమై, మీ బాధల మౌనముగా భరించు పరమ రాజర్షి పుత్రియైన యీ సాధ్విని వధింపబూనితివి. దీనివలన నీకు కీర్తివచ్చునా! ఇప్పుడు నిన్ను వధించినచో నీవు స్త్రీహత్యా పాతకులు వెళ్ళు లోకానికి పోగలవు" అని వాని మీద దూకగా ఇంద్రజిత్తు హరీశునిపై బాణవర్షం కురిపించి అతనితో 'ఓరీ వానరా! ఈమెను చంపితర్వాత రాముని, అతని సోదరుని, ద్రోహియైన విభీషణుని కూడా చంపెదను. మీరు మాకు శత్రువులు. స్త్రీవధ చేయరాదని అంటివి. కాని మీకు గూడ చేయు కార్యమొనర్చుట మాకు కర్తవ్యము' అని అరచి సీతను నరికెను. ఆమె 'రామా రామా' అనుచు రెండు తుండెములై పడిపోయెను. అప్పుడు వాయుజునికి ఇంద్రజిత్తునకు గొప్ప యుద్ధము జరిగెను. సీత ఆ దుష్టుని చేతిలో మరణించెనను దుఃఖము మారుతిని క్రుంగదీయుచుండగా కోపముతో ఒక పెద్దబండను ఇంద్రజిత్తుని రథముపై పడునట్లు వేయగా వాని సారథి ఆ రాతినుండి రథమును ప్రక్కతోలి రక్షించెను. హనుమంతుని దైన్యమునుచూచి రాక్షసులు విజృంభించుచుండ హనుమంతుని

మనసులో ఆలోచనలు కలుగసాగెను. "నేను పోరాడి శత్రుసేనను నాశనము చేసినను లాభములేదు. ఈ వార్త రామునకుతెల్పి ఆయన ఆలోచనప్రకారం కర్తవ్యం నిర్ణయించాలి" అని తలంచి మెల్లమెల్లగా వానరసైన్యమును మరల్ప చేసెను. తన ఆశయము నెరవేరినందున ఆనందముతో ఇంద్రజిత్తు నికుంభిలలో నిర్విఘ్నముగా యజ్ఞం చేయుటకై పోయెను.

రామునకు హనుమ సీతావధనుగూర్చి తెలుపగా రాముడు శోకముతో క్రుంగిపోయెను. అప్పుడు ఆవేశముపూనిన లక్ష్మణుడు ధర్మము నాశ్రయించినవానికి వచ్చు క్లేశముల నతిశయించి పలికి అధర్మము చేయువారికే మేలు కలుగుచున్నదని వాదించుచుండగా అచటికి విభీషణుడువచ్చి ఇంద్రజిత్తు చేసిన మోసమును వివరములతోసహా చెప్పి వారిని ఓదార్చి నికుంభిలయాగము నిర్విఘ్నముగా వాడు చేసినచో అతనిని జయింప సాధ్యముకాదని స్పష్టపరచి యజ్ఞధ్వంసమునకు రామాజ్ఞపొంది హనుమదాది వానరవీరులతో నికుంభిలకు వెళ్లెను. ఆంజనేయుడు అచటి రాక్షసులను పిడికిళ్లతో కొట్టి చంపుచుండగా ఇంద్రజిత్తు యజ్ఞముమాని హనుమంతు నెదుర్కొనెను. ఆయుధములతో మాయాప్రయోగములతో కాక ద్వంద్వయుద్ధమునకు రమ్మని హనుమంతుడు సవాలు వేసెను. వారిరువురు పోరుచుండగా విభీషణ ప్రేరితుడై లక్ష్మణుడు ఇంద్రజిత్తుపైకి వచ్చెను. రాక్షసవీరులతో హనుమ పోరాడుచుండగా లక్ష్మణుడు రావణపుత్రుని సంహరించెను. ఇంద్రజిత్తును రూపుమాపినందున వానరులు సంతోషించి శిబిరమునకు తిరిగి చేరిరి.

రెండవమారు రావణుడు రణరంగమునకువచ్చి లక్ష్మణునిపై శక్తి బాణము వేసెను. అది తగిలి రామానుజుడు మూర్ఛపోగా శ్రీరాముడచటికివచ్చి అవలీలగా ఆ బాణాన్ని లాగివేసి సుగ్రీవుని ఆంజనేయుని పిలిచి తన తమ్ముని కాపాడుకొనుచుండుమని కోరి రావణునితో పోరాటము కొనసాగించి వానిని రథముతో పాటిపోవునట్లు చేసెను. సుషేణుడు లక్ష్మణునిలో ప్రాణములున్న వనియు, దుఃఖింప పనిలేదనియు తెలిపి ఆంజనేయునిచూచి "మునుపు జాంబవంతుని సూచనప్రకారం నీవు తెచ్చిన (సంజీవని) ఓషధపర్వతమున దక్షిణ కూటమున నున్న సువర్ణకరణి, సంజీవని, సంధానకరణి అను మూలికలను వెంటనే కొనిరమ్ము. దానితో లక్ష్మణుడు బ్రతుకగలడు" అని చెప్పెను.

రామాభ్యర్థనతో హనుమంతుడు తత్పర్వతమునకుచేరి ఆ దక్షిణ శిఖర మందలి ఓషధీస్వరూపములను గుర్తించజాలక ఆలోచనలోపడెను. సుషేణుని వద్దకువెళ్లి వానిస్థితిని తెలిసికొనివచ్చుటకు వ్యవధి లేనందున ఆ దక్షిణ శిఖర మునే ఎత్తుకొని వెళ్లుటకు నిర్ణయించుకొనెను. అంత ఆ శిఖరాన్ని మూడు మార్లు కదిలించి వికసిత పుష్పయుతములగు లతలతో తరులతో ఆ శిఖరమును ఎత్తుకొనెను. జలపూర్ణమైన మేఘమును వాయువు తీసికొని వచ్చునట్లు వాయు పుత్రుడు వైహాయసవీధిలో ఆ శిఖరాన్ని తెచ్చి రామాదులచెంత చేర్చి, కొంత విశ్రమించి ఆ ఓషధీమూలికలు తనకు తెలియనందున శిఖరమునే మొత్తముగా మోసి తెచ్చినట్లు సుషేణునితో చెప్పెను. వైద్యుడగువాడు మూలికల నుప యోగించి సౌమిత్రిని బ్రతికించెను. ఇంద్రజిత్తు దెబ్బవలన మూర్ఛనొందిన వానరవీరులను, దాశరథులను బ్రతికించుటకై ద్రోణాద్రినేతెచ్చి యొకమారును, రావణాస్త్రమువలన మూర్ఛితుడైన లక్ష్మణుని బ్రతికించుటకు ద్రోణాద్రిలోని దక్షిణ శిఖరాన్ని తెచ్చి రెండవమారును వారికి ప్రాణదానము చేసినందుకు అందరును ఆనందించిరి. మొదటిసారి రాత్రివేళలోను, రెండవసారి సూర్యా స్తమయమునకు పూర్వము పగటివేళలోను తెచ్చి దివారాత్రములలో నేవేళలో నైనా ఆకాశమున వాయువేగమునవెళ్లి అసాధ్యమైన దానిని సాధించి, అసాధ్య సాధక స్వామిగా వానరులందరిచేతను, రామాదులచేతను స్తుతింపబడెను.[153]

భాస్కరరామాయణమున నీ ఘట్టము: తన సోదరునికై రాముడు హనుమంతుని సంజీవనిని తెమ్మనికోరుచు—

సోదరులము మేము నలువుర
మైదవతోడగుదు వీవు ననయముఁ దేజో
మోదంబు మిగుల గలుగన్
నాదెసఁ గృపసేయరయ్య నగచరవర్య.

—అని పలికెను.[154]

సమీరకుమారవిజయానుసారము : మేఘములలోచేరి ఇంద్రజిత్తు అస్త్ర ములను ప్రయోగించుచో హనుమ లక్ష్మణునిచేరి 'అంబరమందగజేసి ఆవ హించి' నిల్చెను.[155]

హనుమంతుడు ద్రోణాద్రిని తెచ్చుటలో విఘ్నముల కల్గించుటకై కాల నేమి యనువానిని రావణుడు పంపెను. ఈ కాలనేమికథ అవాల్మీకము.

రంగనాథ రామాయణము, భాస్కర రామాయణములలో ఇది ఒకేరీతిగా పోషింప బడినది. సాగరయానసమయమున మైనాకుని అతిథ్యమునే స్వీకరించని ఆంజనేయుడు రామకార్యము పూర్తికాకమునుపే దాహమునకై ముని ఆశ్రమములో దిగుట ఔచిత్యము కాదని తలచి కాబోలు ఈ రచయితలు ఈ కథలో కొన్ని మార్పుల చేసియున్నారు. రాముడు హనుమంతుని పిల్చి మరల ద్రోణాద్రిని తెమ్మని కోరుచు—

"పడయుము త్రిభువన ప్రఖ్యాత కీర్తి
అనుజులు మును ముప్వు రరయ నాకిప్పు
డనిలనందన నల్వురైరి సీతోడ...."

—అని పలుకగా, ఆంజనేయుడు విని—

"నీ బంటు హనుమంతుడుండ
నినకులోత్తమ నీకునేల చింతింప
నీయాజ్ఞ తలమోచి నృపసింహ వేగ
మా యేడు దీవుల కవల నుండినను
నిను డుదయాద్రి కేతేరకమున్న
కొనివత్తు నౌషధ కుధరమేను"

—అని పలికెను. రామాజ్ఞపొంది అనిలసుతుడు వెళ్లుచుండగా అతనికి దారిలో ఒక ఆశ్రమము కనిపించెను. కాలనేమి అను రాక్షసుడు మునివేషములో కుహనాజపము చేయుచుండగా మారుతి గమనించి—

యిది నాడు లేదిప్పుడెందు వచ్చితినో
యెక్కడి దుగ్ధాబ్ధి యెక్కడి మేరు
వెక్కడి మునివనం బది త్రోవదప్పెఁ
దెరువిమ్మునీంద్రుచే తెలియంగ నడిగి

—అడిగెదనని క్రిందకు దిగెను. ఆ వనమున పక్వమైన ఫలములున్నను మునిశాపభీతిచే వాటిని తినక ఆ మునినిచేరి తన పేరుచెప్పి నమస్కరించెను. అతడు కన్నులు తెరువగా 'స్వామీ యిచట నేను దప్పిక తీర్చుకొనవచ్చునా' అని ప్రశ్నించగా ఆ ముని 'నా కమండలువులో నీరున్నది త్రాగుము. ఈ ఆశ్రమమందలి ఫలములను తినుము. విశ్రాంతి కలుగునట్లు రాత్రి బాగా

నిద్రింపుము. నాకు అతీత అనాగత విషయముల నెఱుంగు శక్తికలదు. సీతాపహరణం వలన రామ రావణ యుద్ధము జరుగుచున్నది. లక్ష్మణుడు మూర్ఛనొంది యున్నాడు. నాకు అన్నియును తెలియును. నేను అధర్ములకు కనపడను. ఉత్తముడగుటవలన నీకు కనిపించినాను. నీవు తేదలంచు వన మూలికలు నా ఆశ్రమములోనే యున్నవి. నావద్ద నీవు ఉపదేశము పొంది సరో వనమూలికలతోగూడ నీవు రెప్పపాటు కాలంలో లంకలో ఉండగలవు' అని తెలిపెను. అక్కడ లక్ష్మణుడు ప్రాణాపాయస్థితిలో నుండగా తానిక్కడ నిల్చుటగానీ, ఫలముల తినుటగానీ, నిద్రించుటగానీ ఔచిత్యము కాదని అంజ నేయుడు తెలిపి తనకొక నీటికొలనును చూపుమనగా వాడా ప్రదేశములో ఒక కొలను చూపి అందలి నీటిని సేవించి రమ్మని తెలిపెను.

ఆ మాటలను నమ్మి అంజనేయు డా హ్రదమున దిగెను. కాలు నీటిలో పెట్టిన వెంటనే ఒక మొసలి అతని కాలుపట్టి లాగెను. దానిని మారుతి చంపగానే ఆ మకరి ఒక అప్సరసరూపం ధరించి నిల్చెను. అంజనేయు డాశ్చర్యపడుచుండగా ఆ అప్సరస "మహాత్మా, శాండిల్యముని శాపమున మకరినైయుండిన నేను ధాన్యమాలిని అప్సరసను" అని తన శాపకారణసహిత మైన కథ నంతయు తెలిపి "స్వామీ, మీవలన నాకు శాపవిముక్తి యైనది. ఈ ఆశ్రమములో మీరు చూచిన ముని కపటి. వీడొక రాక్షసుడు. రామ కార్యమున సాగిపోవు మీకు మేలు కలుగునని" పలికి తన లోకమునకు వెళ్లెను. అంజనేయుడంతట ఆశ్రమములోనికివచ్చి మాయా మునిని చేరగానే "నీవు గురుపూజ చేసినచో నీకు మంత్రము తెలిపెదను" అని ముని పలుకగా, హరీశుడు 'ఇదిగో గురుపూజ' అని వాని రొమ్ముపై ఒక్క పోటు పొడిచెను. వాడా రూపంవీడి పక్షిరూపం ధరించిరాగా అనిలకుమారుడు వాని రెక్కలు విరిచెను. తర్వాత సింహముకాగా కపిసింహుడు ముష్టితో కొట్టెను. వాడు సుగ్రీవుని రూపం వహించి 'మారుతీ యిక్కడున్నావా! మన సౌమిత్రి బ్రతికి నాడు. నీవింక ద్రోణాద్రికి పో నవసరంలేదు' అని మోసపుచ్చు మాటలు పలుకగా సామీరి సత్యమును గ్రహించి వానితల త్రెంపి వధించి అంతట ద్రోణాద్రికి వెళ్లెను. ఆ పర్వతము ఓషధులను కనపరచకున్నందునను, అచటి గంధర్వు లడ్డుపడినందునను ఆంజనేయుడు వారికి బుద్ధిచెప్పి ఆ పర్వత మునే మోసి తెచ్చుచుండగా అయోధ్యలోని భరతుడు ఆకాశమున పోవుచున్న

హనుమంతుని చూచి దానిని దుష్టగ్రహమని తన వింటిని ఎక్కుపెట్టి బాణమును సంధింపబోయెను. ఆరోజుకు ముందు రాత్రి భరతునకు రామాదులగూర్చి పీడకల వచ్చియుండెను. పైనుండి చూచిన హనుమంతునికి ఘనజటాభారవల్కలము లతో ఘన శ్యామవర్ణముగల వ్యక్తి కనబడెను. ఆ భరతుని విగ్రహముచూచి అతనిని రామునిగా తలంచి, 'అయ్యో! లక్ష్మణుని, సీతను వదలి రాముడు వచ్చెనేమోకదా!' అని తలపోసి ఆ వృత్తాంత మెరుంగకోరి క్రిందకు దిగబోయి మరల రాముని సత్యవ్రతము, భ్రాతృప్రేమ, ధర్మదీక్ష మొదలగు గుణముల స్మరించి యీ తపోధనుడు రాముని పోలియుండవచ్చునని వెళ్లనుండగా భరతుడు పూర్తిగా సంధించులోగా అశరీరవాణి అతనికి హనుమంతుని వృత్తాంతము తెలిపి బాణమునుపసంహరింప జేయించెను. అంత రామాదుల క్షేమమునకై భరతుడు పరమేశ్వరారాధన చేయబోగా అంజనేయు డాకాశ మున ప్రయాణం సాగించెను. అంత మాల్యవంతుడు అను రాక్షసుడాకా శంలో ఎదురై 'ఈకొండను సముద్రంలో వేయుము. లేనిచో నిన్ను చంపెదను' అని మీదికిరాగా, అంజనేయుడు వానిని వధించి ద్రోణాద్రిని రాముని వద్దకు చేర్చెను. పనినెరవేరి సౌమిత్రి లేచిన తర్వాత ఆ ద్రోణాద్రిని యథాస్థానంలో ఉంచివచ్చుచో స్థూలజంఘ, మహోదరాదులతని నెదిరించగా వారిని మడియజేసి గిరిని దానిచోటికిచేర్చి తిరిగివచ్చెను. అతనిని శ్రీరామ లక్ష్మణులు అభినందించి ఆలింగనమొనర్చి స్తుతించిరి.[156]

సమీరకుమార విజయము ప్రకారము: వాల్మీకి రామాయణములో లేని యీ కథ తెలుగు రామాయణముల పంథాలోనే సాగినది. శక్తిబాణహతుడై మూర్ఛనొందిన లక్ష్మణుని బ్రతికించుటకు ద్రోణాద్రిని తెచ్చుచో దారిలో విఘ్నకారియగు కాలనేమిని కడతేర్చి ఆ పర్వతమును తెచ్చెను. ధాన్యమాలినికి శాపవిమోచనం కలిగించెను. కాని యీ సన్నివేశముల క్రమములలోను కొన్ని కల్పనలలోను, సమీరకుమార విజయమున కొంత విస్తృతి ఉన్నది. కాలనేమి రకరకాల జంతురూపాలను ధరించినట్లు మాత్రం ఇందులో లేదు. ద్రోణాద్రికిచేరి ఔషధములను కనపడవలెనని ప్రార్థించెను—

"ఓ నగచక్రవర్తీ సుగుణోర్జితకీర్తి జగద్ధితంబు రా
మానుజు ప్రాణరక్షకుఁ ద్వదౌషధముల్ గనిపింపు"

—అని అతడు ప్రార్థించినా ఆ పర్వత మాతని మొర నాలకింపలేదు. మరి యొకసారి మొరపెట్టుచు ధరాదురంధరుల నందరిని దాల్చు మహా ఫణీంద్రుడే సౌమిత్రియై పుట్టినాడనియు, రావణ బాణహతుడై మూర్ఛితుడై యున్నాడనియు, అతనిని జీవింపజేయ ఔషధములనిమ్మని ప్రార్థించెను. దానికాకొండ కదలనందున దాని కృతఘ్నతకు రోషించి ఆ గిరిని తన వాలముతో చుట్టి పెకలించెను. అప్పుడాగిరిలోని ఝరులన్నియు ఆ కొండ వ్యథతో కార్చిన కన్నీరులాగా స్రవించెను. దానిని చేత ధరించి పావని పైకి ఎగిరిపోవుచో అందలి పదమూడుకోట్ల గంధర్వులు క్రోధరక్తాస్యులై కేసరిసుతు నెదుర్కొనిరి. అపుడు హనుమ తన వాలమునల్లార్చి వారిని గొంతులపట్టి పైకి ఎగురవేయగా వారు భయపడి శరణువేడిరి. అంత ఆ కొండనుతెచ్చి లక్ష్మణునకు ప్రాణ దానము చేసెను. తిరిగి దానిని యథాస్థానములో చేర్చివచ్చుటకు పోవుచో స్థూలజంఘ, మహాదంష్ట్ర, మహోదరాది రాక్షసులు ఎదిరించగా వారిని చంపి తన కార్యము నెరవేర్చెను.[157]

రామచరితమానస్ ప్రకారం: హనుమంతుని యెదుట ఇంద్రజిత్తు సీతను చంపగా ఆ వార్తవిని రాముడు మూర్ఛపోయెను. అపుడు పావని ప్రచ్ఛన్న రూపం ధరించి లంకలో ప్రవేశించి జానకిని చూచివచ్చి తమవారికావార్తతెల్పి ధైర్యము కలుగజేసెను. ఇంద్రజిత్తు మరణించగా అతని కళేబరాన్ని మోసుకొని లంకానగర ద్వారమున పెట్టివచ్చి ఇంద్రజిత్తు పరాక్రమమునకు తగిన గౌరవమును చూపెను. సంజీవనీ పర్వతమును మోసుకొనిపోవు హనుమనుచూచి వానినొక రాక్షసునిగా భావించి భరతుడు బాణముతో వానిని కొట్టెను. రామనామోచ్చారణముతో హనుమ నేలపై పడెను. భరతుడువచ్చి చూచి చైతన్యవంతుని చేయుట కెన్నో విధాల ప్రయత్నించెను. హనుమ లేవనందున శ్రీరామునిపై ఆన పెట్టినంతనే హనుమ లేచెను. అతని కథ సకలమెరిగి లంకవరకు వెళ్లునట్లు తానొక బాణము సంధింతుననియు, దానిపై కూర్చొని వెళ్లుమని వానరవీరుని కోరెను. శ్రీరాముని ప్రతాపమును పావని వర్ణించి భరతునకు నమస్కరించి గాలిలోనే ఎగురుతూ వెళ్లెను.[158]

## 6 మై (మహి) రావణ వృత్తాంతము

ఈ కథ వాల్మీకి శ్రీమద్రామాయణమున లేదు. పరాశర సంహితలో వర్ణితము. ఆనందరామాయణమునకూడ కలదు. సమీరకుమార విజయమున

దీనిని పాతాళలంకేశవధగా తెప్పున వ్రాసియున్నాడు. అంతరార్థ రామాయణము మైరావణచరిత్ర పద్యగ్రంథములు, వచనగ్రంథములు, హనుమత్ లీలా తరంగిణి మొదలగు కావ్యములలో ఈ కథ పోషింపబడియున్నది. కథలోని అంశములలో అన్నిటిలోను ఏకాభిప్రాయమున్నను పేర్లు కొంచెం తేడాగా ఉన్నవి. పాతాళలంకేశుని మహిరావణుడుగా, మైరావణుడుగా కొన్నింట పేర్కొనబడగా కొన్నింట ఐరావణునిగా పేర్కొనుట జరిగినది. కొందరు గ్రంథకర్తలు అహిరావణుడు, వాని సోదరుడు మహిరావణుడు అను నిర్వురను కల్పించిరి. కొన్నింట మైరావణుడు రావణునకు మేనమామ కాగా మరికొన్నింట దాయాది. మైరావణుని సోదరి దోర్దండి అని కొన్నింట ఉండగా మరి కొన్నింట దుర్దండి అని యున్నది. ఈ కథను నాటకములుగా, సినిమాలుగా చిత్రించి ఇంకనూ అర్వాచీనులు కల్పనలనధికము చేసియున్నారు. శృంగి - భృంగి అను వైకుంఠవాసులే అహిరావణ, మహిరావణులుగా జన్మించి రావణునకు తోడ్పడినట్లు కొన్నింట కలదు. రాముని ఏకపత్నీవ్రతమును పరీక్షింపజేసి అతని శీలమును పోషించుటకును, రాక్షసుల ప్రాణములు పంచ కీటకములలో నుండగా అంజనేయుడు పంచముఖుడై వానిని వధించుటలో చూపిన పరాక్రమాదులను, రావణుని మోసములను మోసముతోనే మారుతి జయించినట్లును అద్భుతమైన సన్నివేశములను ఈ చరిత్రలలో కూర్చి యున్నారు. పునరుక్తదోషమునకు తావీయకుండా కేవలము పరాశరసంహిత లోను, సమీరకుమారవిజయములోను గల కథాంశములను ఆంజనేయ సంబధమగువానిని వివరించుచున్నాను. (ఇతర వివరములు తెలియుటకు ఆనందరామాయణము, మైరావణ చరిత్ర, రామాయణాంతరార్థము, హనుమాన్ లీలాతరంగిణి అను గ్రంథములను చూడదగును.)

పరాశరసంహితోక్త కథ: మైరావణుడు రావణునికి మేనమామ. వీనికి సోదరి దుర్దండి. కాలదండుడనువాని నీమె పెండ్లియాడి నీలమేఘుడను కొడుకును కనియుండెను. నారదుడొకరోజున మైరావణునివద్దనున్న వాని మేనల్లుడగు నీలమేఘుని చూచి 'వీడు పాతాళ లంకాధిపతి కాగలడుసుమా' అని తెలుపగా మైరావణుడు కాలదండుని తుదముట్టించి దుర్దండిని, నీలమేఘుని బంధించియుండెను. వారిని వేరువేరుగా ఉంచెను. దుర్దండితో ఊడిగము చేయించుచుండెను. రాముని వీరోచితముగా రణరంగమున జయించలేక

రావణుడు మాయోపాయమున వారిని నిర్మూలింపదలంచి మైరావణుని సహాయ మర్థించెను. అదిలో మైరావణుడు అయిష్టత ప్రకటించెను. బంధుత్వమూ, జాత్యభిమానములకు లొంగి అంగీకరించెను. శ్రీరామలక్ష్మణులకు అపద కలుగకకుండా హనుమంతుడు తన తోకతోఒక కోటనుకట్టి వారినందుంచి కావలి కాయుచుండెను. రామలక్ష్మణుల నపహరించుకొని రావలసినదిగా మైరావణుడు సూచీముఖుడను రాక్షసుని పంపెను. వాడువచ్చి హనుమంతుని తోకను పొడవగానే వాని ముఖము బ్రద్దలైనందున వాడు పారిపోయి తన ప్రభువునకు తెలిపెను. అంత వాడు మూషికముఖుని పంపగా వాడు హనుమంతుని కొరుకబోగా వాని నోరు బ్రద్దలయ్యెను. ఆ తర్వాత వచ్చిన పాషాణ భేది అనువానికి యిదేగతి పట్టగా స్వయముగా మైరావణుడే కార్యరంగమున దిగి విభీషణుని రూపమున వానర శిబిరములో ప్రవేశించి హనుమదాదులను మోసపుచ్చి వాల ప్రాకారమందలి రామలక్ష్మణులనుచేరి వారిపై సిద్ధ ఔషధ ములచల్లి మూర్ఛితులచేసి వారిని బంధించి ఒక పేటికలోనుంచి వంచనతో పాతాళలోకమునకు చేరెను. తన సోదరి దుర్దండినిపిల్చి ఆ నరులను దుర్గకు బలియిచ్చుటకై సిద్ధము కావింపుమనిచెప్పి పవిత్రముగా ఘటముతో తీర్థమును తెమ్మని ఆమెనాదేశించెను. విభీషణుడు జరిగిన మోసమును వానరాదులకు తెల్పి శ్రీరామలక్ష్మణులను దెమ్మని హనుమంతుని కోరెను హనుమ పాతాళమున ప్రవేశించెను. ఆ పాతాళ లంకాపురమున శత్రువులు ప్రవేశించి నచో ఒక త్రాసు మ్రోగును. దానితో హెచ్చరికనొందిన రాక్షసవీరులు హనుమంతుని పట్టబోవగా శార్దూలముఖ, గార్ధభనిస్స్వన, శతజిహ్వా, దీర్ఘ జిహ్వా, అశ్వముఖ, సర్వరోమ, వృశ్చికరోమ అను ఏడుగురిని చంపి మత్స్య వల్లభుడనువాని నెదుర్కొను. వీడు ఆంజనేయ స్వేదజలసంభూతుడైన కథ విని, వాని సహాయముతో, దుర్దండి సహాయముతో తీర్థఘటమున ప్రవేశించి, మొదట శ్రీరామసౌమిత్రులను దేవికి బలికాకుండా కాపాడి అటుతర్వాత దుర్దండి చెప్పిన రహస్యము ప్రకారము మైరావణుని పంచప్రాణములుకల అయిదు తుమ్మెదలనుచంపి శ్రీరామలక్ష్మణులతో లంకాసాగరస్థశిబిరము చేరెను.[159]

సమీరకుమారవిజయలోని కథ : ఇందీకథ పాతాళ లంకేశుని కథగా వర్ణితము. రాముని వధింపలేక, రామబాణహతినోర్వలేక రావణుడు తన

చెలికాపగు నాగలోక లంకావిభుని సహాయమర్థించెను. సదుంగు దాశరథులను తన పురి కంకాళికి బలి యొనరుదునని వాడు రావణునకు తెల్పి తా జేయబోవు పనిని తన భార్యకు తెల్పెను. ఆ ప్రయత్నమును మానుమని ఆమె భర్తకు హితముపదేశించెను. "పెరవారి నేర్పరిమాటలకు మోసపోయి జగత్పతియైన రాముని మాయతో కప్పుటకు వీలుకాదు. అతనికి మంత్రియై, భృత్యుడై, మేధాశాలియై, జగత్త్రయైకనుత గాంభీర్యుడై, బ్రహ్మశివేంద్రాది దేవతా వర ప్రభావుడై యున్న వాయుపుత్రుడున్నంతవరకు రాముని సాధింప తరముగాదు. ఆ వాతాత్మజుడు —

"....  ....  ....  వానరమాత్రుడే?
యాతత శత్రుకుల జైత్రు డఘటనఘటనా
స్వాతంత్ర్య శుభ చరిత్రుడు
నీ తరమా యతని డొడరి నిలువగ బోరన్"

—అని హెచ్చరించెను. ఆమె తన భర్తనా ప్రయత్నమునుండి వారింపజేయు తలంపుతో ఆంజనేయుడప్పటిదాకా సాధించిన వీరసాహస కృత్యములు కాల నేమి కథ, మాల్యవంత పతనము, స్థూలజంఘాదులు తూలిపోవుట, చిత్రసే నాది గంధర్వులు పాట్లుపడుట, అక్ష ధూమ్రాక్ష దేవాంతకాది వీరుల అస్తమయము పేర్కొని అంజనీసుతుడు బాల్యమాదిగా నొనర్చిన అద్భుత వీర సాహసగాథలు, సూర్యబింబ గ్రహణము, దేవతలందరతనికిచ్చిన వరములు ఇత్యాదులన్నియు తెలిపి 'తెలిసితెలిసి చిచ్చు వడిగట్టనేల' అని పలుకగా వాడు తన భార్య తన శౌర్యము గుర్తించలేదని తెల్పి తన కార్యమును కొనసాగింప బూనెను. ఈ వార్త సరమ విభీషణునికి తెలుపగా అతడు హనుమంతుని వద్దకువచ్చి "వానరాళికెల్ల నీ వాలవల్లియే వజ్రపుకోట, రాజకుమారులకు బహిఃప్రాణము, కావున వారిని కాపాడుకొనవలసినదిగా కోరెను. అంత హనుమ తన వాలమును కోటవలె పెంచి వారికి రక్షావలయము నేర్పరచెను. అపుడతనితోక—

ఆత్మీయ చలన లీలాధూత కంజాత
గర్భాండ ఖాండోర్ధ్వ కర్పరంబు
నిజ కర్బుర ప్రభా నిర్భేదిత క్ష్మాద్ర
శాసనోదగ్ర బాణాసనంబు

ప్రత్యర్థి రాక్షస ప్రాణాహృతి క్రియా
భీల కాలవ్యాళ ఖేలనంబు
పర్వతోత్పాట నోద్భట పాటవ కఠోర
తాటోప విజిత వజ్రాయుధంబు
నై చెలగెడు లాంగూల మట్టి పెంచి
క్రింద మీదటనెల్ల నేకీభవింపి
చుట్టు సేనకుఁ గోటగాఁ బెట్టి యొక్క
పట్టునను నెట్టుకొని గాఢ్పు పట్టియుండె.

—అందు వజ్రపంజరంలో ఉన్నదానికన్న నిర్భయులై కపికోటి నిద్రించెను. దాశరథులు విశ్రాంతి పొందిరి. విభీషణుడు ప్రహరీ తిరుగుచుండెను. పాతాళ లంకాధిపతి తన వేగులవారినిపంపి ఆ కోట తెఱంగు తెలియరమ్మని పంపెను. సూచీముఖుడనే రాక్షసుడు అందుకై వచ్చి ఆ కోట క్రిందుక్రిందుగా త్రవ్విచూచి దాని దుర్భేద్యత తన ప్రభువునకు తెలిపెను. పాతాళ లంకేశుడు విభీషణుని వేషమునవచ్చి కోటలోనికిపోయి తన మాయాప్రభావంతో రామలక్ష్మణులను తీసికొనివెళ్లి వారిని కాళికి బలియిచ్చుటకొఱకై యుండెను. మోసము గ్రహించిన విభీషణుడు హనుమకు పాతాళ లంకేశుని మాయలుతెలుపగా వెంటనే హనుమ పాతాళలంకామార్గం తెలిసికొనిపోయి అచట ప్రవేశించెను. వాయుపుత్రుడగు హమమంతుని పుత్రుడని చెప్పుకొను మత్స్యవల్లభుని ఎదిరించి, తన స్వేదజ
ల పానమొనర్చిన ఒక మత్స్యమునకు జన్మించినవానిగా నెఱింగి వానితో పోరాడి నగరిలో ప్రవేశించి దుర్దండి అనేదాని తోడువలన దనుజుని మర్మమెరిగి, ద్వారపాలురచంపి పలుసేనల పొలియించి, తస్కరుని పుత్ర మిత్ర పౌత్రంబుగా తునిమి దుర్దండి సుతునకారాజ్యమిచ్చి రాఘవులను క్రమ్మరతెచ్చెను.[160]

రామచరితమానస్ ప్రకారం: ఇందులో అహిరావణుడు రావణునికి సాక్షాత్తు మండోదరి ద్వారా జన్మించిన పుత్రుడే. జన్మించినపుడు వీడు ఇరువది పాములతో కూడి పుట్టినందున వీనిని గృహములో నుంచుట ఉచితముకాదని భూమిలో పాతిపెట్టుమని రావణుడాజ్ఞాపించెను. ఆ శిశువు మన్నుతిని జీవించుచు భూమిని తొలచుచుండెను. రాహువుతల్లి సింహిక వీనిని కాపాడి పెంచెను. వీడు పాతాళమునకుచేరి కామదదేవి నుపాసించి ఆమె నుండి రెండు వరములను పొందెను. త్రిమూర్తులు, ఆదిశేషుడు, సూర్యుడు మొదలగువారివలన

మరణము లేకుండునటు మొదటివరము. తన తండ్రి తనను విసర్జించి అవమానించినందున ఆతడు తననొకసారి యాచించునటు చేయుమని రెండవవరము. దేవి అటులనే ప్రసాదించును "నీతండ్రి నిన్ను త్రేతాయుగములో యాచించును. ఒక వానరుడు మాత్రం నీకు వశ్యుడుకాడు. వాని ప్రభువు జోలికి నీవు వెళ్లి కున్నచో నీకు మరణముండును." అని హెచ్చరించియుండెను. వీడే రామలక్ష్మణుల నపహరించెను. వీనినే హనుమంతుడు వధించెను. అందువలన రామలక్ష్మణులు "హనుమా, నీకీర్తి త్రిలోకవ్యాప్తి పొందును." అని అనుగ్రహించిరి.[161]

పైన తెల్పిన అంశములనుబట్టి అహిరావణుడనగా పాములతో పుట్టినందున వచ్చినపేరు. వీడు పాతాళలంకాధిపతియే. మహి అనగా భూమి - అనగా పాతాళమును అనియే భావించి మహిరావణుడని తలంపవచ్చును. మహిరావణ శబ్దమునకు మైరావణ శబ్దము వికృతికాగా అహిరావణ శబ్దమునకు ఐరావణ శబ్దము వికృతి. కనుక పాతాళలంకేశుడు ఒక్కడేగాని ఇరువురుకాడు. సమీరకుమారవిజయకర్త వీనిని పాతాళలంకేశుడనెనేకాని మైరావణ శబ్దముగా వాడలేదు.

## 7 నికుంభునివధ

శ్రీమద్రామాయణము ప్రకారం : కుంభుని సుగ్రీవుడు చంపగా వాని సోదరుడు నికుంభుడు మండిపడి తన పరిఘతో వానరులపైకి రాగా, వారు భీతిల్లి పరువెత్తగా హనుమంతుడు ధైర్యముతో వానిని ఢీకొనెను. ఆ పరిఘను వాడు హనుమ రొమ్ముపైవేయగా అతనిని తాకి అది తునుకలై అనేకమగు కొరవులవలె నేలబడెను. ఆ దెబ్బకు హనుమ భూకంపములో పర్వతమువలె వణకెను. వెంటనే తెప్పరిల్లి ఆ రాక్షసుని తన పిడికిటితో పొడిచెను. వాడు కూడ ముష్టితో ఆంజనేయుని కొట్టెను. అపుడు హనుమ పృథివింబడగదన్ని యతనిపైకెగిరివేగ, చక్కబిగబట్టి మెడద్రిప్పి శాత్రవుండు గర్జిలుచునున్న విడువక కాలనులిమి, మృత్యువునుగూర్చె యొక్క నిమేషమునను[162]

కాని సమీరకుమార విజయమున నికుంభవధ రావణవధానంతరము చేసినట్లున్నది.[163A] ఖడ్గరోముడను రాక్షసుని హనుమంతుడే చంపెనని రంగనాథ రామాయణములో నుండగా శ్రీరామునకు కీర్తి కల్గించుటకై హనుమ

వానిని చంపక రాముని చే చచ్చునట్లు చేసెనని సమీరకుమార విజయమున నున్నది [163R]

కుంభకర్ణునికి మూలానక్షత్రమున జన్మించిన మూలకాసురుడను వానిని హనుమంతుడు చంపినట్లు ఆనందరామాయణములో నుండగా రాముడే చంపి నట్లు ఇతర రామాయణములో నున్నది. (రామచరితమానస్ వగైరా) రావణు నకు మూలానక్షత్రములో నరాంతకుడనువాడు ఒకడు పుట్టగా తనకు గండ కారకుడగు వానిని రావణుడు విసర్జించి యుండెను. వీడు విహ్వాబలపురములో రాజై యుండెను. సుగ్రీవ పుత్రుడగు దధిబలుని చేతనే వీనికి మరణము కలుగునని బ్రహ్మవాక్కు. ఆ దధిబలుడు ధవళగిరిలో తపోదీక్షలో ఉండగా హనుమంతుడు వెళ్లి వానిని తీసుకొనివచ్చి వానిచే నరాంతక నిర్మూలన కావించెను.[164]

శ్రీరామునిచే రావణుడు నిర్మూలింపబడగానే యుద్ధము పరిసమాప్త మయ్యెను. విజయమొందిన రాముడు హనుమంతుని పిల్చి "హనుమా నీవు విభీషణానుమతితో లంకకువెళ్ళి రావణ గృహములోనున్న సీతకు నా విజయ వార్త తెలిపి, సుగ్రీవ లక్ష్మణుల క్షేమముతెలిపి, ఆమెకు ఆనందముకలిగించి ఆమె సందేశము కొనిరమ్ము" అని ఆదేశించి పంపెను. రామాజ్ఞ శిరసావ హించి హనుమంతుడట్లేబయలుదేరి రావణుని గృహము ప్రవేశించి, శోకతప్త రాలైన సీతాదేవి చెంతకుచేరి, తనపేరు చెప్పుకొని, ప్రణామముచేసి నిశ్శబ్ద ముగా నిలబడియుండెను. అతనినిచూచి కొంతసేపు ఊరకుండి పిదప సీత అతడు మునుపువచ్చి వెళ్ళిన హనుమగా తెలిసికొని సౌమ్యానన కాగా అది ఆంజనేయుడు గమనించి తన సందేశము చెప్ప నారంభించెను.

"సీతాసాధ్వీరత్నమా, నీ నాథుడు శత్రునిర్మూలనమొర్చి కృతకృత్యుడై తన క్షేమమును నీతో చెప్పుమనెను. సుగ్రీవ లక్ష్మణ విభీషణాదులతో కూడినవాడై వానరసేనాసహితముగా కుశలముగా నున్నాడు. హరి సాహాయ్య ముతో రావణుని వధించెను. పరాక్రమ స్ఫూర్తితో శత్రునిర్మూలనమొనర్చి నీకు సంతోషావహమైన కొన్ని మాటలను చెప్పుమని పంపియున్నాడు. ఆ మాటలను తమరు కర్ణపర్వముగా వినగోరెద."

"ధర్మజ్ఞే, నీవు నా భాగ్యవశమున జీవించి యున్నావు. నీపై మిగుల ప్రేమ కలవాడను. నా పరాక్రమము వలన యుద్ధమున మనకు జయము

కలిగెను. ఇంక నీవు దుఃఖించకుము. మనసు కుదుటపడనిమ్ము. నిన్ను విడిపించుటకై దృఢచిత్తుడనై నిద్దురనైనాపోకుండా సముద్రానికి సేతువుకట్టి రావణుని వధింపవలెనను ప్రతిజ్ఞ నెరవేర్చుకొన్నాను. ఇపుడు విభీషణుని వశమైనది. కనుక నీవు రావణుని యింట నున్నానని ఎంతమాత్రం భయపడ వద్దు. నీ సొంత ఇంట్లో ఉన్నట్లే నిర్భయముగా, నిశ్చింతగా ఉండవచ్చును. నిన్ను దర్శించుటకై విభీషణుడుకూడ రానున్నాడు" అని రాముని సందేశ మును హనుమ వినిపించినంతనే సీత తటాలునలేచి నిలబడి ఏమియు బదులు పలుకక ఊరకుండెను. హనుమంతుడది గమనించి "తల్లీ ఏమాలోచింపు చున్నావు. నీవేమీ బదులు చెప్పకున్నావే" అని అడిగెను. ధర్మనిరతయైన ధరణిజ ప్రియవాక్య శ్రవణజనిత హర్షముతో గద్గదకంఠయై ఇట్లనెను. "వానరేంద్రా, నా నాథుని విజయవార్త సంతోషమగునట్లుగా చెప్పిన నీ వాక్య ములను విని పరవశించిన నేను క్షణకాలము నిర్వాక్కనైతిని. నాకింత ప్రియ వచనములను తెల్పిన నీకు—

అర్హోక్తులేమని యందునా యని యెంతొ
యోజించితినిగాని యొకడు లేద
యర్హ వస్తువైన నర్పింతు నందునా
యీడైనదీ యిల నేది లేదు
వివిధ మణులుగాని విశ్వంబునం గల
వెండిగాని పైడి కొండగాని
యెల్లలోకములయు నేలిక తనమైన
సాటిగాదు నిజము మాటకైన

—అని తన మౌనకార్యము తెల్పిన సీతకు పావని ప్రాంజలియై "భర్తృవిజయ కాంక్షిణీ యిట్టి స్నిగ్ధోక్తుల పలుకుట నీకేతగునుగదా? నీ నాథుని విజయవార్త చెప్పిన నాకు ఈయదగిన వస్తువేదీ లేదని స్నేహవాత్సల్యముతో నీవు పలికిన పలుకులే నాకు దివ్యమణిమయ సముదాయముకంటే, దేవతా రాజ్యాదులకంటె అధికమైనవి. హతశత్రుడై, విజయుడైన రాముని చూచుటకంటే త్రైలోక్య రాజ్యాధిపత్యము నాకు గొప్పకాదు" అనిన ఆంజనేయునిచూచి సీత "అతిలక్షణ సంపన్నమైన, అతి మధురమైన, అష్టాంగయుతమైన బుద్ధితో మాటలాడ నీవే సమర్థుడవు. పరమ ధార్మికుడవు. పవన నందనుడవు. 'ఘనబలశౌర్య

సత్త్వ శ్రుతకాంతి పరాక్రమ ధీరతా క్షమా విజయధృతి ప్రశస్తగుణ విశ్రుత ఓన్నో మంగళకర గుణములు నీయందే ఒప్పుచున్నవి" అని సీత చెప్పగానే హనుమంతుడు పరమ సంతుష్టుడై సీతాదేవికిన్నాళ్లు బాధలు కల్గించిన రాక్షస స్త్రీల సంహరించుటకు అనుజ్ఞనిమ్మని కోరెను. ధర్మమార్గ స్థితయైన సీత "తమ ప్రభువు ఆజ్ఞల పాలించిన వీరిపై నీవు కోపపడవచ్చునా? నా పూర్వకృత పాపముల వలన దుఃఖముల ననుభవించితినే కాని నా బాధకు వీరు కారణం కారుగదా? సుఖదుఃఖాలు కాలాధీనము. తమ ఏలిక చెప్పిన ప్రకారం వీరు నన్ను బెదరించి హింసించిరేకానీ వీరియందే పాపములేదు." అని వ్యాఘ్ర ఋక్షగాథను జ్ఞప్తికితెచ్చి యిట్టివారిపై సజ్జనుడు కృపజూపవలయునే కాని కోపింపరాదని తెలిపెను. "హనుమా, లోకములో ఏ అపరాధము చేయనట్టి వారు లేనేలేరు" అని నీతిని బోధించి శాంతింపజేసెను. అంత హనుమ తన ప్రయత్నమును వీడి "తల్లీ శరణాగత రక్షావ్రతుడగు రామునకు తగిన పత్నివి నీవే. ఓ యశస్వినీ నీ నాథునకు నేనేమని చెప్పవలెనో తెలిపినచో నీ సందేశము రామునకు అందింపగలను" అని తెలుపగా సీత "నేను నా నాథుని చూడగోరుచున్నాను." అని పలికెను. "తప్పక అనుజసహితుడై యుండు శ్రీరాముని నీవు చూచెదవుగాక" అని మారుతి పలికి ఆమెకు ప్రదక్షిణ నమస్కారమొనర్చి సీతా సందేశముతో శ్రీరాముని చేరెను.

వాచాదక్షుడగు వాయునందనుడు రాముని చేరి "స్వామీ. ఎవరి నిమిత్తమై మీరింత ప్రయత్నము చేసితిరో ఆ సీతాసాధ్వి దుఃఖితయై రావణు నింట నున్నది. నీ విజయవార్త విని సంతోషముతో పరవశించెను. అనుజ సహితుడవైన నిన్ను చూడగోరుచున్నది" అని పలుకగా రాముడు కన్నీరు కార్చుచు నిట్టూర్పు నిగిడించి సీతను తెచ్చుటకై విభీషణుని కోరెను.[165]

భాస్కరరామాయణములో : సీతకు శ్రీరాముని సందేశము విన్పించి నపుడు సీత మారుతిని ప్రశంసించినది – అది ఎట్లన—

పతిహితముం బ్రతాపము నుపాయము శౌర్యము ధైర్యమున్ సమీ
హితకరణక్షమత్వము నహీన జవంబుఁ బరాక్రమంబు నం
చిత వినయంబు నీతియు వశిత్వముఁదేజము నీకయొప్పు మా
రుత సుత నీకు ధారుణి నొరుల్ సరివత్తురె వారి మెత్తురె

(యుద్ధకాం. 2311)

# 8 శ్రీరామునిచే శివలింగ ప్రతిష్ఠ-హనుమంతుని తోడ్పాటు

శ్రీరాముడు శివలింగమును ప్రతిష్ఠించిన విషయము శ్రీమద్రామాయణమునలేదు. రంగనాథ రామాయణమునను సమీరకుమార విజయమునను ఈ కథ కలదు. ఈ శివలింగ ప్రతిష్ఠను గూర్చి శైవవైష్ణవ సంప్రదాయ విధేయులు తీవ్ర వాదోపవాదముల లేవనెత్తి యున్నారు.

శ్రీమ ద్రామాయణం ప్రకారం: సీతావహ్నిశుద్ధి, విభీషణునికి రాజ్యము స్వాధీనపరచుట పూర్తియైన తర్వాత శ్రీరాముడు అయోధ్యకు తిరిగి పుష్పక విమానమున పోవుచు సీతకు తాము సేతువు కట్టినచోటు చూపుచు సముద్రుడు తనకు ప్రసన్నుడయ్యెనని చెప్పుచు సముద్రవాచకముగా 'మహాదేవ' శబ్దము నుపయోగించెను—

దేవిమున్ను ప్రభుడు మహాదేవుండింప
గంజనేత్ర ప్రసన్నతాకారియయ్యె

—అని తెలిపెను. (అత్రపూర్వం మహాదేవః ప్రసాద మకరోత్ప్రభుః అని మూలము) ఈయెడ వ్యాఖ్యానము వ్రాయుచు శ్రీ వావిలికొలను సుబ్బారావు గారు ఇట్లు తెలిపియున్నారు. "మహాదేవ శబ్దము శివపర్యాయముగా నిఘంటువులనందుండుట వలన ఇచట 'శివుడు' అని కొందరు అర్థము చెప్పుచున్నారు. శ్రుతిస్మృతియితిహాసములందలి శబ్దములకు సర్వత్ర అమరనిఘంటువునే ప్రమాణముగా చేసికొని అర్థము చెప్పజాలము" అని తెలుపుచు విపులముగా ఎన్నో ఇతర శబ్దములను చూపి నిఘంటువునకన్నా భిన్నమైన అర్థములో నవి వాడబడిన సందర్భములు రామాయణములోనే చూపియున్నారు. అంతేకాక రావణుని తండ్రి బ్రాహ్మణుడైనను తల్లి బ్రాహ్మణస్త్రీ కాక క్షత్రియాంగన అనియు, ఆమెనతడు వివాహమాడలేదనియు కావున వాని బ్రాహ్మణత్వమునే నిరాకరించి వానిని చంపుట వలన బ్రహ్మహత్యాదోషము రాలేదనియు తెల్పియున్నారు. అట్లైనచో కుంభకర్ణుడుకూడ బ్రాహ్మణుడేగదా. వానిని చంపినందున బ్రహ్మహత్యాపాతకము ఏల రాదయ్యెనని ప్రశ్నించియున్నారు. తాటకవధవలన స్త్రీహత్యాపాతకము రామునకు రానట్లే ఇచట బ్రహ్మహత్యాపాతకము రాలేదని వివరించియున్నారు. సీతావహ్నిశుద్ధి సందర్భమున శివుడే వచ్చి రాముని స్తోత్రముసేసినట్లుండగా సముద్రము అను అర్థమున ప్రయో

సంపబడిన మహాదేవ శబ్దమును ఆధారముగా రామునికి శివభక్తి అంటగట్ట రాదని వివరించియున్నారు. రాముడు రామాయణమందంతటను వైదికుడగు ఆర్యునిగా సంధ్యావందనాది కర్మల నాచరించువానిగనే వాల్మీకి చూపియున్నా డనియు, అతడు శివార్చన చేసినట్లు లేదనియు తెలిపియున్నాడు. కాని, యీ పదమునకు శైవులొకవిధంగా, వైష్ణవులింకొకవిధంగా అర్థముచెప్పుట జరుగు చున్నదనియు, రామేశ్వరమున శివలింగము రామునిపేర నున్నను అది రాముడే ప్రతిష్ఠించినట్లు నమ్మజాలమనియు నిరూపించియున్నారు.[166] రాముడు శివలింగము ప్రతిష్ఠించలేదని నమ్మినచో హనుమంతుడు హిమాలయమునకు వెళ్లి లింగమును తెచ్చుట అను ప్రమేయమేలేదు. రాముడు బ్రహ్మహత్యా పాపమునకు పరిహారముగా శివలింగమును ప్రతిష్ఠించినట్లు రంగనాథ రామా యణమున కలదు.

రంగనాథ రామాయణములో: శ్రీరాముడు పుష్పక విమానమున సీతా లక్ష్మణ పరివార సహితుడై అయోధ్యకు పోవుచుండెను. గతమున తా మేయే ప్రదేశములలో నే యే కార్యముల నొనరించినదీ సీతకు తెలుపుచూ పోవు చుండగా వారికి దశకంఠుడెదురయ్యెను. అపుడు రాముడు విభీషణునిచూచి 'తాను చంపిన రావణుడు మరల కనిపించుటేల' అని అడుగగా, అది బ్రహ్మ హత్యా దోషమని విభీషణుడు తెలిపి బ్రహ్మను ప్రార్థింపుమని తెలిపెను. అంత రాముడు బ్రహ్మను ప్రార్థించి ప్రసన్నుని చేసికొనగా బ్రహ్మ ప్రత్యక్షమై రావణుడు మోక్షార్థియై వచ్చినాడని వానిని మోక్షకామునిచేయు ముదమున—

"భావించి నీపేర భవుని ప్రతిష్ఠ
గావింపు మున్నీటి కట్టపై నొప్ప
రమణమై నొక ముహూర్తములోన...."

—అని చెప్పి వెళ్లెను. రాముడు హనుమంతుని పిల్చి "ఇదివరలో నీవు ఇరువదిమూడు లక్షల ఇరువదివేల పది యోజనములు వెళ్ళి మందులకొండ తెచ్చియుంటివి. రెండువందల నలభై యోజనములుకల కాశీపురమందలి శివలింగాన్ని శీఘ్రమేతెమ్ము" అని పంపెను. హనుమంతుడు కాశీచేరి గంగలో స్నానమాచరించి కాశీవిశ్వేశ్వరునికి మ్రొక్కులిడి లింగమును తీసికొనివచ్చుట కాలస్యముకాగా ముహూర్తము మీరుచున్నదని రాముడు హనుమంతుని కొఱకై ఆకసంపైకి చూచి చూచి, ఏల రాలేదో అని తెలియలేక ఒకవేళ

రాక్షసులబ్దగించినందున వారితో జగడమగుచున్నదేమోనని తలంచి ఒక సైకత లింగాన్ని చేసి సేతుతటమున ప్రతిష్ఠించెను. ఆ తర్వాత కొంత సేపటికి హనుమంతుడువచ్చి రాముడు శివలింగప్రతిష్ఠ చేసినందుకు ఖిన్నుడై రాముని చూచి 'స్వామి శివలింగాన్ని తేగల అర్హత నాకులేదా! నాపై మక్కువ లేక పోయెనా! ఏల తమరు నాకొఱకు నిరీక్షింపక శివలింగప్రతిష్ఠ చేసితిరి' అని బాధతో అడిగెను. రాముడతనికి కాలాతిక్రమ దోషము రాకుండుటకై ప్రతిష్ఠించినట్లు తెలిపి—

"... .... నీ వరుదెంచితివి
సంతోషమయ్యె నీశ్వరుని నవ్వలికి
దోలించి నీ తెచ్చు దేవుని నిలుపు...."

—అని పలుకగా అనిలనందను డానందమొంది—

ముదమంది తన వాలమున నీశు జుట్టి
కదిలించి కదిలించి కదిలింపలేక
మదిలోన శంకించి మరియు నుంకించి
మెదలింప జాలక మిగుల చింతించి
ఇదియేల ప్రేగయ్యె నీరీతి నాకు
బదిలింపు దప్పెనో భానువంశజుని
గినసి యేమాటు పల్కిన పాపముననొ
కనుగొన నటుగాక కాశీవ నిటకు
జేకొని యేను దెచ్చిన పాపముననొ
కాకున్న నిదియేల ఘనమగు

—అని చింతించి తన బలమునంతా కూడతీసికొని పెకలించి చూచి రక్తము గ్రక్కుకొని మూర్ఛపోయెను. శ్రీరాముని ఉపచారములకు, అతని కరస్పర్శకు తేచిన పిమ్మట పావని పశ్చాత్తాపపడి—

మీరు నిల్పిన యీశు నెఱుగ
కీలీల దెమలింప నెంచిన యిట్టి
నాతప్పు లోగొని నన్ను మన్నించి
యీతరి మీ యాజ్ఞ నేడిచ్చినట్టి
యీ యీశునకు వెరవెరిగింపు

—మని కోరెను. అంత రాముడా కాశీలింగాన్ని ఒకచో ప్రతిష్ఠిపజేసి హనుమంతునిచే తేబడిన హనుమల్లింగాన్ని ముందు పూజించిన తర్వాతనే తాను ప్రతిష్ఠించిన రామలింగాన్ని పూజింమనట్లు అనుగ్రహించెను. మరియు గంగాజలమును తెచ్చిన ఏ మానవుడైనా—

"వెచ్చెర నట నభిషేకంబు సేయ
నతడొానర్చిన బ్రహ్మహత్యాదియఘము
లతనిబొందవు కీర్తులలర సిద్ధించు
నతులిత పుత్రపౌత్రాభి వృద్ధియు
నతుల భోగంబులు నమరంగ గలుగు"

—నని తెలిపెను.

సమీరకుమారవిజయములో : ఈకథ హనుమంతునిలోనున్న అహం భావమును తొలగించుటకునూ, లోకమున శివభక్తిని ప్రచారము చేయుటకును చాల విపులముగా పోషింపబడియున్నది. రంనాథరామాయణకర్త చెప్పిన దానికన్న మరికొన్ని వివరములను తిమ్మన చేర్చియున్నాడు. దేవాలయాల ప్రాచీనతను తెల్పుటకు ప్రభావవంతులైవారిచే నవి ప్రతిష్ఠింపబడినట్లు క్షేత్ర ప్రసిద్ధిని తెలుపు గ్రంథములలో నెన్నియో కల్పనలను చేసియున్నారు. భక్తి విశ్వాసములు గలవారు వాటి చారిత్రక సత్యములగురించి తర్కించకుండా తమ అధ్యాత్మిక విశ్వాసముల పెంచుకొను చిత్తశుద్ధి పూర్వకమైన విశ్వాసముతో నమ్మి పూజలొనర్చుచున్నారు. కాలాంతరమున శ్రీమద్రామాయణేతర గ్రంథ ములలో చొచ్చుకొని వచ్చిన అవాల్మీకములగు కల్పనల కెన్నింటికో ఆమోద ప్రచారము వచ్చినట్లే బ్రహ్మహత్యాదోష నివారణకై రాముడు శివలింగప్రతిష్ఠ చేసిన గాథకూడ ప్రచారము పొందినదని భావించుటలో తప్పులేదు.

రావణవధానంతరము రాముని పూజించుటకై దండకారణ్యవాసులగు మునులు అగస్త్యునితో కలిసివచ్చి రాముని కొనియాడిరి. రాముడు వారితో 'మద్దృష్టిగోచరమైన జంతువెప్పటికి కైవల్యభాజన మగు'నని తెలిపి పౌలస్త్య వధ వలన తనకు కలిగిన పాపము తొలగు ఉపాయమును తెలుపుమని వారిని కోరెను. అంత వారు "శ్రీరామా, నీకు దోషముండునా? ఏదో యీ లోకాన్ని అనుగ్రహించు కొఱకు నీవడుగుచున్నావేకానీ నీకు దోషమంటునా? అయినను శంభుప్రతిష్ఠ చేయుమని తెలిపిరి. వారు 'ముహూర్తద్వయ మాత్రములో

అభంగురమాంగల్య ముహూర్తమున్నదని తెలుపగా రాముడు హనుమను చూచి 'కలధౌత ధరాధరమునసున్న లింగాన్ని నాల్గు ఘడియలలో తేవలయు' నని చెప్పగా హనుమంతుడు కైలాసగిరినిచేరి శివలింగాన్ని వెదకి వెదకి కానక —

"చరణాంగుష్ఠముచేత నూతగొని పక్షద్వంద్వమున్ విప్పి భా
స్కరు దృష్టించుచు నూర్ధ్వబాహుడయి నిశ్శ్వాసంబు బంధించి బం
ధుర విశ్వాసముతోఁ దపంబు"

—సలుపగా హరుడు వెంటనే సాక్షాత్కరించి ఇష్టార్థము వేడుమని పలికెను. హనుమ శివుని స్తుతించి తనను రాముడు శివలింగమును తీసికొని వేళ అతిక్రమించకుండా రమ్మనిన వృత్తాంతముతెలిపి 'ఇష్టమైన గూర్పవే'అని మ్రొక్కెను. ఈశుడలరి యతనికప్పుడు లింగద్వయం బొసంగి యంతర్ధాన మయ్యెను.

అంజనేయునికై రాముడొక్కింత నిరీక్షించి ఆలస్యంకారాదను మునుల వాక్కుల నాదరించి సైకతలింగాన్నిచేసి సీతాసమేతుడై సేతు తటమున ప్రతిష్ఠించెను. తన ఆలస్యమునకు రాముడు అన్యలింగమును ప్రతిష్ఠించునేమో యని వితర్కించుకొనుచు వచ్చు అంజనేయుడు 'ఋషిపాఠ్యమాన వేదమంత్రంబులు, మద్దెలమ్రోత వినరాగా, ధరణికిదిగి సీతారామలక్ష్మణాదులకు నమస్కరించి, పెదవి కంపించుచుండగా, ఎఱ్ఱని కన్నులకాంతితో కన్నీరు చంపల తడుపుచుండగా రాముని చూచి శోకావేశముతో—

"కనవలదు ననుబోలిన
తమజాతుని నెప్పటికిని దల్లి నిజంబో
జననాథ వృథా స్థూలము
తనువుండిన నేమి తలగిన నేమి"

—అందరిముందర నన్ను ప్రియమార పిలిచి వెండికొండలోని లింగమును గొని వేగముగా రావలయుననిచెప్పి, నీకసాధ్య మెందును లేదని తెలిపి దానిని నేను తెచ్చులోగా త్వరపడి సికతామయ లింగమును నిలిపితిరిగదా!—

"నేనెంత నాదు బలమన
గా నెంత యనంత శక్తి కలితుడవగు నీ
కేనా యుద్యోగంబులు
పూని ఘటింపం దయా ప్రపూరిత హృదయా

పరితాపానల కీలల
భరియించి వసించుకంటెఁ బ్రాణంబులు వే
గిరమేఁ బెడబాసి మఱి నీ
చరణంబులు గనుట మిగుల సౌఖ్యంబనుమన్"

—నిర్వేదపడగా రాముడంత మందహాస ప్రసన్నవదనముతో "నేను – నీవు అను భేదము నీలో కల పర్యంతము జన్మమృత్యువులకు అంతము లేదు. సన్నుతి, తిరస్కారములు దేహగతంబులు" అని తత్త్వబోధచేసి అద్వయ జ్ఞాననిష్ఠ పూనవలసినదిగా పావనికి బోధించి—

"మత్కృతము త్వత్కృతంబగు
ద్వత్కృతమగు మత్కృతంబు ద్వైతము వలదో
సత్కృతి లింగస్థాపన
సత్కృతి నీవాచరించు సత్కృతి గాదే"

—"లగ్నము దగ్గరైనందున మునిప్రవరులు వివరించగా భూసుత చేసిన సైకతలింగాన్ని నిల్పితిని. ఇంతమాత్రానికే భగ్నత చెందనేల" అని ఓదార్చెను. ఇంకను హనుమను తృప్తిపరచుటకై మరల రాముడు "ధీవరేణ్యా. నీవు తీసుకొనివచ్చిన శివలింగాన్ని కూడ నేడే ఇక్కడ నిలుపుము. మొదట పూజను అక్కడ జరిపి అటుపై నా పేరిట లింగమును ప్రజలు భజియింతురు గాక. అదియుగాక నీవును యుద్ధమునందనేకుల వధించి యున్నావు. తత్పాప పరిహారణమునకు నీవును శంభుని ప్రతిష్ఠించుట మంచిదే. మేము ప్రతిష్ఠించిన సికతాలింగమును తీసి ప్రతిష్ఠించవలయునని నీవు తలంచుచున్నచో అది దుశ్శకము. ఇప్పటికే సప్తపాతాళ భూమికలలో పాదుగొనిన మహేశుని ఏ శౌర్యరాశి కూడ తీయజాలదు. నీవు తీసియిచ్చు నెడల కైలాసగిరి నుండి నీవు తెచ్చిన లింగమునే ప్రతిష్ఠించగలను" అని రాముడు తెలుపగా హనుమంతుడు రామునకు నమస్కరించి—

"దేవర ప్రతిష్ఠ గదా యని కొంకినాడఁగా
కనిమిష శైలమైన ద్రుహిణాండము దాటగ మీటనేరనే"

—అని మనవిచేసి రాముడు ప్రతిష్ఠించిన సికతాలింగమును పెకలింపబూనెను. హనుమంతుడు "తన భీకరతర కరప్రకాండము సారించి రామనాథలింగము ననాయాసమున తెమల్చి, యగలకున్న, దిగులువడక, కలకలనగుచు కిలకిలా

ర్భటి సముద్ఘటించి మోకారించి, అంజెగకట్టి కరద్వయంబునంబట్టి దిట్ట తనంబున నిట్టట్టుగా నూగియు గట్టిమై నెట్టుకొన్నయట్టి కటతటంబులదర, చటులతర లోచనంబులు నిప్పుకలు చెదర, కిటకిట పండ్లు గీరుచు, పటపట బ్రహ్మాండ భాండంబువగుల నట్టహాసంబుచేసి ప్రయత్నించు చుండగా హనుమ చేయు శివాపరాధంవలన నేమి పుట్టునో అని సీతాదేవియును, ఇంతటి అహం కారము తగునా అని సౌమిత్రియును, ఇంతటి బలశాలికిది అసాధ్యమగుట వింతకదా అని సుగ్రీవుడును, రామప్రయుక్తత్ర్యంబు బ్రహ్మాస్త్రంబగుట తెలిసి దానిని భంగముచేయుట వివేకమా అని విభీషణుడును, ఇంకను వానరాది వీరులు, అంగదాదులు తమకు తోచినటుగ పలుకుచుండ, రాముని దయ వలన జగత్ప్రాణసుతునకు హాని లేకుండుగాక అని ఋషులు ఆశీర్వదించు చుండగా, నభోభాగంబున వారిజుభీరి నగవిదారి ప్రముఖ బర్హిముఖ, గరుడ, గంధర్వ, కిన్నెర, కింపురుష, యక్ష, రాక్షస, సిద్ధసాధ్యాది వియచ్చరులు మచ్చెకంటులతో నచ్చెరువడి చూచుచుండగా,

కూలంబుగా వాలంబునకు బలంబు గూర్చగా, సప్తసముద్రాలు కలత చెందు చుండగా, సప్తద్వీపజనులు భయభంగురులై భీతిల్లగా, సప్తాశ్వప్రముఖ గ్రహ నివహంబులు త్రోవలు కలంగ, సప్తకులపర్వతంబులతో ధరాతల ముఱ్ఱూత లూగుచుండగా, భూతములాక్రోశింపగా, దిగ్గజాలు ఘీంకరించుచుండగా, భూభారాన్ని మోయు ఆదిశేషునికాధారమగు ఆది వరాహము ఎట్టి ఉత్పాతము పుట్టెనోకదా అని చింతించుచుండ, కుమారప్రముఖ ప్రమథులు, గజాననుడు సైరించి కాచియుండగా హనుమంతుడు తన కరచరణంబు లిలాతలంబునంబెట్టి తన వాలంబున లింగమూల మామూలంబుగా జుట్టి, పట్టి, చలపట్టి, ఆ పట్టు తప్పించి, ఆకాశానికి ఎగసినా, ఆ లింగము తన తోకవెంట నంటిరాక నిరాక రించుటంజేసి ఆకాశమున సేకరింపలేక సకలలోకపాలక హాహాకారంబులతో నవరంధ్రంబుల బుడబుడ నెత్తురులు వడయ, వడి అడగి, రెండు ఘడియలు ఒడలెరుంగక పరవశుండై పుడమిబడి మూర్ఛపోయెను. అతని రక్తమువలన రక్తకుండమేర్పడగా చూచుచున్న అక్కడివారంతా ఎంతో బాధపడుచుండగా సీతాదేవి ఆంజనేయుని అవస్థజూచి—

"అప్ప యిదేమిరా యని ధరాత్మజ కన్నుల బాష్పపూరముల్
చిప్పిలఁ గేలుదమ్మిఁ దుడిచెన్ దనుసక్త ధరాపరాగమున్"

—అంత రాముడు నెత్తుటిలో తడిసి వుల్లసిలు పావని మోము కనుగొని తల్లడ పడి అతని శిరస్సును తన తొడలోనికి చేర్చి యెంతయో దుఃఖించెను. ''శత్రువుల శూల ముద్గర గదా క్షురికాదులచే గాయమైనా ఎరుగని నీ కాయ మున కీ యపాయమా! నా మాట వినరావా! ఓ అసహాయశూరా! మమ్మే జననీ జనకులుగా భావించి సేవించుచుండు నీవు ఈనాడు భక్తిసేయకుంటి వేమోయి. నీవు తోడుండిన నేను నా కన్న తల్లిదండ్రులను, సోదరులను, చెలులను మరచి వుండిన వాడిని గదా! మేము మూర్ఛలో మునిగినపుడు నీవు మాకు ప్రాణములిచ్చినావే. నీ వీనాడు మూర్ఛమునుగగా మే మేమీ చేయలేకున్నామే'' అని విలపించుచు—

"జగతి యేలనేల సౌమిత్రి యేల సీ
తా లతాంగి యేల తక్కియున్న
వారలేల నిన్నువంటి గుణాఢ్యుండు
లేకయున్న నాకు నో కుమార"

—అని అతని కన్నుల స్రవించు కన్నీటితో నతని కాయము తడుపగా హనుమంతుడు మూర్ఛతేరి, లేచి తన చింతవదలి, రాముని చేరి, తనను నిందించుకొని, భక్తితో నిరోష్ఠ్యదండకమున రాముని ఫలుభంగుల స్తుతించి "నా జాతిచేష్టా నికృష్టేహదృష్టింప కిష్టాదృతించేర్చి రక్షింపగా నీకెకాకేరికిం జేరికే'' అని వినుతించి ఆ తర్వాత సీతామాతనుగూడ నుతించగా ఆమె అతని నోదార్చుటకై "హనుమా, నాయనా, సకలజ్ఞానకళాకలాపుడగు రామ విభు డిక్కడ శివుని ప్రతిష్ఠించగా నీవు—

సికతామాత్రునిగా దలంప నగునే నేడాదిగా నిట్టి గా
యకముల్ సేయకుమన్న స్వామి హితకార్యాసన్నితం బుత్రకా

తప్పుచేసితి( బతికని తల్లడిలకు
నీ మనశ్శుద్ధి యెఱుగు శ్రీరామ విభుండు
పాప డాటల కెనసిన పనులు జూడ
దండ్రి కానందములుగాక తప్పులగునె.

—రాముడే పరాత్పరుండు. నేను మూలప్రకృతిని. కార్యహేతుత్వంవల్ల మే మిర్వురమై వెలగుదుము. స్వామి రూపవ్యాపకమైన సర్వాన్ని నేనే సృజించి, పెంచి, అణచివేయుదానను. త్రైగుణ్యవిస్ఫూర్తిచే మతి దృగ్వ్యాపార దృశ్యాకృతులన్నీ యేర్పడుచున్నాను—

త్రిపుటీశూన్యన కీ జగజ్జనన శక్తి స్ఫూర్తి వర్తిల్లగాఁ
గపిలోకేశ్వర సత్యసంకలిత సంకల్పాకృతిన్ మించి భే
దపు భావంబు వహించి యుండియు సభేదవ్యాప్తి వర్తించు నీ
యపురూపంపు రహస్య మీా వెలిగి నిత్యానందముం బొందుమా.

—అని ఓదార్చెను. "హనుమా, నీ రక్తంవలన ఏర్పడిన ఈ గుండం నీ పేరున వెలసి దురితాపహారియై జగత్తులో వెలయుగాక. నీపేర హనుమత్కుండం అను ప్రసిద్ధినిపొందు. ఈ సరస్సులో జనుల ఎమ్ములు ఎంతకాలం ఉండునో అంతకాలం వారు యమలోకం పోకుండా దివ్యలోకాలలో ఉండగలరు. ఇందులో స్నానం చేసినవారికి గంగాస్నానఫలం, సహస్ర అశ్వమేధయాగం ఫలం, సరస్వతీనదీస్నానఫలం కలుగును. ఇందులో తిలోదకముల నిచ్చినవారికి పితరులు ఘృతకుల్యలో నుండగలరు" అని సీతామాత అనుగ్రహించగా విని, హనుమంతుడు కలతతేరి తాను తెచ్చిన కైలాసగిరి లింగాన్ని సైకత లింగానికి ఉత్తరముగా ప్రతిష్ఠించి ధన్యతగాంచెను.[168]

## 9 హనుమంతుడు బ్రహ్మలోకమునుండి గంధమాదనుని తెచ్చుట.

శ్రీమద్రామాయణమున ఈ వృత్తాంతము లేదు. ఇది సమీరకుమార విజయములో వివరింపబడినది. సీతాదేవి అగ్నిప్రవేశమైన పిమ్మట బ్రహ్మ రుద్ర ఇంద్రాది దేవతలు శ్రీరాముని అనేకముగా స్తోత్రమొనర్చిరి. రాముని కోరికపై ఇంద్రుడు అమృతవృష్టి కురిపించి మడిసిన వానరుల నందరిని మరల బ్రతికించెను. పుష్పకములో అయోధ్యకు పోవుచు శ్రీరాముడు గంధమాదనుడను కపిశేఖరుని అడిగెను. అతడు కుంభకర్ణుని యుద్ధసమయమున సమరమున మరణించినట్లు విభీషణుడు తెలుపగా రాముడు దిగులొందగా జాంబవంతుడు రామునిచూచి "హనుమానుడీదురవస్థ తీర్పగల"డని రామునితో చెప్పెను. అపుడు రాముడు హనుమనుచూచి—

"మా ఆపదలెల్లఁ బాప మహిమాంబుధి నీవె కదయ్య"

—అని పొగడి గంధమాదనుని తీసికొని రావలసినదిగా కోరెను. అపుడు హనుమంతుడు 'నిమిషములో తెచ్చెద'నని పలికి ఉప్పరంబున కెగసి యముని

పురమునకరిగి ద్వారమువద్ద 'అర్చిసఁ దద్దరిల్లి జముడు పరతెంచి పూజించి' సద్భావముతో గంధమాదనుడు తన లోకమున లేడనియు, బ్రహ్మలోకమున నున్నట్లునూ తెలిపెను. పావని జమునికి మ్రొక్కి 'భూర్భువస్సుఖోదంచిత పుణ్యలోకాలదాటి సత్యలోకముచేరి బ్రహ్మదగ్గరకుచేరి మ్రొక్కినంతనే బ్రహ్మ అతనిని కౌగలించి వచ్చినకార్యమడుగగా "సమస్తము నీ వెఱుంగవే మహాత్మా. గంధమాదనుడను కపీశ్వరుడిక్కడున్నాడు గాన వానిని రాముని కొఱకు పంపుము" అని విన్నవించెను. "రామకార్యహితబుద్ధితో కుంభకర్ణుని తోడి పోరిలో మరణించిన ఇతడు అజరామర రూపమొందిన గంధమాదనుని అవనికంపగ జెల్లదు. అయినా, నీవురాగ నంపవలసె" అని బ్రహ్మ గంధ మాదనుని హనుమంతునితో పంపగా, వానిని రాముని చెంతకు చేర్చి హను మంతుడు నమస్కరించెను. తక్కిన కపులందరు ఆశ్చర్యపడి 'తనువుడిగిన జను గ్రమ్మర తెచ్చెదననిచెప్పి తేగల్గిన నీ ప్రభావ తేజములను పొగడ నెవరికి తరమగునని, నీవె విధాత'వని పొగడగా రాముడు హనుమంతుని ప్రశంసాపూర్వకంగా గౌగలించి గౌరవించెను.[169]

రాముడయోధ్యకు చేరులోగా విమానమును కిష్కింధలో ఆపించి వానర కాంతల నందరినీ తన పట్టాభిషేకమునకై ఆహ్వానించెను. వారందరు చేరిన పిమ్మట వాయుకుమారుడు రాముని చూచి 'స్వామీ, మా అమ్మనొక్కసారి దర్శించివచ్చుటకనుమతించుడని కోరెను. రాముడుకూడ అంజనేయునితోను, లక్ష్మణునితోను, సీతతోను ఆమెవద్దకు వెళ్ళిరి. ఆంజనేయుడామెకు నమస్క రించగానే శ్రీరామాదులుకూడా ఆమెకు ప్రణామములొనర్చిరి. శ్రీరాముని వీరోచితకార్యములను హనుమ వివరించగా అంజన తన కుమారునిచూచి కోపముతో 'అయ్యో, కింకరుడవు నీవుండికూడ ప్రభువునకింత కష్టము కల్గించి తివా! ఆ రావణుని నీవే చంపకూడదా!' అని పలుకగా, శ్రీరాముడామెను శాంతింపజేసి 'అమ్మా నీకుమారుడు మహావీరుడే. అతడసాధ్యములను సాధించు ఘనుడు. నాకు కీర్తి కలిగించుటకై, నా చరిత్ర లోకములో నిల్పుటకై అట్లొనర్చెను' అని ఓదార్చెను. ఆమె శ్రీరాముని పూజించుచు సంభాషణలో తన స్తన్యమువలన హనుమ బలశాలియై గొప్పవాడైనట్లు పేర్కొనెను. ఆ వాక్కులను లక్ష్మణుడు విశ్వసించనట్లు అమెకుతోచి 'సౌమిత్రీ, నా పాల మహిమ చూపెదనుసుమా!' అని తన కుచమునుండి పాలను కొండ శిఖరము

మీదికి ఏమ్మింపగా అది తునాతునకలైనది. అదిచూచి వారు అంజనసు స్తుతించి పాగిపోయిరి. ఈ కథ ఆనందరామాయణమున కలదని హనుమాన్ శీలాతరంగిణిలో కలదు.[170]

## 10 రామాగమనవార్త భరతునకు తెలుపుట.

ఈ సన్నివేశము శ్రీమద్రామాయణమున విపులముగా నున్నది. తాము అయోధ్యకు వచ్చుచున్నవార్తను రాముడు లక్ష్మణునిద్వారా గాని ఇంకే కింకరునితోగాని పవనకుమారునే పంపి తెలియజేయింపనెంచెను దీనినాతడు కేవల సందేశముగానే గాక భరతుని రాజ్యకాంక్షారతిని పసికట్టి అంతరంగికముగా రామునికి తెలుపగలందులకే హనుమంతుని పంపెను. భరద్వాజాశ్రమమున దిగిన రాముడు వానరులందరికీ విందగునట్లు అచటి వృక్షములకు మధురఫలములుండునట్లు రాముని వలన వరము పొంది వారందరు తృప్తిగా భక్షించి ఆనందింపుచుండగా, హనుమంతుని పిలిచి "మహిత జనాఢ్య, నీవు అయోధ్యకువెళ్లి అచట రాచనగరులో అందరు క్షేమముగా నున్నారేమో తెలిసికొని రమ్ము. త్రోవలో శృంగిబేరపురమను పల్లెలో నా ప్రాణస్నేహితుడు గుహుడున్నాడు. నా క్షేమాదులు వినుటవలన అతడానందించును. నా కుశలవార్త అతనికి తెలిపినచో అయోధ్యకుపోవు మార్గము అతనే నీకు తెల్పును. అక్కడ భరతునితో నా క్షేమము తెలుపుము. తొలుదొల్త నీవు, నేను నా తండ్రియాజ్ఞనెరవేర్చి తమ్మునితో, సీతతో తిరిగివచ్చితినని తెల్పుము. ఆ మాటలువిని అతనిముఖ మెట్లుండునో పరీక్షింపుము. తర్వాత సీతాపహరణమాదిగా రావణవధవరకు జరిగిన విషయములనన్నింటిని తెలుపుము. నేను సుగ్రీవ విభీషణాదులతోకలిసి వచ్చితినని చెప్పుము. ఆ సంగతివిని అతని ఆకారమెట్లుండునో కనిపెట్టి చూడుము. ఇట్లుండగా నేను చెప్పినరీతిగావేసి నీవుకూడ నా విజయపరంపరలను, ప్రతిజ్ఞాపాలనములను నీ మాటలలోతెలిపి–

అతతి యింగితములు నానన కాంతియు
జూపు విధము పలుకు చొప్పెరింగి
వాని చిత్తవృత్తి వర్తన మఖిలంబు
దెలిసి రమ్ము వేగ తెల్లముగను

—కరి హయ రథాదులతోడి భోగయోగ్యమైన రాజ్యమునందెవ్వరికి ఆశ కలుగదు? ఇంతకాలము పరిచయమైనందున రాజ్యభోగాదులను భరతుడాశించు చున్నచో అతడే రాజ్యాన్ని పాలించుగాక. అట్టికోరిక అతనిలో వున్నచో వెంటనే నీవు బయలుదేరి మేమధికదూర మక్కడికి ప్రయాణము చేయకముందే మమ్ము కలుసుకొని మాకు ఆ వార్త తెల్పుము. అతనికి రాజ్యాభిలాష లేనిచో నీవు అక్కడనే యుండుము. మమ్ము కలియుటకు రావద్దు" అని చెప్పిన రాముని వచనములు విని హనుమంతుడు మనుష్యశరీరము ధరించి వేగముగా పోయి ముందుగా శృంగిబేరపురముచేరి గుహునకు రామాగమనవార్త తెలిపి, జనపదములను చూచుచుపోయి అయోధ్యకు క్రోసుదూరమున నందిగ్రామము నందొక ఆశ్రమమును చూచెను. నారచీరలుకట్టి తపసివేషములో తనరారు భరతుని చూచెను. వెంటనే అతనిని సమీపించి నమస్కరించి యిలాచెప్పెను. "నీవు ఏ రాముని కొరకు ఎదురుచూచుచున్నావో, దండకారణ్యములో చీరాజిన ధారియైన అన్నకై ఎంతకుందుచుంటివో ఆ రాముడు నీ క్షేమము తెలిసికొని రమ్మనెను. భరతా! నీకు ప్రియమైన వార్త తెలిపెదను. దుఃఖమును నీవు వీడుము. నీ ప్రియమైన అన్నను నీవు ముహూర్తకాలములో చూడబోవు చున్నావు. రావణునిచంపి సీతను గ్రహించి లక్ష్మణునితో సుగ్రీవాది మిత్ర పరివారసహితుడై నీ అన్న వచ్చుచున్నాడు" అని చెప్పెను. భరతుడాపలు కులు వినినంతనే ఆనందమున పరవశించి మూర్ఛపోయి కొంచెముసేపటికి తేరుకొని హనుమంతుని కౌగిటగ్రుచ్చి ఆనందబాష్పములతో అతని శరీరాన్ని తడిపి "అనఘా! మనుజుండవో, నిర్జరుండవో దయగొని సమ్మదంబిడు నుదం తము జెప్పగవచ్చితీక్రియన్" అని పలికి 'అయ్యా! నీకు నూరుగ్రామాలు, లక్ష గోవులు, బంగారు ఛాయగల కులీనాంగనలు మొదలగు కానుకలను బహూకరింతును. నీవు మా అన్న సర్వవృత్తాంతమును, ఈ పదునాలుగేళ్లలో అతని అనుభవములను సవిస్తరముగా తెలుపు'మని కోరగా హనుమంతు డంతయు (సీతావహ్నిశుద్ధి తప్పించి) విస్తరముగా తెలిపెను.

అంత భరతుడు ఆనందముతో నగరమును అలంకరించుమనట్లుగా శత్రు ఘ్నునాజ్ఞాపించి, రామపాదుకలు స్వీకరించి, బ్రాహ్మణ మంత్రి పరివార సమేతముగా బయలుదేరి రామునకు ఎదురువెళ్లెను. రాముని రాకలో విలంబము సహింప జాలక హనుమంతునిచూచి 'అయ్యా! రాముడు రాలేదు.

కోతులలో ఒకడైనా కామరూపధారియై మానవవేషములోనైనా రాలేదు. నీవు చాపల్యము చూపలేదుకదా!" అని పలికెను. భరతుని పలుకులకు ఏమాత్రం నొచ్చుకొనకుండా హనుమంతుడతనికి భరద్వాజాశ్రమమునగల విందు ఏర్పాట్లను తెలిపి 'ఇదిగో ధూళి వాలుకానదీ ప్రాంతంలో ఆకాశమంటుచున్నది. అందులో విమానపు ఆకారం గోచరించుచున్నది. దానిలో రాముడు వచ్చుచున్నాడు' అని తెలిపి భరతుని ఆనందింపజేసెను. పరమ భాగవతశిఖామణి భరతునికి రామునకు జరిగిన కలయికను రామభక్తశిఖామణియగు హనుమంతుడు నయనానందకరముగా తిలకించెను.[171]

సమీరకుమారవిజయము ప్రకారం: రామాయణమున తెలుపబడిన అంశమే ఇందు సంకేతముగా నున్నది. భరద్వాజాశ్రమమున శ్రీరాముడు తిరువడిని (ఆంజనేయునకు శ్రీవైష్ణవ సంప్రదాయమందలి పేరు) పిలిచి 'పర హృదయజ్ఞతా గరిమం ప్రౌఢవచోరచనా చమత్కృతియుక్త నరసుడవౌట నా భరతుని సన్నిధికేగి మదాగమనంబు మచ్చరితము తెల్పి రమ్మనుచు' ప్రియమున పంపెను. కాని రామాయణమున నున్నట్లు భరతుని స్వభావమందలి మార్పులను గమనించినట్లులేదు. మారుతి 'మానవరీతి నాతనిం గాంచి రామకథామృతంబు వర్ణించెను.'[172]

అధ్యాయము–7

# 1 అయోధ్యలో హనుమంతుడు

శ్రీమద్రామాయణోక్తరీతి : అయోధ్యకు చేరిన తర్వాత రాజ్యపాలనను భరతునినుండి స్వీకరించి శ్రీరాముడు తన పట్టాభిషేకమునకు సమాయత్తుడాయెను. అపుడు సుగ్రీవునిచే ఆజ్ఞాపింపబడి వానరశ్రేష్ఠులగు వేగదర్శి, జాంబవంతుడు, వృషభుడు, అనువారితో కలిసి హనుమంతుడు 'మూర్త పంతలో దివ్యతీర్థనిచయ పూర్ణకుంభములను రామ పట్టాభిషేకమునకై గ్రన్నన తెచ్చెను. శ్రీరాముని పట్టాభిషేకమున వైభవోజ్జ్వలముగా ముగిసిన తర్వాత శ్రీరాముడు తనకు తోడ్పడిన వానరులకూ, విభీషణునకు బహుమతుల నొసంగెను. అప్పుడు సీతాదేవి తన చూపులతోనే శ్రీరాముని అనుమతి పొందినట్టిదై హనుమంతునకు నిర్మలములైన వస్త్రములు, సువర్ణాభరణముల ఇచ్చి తృప్తినొందక తన కంఠమందలి బంగారు హారము నొకదానిని తీసి తన చేతిలో ఉంచుకొని తన పతివైపు పలుమారు చూచుచుండెను. శ్రీరాముడామె తలంపెరిగి 'నిన్ను ఎవడు తన గుణగణములతో మెప్పించెనో వానికే ఆ హారము నిమ్ము' అని పలికెను. సీత సంతోషించి ఆ కంఠహారమును సీతాశోకవినాశకునికే యిచ్చెను. హనుమంతుడు దానిని ధరించి ఆనందించెను. ఇంతేకాక ఆ వేడుకలో శ్రీరాముడు అంగద హనుమానులను తన తొడపై కూర్చుండబెట్టుకొని వారినిపొగడి తాను ధరించియుండి ఆభరణముల నన్నింటిని తీసి వారిని అలంకరింపగా అదిచూచి వానరులందరును శ్రీరాముని శ్లాఘించిరి. రాముడపుడు హనుమంతునిచూచి తననుండి ఏదైనా వరమును కోరుకొనమని చెప్పెను. అంత నాతడు తన ప్రభువునుచూచి—

.... .... .... రామచంద్ర నా
మన మెదివేళ నీ యెడల మానని నెయ్యముఁ బూనుగాక నా
కనయము నీదుభక్తి వెలువారెడుగాక మనం బికెందునన్
జనదు యుండుగాక మహిజాధవ నన్ను ననుగ్రహింపుమీ.
నీ దివ్య చరితం బీ మేదిని నెందాక నిలచు మిహరకులేంద్రా
నా దేహంబునఁ బ్రాణము లాదరమున నిలువనిమ్ము యందాక పతీ.

—అని కోరెను. ఆ పలుకులకు రాముడానందించి సింహాసనము దిగివచ్చి అంజనేయుని కౌగిటచేర్చి పరమానురాగముతో, నీ మనసులో నున్నట్లే కాగల దని పలికి 'నా చరిత్ర నా కీర్తి ఉండునంతవరకు నీకు ప్రాణములుండు'నని అనుగ్రహించెను. "ఉపకారము చేసినవానికి తిరిగి ఉపకారం చేయదలంచుట వానికేదైనా ఆపద కలుగవలెనని తలంచుటయే. నీవు చేసిన ఒక్కొక్క ఉపకారమునకు నా ప్రాణమే ఇవ్వవలసి యున్నది" అని పలుకుచూ తన కంఠమందలి హారమునుతీసి శ్రీరాముడే స్వయముగా హనుమ మెడలో అలంకరించెను.[173]

ఆశ్చర్యరామాయణోక్తము : త్రిలోకములలో దేవతలకుకూడ దుర్లభ మైన వరమును నేనిచ్చెదను కోరుకొనుము" అని రాముడు హనుమంతుని కోరెను. అపుడాంజనేయుడు 'మీ నామస్మరణము నెంతచేసినా నాకు తృప్తి రాదు. అందువలన భూతలమున నేను సతతము మీ నామ జపము చేస్తూనే ఉంటాను. మీ నామమీలోకంలో ఎంతకాలం ఉండునో అంత కాలము నాకు ఈ శరీరముండుగాక' అని చెప్పగా, రాముడట్లే అనుగ్రహించి 'జీవన్ముక్తుడవై సుఖముగా ఉండి కల్పాంతమున నా సాయుజ్యము పొంద గలవు. నీ వెక్కడున్నను సమస్తభోగాలు నా ఆజ్ఞచే నిన్ను అనువర్తించి యుండును.[174]

సమీరకుమారవిజయము ప్రకారం : శ్రీరామ పట్టాభిషేకమునకు (రామాయణమునందువలెకాక) హనుమంతుడొక్కడే వెళ్లి 'ఉత్తరాంబుధి రంగన్నీరపూరంబు కాంచన కుంభమున' తెచ్చెను. ఆ సమయమున ఉత్సవా నంతరం రాముడు హనుమంతునకు బహుమతుల నిచ్చినను, సీతాదేవి శ్రీరామునిచూచి —

" .... .... మహామణిహారము పూని దీన మం
దార కుమార రమ్మనుచు దానె యురంబున వైచిచూచె న
య్యారె ధరాకుమారి కనిలాత్మజుపైగల కూర్మి యెట్టిదో"[175]

## 2 హారములోని రత్నములను హనుమంతుడు కొరుకుట

ఈ కథ వాల్మీకిరామాయణమున లేదు. పరాశరసంహిత, సమీర కుమార విజయమునను లేదు. శ్రీ తులసిదాసుగారి రామచరిత మానస్‌లో

నున్నది. సభలో తనకు బహుమానముగా లభించిన హారమును హనుమంతుడు త్రెంపి అందరును చూచుచుండగా ఒక్కొక్క రత్నమునుకమలి సభలోనే ఉమ్మివేసెను. అపుడు వానరులు హనుమంతుని కృత్యముల నేవగించుకొనుచుండగా, సీతాదేవి 'ఆంజనేయా, నీ కోతిచేష్ట పోనీవైతివికదా!' అని ఆక్షేపించెను. అపుడు వాయుసూనుడు 'అమ్మా, ఈ హారమందలి రత్నములలో రాముడు కనబడునో లేదో అని కొరికి చూచితిని. అందులో నాకు కనిపించనందున పారవేసితిని' అని తెలుపగా, అపుడచటవారు 'నీకు రామనామ రహిత రత్నము రుచింపనిచో ఆ రామనామము నీలో చూపగలవా!' అని అడుగగగా వెంటనే హనుమంతుడు తన రొమ్ముచీల్చి తన వక్షఃస్థలములో సీతా రాములను చూపెను.[176]

తులసీదాసుగారి రచనచే ప్రభావితులైన ఆధునికులీకథ నెక్కువగా ప్రచారములోనికి తెచ్చిరి. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారును తమ కృష్ణ రామాయణమున దీనికి స్థానమిచ్చియున్నారు. రాముడిచ్చిన బహుమతియగు హారమును త్రెంపబోవుచు హనుమంతుడు సుగ్రీవునివైపు చూచెను. అపుడతని భావము గ్రహించి సుగ్రీవుడు "రాతిలో రప్పలోపల రామనామముండునని యెంతే నీలోన నుండునోయి' అని పలికెను. అంత కపీశ్వరుడు "తన హృదయంబు గోరులనుదారతఁజీరి కనుడటంచు" చూపగా ఆతని శరీరభాగమంతయు రామమయముగా కన్పడెనని శ్రీ శ్రీపాదవారి కల్పన.[177]

ఈ కథలు కేవలము రామనామమాహాత్మ్యము నుగ్గడించుటకు కవులును, పౌరాణికులును కల్పించినదేనని శ్రీ వాసుదాసుగారి అభిప్రాయము. రత్నములలో రామనామ మగుపించలేదనుట, రత్నమును నోటిలోవేసుకొని రామనామమంత రుచిగా లేదనుట అను హనుమంతుని చర్యలు అతనికి ప్రాపంచిక వస్తువులయెడ, ఉపాయనములయెడ గల నిస్పృహను తెలుపుటకును, రామభక్తిలో హనుమకు ఈ జగమంతా రామమయముగా తన దేహాత్మాదులలో రామతత్త్వమున్నట్లుగా తెలుపుటకు ఎంతో తోడ్పడినది.

ఈ సన్నివేశము తర్వాత హనుమంతుడు —

"రామరస విహీనమైన
రత్నమ్ముల పనియేమిటి

ముత్యమ్ముల విలువేమిటి
సత్యజ్ఞానమ్ము నిమ్ము"—అని కోరెను.[178]

## 3 సీతారాములిద్దరూ హనుమంతునకు తత్త్వోపదేశంబు చేయుట.

తన ఆశ్రితులనందరిని వారివారి గృహములకు తిరిగి వెళ్లుట కనుమతించిన తర్వాత శ్రీమద్రామాయణమున హనుమంతునికి సంబంధించిన కథాంశములు తక్కువ. పరాశరసంతహితలో కొద్దిగను, సమీరకుమారవిజయమునను, సీతారామాంజనేయ సంవాదమునను, ఆశ్చర్య రామాయణమునను, మహర్షి తన ఉత్తరకాండమున తెలుపని అంశములు కలవు. వాటిని పరిశీలించగా రాముడయోధ్యలో పరిపాలించినకాలమున హనుమంతుడు రామునకు మరల ఎన్నియో సందర్భములలో సేవలొనర్చినట్లునూ, శ్రీరాముని కృపకు పాత్రుడైనట్లును తెలియును. అయోధ్యలో నొకరోజున శ్రీరాముడు 'తనకు పురోభాగవర్తియు, పుణ్యకీర్తియు, నిటలతట ఘటితాంజలియును, కృతకార్యుండును, నిరాకాంక్షుండును, నిత్యానిత్యవస్తువివేకవంతుడును, సకల విధైహికాముష్మికభోగవిరక్తుండును, శమదమాదిషట్క సంపత్తియుతుండును, మహాబుద్ధిమంతుడగు హనుమంతుని గమనించి కరుణారసంబు పొంగార జనకజాంగనామణి నెమ్మొగంబు జూచి మన నిత్యభక్తుండును, మదీయ జ్ఞానాసక్తుండును, పరమ భాగవత శిఖామణియునైన యితనిని మద్దివ్య తత్త్వస్వరూపంబుపదేశింపుము" అని ఆదేశించగా వల్లెయని సీతాదేవి అతనికి తారకయోగమును బోధించెను. "తారకయోగమనగా నాదబిందుకళలను ప్రత్యక్షముగా అనుభవించి పిదప వానికి లయస్థానమగు పరబ్రహ్మము నందైక్యమగుటయే. ఈ నాదబిందుకళలు ఇంద్రియగోచరములు కావు. వీనిని అనుభవించుటకు అనుకూలమగు ఖేచరి, భూచరి, మధ్యమ, షణ్ముఖి, శాంభవి అను ముద్రల సహాయమున ఇంద్రియములను మనస్సును అంతర్ముఖమగునట్లు చేయవలయును. ఇవి యోగమునకు ముఖ్యాంగములు. యమనియమాది రూపమగు అభ్యాసయోగమున పయనించు తారకయోగికి శీఘ్రకాలమున నాదబిందు సాక్షాత్కారమగును. అట్లెరిగిన వారికి శరీరము చలించదు. బాహ్యమగు శీతోష్ణాదుల వలన దుఃఖాదులుగానీ ఆంతరంగిక మనోవ్యాధులుగానీ బాధింపవు.

మనస్సు ఆ విధముగానున్నప్పుడు జీవబ్రహ్మము లొక్కటియే అను విషయము అనుభవపూర్వకముగా గోచరమగును. ఇది ముక్తికి చక్కని మార్గము. అతి సూక్ష్మమైన పరమాత్మ తత్త్వము నెఱుంగుటకు మనోనిగ్రహము, ఇంద్రియ నిగ్రహము లేనివాడు సమర్థుడుకాడు.

[నాగము - బిందుకళల స్వరూపము: శరీరమునందు ప్రాణవాయువుల సంచారము వలన పుట్టుధ్వనియే నాదము. ఇది ఓంకారరూపమున నుండును. ఈ నాదమును చెవులు మూసికొని వినినచో "చిణి" అని ఒకసారి, "చిణిచిణి" అని మరొకసారి వినబడును. వీనితోపాటు వరుసగా ఘంటానాదము, శంఖ నాదము, తాళనాదము వేణునాదము భేరినాదము మృదంగనాదము, మేఘ నాదము - అను దశవిధ ఓంకారనాదములను శ్రీ గురూపదేశ పూర్వకముగా శ్రుతియుక్తి అనుభవపూర్వకముగా ఎఱుంగవలెను. 'ఓమ్'కారములో 'అ' కారము 'ఉకారము' 'మకారము' అను మూడు అవయవములున్నవి. అకారము భూరినాదము, ఉకారము బిందువు మకారముకళ ఈ మూడును కలిసిననే ఓంకారమగును. నాదము పరమాహ్లాదకమై చిత్తప్రసాదకమై, భేదరహితమై, అపగత వివాదకమునునై యుండును. శరీరము పొందిన జీవునికి షడాధార చక్రములు, డెబ్బదిరెండువేలనాడులు, దశేంద్రియములు, దశవిధ వాయువులు కల్గి, మనస్సునకు శబ్ద, దర్శన, స్పృష్ట ఘ్రాణేంద్రియాది రుచులనందించును. కర్మేంద్రియ జ్ఞానేంద్రియ సహాయముచే కార్యముల నెరవేర్చునది హృదయ కమలము. ఇది అధోముఖమై యుండును. దీనిని ఆధారముగా గొని బుద్ధి సంచరించును. ఇది ప్రాణవాయువునకూ మనస్సునకూ అగ్రభాగమున ఉండును. దీనికే బిందువు అని పేరు. సకలవిధమగు వాసనలకు కార్యకారణములకు ఇదియే ఆశ్రయము. సుషుప్తిలో ఇది అజ్ఞానరూపమున, జాగృతిలో అంతఃకరణ రూపమున ఉండును. దీనికి కదలికలేదు. కాని ప్రాణవాయువుల యొక్కయు మనస్సు యొక్కయు కదలికలచే ఇదియు కదలినట్లుండును. అనాదికాలము నుండియు మోక్షము కలుగువరకు బహువిధములగు కర్మల నాచరించునదియు వారి ఫలముల ననుభవించునదియు నాదబిందువే. కర్తృత్వభోక్తృత్వములు నాదబిందువునకేగాని ఆత్మకు లేవు. అతి సూక్ష్మమగు ప్రాణమనోగ్రస్థిత బుద్ధియే బిందువు. దీనియందు ప్రతిఫలించియున్న పరమాత్మ ప్రతిబింబమే చిత్కళ].

హనుమంతుడు సీత వలన తారకయోగము తెలిసికొని 'అమ్మహాసర్వపు యుని సులభముగాగాంచు పరమ సూత్రము బోధింపు'మని కోరెను. అంత మాత అతనికి అభ్యాసయోగము, జ్ఞానయోగములతెల్పి జీవబ్రహ్మైక్యజ్ఞానము నిచ్చు అతి సులభమైన విజ్ఞానయోగము, రాజయోగముతెల్పి ఈ రెండింటికి శ్రీరామచరణభక్తి, వైరాగ్యము లావశ్యకములని పలికెను. హనుమంతుని రాజయోగిగా సీతామాత గుర్తించి "జ్ఞానమాత్ర స్వరూపమై, వియన్మండలాది దశవిధమండలముల కాధారమగు పదార్థము ఒకటి కలదనియు నాదబిందు కళలకు ఆధారభూతమై వాని ఉత్పత్తి వినాశనముల వలన మార్పు చెందక ఏదైతే తత్త్వమున్నదో అదే పరబ్రహ్మమని బోధించి—

ఆ నాదబిందు కళలం
గానంబడుచుండు వానిఁగను పురుషుడె ప్ర
జ్ఞాన ఘనుడైన రాముడు
నానావిధ తత్త్వములగు నాధుడు పుత్రా.

—అని విశదపరచెను.

సీతాదేవి హనుమంతునకీ రహస్యముల బోధించుచు 'సుతా, పుత్రా, హంసా, మహాత్మా' అని ఆదరముతో పిల్చినట్లే శ్రీరాముడుకూడ అట్టి ఆప్యాయతతో హనుమంతునకు స్థూల సూక్ష్మ కారణ శరీరాది విశేషములను బోధించగా, హనుమంతుడు తనకు ఉపాసనాక్రమమును ఉపదేశింపుమని కోరెను.

"ఏ నియమంబులుం గలిగి యే సమయంబున నెవ్విధంబున
న్మౌనము పూనియో యదియు మానియో మంత్రము తంత్ర మెద్దియో
నీనయ రూప మారయఁగ నిర్గుణమో సగుణంబో నెమ్మదిన్
ధ్యానము సేయగా వలయు నన్నియుఁ బ్రేమ నెఱుంగఁ జెప్పవే.

—అపుడు రాముడు 'శరీర ప్రాణ బుద్ధి చిత్తాహంకారములే ఆత్మ అనియు, తనకంటే ఈశ్వరుడు బ్రహ్మవిష్ణ్వాది రూపములలో వేరుగా నున్నాడనియు, తానుపాసకుడననియు తలచు అజ్ఞానికి దేశకాల నియమాదులుండును. ఈ దేహాదులఁజూచు సాక్షినిగాని నేను దేహాదులగాను అను వివేకికి దేశకాలాది నియామాదులక్కరలేదు. కావున బ్రహ్మమును స్వాభిన్ననిగా జూచువానికి

దేనితోను పనిలేదు సాక్షికి సాక్ష్యవికారము లంటవు" అని బోధింపగా దానిని వినుచు హనుమ 'చిత్రరూపమట్లు చేష్టలుడిగి తనువు మఱచి కొంత తడవూరకుండె.' అంత రాముడానందించి హనుమంతుని ఆలింగనమొనర్చు కొనెను. హనుమంతుడు శ్రీరాముని వివిధ శ్లోకములతో, దండకముతో స్తోత్రమొనర్చి 'జీవబ్రహ్మైక్యజ్ఞానము' హృదయముననిలుప వేడి 'అనవరతము నెఱయ నామది నీయందు నిల్పజేయు రామ' అని ప్రార్థించెను. రాముడు సంతసించి పావనికి అమనస్కయోగము బోధించెను. "పరమ భాగవతోత్తమా, నీవు దేహాద్యతిరిక్తుండ వగుటంజేసి జన్మాస్తిత్వ వృద్ధిత్వ పరిణామాపక్షయ వినాశంబులును, బాల్య కౌమార వయో జరావస్థలును, వర్ణాశ్రమ కుల గోత్ర నామ రూప దేశకాలాదికంబులును, స్థూలత్వ కృశత్వ హ్రస్వత్వ నీలత్వ రక్తత్వాదికంబులును, నిరింద్రియుడవగుటంజేసి వచనాదాన గమన విసర్గానంద కర్మంబులును, శబ్దస్పర్శరూప రసగంధ విషయ సంగంబులు, అప్రాణుండ వగుటంజేసి చలన ధావన కంపనా కుంచన ప్రసారణాదికంబులును, క్షుత్పిపా సాదికంబులును, అమనస్కుండవగుటంజేసి సంకల్పవికల్పంబులును, రాగ ద్వేష కామక్రోధలోభ మోహ మదమాత్సర్యేర్ష్యాసూయాదంభ దర్పాహంకా రేచ్ఛా తృష్ణా విచికిత్సా లజ్జా దయా భయ శోక ధైర్యాధైర్య దైన్యాదికంబు లును, నిత్యానిత్యవస్తు వివేక వైరాగ్య శమదమోపరతి తితిక్షా శ్రద్ధా సమా ధాన ముముక్షుత్వ శ్రవణమనననిదిధ్యాస జ్ఞానాదికంబులును ధీవిలక్షణుండవు నిరహంకారుండ వగుటంజేసి వక్తృత్వ ధాతృత్వ గంతృత్వ విసర్జయితృత్వా నంద యతృత్వబులును, శ్రోతృత్వ స్పృష్టృత్వ ద్రష్టృత్వ రసయితృత్వ ఘ్రాతృత్వంబును, కర్తృత్వ భోక్తృత్వ స్మర్తృత్వ జ్ఞాతృత్వ మంతృత్వ హంతృత్వ ప్రమాతృత్వ ధాతృత్వాకంబులును నీకు లేవు;నీకు కేవల శుద్ధబుద్ధరూప ప్రత్యగభిన్న బ్రహ్మచైతన్య ప్రకాశమాత్రుండవు గావున 'నేను శరీరేంద్రియ ప్రాణబుద్ధి చిత్తాహంకారంబులును గాను; స్వయంప్రకాశ సచ్చిదానంద స్వరూప మాత్రుండ'నని నిన్ను నీవు విలోకించు సమాధి సమయంబున సకల వికార సమన్విత మనోరహితుండవు; భూతభవిష్యద్వర్తమాన కాలంబుల నివ్విధంబున ప్రకాశించుచుండుటవలన నిరంతరంబును నిర్వికల్పుడవై యేకరూపుండవై యున్నావు. ఇదియే సర్వవికారశూన్య సహజామనస్క రాజయోగసమాధి" అని బోధించి. "పరమేశ్వరుండైన నా నెమ్మనంబున పరమ నిక్షేపంబుగా ప్రకాశించు సర్వోపనిషత్సార భూతంబైన యీ దివ్య జ్ఞానంబును మద్భక్తుం

డవు, మత్పూజాపరుండవు, మదర్పిత మనోబుద్ధివి, మత్పరాయణుండవు నగుటంజేసి నీకుపదేశించితి, నింతకంటె రహస్యంబైన యర్థంబు నాడెందబున లేదు" అని పూర్తిగా విశదీకరించెను. సకలజ్ఞానసారమగు శ్రీరాముని పలుకులను మనోగమ్యమైనర్చుకొని శ్రీరామరూప పరమాత్ముని పలురీతుల ప్రస్తుతించి హనుమంతుడు శ్రీరామునిమాచి—

దేహబుద్ధ్యాస్మి దాసోహం
జీవబుద్ధ్యా త్వదంశకః
ఆత్మబుద్ధ్యా త్వమేవాహ
మితి మే నిశ్చితా మతిః

—అని పలికి, శ్రీరామునిచే సాదరముగా అనుజ్ఞాతుడై నిజాశ్రమమునకు వెళ్లెను.[179]

# 4 శతకంఠ రావణాసుర వధ

శతకంఠ రావణాసుర వధను గూర్చిగానీ, సహస్రకంఠ రావణాసురుని గూర్చి కానీ శ్రీమద్వాల్మీకి రామాయణమున లేదు. పరాశరసంహితలోను, మర్దనకవి రచించిన సీతావిజయము అను నామాంతరముగల శతకంఠ రామాయణములోను, ఆశ్చర్య రామాయణము, అద్భుతోత్తర రామాయణము, సమీరకుమారవిజయములలో నున్నది. ఈ కావ్యములన్నిట కథ రమారమి ఒకటిగానే యున్నది. స్థలముల పేర్లు, మానవుల రాక్షసుల పేర్లు, సన్నివేశముల క్రమము మొదలగు వానిలో స్వల్పముగా భేదములున్నవి. ఇవి సీతా మాహాత్మ్యమును, హనుమంతుని జవసత్వాది వినయ సౌశీల్యములు, రామకైంకర్యపరత్వమును, అసాధ్య సాధనాదక్షునిగా అతనిని చిత్రించుటకును రచింపబడినవి.

పరాశరసంహిలోని కథ : శతకంఠుడను రాక్షసుడు కశ్యపపుత్రుడు. బ్రహ్మరుద్రాదులచే వరములపొంది గర్వితుడై యుండెను. వీడు లోక కంటకుడై మునుల బాధించుచుండెను. యక్ష రాక్షస కిన్నర కింపురుష దేవ గంధర్వ నర వానర పురుషుల చేతిలో తనకు మరణము సంభవించ కుండునట్లును, తన రక్తము నేలమీద పడినచో తనవంటివారు నూర్గురు ఉద్భవించునట్లుగను వీడు పొందిన వరములలో ముఖ్యములు. వీని బాధల

పడజాలక సాధువులగు ఋషులు శ్రీరాముని శరణువేడిరి. అయోధ్యకు కడు దూరముననున్న వీని పురము అంతరిక్ష పురము. దీనిని చేరుటకు అనేక సముద్రములను దాటవలసియుండెను. సాగరతీరము చేరిన తర్వాత పదివేల ఆమడల దూరముననున్న వీని పురమునకు వారధి కట్టుటకు సాధ్య పడదని రాముడు చింతించుచుండగా మారుతి తన వాలమును పెంచి అంతరిక్ష పురమునకు దానిని వంతెనగా ఉపయోగింపుమని తెలిపెను. రాముడంగీక రించగా హనుమంతుడు వాలసేతువు నిర్మించగా ఆ వాలమందలి రోమము లలో నక్షత్ర గ్రహాదులన్నియు దర్భలయందు మంచుబిందువులున్నట్లుండెను. రాక్షసుని పట్టణ ప్రాకారము అగ్నిమయము. అది పరాక్రమముచే సాధ్య పడునదికాదు. ఏమి చేయవలయునో అని చింతించు రాముని వద్దకు హను మంతుడుచేరి ఉగ్రుడై ఆ ప్రాకారాగ్నిని సముద్రములో పడవైచి ఆ పట్ట ణము లోపలివరకు తన తోకను విస్తరించెను. ఆ వాలసేతువుద్వారా చతు రంగబలములు, రామానుజులు మువ్వురు, సీతాసహితుడైన రాముడు ప్రవే శించిరి. శతకంఠునితో పోరాడి రామాదులు మూర్ఛపోయిరి. మూర్ఛ నొందిన తనవారినిచూచి సీత చింతించుచుండగా గర్గముని సీతాదేవికి హనుమ ద్ద్వాదశాక్షరీ మంత్రముపదేశించెను. అపుడామెయే వానితో పోరాడుటకు సిద్ధపడెను. యుద్ధరంగమున రాక్షసుని ప్రతి రక్తబిందువు నేలమీద పడునపుడెల్లచో నూర్గురు శతాననులుద్భవించుటను సామీరి చూచెను. అంత అతడు పంచముఖుడయ్యెను. ఒక్కొక్క ముఖమునకు మూడు నేత్రములు, ఒక్కొక రూపమునకు ఆయుధసహితమైన పదిచేతులుండెను. అపుడతని ముఖము త్రిపురాసుర సంహార సమయమున రుద్రునివలె ప్రకాశించెను. ఎందరు శతాననులుద్భవించెడివారో అందరు పంచముఖాంజనేయు లుద్భవించ సాగిరి. హనుమ సీతాదేవిని తన భుజమున వహించగా ఆమె కాళీస్వరూపమై శతకంఠునితో యుద్ధమొనర్చెను. రాక్షసుని రక్తం నేలపై పడకుండా హనుమంతుడు తన తోకను విస్తరించి రక్తబిందువులు నేలమీద పడకుండా చేయగా, రాముని మహిమపై, తన పాతివ్రత్యముపై శపథముచేసి సీతాదేవి వానిని అగ్నిజ్వాలలవంటి బాణములతో సంహరించెను. దేవతలు పుష్ప వర్షము కురిపించి దుందుభుల మ్రోగించగా ఆ శబ్దములకు దాశరథులు లేచిరి. రాముడు సీతను, హనుమంతుని వారివారి విశ్వరూపముల చూపుమనికోరెను.

అపుడాంజనేయుడు మేము మా విశ్వరూపములను చూపినచో మీరు భీతిల్ల గలరు అని అనగానే రాముడు వారిని కొనియాడెను.[180]

సమీరకుమారవిజయోక్త కథ : రాముడయోధ్యలో సామ్రాజ్యము చేయుచుండగా అగస్త్యుడతనిని సందర్శింపవచ్చి రావణుడాదిగాగల రాక్షసుల నిర్మూలించినందుకు రాముని కొనియాడుచుండగా ఆకాశవాణి ఆ సందర్భంలో "ఓ జననాథా! దశకంఠుని జయించినందుకే ఇంతటి ఆనందము చెందుచున్నారే దధిసముద్రముచేత ఆవరించబడిన మాయాపురిలోనున్న శతకంఠుడనుదైత్యుడు నిన్ను గెలువవలెనని యున్నాడయ్యా!" అని పలికిన పలుకులు వారందరును వినిరి. అప్పుడు అగస్త్యుడు ఆ రాక్షసుని వృత్తాంతమును శ్రీరామునకు విన్నవించెను. వసువను దైత్యాంగన అసురసంధ్యాసమయములో కశ్యపుని కూడినందున శతకంఠుడు జన్మించెననియు, వాడు బ్రహ్మ రుద్రాదుల వర ప్రసాదముచే గర్వితుడై మాయాపురమును రాజధానిగా చేసుకొని పరిపాలించు చున్నాడని తెలిపెను. అంత రాముడు 'దుస్తరములైన బహు తోయధులఁ దరించి వైరి నేరీతిఁ జీరువార'మని సంశయించి, సోదరత్రయముతో ఆలోచించి మారుతినిచూచి ఇట్లు పలికెను. 'వాయుకుమారా, సారజవశౌర్యోత్సాహ బాహాబలోపాయశ్రీల భవత్సమాను డీ లోకములోనే లేడు. ఏ ప్రయత్నములో నైనా నీవు సమర్థుడవు. నీవు ఏకపాద రుద్రాంశ సంభూతునివి. నీచే కాగల కార్యమునుగూర్చి యింత ఉపేక్షింపదగునా' అని అనెను. అంత హనుమ —

" .... .... అపార కృపావనరాసులైన మీ
కీ వనరాసులెంత ననునెక్కి సహోదర సైన్యయుక్తిన
ద్దీవికి దాటిపోయి పగదీర్చుము"

— అని బదులాడగానే రాముడు ఆనందించి 'ఏకడ నీ మగటిమి కాక మఱి గలదే' అని మెచ్చి అతనిని కౌగలించెను.

సర్వసైన్యముల సమీకరించి రాముడాజ్ఞాపించిన వెంటనే హనుమం తుడు అజాండమంతా నిండిపోవునట్లు విరాడ్రూపము వహించెను. చుక్క లతని మొలపూసలై దిక్కులకు అవకాశములేని దివ్యాంగము ప్రకాశించెను. అతని ఒక జంఘకు సప్తసాగరాలు చాలవయ్యెను. ఒక చక్కని భానుచక్రాది మండలము చాలదయ్యె. ఒక ఘట్టనకే ఆదివరాహ శేషులు ఓర్వలేరైరి.

అతని వితిక్రమోపక్రమమున బ్రహ్మాండపేటి నిండినది. అజంనేయుఁడు తాను 'కదిలితే ఊర్ధ్వలోకాలు చూర్ణం కాగలవని,' చక్కగా నిక్కితే కర్పరంబు పడి పోవునని, పాదము గట్టిగా మెట్టితే ఆదికూర్మమడుగంటుననీ, బిగువు చూపితే దిశావలయము బీటలువారునని, రాక్షసవధకై పెంచిన తన తనువును నిగ్ర హించుకొని సమస్త లోకోపకారసిద్ధికై —

"ఒక్క దిక్కున ఘనమూర్తి నొందియున్న
నవని యెక్కడ గ్రుంకునో యతి భరమున
ననుచుఁ గకుబంతముల నెల్ల నావరించె"

—అపుడతని బృహత్ కాయాన్ని 'జక్కగ గనలేరవ్వేళ బ్రహ్మాదులున్.' ఆ రూపాన్ని ఆశ్చర్యంతో తిలకించుచు విభీషణుడు అపదుద్ధారకమనే మంత్రాన్ని పఠించి పొగడుచుండగా, 'అయ్యో, నీవు నా మంత్రివని తలంచిన దుర్మదుని గదా' అని సుగ్రీవుడు చింతించి క్షమాపణ కోరుచుండగా, సాక్షాత్తు త్రివిక్రమా వతారమే యిది అని జాంబవంతుడనుచుండగా 'ఇంతవాడై గర్వమింతయుఁ గన'డని రాముడు తలయూచుచుండగా, సీతాదేవి కనులు మోడ్చుచుండగా, తక్కినవారాశ్చర్యపడుచుండగా ఆంజనేయుడు దీర్ఘరూపము వహించెను.

రాముడెక్కుటకై హనుమంతుడు తన దేహము వంచగా ప్రభువు ముందుగా సీతాదేవిని ఎక్కించి, మిగత వానరులను హనుమపై ఎక్కమనెను. అపచారమొనర్చుటగా భావించి వారు సంశయించుచుండగా రాముడు వారిని ఆదేశించినంతనే వారు మొత్తం సైన్యము వాయుపుత్రుని వీపుపై అధివసించిరి. హనుమంతునితోక తుదిభాగం 'చుక్కలబెడంగు దొరసి మెరసింది.' ఆసీను డైన రామునకది ముత్యాల గొడుగువలె భాసించెను. గగనగంగ హనుమంతు నకు తనవారి 'లహరీఘుమంఘుమ' స్వరములతో సేసలు పెట్టింది. అనదిపై ఆంజనేయుని కాంతి పర్వి ఆమె ఎఱ్ఱబారెను. సీతారామసహిత సైన్యముగా ఉత్తరసాగరము, ఇక్షురసవార్ధి, సుధాజలధి, ఘృతవారాశి అను నాలుగు సముద్రాలను అవలీలగా లంఘించి మాయాపురమును చేరెను. త్రినేత్రుడైనా తేరిచూడజాలనట్టి శతకంఠుని హేమపుకోటను మారుతి తృణీకరించి చేర గల్గెననియు, జగదాభీలప్రయాణోద్ధతితో నభోమార్గములో దైత్య వానర నరేంద్రానీకములను, చతుస్సాగరములను దాటించి శత్రుపురము చేరడానికి ఆంజనేయునికితప్ప ఇంకొకరికి చేతకాదనియు, కామరూపతకల్గిన హనుమంతుని

జంగకు భువనజాలములే చాలవనియు, ఇట్టి మహాబలుడానాడు లంకకుచేరుట ఆశ్చర్యము లేదనియు, నాడు హనుమయే విజృంభించి యుండినచో రావణ కుంభకర్ణాదులుండెడువారా అనియు ఆ సందర్భమున ప్రయాణమధ్యములో రాముడు సీతకు తెలిపెను. మరియు 'నా కీర్తి భుజానులెంచుటకై నాకు సాహాయ్యుడై ఉండినాడే కాని హనుమ కసాధ్యమైన దేదియును లేదు. ఆకాశ మార్గంలో ప్రయాణంచేస్తున్న మనకు ఇందలి వింతలు చూడడంకోసం ఇతడు తన వేగాన్ని కావలెననియే తగ్గించెనేకాని నిజముగా మన మారుతి తలంచినచో ఈ దీవి ఒక నిముష గతికి కూడ చాలదు" అని తెలిపిన పతి మాటలకు సీత హనుమంతుని మెచ్చుకొనెను. వారి ఆదేశముపై వాయుకుమారుడు మాయా పుర ఉపవన సమీపములో సేనావాహినిని దింపెను.

వెక్కసమైనందున రాక్షసులు ఆంజనేయుని ఎదిరింపవచ్చిరి. దండ పాణులైన మాయాపుర సైనికులు మ్రగ్గిపోయిరి. అజాండము నిండిన దండి మేనుగల ఆ కోతిని రెండు నెలలు నిర్జించిరేకాని గెలువలేకపోయిరి. మంత్రుల ద్వారా వార్తవిని శతాననుడు సమర సంరంభముతో అక్కడికిచేరగా వానిని చూచుచు రాముడు మహాద్భుతమొంది చూచుచునేయుండెను. అంత పావని రామునిచూచి 'స్వామీ, ఆద్యంతవిదూరవిగ్రహులు, తత్త్వవిదులును అయిన తమరు ఈ రాక్షసుని వింతగా చూడనేల? మీకు వీడు ఎదురుండ గలడా? వీనిని గూర్చి చింతించుటమాని శత్రుహృతి చేయుట మంచిది' అని తెలిపెను.

హనుమ శతకంఠునిచేరి 'తినురా' అని ఒక్కసారిగా వాని రొమ్ముమీద పొడవగా వాడు నొగిలి భూమిని త్రెళ్లి, లేచి ఆంజనేయుని చూచి 'త్రిజగద్భయ దాంగుని నన్ను నొంచె నీ పిడికిటిపోటు బెట్టిదము పేర్కొన శక్యమే వాన రోత్తమా' ఎల్లలోకాలు తిరిగినా ఇంత ముష్టిబలముగల దెబ్బ నేను చూడలేదు అని హనుమంతుని పొగడి తన శూలపువాడిని చవిచూడమని ఆంజనేయునిపై విసరెను. దానిని హనుమ 'తృణలీలఁ బాదహతిఁ ద్రుంచెను' వాడు తన ఇన్నూరు చేతులతో ఎన్నో ఆయుధాలను ఆంజనేయునిపై వేసెను. వాటి నన్నింటిని వాయుకుమారుడు త్రుంచివేసెను. ఇంతలో సుగ్రీవ విభీషణులు వానిపై శైలములను శస్త్రాదులను వేయగా వాడు వాటిని త్రుంచి తన పాద ముతో వారిని చిమ్మగా ఎగిరివచ్చి వారు లంకాద్వీపంలో పడిరి. అపుడది

చూచి హనుమ ప్రాలన వారికై తన వాలము చాచి నాలుగు సముద్రాలకు సేతువు కట్టగా ఆ మార్గంలో వారు తిరిగివచ్చి హనుమంతుని పొగడరి. వాయుపుత్రుని వాలసేతువును చూచి ఆ ద్వీపవాసులు భయమందిరి.—

వదలడు సమరోదగ్రత
గదలడు తానున్నచోటు గగనాంతరమున్
దుదగన్న మేనితో నత
డు దధులపై వాలసేతు వొదవించు నెడన్.

—మరల తిరిగివచ్చిన దైత్యవానరసంఘాన్ని శతకంఠుడు బాధింపగా వారందరు కాందిశీకులై పారిపోగా రామానుజులు ముగ్గురును వాని నెదిరించిరి. నాలుగు నెలలు వానితో వారు పోరాడినను వాడు బలహీనుడు కాలేదు. సోదరులు అలసిపోవుటచూచి రాముడు వారిని విశ్రాంతి గొనుమని చెప్పి తాను ఆంజనేయుని చరమాంగాగ్రస్థితుడై యుద్ధానికి దిగెను. వారి యుద్ధము అతిభీకరముగా నుండెను. రామబాణహతి వలన స్రవించిన ఒక్కొక్క రక్తబిందువునకు ఒక్కొక్క శతాననుడుద్భవించి రాముడువేయు మహిమాన్విత అస్త్రములనన్నింటిని త్రుంచుచుండగా ఆ అందరికీ అందరైన రామునితో యుద్ధం చేయుట ఆంజనేయునకొక్కనికే తెలియును. అపుడు హనుమ 'మహిమాధికుడై వీరరసమావేశించగా' వాని రక్తబిందువులను తన పదఘట్టనలతో నేలరాచి నాశనం చేసేవాడు. ఈ సందర్భమున హనుమ చూపిన పరాక్రమము పరాకాష్ఠ చెందగా "అప్పంచముఖకపి వియచ్చరుల కచ్చెరువును శతముఖ శతశతకంబులకు రౌద్రంబును, తచ్చమూపతులకు భయానకంబును, నిజసైనికులకు సంతసంబును స్వామికి భృత్యభావంబును సుగ్రీవునికి సౌహార్దంబును కనిపించుచు పెంపుమీరినది. యుద్ధరంగమున పడిన మాంసరక్తమేదో పలలముల నారగించు భూతతతులు "అనుమయ్య దయ సమగ్రంబు" అని స్తుతించుచుండగా యుద్ధము భీతివిస్మయ భీభత్సహేతువయ్యెను. పోరులో అలసట చెందిన రాముడు తన కోదండమును సీతకివ్వగా ఆమె బాణములకు శతకంఠుడు మరణించెను. దీనిని చూచిన వేల్పుదొరలు శ్రీ సీతారామాంజనేయులను ప్రణుతి చేయగా సీత తన చేతివిల్లు సౌమిత్రికందించి రామునకు మ్రొక్కెను. శతకంఠవధ చేసినందుకామెకు బహూకృతిగా రాముడామెకు మణిహారమును ఇవ్వగా, సీత రాముని చూచి—

"ఘోరాస్త్రాహతమైన శాత్రవుని క్రొన్నెత్తుటన్ బుట్టి పెన్
బారుల్ దీరు శతాస్యకోటిమశకప్రాయంబుగా స్వాంఘ్రి సం
బారస్ఫూర్తి నడంగ ద్రొక్కిన నభస్వత్స్వాతికే గాక నీ
హారంబన్యులు దాల్ప నర్హులె త్రిలోకాశ్చర్య చర్యాధికా"

—శతకోట్యర్బుద సంఖ్య శతకంఠుల చంపిన సామీరి ఒక్కనిని చంపలేదంటే జగత్తంతా నన్ను—

"స్తుతి గావింపదలంచిగాక మనకున్ సూనుండు సద్బంధుడున్
హితుడున్ భృత్యుడమాత్యుడాప్తు డికలేడేతాదృశం డెయ్యడన్"

—అని పలికి "మనకు ప్రాణనందనుడే బహిఃప్రాణము; యుద్ధములో మనకు ఎన్నో మహోపకారాలు చేసినవాడు, దూతయై మన ప్రాణాలు నిల్పినవాడు, మిమ్మే మదిలో నుంచుకొని మనోవాచాకర్మణా అన్నీ మీ అడుగుజాడలలో నడిచి కార్యాలు చేసినవాడు. ఈ ఋణంబేజన్మలో దీర్చుకోగలమో నృపాలాగ్రణీ." అస్త్రపరాక్రమములో సాటిలేనివారు తమరు. తమరి తర్వాత ఈ హనుమయే శ్రేష్ఠుడు.

ఏ రమ్యమతి సత్కథా రత్నముల్
ఘనమతుల్ కంఠ భాగమున దాల్తు
రే మహామహు దృష్టి కీరేడు లోకంబు
లసదు కుండల దొంతులై కనబడు
నే వీరవరు దేహ మావహించిన దీప్తి
ఖిహిరాదులకు మిరుమిట్లు గొలుపు
నే కపీంద్రుని యున్కి మీకీర్తి వల్లికా
జాలకంబున కాలవాలమయ్యె

కంఠ చరమాంగ ఫాలభాగముల మనుజ
దనుజ వానర సేనల దాల్చె నెవ్వ
డట్టి విశ్వాధికునకు మీ యనుగు బట్టి
కాంజనేయున కొసగుడు హారమనిన.

—రాముడు తనకు ప్రేమైక పాత్రుడు, బహుకార్య నిర్వహణతాధీరు ప్రభావ ప్రతాప యశశ్చిత్ర చరిత్రుడగు హనుమంతుని కారుణ్యముతో చూచి "నీవు

మమ్ము మాతా పితృభావముల గొలిచి ప్రబలినావు కాన భావి బ్రహ్మ పదశ్రీ బ్రోవంగల మహిమ నింక బొందెదు తండ్రీ, "బ్రహ్మాండోద్ధరణ ప్రసక్తి మనుమా భాషాధృతిం పుత్రకా" అని పలికి ఆ హారమతని కందించెను. ఆ హారము పూర్వచరిత్రను రాముడు వివరింపబూని "ఆదినారాయణుడు దీనిని సృష్టికర్తయగు బ్రహ్మకిచ్చెను. ఆయననుండి ఇక్ష్వాకునకు లభించగా దాని నాతడు పట్టాభిషేకవేళలో ధరించెను. తదాదిగా ఇక్ష్వాకులకిది వంశపరం పరగా వచ్చుచున్నది. చక్రవర్తులచే ధరింపబడిన ఈ హారమును అన్యులు ధరింప నర్హులుకారు. ఇది కామరూపాన్వితమై సార్వభౌమ చిహ్నముకలది. దీనిని ధరించుటకు నీవే అర్హుడవు" అని చెప్పి హనుమంతుని కంఠమునందు తానే స్వయముగా వేసెను. రాముడు కోరినందున వారినందరిని శివదర్శ నమునకై కైలాసమునకుజేర్చి భక్తిసలిపి తిరిగి వారిని సాకేతనగరమునకు చేర్చెను. రాజమాతలు శతకంఠు నెట్లు వధించితిరో తెల్పుమని కోరగా, రాముడు వారికి హనుమను చూపి,—

మట్టుమీరిన మహామహిమమై చదలెల్ల
　　గప్పిన లోక విఖ్యాతుడితడె
లెక్కకెక్కువయైన పెక్కు సేనల మేన
　　సంభరించిన మహాసత్త్వుడితడె
నిమిషములో సముద్రములెల్ల గ్రమియించు
　　సరిలేని ఘన వేగశాలి యితడె
శాకాంతరీప భూస్థలినుండి లంకకు
　　వాల మర్చిన జగద్వంద్యుడితడె
అప్రమేయ ధృతి శతాస్యకోటుల గాల
పెట్టినట్టి గట్టి దిట్ట యితడె
వేయి మాటలేల వినుడు పోరున మాకు
విజయమిచ్చినట్టి వీరుడితడె.

—అని తెలుపగా వారును, తక్కిన వారును హనుమంతుని సన్మాన వాక్యము లతో ఆదరించిరి.[181]

శతకంఠ రామాయణ కథ ప్రకారం: పులస్త్యునికి విశ్రవసుడు, అశ్రముడు అని ఇద్దరు కుమారులు. విశ్రవసుని పుత్రులే రావణాదులు.

అశ్రముడు చిత్రవతి అను గంధర్వకన్యను తగుల్కొని సంతానము కొఱకై తపము చేసెను. వీని కుమారుడే శతకంఠుడు. వీడు నూరు తలలతో ఇన్నూరు చేతులతో పుట్టెను. రామునిచే రావణాదులు వధింపబడిన వార్త విని వీడు బ్రహ్మను గూర్చి తపమొనర్చెను. "యక్ష రాక్షస గరుడ గంధర్వ సిద్ధ విద్యాధర కిన్నర కింపురుష సుర, నర, వానరాదులలో పురుషులవలనను, మృగాండజ భుజంగమ లోకములవలనను, మీన మర్కట మకర కచ్ఛపేత్యాదులగు జలచరముల వలనను తనకు మరణము లేకుండా కోరుటేకాక 'రణంబు సేయునెడఁ దన శరీరంబునఁగల శోణిత కణంబెచట దొరంగు నచట నూర్గురు శతముఖులు జనించునట్లుగాను జరయు,శ్రమయు, పరితాపంబులు,భయంబును, దైన్యంబును, నెన్నండును దన్నుం బొరయకుండునట్లును వరములను కోరి పొందెను. లోక కంటకుడైన వీనిని వధించుటకై ఉపాయమాలోచించుచు రాముడు హనుమంతుని స్మరించెను. వెంటనే గంధమాదనము నుండి వచ్చి వాలిన హనుమంతునితో ఏకాంత సౌధమున వీభీషణాదులతో చేరి హనుమకు ఈ రాక్షసుని చరిత్ర తెలియజేసెను. అంత హరీశుడు 'బంటును నన్ను పంపినచో వెళ్లి వానినిపుడె వధించి వత్తు' ననెను. తన పరాక్రమునకు దేవతల వరాలు శ్రీరామ సేవకారణమని తెలిపి తన వాలము మీద సేనలు సముద్రములు దాటివెళ్లవచ్చునని తెలిపి తన విరాడ్రూపం చూపి 'రేపు మీ పేర చంద్రతారాబలములు బాగున్నవి" అని స్పష్టపరచి రామునివద్ద సెల వొంది తన విడిదికి వెళ్లి శివుని ధ్యానించి అతనిని ప్రత్యక్షము కావించుకొని పూని ప్రళయకాలంబున మీకు విశ్వరూపంబుదాల్చునెడ మీ యందెట్టి మహిమంబు ప్రవర్తిల్లునట్టి దుర్నిరీక్ష్యంబగు తేజంబును విమత శిలీముఖా ప్రతిహతత్వంబును కోరి," తదనుగ్రహమున వానిని పొందెను. తర్వాత తన తండ్రియగు వాయుదేవుని ప్రార్థించి అతనిని కూడ ప్రత్యక్షము కావించుకొని అతని వలన అసదృశజవమును, అభేద్యసత్త్వమును పొందెను. మరునాడు శ్రీరామ విభీషణులవద్దకు వచ్చి వారి వద్ద తన బృహద్రూపాన్ని చూపగా, ఆ రూపాన్ని సుయంత్ర ప్రముఖ ప్రధానులు నిరీక్షింపజాలిరి; రామానుజులు ఆశ్చర్యముతో నిర్విణ్ణమనస్కులైరి. రాముడతని ఘన రౌద్రరేఖా విశేషంబుల జూచి అతని సహాయముతో శతకంఠుని చంపుటకు సందేహింపఁబని లేదని నిశ్చయించి తన కంఠములోని దివ్యరత్నహారము తీసి హనుమంతుని గ్రీవము నలంకరించి, లక్ష్మణుని వెంట పంపి సకల వానర సైన్యముతో సుగ్రీవుని

తోడి తెమ్మని పంపెను. వారావిధముగా రామాజ్ఞ నెరవేర్చగా, నీల గవ యాదులకు పట్టము కట్టి రాముడు హనుమంతుని చూచి వారినందరిని కాపాడు మని కోరెను. అప్పుడాబలముల కన్నింటికి హనుమంతుడాదరువై తన రూపాన్ని పెంచి, ఆభీలంగా వాలాన్ని పెంచి ద్వారప్రదేశమున నుండెను. ఆ విరాడ్రూపానికి సూర్యుడు బొడ్డుగంటగా, తారలు మొలపూసలుగా నుండుటకు రాముడు చూచి ఆనందించి సైన్యములను సముద్రాలను దాటించమని కోరెను. అపుడు హనుమ, రాముని రథతురంగముల విడిపించి, సీతారాములెక్కిన రథాన్ని తన శిరోమధ్యంలో, రామానుజులను భుజములపై, సుగ్రీవవిభీషణాది వీరులను, వారి పరివారమును తన వీపుపైనను, రోమరోమకూపంలో సైన్యములను 'చీమ చీమఁ గమి బ్రాకిన బాడ్పున' ధరించి ప్రతాపలంకకు లంఘించినాడు. శతకంఠునిచారులతనిని చూచి—

"ఆ పవనజు నెదురనోప రమరులనియు అతడు మృత్యువే"

—అని తన ప్రభునకు చెప్పిరి. ప్రతాపలంక చేరిన తర్వాత సీతారాములిర్వురూ హనుమంతుని పొగడి అతని ఋణము తాము తీర్చుకొనజాలమని పలికిరి. అపుడు ఆంజనేయుడు—

...."యేను మీ మహిమగాదె తరించితి నెల్ల భారముల్
వినుతికి నెంతవాడ నవివేకిని మర్కటుడన్ మహాత్మ మీ
యనుమతిజేసి యెట్టి పనులైనను సాధ్యముకాక తక్కనే"

—అని బదులు పలికెను.

సమీరకుమారవిజయమున హనుమంతుడు తన విరాడ్రూపం పెంచి ముందుగా రామాదులకు చూపినట్లు లేదు. రాముడు దుందుభి కళేబరాన్ని కాలి బొటనవ్రేలితో చిమ్మి సుగ్రీవునకు నమ్మకము కల్గించినట్లుగా హనుమంతుడు సైన్యాలను తరలించుటకుముందే తన రూపాన్ని చూపినట్లు రచయిత రామాయణ విధానము ననుసరించి కల్పించెను. ఈ శతకంఠ రామాయణమున హనుమ రాక్షసుని వద్దకు రాయబారము నడుపుటకూడ అధికముగా కలదు. శతకంఠుని బుద్ధి తెలియుటకై రాముడు హనుమంతుని శతకంఠుని వద్దకు దూతగా పంపెను. అదృశ్య శరీరుడై వాని ప్రాకారమును గడచివెళ్లి వాని సభలోనికిచేరి తన వాలమునే సింహాసనముగా చేసుకొని వానితో భాషించెను. "రాక్షసరాజా, మేము వనచరులమేకాక మహీసురావనచరులము.

నీవు పురుషవర్గముచే చావు పొందవని గర్వించుచున్నావు. ఈ యుద్ధమునకు శ్రీరాముడు సీతాసమేతుడై వచ్చియున్నాడు. నీవు శ్రీరాముని శరణు పొందినచో ఆపదనొందవు" అని స్పష్టముగా తెలుపగా శతాననుడు హనుమంతుని మాటలను అంగీకరింపక అతని తూలనాడగా వాని సభలో తన బృహద్రూపం చూపి, నోటినుండి అగ్నిశిఖలను వెల్వరచి వాని సేనానుల భీతచిత్తులజేసెను. శతకంఠుని తలలపై ముష్టితో కొట్టి, వాని సింహాసనము చూర్ణమొనర్చి వాని 'ఉన్నత లలాటము దుస్సి తివిచి' వచ్చెను.

శ్రీరామ శతకంఠ యుద్ధమునందు హనుమంతుడధికమైన పాత్ర వహించెను. తన వాలము నడ్డుగాపెట్టి రాక్షసుని బాణములు రాముని తగులకుండా రక్షించెడివాడు. రాముడు తాత్కాలికముగా శతకంఠునిచే పరాభూతుడై శ్రమనొంది యుండగా హనుమంతుడు నిర్విణ్ణుడై యుండెనే కాని కర్తవ్యమును బోధింపక ఊరకుండగా సీత రంగమున ప్రవేశించి హనుమ భుజముపై 'మిన్నుముట్ట' నిలచి ఆదిశక్తి రూపముధరించి నాలుకలు విస్తరించి దానవుని రక్తము నేలపై పడకుండా తన మాయారూపముతో నాకివేసి వానిని విజయసిద్ధితో శ్రీరామాదుల నందరినీ మరల అంజనేయుడు తన మేన వహించి అయోధ్యకు చేర్చెను అందరును హనుమంతుని సేవల ప్రశంసించగా శ్రీరాముడతనికి తన కౌగిలిని ప్రసాదించి ఆదరించెను.[182]

ఆశ్చర్యరామాయణమందలి కథ : ఇందలి కథ శతకంఠ రామాయణమున నున్నట్లే ఉన్నను కొన్ని మార్పులుకూడ కలిగియున్నది. ఆ రాక్షసుని తానే చంపివత్తుననగా రాముడు అంజనేయునిచూచి "చిన్న పామునైనా పెద్ద కఱ్ఱతో చంపవలయును. కావున దండయాత్రకు సన్నాహముల నొనర్పవలె" నని పలికెను. రాముని ఆజ్ఞపొంది లంకకువెళ్ళి విభీషణుని సైన్యాన్ని తన మూపుపై మోసుకొనివచ్చి అయోధ్యచేర్చి, అటుపై కిష్కింధకువెళ్ళి సుగ్రీవుని, అతని సైన్యమునుకూడ అట్లే అయోధ్యకు చేర్చెను. శ్రీరాముని సైన్యములను తన వాలమున ప్రతాపలంకవరకు నడచిపోవుటకు వీలుగా ఆయోధ్యనుండి ప్రతాపలంకవరకు ఆ వాలమును పెంచెను. ఇందులోను శతకంఠునివద్దకు హనుమంతుడు రాయబారిగా వెళ్ళినట్లున్నది. సభలో వానికి బుద్ధిమాటలను చెప్పినను వాడు విననందున వానిని కొట్టి మూర్ఛితునిచేసి వాని కిరీటమును తీసికొనెను. వాని అనుచరులను చితకగొట్టి తిరిగివచ్చి శ్రీరామునితో వాని

యెడ సామమార్గము పనికిరాదనియు, దండోపాయమే ప్రయోగింపవలయు ననియు తెలిపెను. యుద్ధములో శతాననుడు హనుమానుని మూర్ఛితు చేయగా కొంతసేపటిలో హనుమంతుడు తేరుకొని—

"ఆపదామ్ అహహర్తారం దాతారం సర్వసంపదామ్।
లోకాభిరామం శ్రీరామమ్ భూయో భూయో నమామ్యహం॥"

—అను శ్లోకముగల ఆపదుద్ధారక మంత్రము జపించి స్వస్థత పొందెను. సీతాదేవి చేతిలో రాక్షసుడుతెగటారగా శ్రీరాముడు ఆమెను ఆదిశక్తిగాస్తుతించి ఆమెను శాంతింపజేసి తన కంఠమందలి రత్నహారముతో సన్మానింపబోగా, సీత రామునితో "నాథా, ఇట్టి ఉత్తమ సత్కారం పొందుటకు నేనేమి ఘన కార్యము చేసితిని? నేనొక్క శతకంఠుని మాత్రమే త్రుంచితిని. కాని వాని శోణితమునుండి పుట్టిన కోటానుకోట్ల శతకంఠులను మన మారుతియేకదా చంపివేసినది. కావున నాకంటే ఈ హనుమకే సత్కారము జరుగవలయును' అని పలికి తానే హనుమంతుని ఆ హారముతో నలంకరించెను. తిరిగి వారి నందరిని అయోధ్యకు చేర్చిన పిమ్మట శ్రీరాముడే స్వయముగా తన నగర వాసులలో గురువృద్ధబాంధవ జనులందరికి హనుమంతుని సాహసవిక్రమాదులు వర్ణించిచెప్పి అందరిని వారివారి స్థానములకు పోవ ననుమతించి హనుమంతుని పిల్చి గంధమాదనమున నుండునట్లాతని నాదేశించెను.[183]

శ్రీ నాదెళ్ల పురుషోత్తమకవి వ్రాసిన అద్భుతోత్తర రామాయణముననుం శ్రీ జనమంచి వేంకట సుబ్రహ్మణ్యశర్మ వ్రాసిన అద్భుతోత్తర రామాయణము నను సీతాదేవి సహస్రకంఠ రావణుని వధించినట్లు కలదు. ఇందులో హను మంతునికన్నను సీతామాహాత్మ్యమునకే అధిక ప్రాధాన్యమీయబడినది. ఇందు సీతారాములు పుష్పకవిమానములో పుష్కర ద్వీపానికి బయలుదేరి వెళ్ళిరేకానీ వారికి హనుమంతుని వాహనముగానీ, వాలవంతెనగాని తోడ్పడినట్లు లేదు. సీతారాములవార్త తెలియనందున అయోధ్యావాసులందరు దిగులొందిరి. అంత సుగ్రీవ జాంబవదాదులు హనుమంతుని చూచి—

"నినుబోలు వారు పుట్టిన
ఘనులందును లేరు ముందు గలుగరు నీవే
నినుబోలు ఘనుడ వన్నా
మన యన్నను జూపు"

—మని కోరిరి. హపుడు మారుతి మహా(ద్రూపం ధరించి పుష్కరద్వీపానికి ఎగసి పోయెను. దారిలో పుష్పకవిమాన మెదురుపడగా తన బృహా(ద్రూపం వీడి సాధారణ రూపంధరించి వారిని కల్సుకొని శ్రీరామునికి (శమనిచ్చిన సహస్రకంఠుని 'గూల్పగల్గిన సీతా వధూటి'ని (ప్రస్తుతించెను.[184]

అయోధ్యలో శ్రీరాముని సేవలో హనుమంతుడెట్లుగడిపెనో శ్రీమద్రా మాయణమున తెలియదగు విషయమే లేదు. ఉత్తరకాండములో వాల్మీకి కవి హనుమంతునికి శ్రీరాముడు వరములనిచ్చినట్లు మాత్రం ఉన్నది. రాము డొనర్చిన అశ్వమేధయాగమున ఆంజనేయుడెట్లుతోడ్పడెనో, పవనాశ్వ రక్ష ణకు వెళ్ళినట్లుగను లేనేలేదు. పరాశరసంహితలోను, సమీరకుమార విజయమునను కుశలవులు శ్రీరాముని అనుచరులతో పోరినట్లు వర్ణింపబడి యుండలేదు. ఆశ్చర్యరామాయణమున అనేకమైన కల్పనలు హనుమంతుని గొప్పతనమును (ప్రకాశింపజేయునవిగా తెలుపబడియున్నవి. సమీరకుమార విజయమున హనుమంతుని దినచర్య వర్ణితమైనది. పై కల్పనలకు వాల్మీకి కర్తకాడు. ఏ ఆధార గ్రంథమునుబట్టి పై కల్పనలను ఇతర కవులు (ప్రవేశ పెట్టిరో చెప్పుటకు విశేషమైన పరిశోధనయే శరణ్యము.

విభీషణాది దైత్యవీరులను, కపి(శేష్ఠులను వారివారి స్థానములకువెళ్లుటకు రాముడనుమతించిననూ హనుమంతుని తనవద్దనే ఉంచుకొనెను. హనుమ కూడ రాముని యెడబాయకుండా ఉండెడివాడు. "సహాసన మజ్జన భోజనాది శయన గమనుడై" రాముడుకూడ హనుమంతు నెడబాసియుండెడివాడు కాదు. రాముడు నిద్రలేచుటకు ముందే హనుమంతుడులేచి 'రాముడల కేళికారామ భూమి వెడలఁ బాదుకల చప్పుడాలించి ఆ రాముని కేళీమందిర సజ్జ చలువరాతి తిన్నెపైనుండి లేచి సాష్టాంగమొనర్పగా' రాముతడనికి కైదండ యొసగి సాగెడివాడు. రాముడు సరయూనదిలో స్నానసంధ్యాజపాదుల నెరవేర్చు కొని వచ్చుచో—

"భద్రకరిపైఁ బరగు పతికి గొడుగుపట్టి పావని నడచున్"

—రాముడు ఏనుగునుండి దిగుచున్నయెడల హనుమ అతనికి చేయూత నిచ్చెడివాడు. సభలోనికి రాముడు రాగానే—

"పాదుకల చెంత దక్షిణ
పాదము కెంగేలఁ బూని భక్తి"

—వసించెడివాడు. కొలువులో ధర్మతంత్రము నలుపువేళలో, మంత్రము నిర్వహించుచో ప్రభువు ఆత్మను తెలిసి తదనురూపమనిషావిధానరీతిలో—

లలిత యథోచిత రచనా
కల్పనం దత్ప్రసక్తిఁ గార్యము

—తెల్పుచు 'పగటి కొలువున' వర్తించెడివాడు. కొలువు చాలించి రాముడు పీఠము దిగిన వెంటనే 'కడాని మెఱుంగు పాదుకలను' పావనియే స్వయముగా ప్రభువు పాదాలకు తొడిగెడివాడు. హనుమ దక్షిణభుజముమీద హస్తమిడి నగరిలోనికి వెళ్లటయే రాముని అలవాటు. మధ్యాహ్న భోజన విరామ సమయంలో రాముడు అతిసరళంగా వేదాంత రహస్యముల చెప్పుచో కించిత్కంపంబొందుచు హనుమ వాని నాలకించెడివాడు. త్రయ్యంతపదార్థ రహస్యములను వివరింపుమని స్వయంగా సామీరి కోరిన సందర్భములలో రాముడొనర్చు వ్యాఖ్యానములను వాయుజుడతి శ్రద్ధతో వినెడివాడు. తాను రచించిన శ్రీరామబిరుదు గద్యలను వందిమాగధులచే ప్రాణనందనుడే చది వించెడివాడు. తన శిక్షణలో నిపుణులైన వైణికులచే గీతప్రబంధములను పాడించెడివాడు. కావ్యములలో రసస్థితిగల భాగములను కవులచే చదివింప జేసెవాడు. రామకైంకర్యరూప కథలను సభాసదులు పొగడునట్లు నియ మించెడివాడు. కంబళాశ్వమతంగాది కథిత నర్తనాగమోక్తమతప్రౌఢి నధిగ మించి తానొనర్చిన భరతశాస్త్ర క్రమములో చెలులను నటింపజేయుచు రాముని కొలువుచేసెడివాడు. కూర్మి పుత్రుడుగూడ చొరరాని శ్రీరాముని కేళికాకనక గృహోద్యానాది ప్రదేశములోనికి అనుమతింపబడి ఆంజనేయుడచటనే 'రేలు గ్రమించెడివాడు.' రాముడొక్కొక్కసారి 'హరువుగ నొక్కరాగమనుమా మాతమా' అని అనినంతనే—

"స్వామికింపయిన పోలిక దాననంగ రాల్
గరిగి ఘళంఘుళార్భటిఁ జెలంగిన నీదగు రాగరక్తి మై
గరగెడు సౌధలక్ష్మి యని కౌగిటఁజేర్చు నృపాలుజొక్కడన్"

—రాముడు సీతాదేవి నిద్రలోనుండగా తాను నిద్రలేచి 'హనుమంతుడు గూడ కూర్కెకదా' అని పౌరవోత్కరవార్తల వినుటకై బయలుదేరుచో ఆ విషయము కనిపెట్టిన అంజనేయుడు తన ప్రభువు 'జాడపట్టుకొని గాడ్పు కొమరుడుఁబోవు వీటిలో నింతట నంతటన్ నృపతి దృష్టికిఁ దోపక గూఢచాతురిన్.' రాజెంత

వీరుడై సను ఒంటరిగా వెళ్లబో బంటు వెంటనంటివెళ్లట కర్తవ్యమని తలంచియే హనుమ యాతనికి తెలియకుండా అనుసరించి వెళ్లెడివాడు. రాముడింటికి మరలివచ్చుచో చొప్పుదెలిసి అతనికన్న ముందుగావేరి యేమియు యెఱుగని వానివలె తన తావులో పవ్వళించి నిదురపోయినట్లగపడెడివాడు.

ఈవిధమైన దినచర్యతో చరించు హనుమంతుని చూచి రాముడొకనాడు 'రావోయి పావనీ' అని కరమూది భోజనశాలాంతరసీమకు తోడ్కొనిపోయెను. అపుడతనితోకలిసివెళ్ళలేక ఓసరించుచుండగా రాముడు అంజనేయుని హస్తము పట్టి 'నా పొత్తున ఆరగింతు వెటుపోవక' రమ్మని ఆహ్వానించెను. తన కుడి వైపున కూర్చోనబెట్టుకొని 'యుద్ధములందందరినీ మోసితివి కావున శరీరము బడలినదిగదా' అని హనుమంతునిచేతిని తాకుతూ, అతని కడిమిని పొగడుతూ, సారెసారెకతని ముఖముచూస్తూ, వాత్సల్యము ప్రసరింపజేస్తూ అంజనేయుని ముదబ్ధి తేల్చెను. అపుడు హనుమ—

మొగ మొకయింత వంచి కయిమోడ్పునఁ గుండల కాంతి చెక్కులున్
ధగధగ లీన దేవుని పదద్వయి జూచుచు నే వికారమున్
దగులని చిన్న రూపున నతండు గనంబడె రాము చెంగటన్
ముగుద తనంబు సద్వినయమున్ భయముం బ్రియముం బెనంగొనఁ.

— అపుడు సీతాదేవియే స్వయంగా వడ్డించుటకై రాగా రఘునాథుడు 'సర్వత్ర సుఖోజ్యమస్తు' అని పలికి ప్రాణాహుతులు కాగానే ఆంజనేయుని చూడగా, అతడు భుజింపకున్నందున 'ఆహారముంగొనుమా తండ్రి క్షుధాగ్ని దీరు'నని వాక్రువ్వగా హనుమ భయమొంది, ప్రాంజలియై 'నృపా, మీరు భుజింపక మున్ను గాక భుజియింపగ నాకుం జన'దని అనెను. అతని పలుకుల నామోదించి రాముడు కొన్ని కబళములు గైకొని 'ఇకనైనా ఆరగింపుము' అని పలికెను. అపుడు హనుమ 'మీరలూరక యారగింపుమన్నగాని భుక్తి చేయ బూనననని' అనెను. ఈ విధముగా ప్రతి కబళమునకు రాముడు ఆంజనేయుని 'తిను'మని కోరుట, ఆంజనేయుడు 'ఇదిగో తింటాను' అని అనుచుండుట జరుగసాగెను. చివరకు రాముడు 'తుష్టిగా ఆరగించు ప్రొద్దువరకు వినయ వ్యాజముల్ గడపి' పిమ్మట రాముడారగించిన భోజన భాజనమును వేగంగా పుచ్చుకొని ఎత్తుకొనిపోయెను. అపుడు ప్రభువు 'నీవు పొత్తున నాతో ఆరగించ కుండగనే భోజనపాత్రనెత్తుకొని యెందుకు పోవుచున్నావన్నా' అని ప్రశ్నించెను. అంతట సామీరి—

" .... .... .... జగదీశ్వర దేవర భుక్తశేషమే
నిత్తఱి మత్కుల ప్రజలకెల్లను బెట్టి భుజించు వాంఛ మైఁ
బుత్తడి పల్లెరంబు గొనిపోయెద .... ...."

—నని నమస్కరించుచు తెలిపెను. దానికి రాముడు సమ్మతించుటేకాక హనుమంతుని చర్యను తన సోదరులకు బ్రాహ్మణులకు తెలిపి హనుమంతుని 'గాఢ వినయ నయ చాతుర్యముల గమనించు'డని తెలిపి హనుమంతుని ప్రశంసించెను.

హనుమంతుడా పళ్లెమును తీసుకొనివెళ్ళి అగిసె చెట్టుమీదికి ఎక్కి తాను తెచ్చిన రామ ప్రసాదమును స్వీకరించుటకు కపులనందరినాహ్వానించెను. అతని ఎలుగెత్తిన స్వరమునకు కపులందరు తేనెటీగలు బారులు తీరునట్లుగా చేరి మూగగా, ఒక్కొక్కరికి ఒక్కొక్కపులకము ఇచ్చి తర్వాత అట్లొనర్చినచో సరిపోదని ముందే గమనించి ఆ అగిసిచెట్టు ఆకులను అపరిమితంగా దుస్సి భోజనపాత్రలోవేసి తుడిచి తుడిచి కపులకు పంచెను. వారును ఒక్క ఆకు తునుక కూడ నేలమీద పడకుండా స్వీకరించి 'ఒడలెత్తిన ఫలము నేటి కొదవే'నని ఆ ప్రసాదము భుజించిరి. వారాంజనేయుని చూచి 'సర్వశరణ్యా బుధాగ్రగణ్యా, యుద్ధములో మాకు ప్రాణాలనిచ్చి ఐహికసౌఖ్యాన్ని, లోకేశ భుక్తశేషమిచ్చి అముష్మిక సౌఖ్యాన్ని కలుగజేసితివి. ప్రసాద వినియోగమున ఎక్కువ తక్కువలు లేకుండాచేసి మా కలుషములను తొలగించి మాకు హిత కార్య మొనర్చిన దీనవత్సలుడివి. నిన్ను నుతియింప మేము శక్తులమా? అని తమకు భవపాశముల తొలగించి భుక్తి ముక్తి ప్రధాన విధానాత్ముడైన పావనిని హితాలాపములతో నుతించిరి. అగస్త్యమహర్షి తారకమంత్ర రాజపఠనము వలనను, అంజనేయుడా అగిసెచెట్టునెక్కి రామప్రసాదము నిచ్చిన కారణమునను ఆ అగిసెచెట్టుకూడా లోకాన ప్రసిద్ధిపొందెను. సదాగతి సూతియే అగిసె ఆకు. ప్రసాదమును స్వీకరించినరోజు ద్వాదశి అగుటవలన ఆర్యులు ద్వాదశి తిథినాడు అగిసె ఆకులను మానక స్వీకరించుట వ్రతమైనది. తన్నుమాలి కూడ పరబంధు రక్షణకై పూనిన పావని రామ భక్తి, స్వజన వాత్సల్యమూ సర్వస్తుత్యమయ్యెను. రామచంద్రుని ప్రసాద మందించగల్గిన పావని భక్తాభీష్టముల నీడేర్చుటలో నాశ్చర్యమేమున్నదని వానరులెల్లరును స్తుతించిరి.[185]

ఈ కథకు ఇంకొన్ని మార్పులు ఆధునికులు చేసి రచించియున్నారు. సీతాదేవి తన నాథునితో ఒకనాడు 'స్వామి! హనుమంతుని విందునకు ఆహ్వానించి పందెం వేయదలంచినాను' అని అనగా 'నీవు హనుమంతుని ఏ పందెంలోను నెగ్గలేవు' అని రాముడు బదులు పలికెను. తన పరిచారికలతో రకరకాల భోజనపదార్థముల చేయించి పావనికి విందుచేసి ఎన్ని వడ్డించినను అన్నిటిని ఆంజనేయుడు తినుచుండెను. సీత హనుమంతుడు ఏదీకూడ 'చాలును' అని అనక భుజించుచుండుట రామునకు చెప్పగా ఆ ప్రభువు వచ్చి చూడగా హనుమ సాక్షాత్ రుద్రావతారుడై తినుచున్నట్లు కన్పించెను. రాముడతని తలపై 'ఓం నమః శివాయ' అని పంచాక్షరిని వ్రాయగా ఆంజనేయుడు తృప్తిచెందెను. ఇంకకొందరు లక్ష్మణుని సలహానుసరించి భోజన పదార్థములపై 'రామనామము' వ్రాయించి వడ్డించగా అంజనేయుడు తినుట మానెనని కలదు.[186]

రామాజ్ఞపై అయోధ్యలో ఒక సత్రములో అన్నదానం జరుగుచుండెను. ఒకనాడొకబ్రాహ్మణుడాసత్రమున భుజింప నిరాకరించెను. వేగులవానిద్వారా ఈ వార్తవినిన రాముడు పాపపరిహారమునకై సీతాసహితుడై తీర్థయాత్రలకు బయలుదేరెను. అదివిని హనుమంతుడు వారిని కాశీలో దర్శించెను. వారికి నమస్కరించి అనంతరం గంగలో స్నానమొనర్చి అచటిరాళ్ళలో తన పేరుతో ఒక ఘట్టము నేర్పరచెను. అదియే నేటికిని కాశీలో పిలువబడు హనుమాన్ ఘట్టము.[187]

రాముని సేవించుచు హనుమంతుడు అయోధ్యలో పదునొకండువేల సంవత్సరములను గడపెను. ఆ సమయములో రాముడుచేసిన హయమేధ సహస్రములకు హనుమ ఎంతో సహాయము చేసెను. సవనాశ్వ రక్షణకై సైన్యముతో హనుమ వెళ్లెడివాడు. అపుడెందరో అవనీనాథులతో ఆంజనేయుడు పోరాడిననూ, వారి బాణద్యాయుధాలను మాత్రమే త్రుంచెడివాడు. తనను కొలిచినభక్తులను వాత్సల్యముతో వారిని వధింపక వదలెడివాడు.[188]

## 5 సహస్రకంఠ వధ

పుష్కరద్వీపమునకు రాజైన సహస్రకంఠుడు సవనాశ్వమును బంధించెను. వీనిమీదికి హనుమంతుడు భరతాదులతో కలిసివెళ్ళెను. సహస్ర

కంఠుని మంత్రి భరతాదులపై మత్తుమందుచల్లి వారిని తన వశమున నుంచు కొనెను. హనుమంతుడు పంచవన్నెల చిలుకరూపం ధరించి సహస్రకంఠుని నగరులోనికి ప్రవేశించి వానితో రాయబారము నడపి, వానిని పడవేసి వాని కిరీటమును హరించగా వాడు హనుమంతుని బంధించెను. అది తెలిసి శ్రీరాముడే స్వయముగావచ్చి సహస్రకంఠుని వధించెను.[189] ఈ కథకు కొన్ని మార్పులు, చేర్పులు శ్రీమద్రామాయణాంతరార్థమను గ్రంథమున చేయబడి యున్నవి.

శ్రీమద్రామాయణాంతర్గత కథ: ఇందు సహస్రకంఠుని నగరం చిత్రవతీ నగరము. చిలుకరూపమున వెళ్లిన హనుమను రాక్షసుడు బంధింపబోగా హనుమ యాభైవేలమందిని చంపెను. ఇందు పుష్కరద్వీపంవరకు తన శరీరాన్ని పెంచి ఆ చివరనుండి ఈ చివరవరకు ధనురాకారంలో ఉండెను. సైన్యములతని వీపుపై ఎక్కి నడచి వెళ్లెను. శబరమాయావులను రాక్షసులు సర్పాకారులై వచ్చి రామానుజులను మ్రింగిరి. విభీషణుని ద్వార ఈ విషయ మెరింగి వాతాత్మజుడా సర్పాలను నిలువున చీల్చి చంపి ఆ మాయాజాలము నుండి వారిని రక్షించెను. సహస్రకంఠుడు ఒక పర్వతాన్ని పెకలించి శ్రీరామునిపైకి విసరెను. హనుమంతుడు తన బాహువులను అమడ వరకు విస్తరించి చూచి దానిని పట్టుకొని రాక్షసుని రాజధానిపై వేసెను. రాము డెంత పోరినా సహస్రకంఠుడు కూలనందున హనుమంతుడు బ్రహ్మను ప్రార్థించి వాని జీవరహస్య మెరిగింపుమనెను. బ్రహ్మ అపుడా విషయమును తెలిపెను "ఈ ద్వీపానికి నూరుయోజనముల దూరమున క్రౌంచద్వీపమున భైరవపర్వత మున్నది. దానిలో ఒక గుహకలదు. దానికి సువర్చల అనే రాక్షసి కాపలా యుండును. దానిని జయించి ఆ కందరమునుండి వెళ్ళినచో పంచద్వారములు కలవు. వాటిని భీకర రాక్షసులు కాపలా కాయుచుందురు. వారిని చంపుట కష్టం. వారిలో ఒకరిని అశ్వరూపంతో, గండభేరుండ రూపముతో రెండవ వానిని, సింహ రూపంతో మూడవవానిని, సూకరరూపంతో నాల్గవవానిని, అయిదవవానిని ఈ అన్ని రూపములు కలిసిన రూపముతో పూని చంపవలసి యుండును. ఆ తర్వాత ఒక మాయాసౌధముండును. ఆ సౌధములో పంచదిశలందు పంచజ్యోతులుండును. వానిని ఒకేసమయములో ఆర్పివేసినచో సహస్రకంఠుడు మరణించును." ఈ వివరం వినిన వెంటనే ఆంజనేయుడు

గుహను చేరెను. సువర్చల అను రక్కసి అతనిని చూచి దిగ్భ్రమచెంది మూర్ఛితురాలాయెను. ఆమె కొంతసేపటికి స్పృహతెచ్చుకొని "ఓ వానరా కారా! నీవు ఎవరవు? అజరుద్రాదుల కభేద్యమైన ఈ పర్వతప్రాంతానికి నీ వెట్లు వచ్చితివి?" అని ప్రశ్నించెను. రామకార్యార్థమై తాను వచ్చిన వత్తాంతం ఆమెకు అంజనేయుడు తెలిపెను. అప్పుడామె 'ఓ మహాబలా! నీవు నా కోరికను తీర్చినచో నేను నీ కోరికను తీర్చగలను. ప్రపంచములో స్త్రీ రూపం ధరించిన ప్రతిస్త్రీ నీలాంటివానినే కల్యాణమొనర్చుకొని సుఖింపగోరును. కావున నీవు నన్ను నీ భార్యగా స్వీకరించి నాకు జీవితానందం కల్గించుము' అని కోరెను. హనుమంతుడదివిని 'లలనా నేను బ్రహ్మచారిని. పైగా స్ఖలితము లేనివాడను. మలమూత్రాదులే లేనివాడను. నేను ధరించిన ఈ ఘట్టి నా శరీరము వ్యాపించియున్నది. నన్ను భర్తగా స్వీకరించి నీవేమి సుఖపడెదవు. నీ కోరికను విరమించుకొనుము' అని చెప్పెను. సువర్చల వెంటనే "స్వామీ! నేను మీతో సుఖించకపోయినను నన్ను మీ భార్యగా స్వీకరింపుడు. ఏడు ఘడియలు (రెండుగంటల నలువది ఎనిమిది నిముష ములు) మీరు మీ వామభాగమున నన్ను అలంకరింపనీయుడు చాలును" అని కోరగా సామీరి శ్రీరాముని స్మరించి "స్వామీ! ఇదియేమి వైపరీత్యము. బ్రహ్మచారియగు నాకు భార్యయా? ఇది నా భక్తికి పరీక్షయా? లేక నాలో ఏదేని లోపమా? అంతా మీదే బాధ్యత" అని శ్రీరాముని ధ్యానించుచు 'సువర్చలా! నీవు నా వామభాగము నలంకరింపుము' అని తెలిపెను. ఆమె అట్లొనర్చగా ఆమెకు సూర్యునివలన వచ్చిన శాపము తొలగి దివ్యరూపము కలిగెను. పతివద్ద శలవుపొంది సువర్చల సూర్యలోకమునకేగగా, ఆంజనే యుడు అశ్వనీదేవతలను ఉపాసించి అశ్వరూపమున ఒక రాక్షసుని, నరసింహ స్వామిని ప్రార్థించి సింహరూపమున రెండవవానిని, గరుత్మంతు నుపాసించి గండభేరుండ రూపమున మూడవవానిని, శ్వేతవరాహస్వామి నర్చించి నాల్గవ వానిని, పంచరూపములొక్కటిగా ధరించి పంచముఖాంజనేయుడై పంచముని, పంచత్వమొందించి ఆ జ్యోతులనార్పి సహస్రకంఠుని అంతమొందించెను.

వీరమణి కథ : పవనాశ్వము దేవపుర ప్రాంతములో తిరుగుచుండగా ఆ నగరపాలకుడు వీరమణి దానిని బంధించెను. ఇతడు శివభక్తుడు; శివుడే ఇతనిని సదా కాపాడుచుండెను. భరతపుత్రుడు పుష్కలుడనువాడు వీరమణి

పుత్రుడగు రుక్మాంగదునితో పోరాటమారంభించెను. పుష్కరునిపైకి వీరమణి రాగా హనుమంతు డతని నడ్డగించెను. హనుమంతుని దెబ్బకు వాడు మూర్ఛ పోగా తన భక్తుని రక్షించుటకై శివుడు ప్రమదగణములతోవచ్చి నందిని హనుమంతుని మీదకు, తక్కినవారిని ఇతర సైనికులమీదకు పంపెను. వీరభద్రునిచేత పుష్కలుడు వధింపబడెను. శంకరుని చేతిలో శత్రుఘ్నుడు మూర్ఛపోయెను. అపుడాంజనేయుడు శంకరునిచూచి "రామానుజుని కొట్టుటకు రామభక్తులగు మీకు తగునా?" అని ప్రశ్నించెను. కాని శివుడు ముసలాయుధముతో హనుమను కొట్టగా, హనుమంతుడు దానిని విరిచివేసెను. అంత తన వాలముతో శంకరుని చుట్టి ఆంజనేయుడు బాధించగా, శంకరు డతనిని మెచ్చుకొని వరము నిచ్చెద ననెను. తాను ద్రోణాద్రికివెళ్ళి సంజీవనిని తెచ్చువరకు రామసంబంధి వీరులగు పుష్కల శత్రుఘ్నాది వీరుల కళేబరములను శివకింకరులగు భేతాళ పిశాచాదులు తినకుండా రక్షింపుమని వరము కోరగా శంకరుడంగీకరించెను. ద్రోణాద్రిని తెచ్చుటకై వాయుపుత్రుడు బయలుదేరివెళ్ళి అడ్డుపడిన దేవేంద్రాదుల నిర్జించి, బృహస్పతి మధ్యవర్తిగా రాజీ యేర్పరచి విశల్యకరణి, సంధానకరణి, సంజీవకరణి అను ఓషధులను ఇప్పించగా వానినితెచ్చి తనవారిని బ్రతికించెను. చివరకు రాముడే శంకరునితో తలపడవలసివచ్చెను. శ్రీరామ శంకరులు తమతమ భక్తులయెడ వాత్సల్యముతో యుద్ధము విరమించిరి. ఓషధుల ప్రభావముతో వీరమణి పరివారమున చనిపోయినవారిని బ్రతికించిరి. అంత వీరమణి అశ్వమును శ్రీరామునకప్పగించెను.[190]

సురథునితో పోరాటము: రామభక్తుడగు కుండలి పురాధీశుడు సురథుడు యాగాశ్వమును బంధించెను. వీనికి పదిమంది కొడుకులు. శత్రుఘ్నుడు వీని వద్దకు అంగదుని రాయబారిగా పంపెను. తానన్నీ తెలిసియే యాగాశ్వము బంధించితినని వాడు తెలిసి శ్రీరాముడే స్వయముగావచ్చి దర్శనమిచ్చినచో అశ్వమును వదలుదుననెను. కానీ యుద్ధమే జరిగెను. సురథపుత్రుడు చంపకుడు పుష్కలుడను భరతకుమారుని బంధించెను. వానిని విడిపింపుమని శత్రుఘ్నుడాంజనేయుని కోరెను. హనుమంతుడు చంపకునిపై ఒక బండను ఒకసారి. మరొకసారి మదగజము నొకసారి వేయగా వాడు వానిని నాశనము చేసెను. చంపకుని పాదములుపట్టి వానిని హనుమంతుడు గిరగిర త్రిప్పగా,

వాడాతని వాలమును పట్టుకొని వ్రేలాడెను. పిదపకు తన వాలము చేతనే వానిని బంధించి అంజనేయుడు పుష్కలుని విడిపించెను తర్వాత హనుమంతునికి సురథునికి పోరు జరిగెను. సురథుని రథమును హనుమ విరుగగొట్టెను. అట్లు నలువది తొమ్మిదిమారులు రథములు కోల్పోయి సురథుడు హనుమపై పాశుపతాస్త్రము వేయగా హనుమంతుడు క్షణకాలము బద్ధుడాయెను. మరల పోరాటమునకు రాగా బ్రహ్మాస్త్రమును సురథుడు వేయగా దానిని పావని భక్షించెను. సురథుడు శ్రీరాముని స్మరించి రామాస్త్రమును వేయగా హనుమంతుడు బద్ధుడైనందున సుగ్రీవుడు తలపడెను. అనిని కూడ సురథుడు బంధించి వారిని తన నగరమునకు చేర్చెను. హనుమంతుడంత రాముని స్మరించెను. అవసరమునకు రాముడేతెంచి సురథునికి దర్శనమిచ్చి అతనిని ఆదరించినందున అశ్వమును వాడు వదలుటేకాక బంధితులను గూడ విడిచి పెట్టెను.[191]

కుశలవులతోడి పోరాటము: ఈకథ వాల్మీకి రామాయణమునగానీ, పరాశర సంహితలోగాని, సమీరకుమార విజయమునగాని లేదు. శ్రీరామునిచే సీతాపరిత్యాగము, కుశలవ జననము, సీతాశపథము మొదలగు అంశములే ఉత్తర రామాయణమున ప్రధానమైనందున హనుమంతుని కథ అందులో గౌణమైనది. ఆశ్చర్యరామాయణమే ఈకథ విపులముగా పోషించి యున్నది. శ్రీరాముని యాగాశ్వమును లవుడు బంధించెను. భరతపుత్రుడు పుష్కలుడు, శత్రుఘ్నుడు, హనుమంతుడు సైన్యముతో వచ్చిరి. హనుమంతుడు బూరుగు బెట్టు నొకదానిని లవునిపై వేయగా దానిని లవుడు నాశనము చేసెను. తోకతో హనుమ లవుణ్ణి గిరగిర త్రిప్పగా, లవుడు తన తల్లియగు సీతను స్మరించుచు ఆంజనేయుని తోకను పొడిచెను. దానికి వ్యథచెంది హనుమ లవుని వదలి వేసెను. లవుని బాణాఘాతముతో హనుమ మూర్ఛపోయెను. శతృఘ్నుడువచ్చి లవునితో పోరాడి వానిని మూర్ఛితు చేసెను. కుశుడు గురుదైవములను పాసించి, తల్లి ఆశీర్వచనం పొంది వచ్చి వాయవ్యాస్త్రముతో శ్రీరాముని సైన్యాన్ని విసరికొట్టెను. దానితో శత్రుఘ్నుడు మూర్ఛనొందెను. హనుమ తేరుకొని కుశునిపై తరువర్షం, శిలావర్షం కురిపించెను. తేరుకొన్న లవుడు సుగ్రీవుని బంధించగా, కుశుడు హనుమను బంధించెను. ఈ యిరువురి తోకలను పట్టుకొని లాగుకొనివచ్చి లవకుశులు వారిని తమ తల్లివద్దకు చేర్చిరి. సీత వారిని ఆదరించెను. శ్రీరామలక్ష్మణులే యుద్ధమునకు వచ్చిన తర్వాత

వాల్మీకిమహర్షి కల్పించుకొని వారినందరినీ కలిపెను. ఈ కథలో హనుమంతు నితో లవకుశులు ఆడుకొనినట్లు, చెట్టుకు కట్టివేసినట్లు ఎన్నియో కథలు అధుని కులు కల్పించి యున్నారు.[192]

చక్రాంగనగరాధీశుడు సుబాహుడనువాడు అశ్వమునుపట్టి యుద్ధమునకు సిద్ధపడినట్లును హనుమంతుని పాదతాడనముతో మూర్ఛకల్గి అందు వానికి రామదర్శనమై, శ్రీరామాపచారదోష పరిహారమై అశ్వమునప్పగించిన కథ యున్నది. కాశీరాజగు యయాతి విశ్వామిత్రునికి అపచార పడినందున శ్రీరాముని శిక్షకు పాత్రుడుకాగా అంజనేయుడతనికభయమిచ్చినందున శ్రీరామాంజనేయ యుద్ధము జరిగిన కథ కలదు. ఇది చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి గయో పాఖ్యానమునకనుసరణముగా వెలసిన కథ. ఇట్లే యమాంజనేయయుద్ధము, కర్ణాంజనేయయుద్ధము, శనైశ్చరునితో వివాదము అంజనేయ సంబంధమగు కథలు కలవు. ఇవి అధునికములైనవగుటేకాక రామాయణమున లేనివగుట వలనను, వాని ప్రామాణికత్వము రూఢము కానందునను కేవలము పేర్కొని నానే కాని వానిని వివరింపబూనలేదు.[193]

కొందరు అధునికులు హనుమంతుని అమాయకత్వమును, వానర ప్రవృత్తిని చూపించుటకై లోకజ్ఞాన హీనునిగా, మూఢునిగా చిత్రించినట్లు కథలను కల్పించియున్నారు. వానికాధారమేగ్రంథమో వారు తెలుపనందున వాటి ప్రామాణికత్వము కూడ రూఢి కాలేదు. కావున వానిని కేవలము సూచించుటతో వదలుచున్నాను. శ్రీరాముడావులించినపుడు చిటికెలువేయు పనిని హనుమంతునికి కేటాయించగా దాని ద్వారా ఇతర భక్తులకునూ, శ్రీరామునకును అసౌకర్యము అంజనేయుడు కల్పించి తన నిత్య కైంకర్యము యథావిధిగా సాగునట్లు చేకొనిన కథ ఇందొకటి[194] (అ). అట్లే సీతారాముల ఏకాంతమునకు హనుమంతుడంగీకరింపక, దాంపత్యక్రీడను తుచ్ఛముగా పేర్కొని సీతాదేవికి గర్భోత్పత్తి అగుటకు శ్రీరాముని ధనువును మథించి ఆ గంధమునిప్పించిన కథ కలదు. ఇందు హనుమంతుడు స్త్రీ పురుషుల మిథునక్రీడనుగూర్చి ఏమియు తెలియనివానివలె చిత్రింపబడుటేగాక రామునికి సీతకును గల అద్వైతస్థితిని తెలియనివానివలె చిత్రింపడియున్నాడు.[194] (ఆ) ఈ కథలన్నింటి సారాంశమేమనగా హనుమంతుడు శ్రీరాముని సన్నిధివీడి క్షణమైనను ఉండలేకుండెనని తెలుపుటే.

అయోధ్యలో హనుమంతుని పరిచర్యలనుమెచ్చి రాముడు ఒకనాడు "నాయనా హనుమా! నీ భక్తికి, ప్రపత్తికి, త్రిశుద్ధికి నేను చొక్కినాను; అందుకే నేను నీకు దక్కినాను.—

ఒక గుణరీతినైన వినయోన్నతినైన విరక్తినైన శౌ
ర్య కలననైన నామదికి రాగమొనర్పగ నేర రన్యు లీ
వొకడనెకాదనేక గుణయోగ సమగ్రత మెచ్చజేసి నా
విక ముదమందినా డనన నేటికి నీమది నేనె యుండగన్.

— సూర్యచంద్రు లున్నంతకాలం, నా కీర్తి ఉన్నంతకాలం, చతుర్వేదా లున్నంతకాలం నీవు నీ స్వరూపం ద్వారా నా భక్తినీ, నా మంత్రాన్నీ లోక హితంకోసం ప్రవర్తింపజేయుటకై నీకు చిరాయువు కలుగునట్లు వరమిచ్చు చున్నాను. నీవు కింపురుష వర్షములో గంధమాదన పర్వతాగ్రమున కదళీ వనమందు విశాల ప్రదేశమున కల్పతరుమూలమున నివసించుచుండుము. కింపురుష వర్షవాసులకు నీ వధిపతివై సంపద్విజ్ఞానమోక్షసౌఖ్యార్థమై వా రొనర్చు పూజలందుకొంటూ ఉండుము. నీవునూ ప్రతిమారూపముపొంది మావలెనే పూజలుపొంది జనులకీప్సితదాయకుడవై వరలెదవుగాక" అని ఆశీర్వదించి హనుమంతుని కౌగిటిలో చేర్చెను. అంత హనుమ శ్రీరామునకు సాష్టాంగపడి 'స్వామీ! మీ పాదపద్మ దర్శనమును వీడి ఇంకొకచోట నే నుండజాలను. నా మనోదృష్టిలో మీరు వసించుచుండగా, నా ఆత్మ దృఢ మైన భక్తిని పొందుచుండగా మీ కథలు ఆలించుచు గడుపవలెననియే నా ఆశయము. మనసులో మిమ్మే తలుస్తూ, మీ దివ్యకథలే చెవులతో వింటూ తప్ప వూరక నేనుండలేను స్వామీ' అని మనవిచేయగనే రాముడు, "హనుమా! అవశ్యము నేను నీ మనసులో తోచుచుండెదను. నీ తలంపుగూడ నాలోనే యుండును. నారద తుంబురులు, విద్యాధర ముఖ్యులు, అప్సరసలు నీ చెంతనుండి అన్నివేళలలో నా కథలను నీకు వినిపించుచుందురు. నీవుండు కదళీవనము ఎన్నో జన్మలెత్తి పుణ్యచారులైన వారికే గోచరించునుకాని అన్యు లకు దర్శింప వీలుకాదు. కావున నీవు ఎవరికినీ కనపడకుండా ఉండగలవు. నీకు సాటి ఎవరునూ లేరు. నీవు కపిరూపమొందిన త్రినేత్రుడవే. నీవు నన్నేరీతిగా నుతింతువో నేనారీతిగానే నీలో వసించుచుందును" అని సమాధాన పరచి తన వైఢూర్యోజ్జ్వలహారం ఇచ్చి వీడ్కొలుపగా హనుమంతుడంగీకరించి

గంధమాదనశైల శిఖరముచేరి తనస్వామి పలుకులకు తగినట్లే వినీతివివేకాతి గుప్తనియమైకగతితో కాలము గడుపుచుండెను. ఆ కింపురుష వర్షజనులతి భక్తితో అతనినే దైవముగా తలంచి పూజించుచుండుటవలన వారికి దీర్ఘ ఆయురారోగ్య కళత్ర పుత్రాది సిరులతో తులతూగుచుండిరి. ఆ కింపురుష భోగభూమిలో సువర్ణ కదళికారామమునందు కల్పద్రుమ ఛాయలో బంగారు ఆసనముపై ఆంజనేయుడు నివసించుచుండగా గంధర్వులు, మునులు, అచ్చరలు, చారణులు, యక్ష కిన్నెర సిద్ధవిద్యాధరాహిగరుడాది గణములతని రామకథాగీతములతో కొలుచుచుండెడివారు. అష్టదిక్పాలురూ, ఇంద్రాదులతని పూజించుచుచో భావిబ్రహ్మలీల ఆనాడే కల్పించినట్లుండెను. తమ వీణావాదనములతో నారద తుంబురులతని నలరించెడివారు. రంభ, హేమ, తార, మంజుఘోష మొదలుగాగల అచ్చరలు అంజనేయుడు సకలకళల నెఱజాణ యని తెలిసి ఇంద్రుని కొలువులోవలె కాక భక్తిశ్రద్ధలతోచేరి నాట్యము చేసెడివారు. వారి కీర్తనలలో రఘుశేఖరుని వర్ణనలేయుండి ఆంజనేయున కానందం కల్గించెడివి. దివ్యులూ, గంధర్వులూ, దివౌకసశ్రేష్ఠులు అతనిని కొలిచెడివారు.[195]

ఆంజనేయుడు నివసించు స్థానము పది అని కొందరు, పదునొకండని మరికొందరు భావించుచున్నారు. 1 శ్రీభద్రము, 2 కుశతర్పణము, 3 కుండిన నగరము, 4 పంపాసరోవర తీరము, 5 చంద్రకోణము, 6 మలయపర్వతము, 7 కాంభోజము, 8 నైమిశారణ్యము, 9 బ్రహ్మావర్తపురము, 10 సుందర నగరము – దీనికి హనుమత్పురము చేర్చి పదునొకండుగా కొందరి భావన. ఇవి తన్మంత్రాధిష్ఠాన దేవతయొక్క స్వయంవ్యక్త స్థలములుగా తంత్రములందు చెప్పబడినవి.[196]

సకుంభ నికుంభుల కథ : రామరావణ యుద్ధమున హనుమచేతిలో నికుంభుడు వధింపబడినట్లు కలదు. కాని వీరిని పట్టాభిషేక అనంతరము తుదముట్టించినట్లు సమీరకుమారవిజయములో ప్రత్యేకముగా పేర్కొనబడినది. గంధమాదనమున రామధ్యాన తత్పరుడై యున్న హనుమంతునివద్దకు విభీషణుడు వచ్చి తన దాయాదులగు సకుంభ నికుంభులు తనపై దండెత్తివచ్చిరని తెలిపి వారిని రూపుమాపవలసినదిగా హనుమంతుని కోరెను. వీరు కుంభకర్ణుని పుత్రులు. దేవయాన శాపమువలన గజరూపమున నుండిరి. రావణ

కుంభకర్ణ వధానంతరము వీరికి శాపవిముక్తి కలిగి నారద ప్రోత్సాహముతో విభీషణునిపై దండెత్తిరి. అంత ఆంజనేయుడీపనికి స్వయంగా పూనుకొనక విభీషణుని తనతో వెంటబెట్టుకొని రాముని ఆశ్రయించెను. సకుంభ నికుంభుల కథ వాయునందనుడే చెప్పగా వినిన రాముడు 'ఈ వాయుకుమారుని శక్తి వలన శతకంఠాదులే కూలిరి. వీరినోర్చుటెంతపని' అని పలికి మరురోజు సైన్యసమేతుడై ఆంజనేయునితో కలిసి లంకకు చేరెను. రామునితో భరత శత్రుఘ్నులు వచ్చిరి. రాక్షసుల యమదండపు దెబ్బకు వారు మూర్ఛపోయిరి. మరల హనుమంతుడు ద్రోణాద్రినితెచ్చి యిదివరలో లక్ష్మణుని బ్రతికించినట్లే చేయవలెనని వానరులభిప్రాయపడగా శ్రీరాముని అనతిపై వాయుజుడు ఇంద్రుని చేరి సుధాకలశము తెచ్చి రామానుజులను చైతన్యవంతుల చేసెను. ఆంజనేయుని శ్రీరాముడు పొగడగా "మీ ప్రతాప ప్రభావములే కదా యివి. అయినా, మీరు మీ బంటును పొగడవచ్చునా!" అని వినయోక్తులాడెను. ఆ రాక్షసులు తృణసంజాతులచే చావగలవారని కుశడను కపిశేఖరునిచే వారిని చంపించి విభీషణునికి శత్రుశేషము లేకుండా హనుమ తోడ్పడెను.[197]

అయోధ్యలో శ్రీరామ నిర్యాణ సన్నివేశమునకు ఆంజనేయుడు ప్రేక్షకుడుగా నుండెను. మహాప్రస్థానోన్ముఖుడైన రాముడు అయోధ్యాపురవాసులందరిని అతనితో వచ్చునట్లు అనుగ్రహించెను. అందరకును వీడ్కోలుచెప్పి అవతారపరిసమాప్తి సందర్భమున రాముడు అంజనేయునిచూచి—

జీవితమందు నాశ యెడసేయకు మానకుమా ప్రతిజ్ఞ యీ
భూవలయమునందు గపిపుంగవ మత్కథ ఎంతదాక బెం
పై విలసిల్లు నందనుక హాయి రమింపుము మద్వచస్థితిన్.

—అని కోరెను. రాముడు సానుజుడై వైష్ణవతేజమున లయమొందుట బ్రహ్మాదులేతెంచి అతని నుతించుట హనుమదర్శించి ధన్యుడయ్యెను. వానరములే యే దేవతాంశమున జన్మించిరో ఆ యా దేవతలలో ప్రవేశింపుమని బ్రహ్మ తెలుపగా, సుగ్రీవుడు సూర్యబింబమున చేరగా తక్కిన వానరులు తమ పితృ అంశలలో చేరిరి. వీరందరు సుగతుల పొందగా హనుమంతుడు రామానుగ్రహమున 'మనం బింకెందునున్ జనకయయుండ యీ లోకమున చిరంజీవిగా నిల్చిపోయెను.'[198]

——

అధ్యాయము—8

# ద్వాపరయుగమున హనుమంతుని వృత్తాంతము

రామావతార సమాప్తితో రామునికథ ముగిసెను. కాని శ్రీరామానుగ్రహములన, సీతామాత వరమువలన హనుమంతుడు చిరంజీవియై యున్నందున ఇతని కథ తర్వాత యుగములో కూడ వ్యాపించెను. మహాభారతము, భాగవతము, పురాణములు పరాశరసంహిత, సమీరకుమారవిజయములలో హనుమంతుని ద్వాపరయుగ వృత్తాంతము కొంత తెలియుచున్నది.

వజ్రాయుధ ప్రహారము వలన తనలో రోమమొక్కటి మాత్రం రాలినదనియును, తాను నాగులకుశత్రువై, విష్ణువాహనమై విశ్వంభరునిమోయుచున్నానని తన జవసత్తముల గూర్చి గరుక్మంతుడు గర్వించినట్లు శ్రీకృష్ణుడు గ్రహించెను. కృష్ణునికి కూరిమి ఇల్లాలును తానేనని భావించి అన్యకాంతలను సరకు చేయక సత్యభామ యుండెను. నారద తుంబురులు గానములో తమలో ఎవరు గొప్పవారో తెలుపుమని శ్రీకృష్ణుని ఆశ్రయించిరి. అపుడు కృష్ణుడు శౌర్యజవంలో పక్షిరాజు గర్వాన్నీ, భక్తి పటిమలో సత్యభామ గర్వాన్నీ, గానలీలలో నారద తుంబురుల గర్వాన్ని అణచుటకు హనుమయే తగినవాడని భావించి, నారద తుంబురుల చూచి మీ సంగీత కళావిలాసములో మేలెంచుటకు గానాది నానాసారస్య రహస్యవేదియు, సకలామ్నాయాంతవిద్యాభామా సర్వంకష శేముషీనిధియు, సర్వజ్ఞుడును అగు హనుమద్బ్రహ్మను పిలిపింతునని తెలిపి అతనిని పిల్చుకొని వచ్చుటకై గరుత్మంతుని తలచెను. అతడు వెంటనే వచ్చి కార్య మడుగగా కృష్ణుడాతనికి నారద తుంబురులజూపి వారి గానకళా ప్రావీణ్య పరీక్షకై నిర్ణయాధికారిగా సామీరిని గంధమాదన పర్వతమునుండి రప్పించవలసి యున్నదని తెలిపి 'నీ ఘనతేజోబలయుక్తితో ఉద్యద్వేగివై వెళ్ళి హనుమంతుని తీసికొనిరమ్ము' అని ఆదేశించెను. గర్వమెక్కియున్న గరుక్మంతుడా పలుకుల సరకుసేయక "ప్రభూ! నా బలమూ, జవమూ, భక్తీ గాసి చెందంగజేసి క్రోతిఁ బిల వేగంబేగుమన్బాస నాయాసంబేల ఘటించితిరి. ఈ పని నాకర్హమైనదా? నాకు బాగా సన్మానంచేస్తున్నారే! హీనాధిక్యము లెంచకుండా ఒక్క కపిమాత్రుని పిలుమటకు నన్ను పొమ్మంటారే? అతడు నాకు

సాటి రాగలడా! నాతో ఒక్కదానిలోనూ సమానుడు కాడే. కానీ మీ ఆజ్ఞ నెలా కాదనగలను" అని ఎలుకమాలి పలికిన గరుడిని చూచి కృష్ణుడతని నాలింగనమొనర్చి "పక్షిశ్రేష్ఠా విచారింపకుము. నీవు మా భక్తుడివికదా! అంజనేయుడు సాక్షాత్తు శివుడే; వైష్ణవాగ్రణియే; భవిష్యద్బ్రహ్మయే. అత డున్న కదళికోద్యానవనము దుర్లక్ష్యమైనది. ఆ త్రినేత్ర బ్రహ్మాదులకంటే నీవు ఉన్నతుడవని తలంచి నిన్నే పంపుచున్నాను సుమీ. నీవు లావరివి. బలరయములతో పొగలాడివి. నా వచనము నీవు మీరజాలవు కదా!" అని పలుకగా, గరుక్మంతుడు 'తారతమ్యమెరగి దాసునేలని రేనికిలేని హాని నాకేల యుండును' అని తూష్ణీంభావముతో పలికి "నేను గంధమాదనమునకు వెళ్లి ఆ కోతిని రమ్మని పిలిచెదను. వస్తే మంచిదే. రానిచో నా బలమెంతో తెలుసుకుంటాడులెండి" అని పలికి కృష్ణునికి నమస్కరించి వెళ్లెను.

గంధమాదనమున గరుడుడెంత వెతకినా ఆ హనుమంతుడు కనపడ లేదు. తన వాలాన్ని సాలము పోలిక చుట్టును చుట్టుకొని హనుమంతు డుండెను. కొద్ది సమయమునకు గరుడుడది గమనించి 'తుది మొదలు లేకుండా తన తుచ్ఛపు పుచ్ఛపుగోడ కట్టుకొని అందులో రాజసవృత్తిలోనున్న ఈయనకు ఎదుటివారి ఘనత తెలియదు. అతనిని గూర్చి స్వామి అంత గొప్పగా చెప్పినాడే కానీ. జాతికి తగిన బుద్ధి వుంటుందే కానీ గొప్పతన మెక్కడినుండి వచ్చును. ఒక బ్రహ్మవారినే శతమర్కటుడంటారు. అందులో బ్రహ్మవారియై కోతియై యున్నచో ఇంక ఆ చేష్టలు వేరే చెప్పాలా? నా రెక్కల తాకిడికి తోడు నిల్వగలడా' అని తనలో తలంచి గరుక్మంతుడు హుంకరించి వాయుకుమారుని వాల వలయాన్ని 'రెక్కలతో గడలు కొలిపె'. ముక్కుతో పొడిచి నఖాంకురములతో తాడించి, చుట్టుచుట్టూ తిరిగెను. అనిలసుతుని కదిలించలేకపోయెను. ఇంద్రుని వజ్రాయుధముకానీ, ఆదిశేషుడుకానీ, ఆది కూర్మనాథుడుకానీ తన బలమునకు ఆగజాలరని అనుకొనుచు తన దెబ్బలకు హనుమంతుని తోక తెగకుండా, పగులకుండా, నొగులకుండా, బలుపు చెడ కుండా ఉండుటను చూచికూడ అతని మహిమను గుర్తించలేక ఈర్ష్యచూని తోకకు ఎగబ్రాకి దుముకదలచెను. సూర్యునిముందు ఖద్యోతములాగా, ఏనుగుముందు దోమలాగా, నిండు చంద్రునిముందు చుక్కలాగా ఆ కపీంద్రుని వాలలతికాప్రాకారంలో అణుమాత్రమై పక్షీంద్రుడు కనిపించగా సురల

కాశ్చర్యమాయెను. గరుడిని అంగమంతా చెమర్చి, వడివేడి, గుండె తల్లడిల్లి, వక్త్రము వెల్వెలపోయి, పాదాలు తడబడి, ఈకలకు జడిమ హెచ్చెను. మారుతి వాలము కడగానకున్నా గర్వం మాత్రం తగ్గని గరుక్మంతుడు ఇంకా తన పట్టు దలను పెంచుకొని "ఇతడు కోతి. నాలాంటి మహామహుడు తోకమీద ప్రాకినా ఊరుకొన్నాడేకాని ఉచితజ్ఞత చూపడయ్యె. ఇతనిని ప్రియోక్తులతో పిలిచి చూస్తాను. పలుకనిచో బంటుతనాన్ని అపుడే ప్రయోగించెదగాక" అని భావించి 'ఓ కపీంద్రా! శౌరి నిన్ను పిలుచుకొని రమ్మనెను' అని బిగ్గరగా గొంతెత్తి అంజనేయుని పిలిచెను. పావని ఆ పలుకుల నాలించనందున గరుడుడీమారు "బ్రహ్మాదుల శాసింపగల కృష్ణుడు నిన్ను రమ్మని పిలిచెను" అని అరచెను రామధ్యాన తత్పరుడైన హనుమంతుడు పలుకనందున గరుక్మంతుడు 'ఇతడు పలుకడు; రాడు; ఒకవేళ చెవుడేమో! లేక వివేక హీనతయో?' అని తలంచి ఆంజనేయుని దండోపాయమున సాధింప నెంచెను. అపుడాపక్షి —

"పదనఖరాజిఁ బైనదిమి పట్టి శతారము మీరు ముక్కునం
బొదివి కపీంద్రు వాలలత బోరన వెన్కకు బెల్లగిల్లి నీ
డ్చెదనని కంట నిప్పుకలు చిప్పిల నిట్టట్టు చుటును"....

—ఊగసాగెను. ఇది గమనించి ఆంజనేయుడలవోకగా తన వాలాన్ని ఒక్క సారి అదల్చెను.

వాతజుని వాలవాయువును సైరింపజాలక గరుడుడు చక్రంలాగా గిరిగిరా తిరుగుచు, భ్రాంతుడై చెమటలు కాలువలై పారుచుండగా ద్వారకా నగరంలో కృష్ణుని కొలువుకూటములో వచ్చి పడెను. మేరుపర్వతమే పగిలి అక్కడవచ్చి పడెనా అనునట్లున్న అతనిని చూచి శ్రీకృష్ణుడు అతని అవస్థను గమనించికూడ ఏమీ యెరుగనివానివలె అదరిపడుతూ, పీఠముదిగి 'ఎన్నడూ పన్నగవైరి విన్నదన మొందగ లేదే, ఇపుడేమి వచ్చెనోకదా' అని చేరి వాని శరీరమునుండి కారే రక్తాన్ని గడిగించి, వానిని ఎత్తి తన తొడలపై పెట్టుకొని తేరుకొనేవరకు అనేకోపచారములు చేసి తన కటాక్షామృతం వలన పక్షీంద్రు నికి చైతన్యం కలిగి కండ్లు తెరువగా శ్రీకృష్ణుడు "నీవు హనుమంతుని వన చరుడని దుర్బుద్ధితో ఎదిరించావా! రామధ్యానములో ఉండి నీతో పలుకలేదని దౌర్జన్యమేమైనా చేసితివా! అక్కడ నిన్ను బాధింపగలవారెవరు లేరుగదా!

రామకింకరుడు కోపించినచో సహింపగల్గుదురా! అని హనుమన్మహిమ నుగ్గడించుచు పలుకు కృష్ణుని చూచి గరుడుడు కనుల నీరు నిండగా, కృష్ణునికి ప్రణామముచేసి గద్గదస్వరముతో 'మీ మాటల నిర్లక్ష్యపరచినందుకు ఆ సంజీవదేవు వాలలతచే నా శౌర్యం భంగపడినది స్వామీ' అని బదులిచ్చెను. అంత కృష్ణుడు 'ఎట్టివానికైనా ఒక్కొక్కసారి బుద్ధి దూరమవుతూ ఉంటుంది. దానికి పరితాపమొందరాదు. ఇపుడు నీవు మరల వెళ్లి జానకియు, రాముడును నిన్ను రమ్మనుచున్నారని పిల్చి రమ్ము' అని గరుత్మంతుని శౌరి ఆదేశించగా, వైనతేయుడు భయపడుచు 'ఒకసారి పోతేనే తోకతో విదిలించినాడే ఇంక రెండోసారి పోతే తోకతోచుట్టి కొట్టునేమో స్వామి. అపుడాతికమక నేనోర్చు కొనలేను స్వామి. ఆంజనేయుని చేరడానికే నాకు భీతిగా ఉన్నది. కావున నేను పోజాలను' అని పలుకగా, శ్రీకృష్ణుడతనిని బుజ్జగించి ధైర్యవచనాల తెల్పి మరల ఒప్పించి పంపెను.

చెప్పినట్లే గరుక్మంతుడు వెళ్లి వానరచక్రవర్తి వాలము కడనిల్చి "ఓ బ్రహ్మరుద్రాదిదేవతా వినుతా, సద్గుణరత్నమా అంజనేయా, నిన్ను ద్వారకా వాసులై సీతాదేవియు శ్రీరాముడును రమ్మనుచున్నారు" అని పలుకగానే హనుమంతుడాతని చూచి, లేచి, ఆనందాశ్రువులు కలుగుచుండగా పక్షీంద్రునికి నతుడై నమస్కరించి, రూపమున కొంచెమై అతనితో "మహాత్మా, భక్తజనుల చింతాఘముల దొలగించు సీతారామనామార్థములను నేడు నీద్వారా ఆలించు చున్నాను. నా ప్రభువు నన్ను రమ్మని పిలచెనంటివి కాన నా జపము ధన్య మైనది. రమ్మని పిలువవచ్చిన నీకు అపరాధ మొనర్చితిని. అజ్ఞానినైన నన్ను మన్నించుము"అని పలుకగా గరుక్మంతుడు "అయ్యా, తమరు త్రిజగత్సేవ్యులు; అప్రతర్క్యమహిమోద్దీపులు; అశ్రాంతరామధ్యానతత్పరులు, దాసుడనైన నన్ను అట్లు పలుకజనదు" అని బదులాడగానే హనుమ అతనిని కౌగిలించి అతనిని అనుసరించి ద్వారకకు బయలుదేరెను.

ద్వారక చేరగానే గరుక్మంతుడు హనుమంతుని కృష్ణ మందిరమున ఉచితాసీనునిగాచేసి ఆవార్త తెలుపుటకై తన స్వామివద్దకు వెళ్ళెను. అంత కృష్ణుడు సత్యభామను చూచి "సీతారాములు రమ్మని పిలిచినారనినందున సామీరి వచ్చి యున్నాడు. కావున మనము ఇపుడు సీతారాముల రూపముల ధరించాలి. నేను రామునిగా నీవు సీతగా రూపొందాలి అని కోరెను. సత్యభామ

ఎంత ప్రయత్నించినను సీతారూపము పొందలేక రూపభాగ్య జనితాహంకారము తొలగిపోగా గోడమీది చిత్రమువలె నుండెను. అపుడు కృష్ణుడు రుక్మిణిని సీతారూపము పొందుమని కోరెను. ఆమె తక్షణమే తద్దేవిరూపము నొందగా రామునిగా తానుమారి శ్రీకృష్ణుడు సీతాసహిత శ్రీరామ దర్శనమును అంజ యునకనుగ్రహించెను. వారిని చూచినంతనే హనుమంతుడు లేచి వారికి ప్రణా మము లాచరించి, 'రగడ' ఛందస్సులో ఒకపాదములో సీతను, రెండవపాద ములో రామునిస్తుతించుచు శ్రీ సీతారాముల అద్వైత స్వరూపాన్ని సేవించగా, రాముడతనిని కౌగిలించి కరుణాలోకనములతో చూచి "మము నుల్లములోపల నెల్లవేళల బాయక చింతన సేయుచు దపంబున నెపంబుననున్న నిన్ను నేడు నారదతుంబురుల గాన కళా ప్రావీణ్యసంబంధ వివాదమును పరిష్కరించు పెద్దగా నిన్ను పిలిపించితిని. వారి వివాదమును తీర్పుము" అని ప్రభువు కోరగానే పావని తన స్వామికి నమస్కరించి 'అయ్యా, తమరు సర్వేశ్వరులు తమకు తెలియనిదుండునా? కాని మీ అజ్ఞాబద్ధుడను కావున మీ కృపతో వీరి వాదమును పరిష్కరించు ప్రయత్నము చేసెదను' అని చెప్పి, నారదతుంబురుల దగ్గరకు చేరెను.

వారినిచేరి వారితో వాయుపుత్రుడు 'ఠాయిగ ఒక్క రాగమనుడా' అని కోరెను. వారు తమ వీణెలుపూని తంత్రుల దీటించి తెనెలొలుక పలికించగా హనుమ విని 'గానము బాగున్నది' అని వారిని మెచ్చెను. 'శ్రీ రఘునేతకు నేను నేర్చిన కొన్ని గీతముల వినిపింతును. మీరుకూడ వినుడు. అని వారికి తెలుపగా వారు 'తమ పాటముందర ఇతరులపాట కందళమొందునా' అని లోన తలంచి, 'మంచిదే యిందర రక్తి(గుల్కు)డని' వీణల నివ్వరాగా వారి అతిప్రియోక్తి వినయోన్నతిలో ధూర్తతను హనుమంతుడు గమనించి నార దుని వీణను గ్రహించి తంత్రులు మొరయించి మంద్రమధ్యకుతార స్థాయులు మెరయునట్లుగా ఇంపు సరళియు మునుకొన కొన్ని గీతముల పలికెను. ఆ గానంతో హనుమంతుడు—

పరఢవించె మోటులఁ బల్లవములు
నిగిడించె నెలరాల నిర్ఝరములు
మొనయించె సకల మోహన నిరూఢి
అలరించె జనహృదయాంబుజములు.

—అతని అనవద్యవల్లకీవాద్యమహిమ నివాసబర్హులకు జీమూతయుత భద్ర రావ ప్రమోదాన్ని కల్గించెను. అలంకారపర్యాప్తితో వారకాంతను, ఆలాప సంబంధవైఖరిలో కవి వాణిని, రాగసంపదాస్ఫూర్తిలో నృపుని, తారకాంతర స్ఫురిత నాదప్రౌఢిలో యోగిని హనుమంతుని సంగీతము భుజంగమోహనో ద్వేలమై, పారవశ్యహేతువై, మాధుర్యముతో మించగా ఆ సభలో పారవశ్య మొందనివారు లేరు. ఆకాశగంగా విహారులగు అమరజనము కూడ పరవ శించెను. ఆంజనేయుడాలపించిన మేఘరంజని రాగానికి ఆకాశం మేఘావృతము కాసాగెను. కొద్దిగా వాన కురిసెను. నెమళ్లు నర్తించెను. పాతాళలోక లోకమందలి ఫణులు పడగలెత్తెను. కొలువునందలివారి ఆభరణములు కరగి పోసాగెను; శశిమణిస్తంభాలార్ద్రీభూతములాయెను. ఆకాశ సంచారులకు పారవశ్యము హెచ్చెను; కైలాసనాథుడగు హరుని కానందమాయెను. విను చున్న కృష్ణుడు అతని గానాన్నీ, దాని శ్రుతినీ, కంపితమును, మూర్ఛనను పలువురు వినునట్లుగా మెచ్చుకొని అభినుతించెను. అంత హనుమంతుడక్కడి పెద్ద శిలనొకదానిని చేతబట్టి నారద తుంబురుల తాళములనడిగి వాటిని చేత పట్టుకొని తన గానమునకు కరిగిపోవుచున్న ఆ శిలలో తాళములనుపెట్టి గాన ప్రౌఢితో మరల ఆ శిలను 'గుండు'గా చేసి వీణను నారదునకందించుచు 'ఈ గుండును కరగిపోవునట్లుగా రాగము ఆలపించి తాళముల తీసుకొనువారే గాన విద్యలో అధికులు. కావున మీరు ఆ విధముగా చేయవలసినది' అని వారికి తెలిపెను. నారదుడు తన చాతుర్యముచూప ప్రయత్నింపగా ఆ రాయి ఇంకా గట్టిగా ఘనీభవింపసాగెను. తుంబురుడును ప్రయత్నించి చూచెను. అతడు విఫలుడై వీణను నేలపైపెట్టి తల వంచుకొని సిగ్గుతో ఉల్లము తల్లడిలు చుండగా చేష్టలుదక్కియుండెను. ఆంజనేయుడపుడు—

"గానవిద్యలఁ బ్రసిద్ధులు రా గరగింపలేక పోఁ జెల్లునె?
యిట్టులైన నికఁ జెప్పెడి దేగతి తారతమ్యముల్"

—'గాయక పంతముతో మీరు మీ తాళముల దిగవిడివిపోవుటుచితమా?' అని పలుకగా గర్వభంగమై వారిరువురూ వాయునందనునకు నమస్కరించి 'తమ మదోద్వృత్తిని యెంచినచో నగుబాటగునని పలికి క్షమింపవేడి తమతమ తాళముల నిప్పింప'మని కోరిరి. వారు—

ఎంతటి వారము మే మీ
వెంతను గానంబు సేయ శ్రీరామ మహా

హంత వహించిన దుర్మతు
లింతేనియు నెదురుఁ దమ్ము నెఱుగంగలరే.

గ్రావంబున్ గరిగింపనోపిన భవత్కల్యాణ సంగీత వి
ద్యా విస్ఫూర్తికి దీటుగా దెలియలేక జ్ఞస్థితిన్ గ్రమ్మఱన్
మా వీణల్ మొరయింప బోయితి మహో మా చెయ్దముల్ మాకు మా
కే విభ్రాంతి ఘటించెఁ బ్రోవగదవె హీనాత్ములన్ మమ్ములన్.

—అని బహుభంగుల నుతింపగా హనుమంతుడు మరల మేఘరంజి పలికించి ఆ శిలను కరగించి వారి తాళాలను తీసియిచ్చి "మీరిద్దరూ గానప్రౌఢిలో సమానులై కూడ హీనాధిక్యములెంచి వచ్చినందున శ్రీరామ ప్రభువు మీ కీవిధంగా గర్వభంగమొనర్చెను. ఇంకెన్నడును వివాదమొందుకుడు" అని బోధించగా వారు హనుమంతుని, దేవదేవుని నుతించుచు వెళ్లిపోయిరి. సత్య కును, గరుడునకును, నారదతుంబురులకును గర్వభంగమొనరింపజేసిన ఆంజనేయుని కృష్ణుడు కొనియాడి అనుమతించగా మరల హనుమంతుడు గంధమాదనాద్రికి వచ్చెను.[199]

పరాశరసంహితలో ఇదేకథ స్వల్పభేదములతో కలదు. త్రిశూల రోముడను రాక్షసుడు హనుమంతునితో పోరుచు పారిపోయి ఒక శిలలో దాగుకొనగా హనుమంతుడు వానిని వెన్నంటివెళ్లి వాడు కనరానందున వాడు శిలలో దాక్కొని యున్నాడని తలంచి గుండ క్రియాగానముతో శిలను కరగించి వానిని బయటకు లాగి వధించెను. అపుడు మైత్రేయుడు పరాశరుని ఆ గుండ క్రియాగానముతో ఇంకెవరైనా ఈ విధముగా శిలలను కరగించిరా అని ప్రశ్నించగా, పరాశరుడపుడు నారదతుంబురులు వివాదపడిన కథను తెలిపెను. ఇందులో శ్రీకృష్ణుని వద్దకు కాక వారు సరాసరి హనుమంతుని వద్దకే వచ్చి నట్లునూ, అతడు గుండ క్రియాగానముతో శిలను కరగించి వారి వీణలను శిలలలో ఇమిడ్చి గానమాపెననియు తర్వాత వాటిని గానశక్తితో వారిని తీసునొనమని కోరగా వారు అశక్తులై ప్రార్థించగా, మరల మారుతి తన గుండ క్రియాగానముతో శిలను కరగించి వారి వీణలు వారికిచ్చి గానములో వారిరువురూ సమానులేనని చెప్పి పంపెను.[200]

హనుమాన్ లీలాతరంగిణిలో కూడ ఈ కథలున్నవి. శ్రీరాముని కొఱకై హనుమ ద్వారకలో ప్రవేశింపబోవుచో సుదర్శనచక్రమతనిని నిరోధించగా

హనుమంతుడు దానిని నోటకరచుకొని ప్రవేశించెనని రచయిత పేర్కొని యున్నాడు.[201]

## 2 ఆంజనేయుడు అర్జునకపిధ్వజమగుట

ద్వాపరయుగమునందాంజనేయుడు పాండవులకు తోడ్పడిన సన్నివేశములు పురాణములలోను, పరాశరసంహితలోను, భారత భాగవతములలోను సమీరకుమారవిజయమునను కలవు. వానిలో స్వల్పభేదములు కనిపించినను మూలకథాంశములొకేతీరున సంగ్రహముగా నున్నవి.

పరాశరసంహితోక్త కథ : జగద్విజయసాధనాదీక్షతో బయలుదేరి అర్జునుడు వచ్చి దక్షిణ సాగరసమీపమందలి సేతువును చూచి దానిని గురించి తెలుపుమని సూతునడిగెను. అది శ్రీరాముడు లంకను చేరుటకై నిర్మించెనని సూతుడు తెలుపగా, అర్జునుడది విని కోదండపాణియై కూడ రాముడు తన బాణములతో వంతెన నిర్మింపజాలక కోతుల సహాయముతో శిలలతో సేతువు కట్టినాడని హేళనగా పలుకుచుండగా అతని దుర్వినీతవచనముల వారింప హనుమంతుడే స్వయముగా అచటికి వచ్చెను. అర్జునుడు ఆంజనేయుని మాటలు వినక అతనితో వివాదము పెంచుకొనెను. తాను తన బాణములతో సేతువు నిర్మించి ఆంజనేయుని దానిని త్రొక్కి విరుగకొట్టుమని పందెం వేసెను. హనుమంతుడా సేతువు నవలీలగా విరుగదన్నగా అర్జునుడు ప్రాయోపవేశము చేయబోగా, కృష్ణుడచటికి వచ్చి మధ్యవర్తిలేని పందెం పనికిరాదని రెండవపర్యాయము అర్జునునిచే బాణసేతువు నిర్మింపజేసి పందెము జరిపించి విజయము అర్జునునకు కలుగునట్లు చేసెను. ఆంజనేయుడు కృష్ణుని సాహాయ్యమును గౌరవించి అర్జునుడు తొలిజన్మమున తన భక్తునిగా నెఱింగి 'నేనోడితిని' అని పల్కి అర్జునునికి ధ్వజలాంఛనమయ్యెను.[202]

శివపురాణోక్త కథ : రుక్మిణీదేవికొకరోజున సౌగంధిక పుష్పములపై ముచ్చట కలిగెను. ఇది విని కృష్ణుడు అర్జునుని పిలిపించి "అర్జునా కదళీవనమున వానరులు కాపుండుచోట సౌగంధిక పుష్పములుండును. వానిని రుక్మిణి కొరకు తీసికొనిరమ్ము" అని ఆదేశించెను. కృష్ణునివద్ద తత్ప్రదేశ వివరముల నడిగి తెలుసుకొని కిరీటి కిరాతవేషంలో బయలుదేరెను. ఆ వనమున ప్రవేశించి పూలను కోయుచుండగా కాపుండిన కపులతనిని బెదరించగా అర్జునుడు వారిపై

బాణవర్షం కురిపించెను. వారు పారిపోయి తమ యేలిక అగు అంజనేయునకు తెలుపగా హనుమంతుడు వెంటనే అక్కడకు వచ్చి అర్జునుని చూచి "ఓ ఖిల్లో త్తమా, నీవు నిర్భయుడవై నా పాలనలోనున్న ఈ వనమున ప్రవేశించి యీ సరోవర పుష్పాలను కోయుచున్నావు. ఇవి శ్రీరామచంద్రుని పూజకై నేను పెంచుకొనునట్టివి. నీవు విష్ణ్వపరాధం చేసినావు. ఇది నీకు తగదు సుమా" అని చెప్పగా నరుడు 'వానరులు మృగసంతతివారుకదా! వారికినీ పూజలుండునా? అంతేకాక వనధ్వంసకులగు మీకు పూజలేల?' అని ప్రశ్నించెను. హనుమంతుడు ఆ మాటలువిని కోపించి 'ఓరీ! నీవు అఖిలాండకోటి నాయకుడగు శ్రీరాముని కార్యముల చక్కదిద్దజాలిన వానరులను గేలి చేయుచున్నావు. జాగ్రత్త' అని హెచ్చరించెను. అర్జునుడపహసించి 'ఓ వానరశ్రేష్ఠా! నీ కోతి చేష్టలకు, ఆ రాముని కార్యాలకు సరిపోయింది. వనచరుడవగు నీకు వనవాసయోగ్యుడగు రాముడు గురువగుటలో ఆశ్చర్యములేదు. నీ భృత్యత్వ మాయనకే సరిపోయినది. ఆయనకేమి మహిమ కలదు. సాగరానికి వంతెన కట్టుటకు కోతులతో రాళ్లు తెప్పించవలెనా! బాణములతో వంతెన కట్టలేని అతని ధనుష్పాండిత్య మేమి పాండిత్యము?' అని పలుకగా ఆంజనేయుడు 'ఓయీ! అట్టి వంతెన రాముడు కట్టియుండినచో నావంటివాడు నడచి వెళ్లినచో అది కూలిపోకుండునా?' అని బదులు ప్రశ్నించెను. అపుడర్జునుడు 'ఇదిగో నేను ఇపుడు నా బాణములతో వంతెన కట్టెదను. నీవు కాదుగదా నీ తల దన్నినవాడు నడచినా అది చెక్కుచెదరదు. కట్టమందువా?' అని అనగానే హనుమ అంగీకరించి అతనిని సముద్రతీరానికి తీసికొని వచ్చెను. అంజనేయుడు చూచుచుండగా అర్జునుడు తన బాణములతో వారధి కట్టెను. దానిని చూచి 'వీడు అసాధ్యుడే' అని హనుమ తనలోనే అనుకొని యీతనితో ఈ కలహము అనవసరమేమోనని భావించుచుండెను. పని పూర్తిచేసి అర్జునుడు ఆంజనేయునివైపు చూడగానే హనుమంతుడు పశ్చిమాభిముఖుడై వెళ్ళి ఒక మహీధరము చాటున త్రికరణశుద్ధిగా శ్రీరాముని ధ్యానించి, ఒడలుజళిపించి విశ్వరూపుడై భూమ్యాకాశాలునిండి పెద్దపెద్ద అంగలువైచుచు వచ్చెను. అది చూచి అర్జునుడు తనకు పరాభవము తప్పదని మనసులోనే గుర్తించి కృష్ణుని ధ్యానించి శరణువేడెను. అతని ప్రార్థన విని కృష్ణుడచటకుచేరి కూర్మరూపముతో ఆ వారధిక్రింద నుండెను. ఆంజనేయుడు ఆ వంతెనమీద ఎన్ని గంతులు వేసినా అది కూలిపోక కేవలము జవజవలాడెను. కొంతసేపటికి

సాగరజలములు రక్తమయముకాగా హనుమంతుడదిచూచి 'ఇదియేమి' అని కిరాతుని ప్రశ్నింపగా అర్జునుడు నవ్వి 'అయ్యా! నా బాణాలు పనిలేక త్రుప్పు పట్టినవి. నీ దేహభారంతో అవి రాపిడి జలములకలిసి రక్తవర్ణమైనవి' అని చెప్పెను. హనుమంతుడామాటలను విశ్వసింపక తన దివ్యదృష్టితో చూడగా, కూర్మరూపుడై విష్ణువు వంతెనను మోయుచుండుట చూచి తాను భగవదపచారము చేసినట్లు తలంచి దానికి శిక్షగా తానే సముద్రమునపడి మరణింప దలంచుచుండగా కృష్ణుడు విష్ణురూపుడై అచట వెలసి ఆంజనేయు నెంత నివారించినను అతను పంతమును వీడనందున కోదండపాణియైన శ్రీరామునిగా సాక్షాత్కరించి ఆతనిని బుజ్జగించి "హనుమా! నేటినుండి పాండవులు నీకు సోదరులు. వీరిని నీవు సమయములో కాపాడుచుండుము" అని చెప్పి అంతర్ధానమొందెను. అంత అర్జునుడు ఆంజనేయునకు తా నొనర్చిన అపరాధమును క్షమింపుమని ప్రార్థించి అతని కృపకు పాత్రుడై సౌగంధిక పుష్పములను తీసికొని వెళ్లెను.[2 3] ఈ కథలో అర్జునుని ధ్వజమగుటకు ఆంజనేయుడు పందెము కాసినట్లు మాత్రము లేదు.

సమీరకుమారవిజయము ప్రకారం : ఈ కథ పుష్పగిరి తిమ్మన విస్తరించి వ్రాసియున్నాడు. ఒకనాడు క్షారపయోరాశి వద్దకు కృష్ణార్జునులు చేరియుండ, కృష్ణుడు ఆ సముద్ర వైభవమును కిరీటికి వర్ణించి చెప్పసాగెను. 'ఈ సాగరాన్ని ఒక వానరం దాటింది. ఒక చక్రవర్తి దీనిపై ఉగ్రాస్త్రముల ప్రయోగింప బూనెను. దీనినే ఒక ముని త్రాగెను. అందువల్ల నా దుస్తరత్వ, దుశ్శకత్వ, దురాపహకత్వ గుణములు పొల్లుపోయినవి' అని కృష్ణుడు తెలుపగా, అర్జునుడు ఆశ్చర్యపడి దాశరథికి కోదండవిద్యాపాండిత్యం ఉండి కూడా అక్షయబాణములుపయోగింపక సాగరమునకు సేతువే ఏలకట్టెనో తెలుపుమని కోరుచు "రామునకు ధీసంపద కరువైనదా? లేక ధనుర్విద్యాపాండిత్యము లేదా?" అని అడిగెను. అర్జునుడూహించిన కారణములను త్రోసిపుచ్చుచు కృష్ణుడు 'అర్జునా! ధీరులు, వీరాధివీరులు రాముని సైన్యములో ఎందరో కలరు. బాణములతో బాట నిర్మించి యుండినచో వారి పాదముల ఘట్టనకది పటాపంచలై పోవుననియే రాముడు సేతువును నిర్మించెను. అంతే కాక వాయుసూనుడగు హనుమంతుని వేగానికది తాళజాలదు. అతడు మహా బలవంతుడు. కావుననే శతముఖుడను రాక్షసుని చంపు సందర్భములో 'నందర మైనిడుకొని, చతురబ్ధుల కవలగాదె క్షణమున చేర్చెన్'అని తెలిపెను.

ఈ కథ వినిన విజయుడు వాయుపుత్రుడంతటి బలశాలియైనచో నేను కట్టే సేతువును పదప్రహతులతో కూల్చగలడా? అని ప్రశ్నించెను. అంత కృష్ణుడాక్షణముననే హనుమను స్మరించి అతనిని వెంటనే అక్కడికి రప్పించి గౌరవించి 'కపివరా! నరుడు శరాశితో సేతువు కట్టినచో అది నీ పాదహతులకు నిల్చునో నిలువదోనన్న సంశయము కల్గియున్నాడు. తన్నివృత్తికై నిన్ను పిలిపించితిని' అని తెల్పెను. కృష్ణానుమతితో అర్జునుడు అంపకట్టలతో సేతువును కట్టగానే దానిని త్రొక్కుమని కృష్ణుడాంజనేయునాదేశించగనే హనుమ—

"గుప్పునం దుమికి నంతనె దారునవిచ్చి నుగ్గులై
గప్పె శర ప్రకాండ శతఖండము లంబుధి నెల్ల ఫేనముల్
జొప్పదెఁ గట్టకట్టు నరుజూచి పయోధి హసించెనో యనన్."

—నరుని బాణములు వానరుని పాదహతి కోర్వక గుభగుభ స్వానములతో శిథిలముకాగా క్షోభించిన సముద్రజలాలు ఆకాశానికెగిరెను. అన్యసముద్రములలో క్షోభ యేర్పడెను. నానావిధ జంతు సంతానములు ప్రాణములపై ఆశలు వీడెను. శరసేతువట్లు గ్రుంగిపోగా, ఈర్ష్యారోషాదులనొంది అర్జునుడు ఆంజనేయుని చూచి యింకొకమారు 'ఘటించెద నిల్వదేని గాండీవముతో శిఖింబడుదు నిక్కమని' అనగా అతని పందెము నంగీకరించి వాయుసూనుడు నా దెబ్బలకది నిల్చినచో నీ చెలినై, నీ రథకేతనమై యుండెదనని మారు పందెమును పలికెను. ఇది గమనించిన కృష్ణుడు అర్జున రక్షాదీక్షలో కూర్మరూపము ధరించి శరసేతువుక్రింద చేరెను. ఆంజనేయుడు ఎన్నివిధాల దుమికినా, త్రొక్కినా అది కూలిపోకుండుటను గమనించి, యీర్ష్యారహితుడై అది కృష్ణుని మహత్తుగా గుర్తించి అర్జుననికి ఓడినట్లు అంగీకరించి అతనిని కౌగలించి 'సఖివృత్తి వహించితిఁ డెక్కెమెక్కెదన్' అని పలికి శౌరికి నమస్కరించి వెళ్ళిపోయెను. అతడటుపోగానే కృష్ణుడు బొడబొడమని నెత్తురు కక్కసాగగా నివ్వెఱపడి చూచె నరునకు నారాయణుడు—

పరమ పావనుండు పవమాన తనయుండు
దుముక నీ శరాళి దునిసెనేని
దప్పుఁ గార్యమనుచుఁ దామేటి బలెక్రింద
నుండినాడ నగుట గుండె పగిలె.

—అని రొప్పుతూ కృష్ణుడు పలికెను. మహావేగమూ, బలమూ కలిగిన హనుమంతుని బరువునకు తన వీపు బ్రద్దలైందనీ, తన యేపు తీరిందనీ, తన చూపు బెడగారిందనీ, తన గుండె చెదరిందనీ, తనకు మూర్ఛవచ్చిందనీ, ఎలాగో ఓర్చుకొనగా కొంత తడవునకు సేద తీరందనీ 'నీతోడి కూర్మికి నిటువలె నైతి'నని తెలుపగా, సవ్యసాచి ఆశ్చర్యమొంది, హనుమంతుని మహిమ నంగీకరించి తన ధ్వజమందున్న సామీరిని గౌరవించెను. భారత యుద్ధములో గాండీవి టెక్కెముమీద నున్న పావని కౌరవ సైనికులకు మిరుమిట్లు గొల్పుచుండుటేకాక ప్రత్యర్థి నేత్రముల కొక్కొక్కమాటు బృహద్రూపంతోనూ, ఒక్కొక్కమాటు గుండెలదరించు హుంకారముతోనూ తోచెడివాడు. దిక్కులదరునట్లు అర్చుచు, సూర్యరశ్మిని కవ్వించు కాంతితో తేజరిల్లుచు శత్రుసైనికులను తాను సగము చంపగా అర్జునునకు శేషకార్యము సులభమగు నట్లుండెను. ఆంజనేయునిపేరు స్మరించగనే నిర్జరరిపు సంగ్రామవిజయము కల్గుననగా, ఇంక ఆంజనేయుడే తోడైయుండగా జయమరుదగునా అని ద్వాపరయుగ ప్రజ భావించుచుండెడిది.[204]

## 3 హనుమంతుడు భీమసేనునకు తోడ్పడుట

భారతమున అరణ్యపర్వమున భీముడు ద్రౌపది కొఱకై సౌగంధిక పుష్పములను తెచ్చు సందర్భమున భీమునకు హనుమంతుడు తోడ్పడినట్లు సంగ్రహముగా కథ కలదు. భీమునకు తన విశ్వరూపము చూపి యుగధర్మములను హనుమంతుడు విశదపరచినట్లున్న ఈ కథను గ్రహించియే సమీర కుమార విజయకర్త విపులీకరించి యున్నాడు. శివపురాణమున కూడ ఈ కథ కలదు.

శివపురాణోక్త కథ: నల్లని కమలములతో శివుని పూజించినచో శత్రు వినాశకరమగు వరముల నాతడియ్యగలడని ద్రౌపది భావించి అట్టి పూవులను వేయింటిని తన పూజకొఱకై తెప్పింపుమని ధర్మజుని కోరెను. తత్సేకరణకై ధర్మజుడు భీముని నియోగించి పంపెను. ఆ పుష్పముల కొఱకై అనిలసుతుడు ఆంజనేయుడున్న గిరిగహ్వర ప్రాంతమునకు భూమి దద్దరిల్లునట్లుగా నడచి వచ్చుచుండగా ఆ పాదధ్వని ఆంజనేయుని తారకరామనామ జపభంగకారణము కాగా హనుమంతుడు గిరిగహ్వరములో నుండి యీవలకు వచ్చి ఆ వచ్చువాడు

తన సోదరుడగు భీముడని తెలిసికొని, అతని ప్రయత్నమును గుర్తించి కుంతీ సుతుని బలపరాక్రమాదుల పరిక్షింపనెంచి దారి కడ్డముగా తన తోక నుంచి పండుకొనెను. భీముడతని నొక ముసలికోతిగా భావించి గర్వముతో "ఓ మర్కటమా, నీ వాలము దారికి అడ్డముగా నున్నది దానిని తొలగింపుము" అని కోరెను. అంత ఆంజనేయుడు 'అయ్యా, నేను వృద్ధుడను మార్గమును ప్రక్కకు తప్పించుకొని వెళ్లుము' అని వినయముగా చెప్పెను. అహంకారియగు భీముడు 'ఒక క్షత్రియవీరుడు కోతికిలొంగి మార్గము తప్పి చనునా' అని ప్రశ్నించెను. హనుమంతుడింకనూ వినయమభినయించి 'అయ్యా, అట్లయినచో నీ దారికి అడ్డముగా నున్నది నా వాలమేకదా! దయయుంచి దానినొక ప్రక్కకు గెంటివేసి మార్గము చేసికొనిపొమ్ము' అని అనెను. భీముడా పలుకుల విశ్వసించి, తన కాలిచే వాలము నొక ప్రక్కకు గెంటబోయెను. అంతమాత్రానికే అది కదల నందున ఎడమచేతితో ఎత్తి ఆవలకు పారవేయబోయెను. అదికూడ సాధ్యపడ నందున రెండుచేతులతో ఎత్తి ప్రక్కకు తప్పింప చూచెను. అదియు విఫలము కాగా, మోకరించి 'హుం' అని వూపిరి బిగబట్టి రెండుచేతులతోపట్టి ఎత్తబోయి ఒడలంతా చెమటపట్టి నీరైనా ఆ తోకను కాస్తకూడ కదిలించలేక అహంభావ మంతరించగా, అతడెవడో మహానుభావుడై యుండునని తలంచి, ఎదుటకు వచ్చి నమస్కరించి 'అయ్యా, తమరెవరో మహాత్ములవలె నున్నారు. శివకేశవు లలో నొకడివో! నాతప్పు మన్నించి మీ వృత్తాంతం నాకుతెల్పి నన్ను ఆశీర్వదించండి.' అని ప్రార్థించెను. వానిపై కనికరము వహించి హనుమంతుడు దిగ్గునలేచి 'తమ్ముడా,' అని భీముని కౌగిలించి తన వృత్తాంతము తెలిపి 'విజయోస్త'ని భీమునాశీర్వదించెను. అంత భీముడతనికి ప్రదక్షిణ నమస్కారముచేసి, అంజలించి తన అపరాధము మన్నింప ప్రార్థించెను. 'అన్నా, రుద్రావతారా, మహాబలా, నాకొక సంశయమున్నది. నివారింప వేడుచున్నాను. దుర్జయులగు రాక్షసులను ఈ నీ అల్పాకారముతో ఎట్లు నిర్జించితివోనని నాకు ఆశ్చర్యమగుచున్నది. శ్రీరామునకు నీవుచేసిన సహాయమపారము నీ వలననే ఆ దంపతులు కలసికొనిరి. నిన్ను స్మరించు భక్తులకు శత్రువుల బాధలేగాక, భూతప్రేత పిశాచాదుల బాధలుకూడ నశించును. నీవు మా పాండవుల కొఱకై నాకొక వరము ననుగ్రహింప కోరుచున్నాను. కౌరవులు మా సోదరులనడవుల పాలు గావించిరి. మా రాజ్యమపహరించిరి. వారికిని మాకును పోరు తప్పక జరుగును. అందులో నీవు మాకు సర్వవిధాలా తోడ్పడి మాకు విజయము

చేకూర్చ కోరుచున్నాను" అని వినయముగా పలికిన భీముని మాటలకానందించి హనుమంతుడు "తమ్ముడా, నీవు కోరినదొక పెద్ద కోరికయేకాదు; దుర్ఘట కార్యమునుకాదు కాని, నేను త్రేతాయుగపువాడను ఇది ద్వాపరయుగము. మీకును, నాకును సుమారు రెండు యుగముల వ్యత్యాసమున్నది. యుగభేద మును బట్టి మీకునూ, నాకునూ అత్యంత పరిమాణ భేదమున్నది. నాటి నా స్వరూపమును ఇప్పటి మీరు చూడనైన చూడజాలరు. నేను మీ మానవులలో వీరవిహారమెట్లొనర్తును? అది అసంభవము. కృతయుగమున నరవానర ప్రమా ణము ఇరువదియెనిమిది మూరలు. త్రేతాయుగమున పదునాలుగు మూరలు. ద్వాపరమున ఏడుమూరలు. కలియుగమున మూడున్నర మూరలు మాత్రమే యుండును. ఈ మూరల ప్రమాణము ఎవరిమూర వారికే వర్తించును. కావున ఇపుడు నేను మీతో కలిసి యుద్ధము చేయుట అనగా మేకలతో ఆబోతు తలపడినట్లగును. కావున అది పొసగదు. నేను నా యథారూపముతో యుద్ధము చేసితినేని ఆ కదనరంగమంతయు పాతాళమునకు క్రుంగిపోవును" అని తెలిపెను. భీముడు మరల "సోదరా, భీష్మద్రోణకృపాదులు పరశురాముని కన్నా బలవంతులు. వారితో పోరుట నీకు సరిపడునుగదా!" అని అనగానే, అంజనేయుడు "ఓయీ అమాయకుడా, నావంటి వానికి మీ భీష్మద్రోణాదులొక లెక్కా? నిజంగా వారు నా రూపం చూడగనే మూర్ఛిల్లి పడిపోవుదురు. తనకంటే అల్పులతో పోరుట వీరలక్షణం కాదు. కావున నీవు కోరినట్లు చేయుటకు వీలుకాదు" అని జవాబిచ్చెను. భీముడు సంతసించి వాయుసుతుని బృహద్రూపం చూపుమని ప్రార్థించెను. తృటిలో ఆంజనేయుడా బ్రహ్మాండ పర్యంత రూపము దాల్చెను. అపుడతని శిరస్సున శ్రీరాముడు, దక్షిణ భుజమున సౌమిత్రి, వామభుజమున సీతాదేవి శ్రీరాముని చరణసన్నిధిని విభీష ణుడును చూపట్టగా భయవిహ్వలుడై భీముడు మూర్ఛపోయెను. అంత హను మంతుడు తన విశ్వరూపము నుపసంహరించి భీముని మూర్ఛనుండి తేర్చి లేవనెత్తి, బుజ్జగించి, భయంబుడిపి, ధైర్యముచెప్పి తన దేహమునుండి ఒక రోమము నూడదీసి భీముని చేతికిచ్చి "దీనిని భద్రముగా కొనిపోయి అర్జునుని కిచ్చి అతని రథమునకు కట్టుకొనుమని చెప్పుము. అంతటినుండి నేను ఫల్గును నకు విజయము సేకూర్తును. ఆ రథమును గాంచినంతనే శత్రువులు భయకంపి తులై వెఱచి పాఱుదురు. అంతటి నుండి పార్థుడు కపికేతనుడను సార్థక నామము కలిగి జగద్విఖ్యాతమగును. నీకును సర్వదా జయసిద్ధికై నేను నీ

గదాదండమున నివసించుచుందును." భీముడతనికి వినమ్రుడు కాగా, అంజనేయుడతనికి గంధర్వోద్యానమునకు దారిని తెలిపి అచట దేవగంధర్వ గురుజనులయెడ ఎట్లు వినయవిధేయతలు చూపవలెనో తెలిపి దీవించి పంపెను.[205]

సమీరకుమారవిజయములోని కథ ప్రకారం: పాండవులు అరణ్యవాసమొనర్చు సమయములో గంధమాదన పర్వత ప్రాంతములో భీముడు పాంచాలితో స్వేచ్ఛగా సంచరించుచుండెను. వాయుదేవుడు తన పుత్రుని సంప్రీతికై 'కాంచన సౌగంధిక పుష్పము వేయగా దానిని చూచి ద్రౌపది అలాంటి పుష్పాలను తెచ్చి యివ్వమని భీముని కోరెను. దానిని తెచ్చుటకై భీముడు శర, శరాసన గదాబంధురపాణియై బయలుదేరెను. అతనికి కనకపుటనటి తోట కనిపించగా దానినిచూచుచు దిక్కులదరునట్లుగా శంఖకలిత నినదమొనర్చెను. అచట యోగముననున్న అంజనేయునకాధ్వని వినపడెను. వచ్చినవానిని భీమునిగా గుర్తించి అతని బలాన్ని పరీక్షింపనెంచి దారికడ్డంగా వుండునట్లు తన తోకతో కొన్ని చెట్లను చప్పుడు కలుగునట్లుగా లాగి పడవేసెను. అంజనేయుని లాంగూలస్ఫాలనము భీమునికి మేఘగర్జనవలె వినబడెను. ఆ శబ్దాన్ని అనుసరించి వచ్చిన కౌంతేయునకు కదళీషండ మధ్యభాగంలో చంద్రకాంత శిలపై శయనించినవాడూ, గొప్ప వక్షఃస్థలముతోనూ, కొంచెం వంగిన హనువుతోనూ, ఎఱ్ఱని పెదవితోనూ, అజానుబాహువులతోనూ, పిశంగ నేత్రముతోనూ యోగనిద్రారతుడైన ఒక వ్యక్తిగా అంజనేయుడగుపించెను. అతని యోగసమాధికి భంగము కలుగునట్లు భీముడు గొప్ప 'రవళి' చేయగా, హనునుంతుడు విని—

జరా రోగ తప్తాంగు సంప్రాప్త నిద్రా
భరా కుంచితా పాంగు భ్రాతృత్వ నిత్యా
దర స్ఫూర్తి పోనాడి ధర్మంబో శ్రాంతి
స్ఫురచ్చిత్తు నన్నిట్లు బోధింప నీకున్.

—అని అనాదరముగా పలికెను. 'అయ్యా! తిర్యగ్జాతులకు ధర్మములు తెలియవు. కాని నీవంటి సత్కార్యాకార్య వివేకవంతులిట్లా చేస్తారా? నీకు భూతదయ లేదా? ఇట్టి దుశ్చర్యలవల్ల మావంటి వృద్ధజంతువుల మనస్సు క్షోభించదా? ఇది నరుల కగోచరమైన వనముకదా! ఇక్కడికి ఎవరూ చేరలేరు. నీవు ఎవడవు? ఎవరి తనయుడవు? ఇక్కడికెందుకొచ్చితివి? ఇంకపై వెళ్లుటకు

ఖేచరత్వమున్నవారికే అది సాధ్యము. అమృతోపమానములైన ఫలము లిందున్నవి. వానిని నీవు భుజింపుము' అని అనెను. భీముడు పాండురాజ క్షేత్రమున వాయువరమున జన్మించినవాడనని తన ప్రవర చెప్పి తానొక ప్రయోజనమును గూర్చి యేగుచుంటినని తెలిపి—

"..... .... తెరువిమ్ము నీ వీనినాడు నాడు
కడలి లంఘించు హనుమకైవడిని వడిని
బొసగ గిరితోడ నిను దాటిపోదు...."

—నని బెదిరించెను. అదివిని ఆంజనేయుడు 'అయ్యా! హనుమంతుడు సముద్రాన్ని ఎందుకు లంఘించెనో తెలుపుము' అని కోరగా, భీముడు శ్రీరాముని కథను తెల్పి, హనుమంతుడు సీతాన్వేషణ తత్పరుడై సముద్రమును దాటిన మహాజవసత్త్వుడని తెలిపి—

నే హనుమంతుని యంతటి
బాహుబలాటోప సత్ప్రభావాఢ్యుడ నా
సాహసము సూచెదే యన
నా హనుమ నిగూఢ మందహాసాననుడై.

అన్నా, నే ముదివాడ లేవ వడి లేదెందెందో నీ వేగగా
సన్నాహంబున వచ్చినాడవుగదా జాగేల నీకేల నీ
సన్నంబైన మదీయ పుచ్ఛమొక పార్శ్వంబందుఁ బొందించి

—పొమ్మని కోరెను. ఆంజనేయుని మహిమ తెలియని భీముడు అహంకార పంకాత్ముడై అతనిని సామాన్యునిగా భావించి, పొగరుగలవాడై ఎడమచేతితో ఆ వాలమును కదల్చుటకై పూనెను. అది కదలనందున తన శరశరాసనాదుల ప్రక్కనబెట్టి వస్త్రాదులను గట్టిగా బిగించుకొని తోకను రెండుచేతులతో ఎత్తుటకై ప్రయత్నించెను. బలమంతయు కూడదీసుకొని పల్మారు వూగివూగి కదిలించి, నిస్సత్త్వుడై మోకరిల్లి పడి మొగము వెలవెలపోగా తలవంచుకొని దిగులు చెందుతూ, తడబడుతూ, ఒళ్ళంతా చమటపట్టినందున కొంత విశ్రమించగనే అతనికి కనువిప్పుకలిగి ఆంజనేయుని పాదాలపై వ్రాలి భక్తి వినయాదుల చూపుచూ 'స్వామీ! మీ మహిమ తెలియక వెట్టివెట్టి మాటల నంటిని. నేను గుణహీనుడను. నన్ను కనికరించండి. మీరు వానరాకార

ములో నున్న లోకనాథులో? ఇంద్రులో? శివుడో? విష్ణువో తెలుపండి' అని శరణువేడెను.

అంత హనుమంతుడు చిరునవ్వుతో 'అన్నా! నేనే వాయుపుత్రుడనగు ఆంజనేయుడను. ఈ లోకమున రామకథా సుధాంబుధి ఎన్నాళ్ళుండునో అన్నాళ్ళు నా తనువుండునట్లుగా సీతారాములు నాకు వరమునిచ్చియున్నారు. కావున నేను ఈ కదళీవనమున నివసిస్తూ ఉన్నాను' అని పావని చెప్పగానే భీముడు భయభక్తులింపార ప్రణామమొనర్చి యిన్నాళ్ళకు ఆంజనేయుని తాను చూడగల్గు సుకృతమునకు ఆనందించి, ఆంజనేయుని స్తుతించి తనజన్మ ధన్యత గాంచెనని పలికి వినయముతో అతనినిచేరి సాగరలంఘనమునాటి అతని రూపమును చూపునట్లుగా ప్రార్థించెను. అపుడు మారుతి 'కాలస్వభావమును' గూర్చి తెలిపి, 'మునుపటి రూపము చూపగా గూడునే' అని తెలిపెను. 'యుగ ధర్మములనుబట్టి ఒక యుగములోని రూపమునకు మరియొక యుగములోని రూపమునకు వ్యత్యాసములుండుననియు, కాలము నతిక్రమింప త్రిమూర్తులకు కూడ దుశ్శకమ'ని బోధించెను. భీముడంత 'నాకు చతుర్యుగ ధర్మములనైనా తెలుపు'డని కోరెను.

హనుమంతుడు కౌంతేయునియెడ ప్రసన్నుడై 'కృతయుగమున ధర్మ దేవతా రూపమగు వెలిగిత్త నాలుగు పాదములతో నడచును. విష్ణువు తెల్లనివాడై యుండును. జనులు సత్క్రియాశీలురై క్షేమమొందుదురు. మదగర్వ ఈర్ష్యామాత్సర్యాదులు లేక కీడుపొందకుండా జనులు వర్తింతురు. త్రేతాయుగమునందు గోవు మూడు పాదములపై నడచును. హరి రక్త వర్ణుడై యుండును. జనులు సత్యవ్రతాఢ్యులై యజ్ఞతపోదాన రూపమగు కార్యములొనర్చి తత్ఫలమగు సుగతులనొందుదురు. ద్వాపరయుగమున ధర్మవృషభము ద్విపాదములతో చరించును. హరి నల్లనిరూపములో నుండును. ప్రజలు సత్యశమదమములు కలిగికూడ కామార్థములకు ప్రాముఖ్య మిత్తురు. కలియుగమున ధర్మవృషభము ఏకపాదమున చరించును. హరి పీతవర్ణుడై యుండును. కలిలో ప్రజలు అనృతమూ, హింస, కాపట్యము, నాస్తికతాది దోషభూయిష్ఠులై యుందురు. సర్వేశ్వరుడే ఈ నాలుగు యుగము లలో నాలుగు రీతులలో వెలయుచుండగా కాలాతీతునిగా నుండుట నా తరమా సోదరా' అని ఆంజనేయుడు తెలుపగా విని కుంతీసుతుడు 'మహాత్మా! కాలము

నీకు అడ్డుగానుండునా? నీకును షడ్వికారములున్నవా? నీకు వృద్ధత్వమున్నదా! నీవు సాక్షాదీశ్వరుడవే కానీ వనచరుడవా? నీచేత కానిదేమున్నది. నన్ను మాయపుచ్చక నీరూపం ఎటులైనా చూపుము' అని పరిపరివిధాల ప్రార్థించగా అంజనేయుడంగీకరించి తన నిజరూపము చూపింతునని కొంచెము సేపటిలో విశ్వరూపము చూపగా భీముడు కన్నులురెండునూ మూసి శిరోదిక్కలిత ప్రాంజలియై 'రగడ'లో అతనిని నుతించుచు—

మొలపూసలో పాదముల గజ్జెలో చుక్క
    లెటిగింపు నీకు లోకేశ వినుత
విరిబంతులో సన్నవిడిరాలో నీ కిలా
    ధరములు వివరింపు పరమ ధైర్య
పల్వలోపమమో గోష్పదమో తెల్పు సము
    ద్రము నీకు గారుణ్య సముద్ర
మక్షికలో లేక మశకంబులో నీకు
    దనుజులు వచియింపు దైత్య హరణ
యౌర నీయంతవాడు తోడయి నడవగ
రావణు జయించుటే దొడ్డు రాఘవునకు.

—అని వినుతించి మరల పూర్వ రూపమునే ధరింపుమని కోరెను. అంత హనుమంతుడు తన తొంటి రూపమున భీమునకు ప్రసన్నుడై 'భీమా! శత్రువులు చూచునపుడు నేనింకను ఏడురెట్లు ఘనతరముగా నుండెదను. నీవు నాకు తమ్మునివి కావున నన్ను నీవు యింతగా పొగడవలసిన పనిలేదు. నీవు వెళ్ళుచున్న పనిని నా భావమున నేను గుర్తించినాను. దైవతములమీద సాహసము పనికిరాదు. దేవతలు ధ్యాన, దాన, యజ్ఞ తపో తృణాదులకు సాధ్యులగుదురేకానీ వారిపై కోపించి సాధించుట కష్టము. నీకు ఆపద కలుగకుండా నీవు తలంచిన కార్యము నెరవేరగలదు. అంతేకాదు, ధార్తరాష్ట్రుల నందరిని నేను నాభుజబల స్ఫూర్తితో గెలువగలను' అని ఆంజనేయుడు తెలుపగా, భీముడు 'మీ కరుణా కటాక్షమున్నచో శత్రువులుడిగినట్లే కదా! మేము సాధింపవలసిన శత్రునిర్మూలనమనే కించిన్మాత్ర కార్యమునకు స్వయముగా మీరు ప్రయత్నింపవలసినపని మీకిచ్చుట మాకు భావ్యముకాదు. మీ శుభాశీస్సులున్న చాలు'నని పలుకగా హరీశుడు 'మీకు శ్రీకృష్ణుడు తోడు

న్నాడు. కావున ఇతరులతో మీకు పనిలేదు. అయినా, నరుని కేతనములో నుండు నన్ను నీవు స్మరింపుము. భారతయుద్ధములో నీ 'బలోద్ధతి చూతు' నని చెప్పి కార్యసిద్ధి కలుగునట్లు ఆలింగన పూర్వకముగా ఆశీర్వదించి, అనుమతించి అంజనేయు డంతర్ధానముకాగా 'హనుమంతుని పరిరంభణమున మహిత బల శ్రీమంతుడై యక్ష రాక్షస సంతానము గెల్చి సౌగంధిక ప్రసూనముల దెచ్చి ద్రౌపదికిచ్చెను.[206]

## 4 పురుషామృగమును తెచ్చుటలో భీమునకు హనుమంతుడు తోడ్పడుట.

ఈ వృత్తాంతము పరాశరసంహితలోను, సమీరకుమారవిజయములోను మాత్రమే కలదు. ధర్మరాజు అఘనిష్కృతికై చేసిన అశ్వమేధయాగములో బహుద్విజ భోజనాదులవలన ఉచ్ఛిష్ట సమిష్టిచే యాగశాల శుద్ధిని కోల్పోకుండా నిత్య సంశుద్ధికై ఏమి చేయవలయునో తెలుపుమని ధర్మజుడు కృష్ణుని ప్రార్థించగా పురుషామృగమును రప్పించినచో అది యున్నచోట ఎంత అంటు అయినా పరమ పవిత్రమై పరిఢవిల్లునని కృష్ణుడు తెలిపెను. పరాశరసంహితలో ఈ కథలో కూడ భీముడురాగా హనుమంతుడతనిని పరీక్షించుట, యుగధర్మములు తెలుపుట, హనుమద్విరాట రూప సందర్శనములున్నవి. హనుమంతుడు పురుషామృగ తత్వము తెలిపి అది పురుషుల భక్షించు అతి క్రూరమైనదని తెల్పి దానికి చిక్కకుండా పరిగెత్తినచో ప్రమాదము తప్పించుకొనవచ్చునని తెలిపి తన వాలమందలి రోమముల మాహాత్మ్యము తెలిపి కొన్ని రోమములనిచ్చి పంపెను. భీముడు పురుషామృగమునుచేరి ధర్మజుని యాగ వృత్తాంతముతెల్పి హస్తినాపురమునకు రమ్మని కోరెను. ఆ మృగముకూడ తనకుచిక్కకుండా పరిగెత్తినచో తానెట్టి హానిచేయననియు, చిక్కినచో భక్షింతుననియు చెప్పి బయలుదేరెను. రుద్రకుమారుని రోమ ప్రభావమువలన భీముడా మృగమునకు చిక్కకుండా పరిగెత్తి ఆఖరురోమము ముగియుసరిగి నగర ద్వారమున ఒక కాలు ఉంచిన తర్వాత మృగమున కతడు చిక్కెను. అతనిని తినుటయా, మానుటయా అని విచికిత్సలోనుండగా ధర్మరాజువచ్చి ధర్మసూక్ష్మము తెలిపి నగరద్వారానికి వెలుపలగల భీముని దేహము తినవచ్చునని చెప్పగా అతని నిష్పక్షపాత న్యాయనిర్ణయమునకు ఆ మృగము హర్షించి భీముని చంపకుండా వదలి యాగశాలకు చేరెను.[207]

సమీరకుమారవిజయమందలి కథ : ధర్మజుని యాగశాలలో పురుషామృగము సంచరించినచో అచట నిత్యసంశుద్ధియగునని కృష్ణుడు తెలిపి "పురుష భావము మృగస్ఫురణతోనుండి నిష్పురుషగ్రావ విపినసీమలో పురుషామృగ ముండుననియు, అది యున్నచో నెంత యంటైనా పరమ పవిత్రమై పరిఢవిల్లు ననియు" తెలిపెను. ఆ మృగమును స్మరించి త్రివారము పఠించినచో దుస్స్వప్న భయములు తీరుననియు, దానిని యక్ష, రాక్షస సిద్ధ విద్యా ధరాహి పతులు సపర్యలందించుచుందురనియు, అంజనేయుని సాహాయ్యమున భీముడు దానిని కొనిరాగలడనియు తెలుపగా ధర్మజుడు తన తమ్ముని తత్కార్య సాధనకై ప్రేరేపించి పంపెను. భీముడు గంధమాదనమునకుచేరి హనుమంతుని ప్రసన్నుని చేసికొని తనతో పురుషామృగమును తీసికొని పోవుటకు తగిన ఉపాయమును తెలుప ప్రార్థించెను. హరీశుడపుడు 'తమ్ముడా! ఆ మృగముండు అడవికి చేరుటకు సురలైనా భయపడెదరు. నీవు కృష్ణానుమతితో వచ్చినాడవు కాన నీకు నేనొక ఉపాయమును బోధించెదను. ఈ మృగమువద్దకుచేరి అశనిధ్వానోద్ధతితో తర్జించినచో అది ఆ ధ్వని చేసినవానిని వెంబడించి పట్టుకొని, కినుకతో వానిని చెండాడును. అది వెన్నంటినపుడు ఎంత బలవంతుడుకూడ దానితో సమానమగు వేగముతో వెళ్ళజాలడు. నీకు నా శరీరమందలి యేడు రోమముల నిచ్చెదను. వీనిని నీ దగ్గరుంచుకొని మృగమువద్దకు వెళ్ళి గట్టిగా గర్జింపుము. అది కినుకతో నీపై బడుటకు వచ్చును. నీకు బడలిక వచ్చువరకు నీవు పరిగెత్తి ఆ మృగము సమీపించగనే నేనిచ్చిన రోమములలో ఒకదానిని దాని ముందర వేయుము. నా ప్రభావము వలన ఆ రోమ మొక లింగముగా మారును. 'లింగముగన్న బూజ సేయక రాదు పురుషమృగము'. అది పూజించుచున్న సమయములో—

" .... నీ వేగు మింతలోన
జాడబట్టుక యేతేర జోడు తోడ
నిటుల యెలయించుకొని పొమ్ము హస్తిపురికి"

— అని తెలిపి అశీర్వదించి పంపెను.

ఆ సప్తరోమముల గ్రహించి భీముడా మృగమున్న కొరడవిజొచ్చి ప్రళయాభీలంగా ఘోషించగానే ఆ మృగము లేచి, అర్చి,
వడముడిని వెంటబడగా భీముడు జవము కొద్దీ పరుగెత్తి శ్రమ కల్గిన క్షణంలో

సామీరి యిచ్చిన రోమములతో నొకదానిని తీసి మృగముపై విసరగానే పరమశించు పూవులతోటలో కమలకైరవములతో గూడిన సరోవరములతో రత్నగోపురములతో కూడిన శివలింగముతోడి ఆలయమక్కడ ఆవిర్భవించెను. ఆ మృగము వెంటనే హరునకు నమస్కరించి, సరస్సులో మునిగి వివిధ పుష్పవ్రాతముదెచ్చి నిష్ఠతో శివపూజచేసి ఆ తర్వాత రెండింతలు కోపముతో భీముడెంతదూరము పోయెనో అని చలముతో అనుసరించి రాగా భీముడు పరుగెత్తుచు అలపువచ్చిన వేళలో చేతనున్న ఆంజనేయుని రోమముల విసరుచు దానిని భ్రమింపజేయుచు రాగా అది వేసారినదై భీముడు హస్తినాపురములోని గృహద్వారము దూరిపోవు సమయముతో అతని కాలొకటి చిక్కించుకొని లాగసాగగా కృష్ణసహితుడై ధర్మజుడచటికిచేరి తన సోదరుని బాధింపవలదని ప్రార్థింపగా అతని స్తోత్రముల కానందించి ఆ మృగమతని యిష్టము తెలుపుమని కోరెను. అంత ధర్మజుడు—

....“మృగేశ్వర నా మఘమైన యంతకున్
స్పష్టి దొలంగ నీయెడ వసింపగదె యన నుండెనయ్యెడన్.

—ఈ విధంగా ఆంజనేయుని కటాక్షవీక్షణముచేత భీముడు ధృతి బలోన్నతి జవముపొంది మృగభీతినొందక కార్యసాధన కావించెను.[208]

అధ్యాయము —9

# హనుమంతుని పాత్రచిత్రణ.

## 1 ఉపోద్ఘాతము

భారతీయ సాహిత్యములలోనేకాక ప్రపంచమందలి యే భాషా సాహిత్యములోను హనుమంతునివంటి పాత్ర ఇంకొకటిలేదు. దానికదియే సాటియై, అద్వితీయమై అపురూపమైన పాత్రయిది. కృతయుగము మొదలుకొని కలియుగము వరకు హనుమంతునికథ ప్రసరించిననూ, త్రేతాయుగపు సాహిత్యములో వ్యక్తమైనంతమేర ఇతర యుగసాహిత్యములలో ఈ కథ వ్యక్తము కాలేదు. మానవ సమాజములకితని గాధ తెల్సిననాటినుండి హనుమంతుని పాత్ర – బాల్యమాదిగా ప్రౌఢదశవరకు - జనహృదయాలను సంభ్ర మాశ్చర్యములతో ముంచెత్తుచున్నది. 'పరిచితమివాపి గహనం' అను ప్రసిద్ధికి లక్ష్యమై ఎంతో తెలిసినట్లుగా కనబడు ఈ పాత్ర చాల విశిష్టమైనది.[209]

ఈ పాత్ర ఏ ఒక కవియో, రచయుతయో సృష్టించిన పాత్రకాదు. ఈ పాత్ర నందరికన్న ఎక్కువగా పోషించిన వాల్మీకి కవియే దీనిని సొంతముగా సృష్టించెనని చెప్పుటకు వీలులేదు. ఇది పురాణపాత్ర. హనుమంతుని వృత్తాంతము శివపురాణము, పద్మపురాణము, అగ్నిపురాణము, స్కందపురాణములలో కన్పించును. ఈ పురాణపాత్రను తన కావ్యకళాధ్యేయమునకు తగినట్లుగామలచుటలో భగవానుడగు వాల్మీకి శ్రీమద్రామాయణమున ఎంతయో కృషిచేసెను. పరాశరసంహిత, ఉమాసంహిత, ఆనందరామాయణము, ఆశ్చర్య రామాయణము, ఉత్తరరామాయణము, అద్భుతోత్తరరామాయణము అవాల్మీకములగు కల్పనలుగల సంస్కృతేతర భాషాసాహిత్యములు మొదలగునవి హనుమంతునిపాత్రను తమతమ విశ్వాసములకూ, అవసరములకూ తగినట్లుగా కాలగమనమున రూపొందించినవి.

హనుమంతుని జీవితమఖండమైనది. అజరామరమైన వ్యక్తి. గత జీవితమును సాగించుచూ ఈ పాత్ర తన కాలపు సంఘములోని సామాజిక జీవితమున బహు ప్రభావము చూపుచు దానితో యేకమై, విడదీయరాని సంబం

ధము కలదై అందంతర్భూతమైనది. నాటి స్థల కాల సన్నివేశములనుండి ఈ పాత్రను వేరుచేసి చూచుట పరిశోధనకు పనికివచ్చు విషయమైనను అది అవయవినుండి అవయవములను వేరుచేసి చూచినట్లుగానే యుండును; పాత్ర సమగ్ర స్వరూపమునది చక్కగా ప్రదర్శింపజాలదు. "It was a simple life, and was not only of a piece, it also merged with the history of times. The attempt to isolate a part from the whole for clinical analysis may have the advantages for the accademic researcher, but only at the expense of the integral truth"[210] అందువలన హనుమంతునిగూర్చి, హనుమంతుని పాత్రచిత్రణనుగూర్చి పరిశోధనకందిన అంశములను ప్రతిఫలింపజేయుటయే నా కర్తవ్యము. అమేయమైన ఈ పాత్ర స్వరూపము రసజ్ఞుని ఊహాశక్తికీ, లోనారాయగల భావనాశక్తికీ, ఇంకనూ ఎంతో ఉండుననుట స్పష్టము.

తెలుగు సాహిత్యములో ప్రతిబింబించిన హనుమంతుని కథను తెలిసికొనినట్లే, ఇతని పాత్రచిత్రణ ఈ భాషలో ఎట్లు జరిగెనో తెలిసికొనుటయే ప్రస్తుత పరిశీలనాధ్యేయము. కావ్యములలో ఇతివృత్తానికీ, రసభావములకూ, పాత్రలకూ గల సంబంధము గుర్తించనిదే పాత్రచిత్రణను గురించి తెలియుట కష్టము. "Plot, charecter, thought - the TRIO is destined to play a big part in literary criticism. You cannot have an important plot without character. Plot presuposes both character and the thought."[211A] ప్రధానేతివృత్తమేదైనా పాత్రలు లేకుండా ఉండజాలదు. సార్థకమగు సన్నివేశ కల్పనానికి పాత్రయేసాధనము. "Character is an instrument for creation a significant situation."[211B] కవిత్వము చరిత్రవలె జరిగినవాటిని చెప్పడంకాదు. ఏవి జరుగుట కాస్పదమై యుండునో, ఏవి సుసంభవములో వాటిని స్వీకరించి విశ్వజనీనం చేయడమే కవిత్వం పని. The poet's business is not to write of events that have happened, but what may happen of things; of things, that are possible in the light of probability or necessity. While history deals with particular only, this event or that event, poetry deals with the universal.[211C] సాహిత్యములో ఉన్న ప్రక్రియలలో కావ్యనాటకాలు ప్రధానములు. అయితే నాటకంలోకన్నా, మహాకావ్యాలలోనే అద్భుతమైన

విషయాలూ, అలౌకిక విషయాలూ, నమ్మశక్యంగాని కల్పనలూ ఉంటాయని అరిస్టాటిలు పండితుని అభిప్రాయము. "The epic enjoys one advantage over the drama, in that, it affords wider scope not merely for the marvellous, but even the irrational. A thing is ~~time~~ true for a poet if it is ~~time~~ true for the MIL'IEV in which the characters are placed. So the plot of an epic poem may rest upon events some of which may be super human and irrational."[211D] రామాయణము మహాకావ్యము కావున అతిమానుష శక్తులకూ, ఊహాతీత కల్పనలకు అందు స్థాన మీ కారణముననే కల్గినది. అంజనేయుడు సముద్రాన్ని లంఘించినా, పర్వతాలు మోసి తెచ్చినా, సైన్యాలను వీపుపై మోసుకొని వెళ్ళినా, తోకను వారిధులకు వారధిగా వాల్చినా, చతుర్దశ భువనాలలో సంచరించినా, సూర్యుని పట్టుకొనినా, స్థూల సూక్ష్మ రూపముల ధరించినా అది మహాకావ్య విధానానికి తగినట్టిదనే భావించాలి. ఇట్టికల్పనలున్నప్పుడు ఏ పాత్రయైనా అది తన స్వభావాని కనుగుణమగు పనుల జేసినట్లు చూపవలసియుండునేకానీ స్వభావ వ్యతిరేక రూపమగు కార్యముల నొనర్చినట్లు చూపరాదు. కవి తన కావ్యములో సంభవార్హమగు అసాధ్యకార్యములకే మొగ్గుతాడుకానీ అసంభవములగు సుసాధ్యముల జోలికి పోడు. "The character must not be represented as commiting actions inconsistent with his character - that would be poetic falsity. The poet will prefer probable impossibilities to improbable possibilities.[211E] అందువలన ప్రపంచమందలి మహాకవులందరూ అక్షరమైనదానికే ప్రాధాన్యమిచ్చి తమ్ముద్ధరించు ధీశక్తిని పొంది దైవత్వానికి చేరుకోవాలని ప్రయత్నించుచుండుట. All greatest writers are above what is mortal. Sublimity lifts them near the great mindedness of god.[211F]

ఋషితుల్యులగు ఉదాత్త సాహిత్యస్రష్టలు అందువలననే దేహానికీ ఆత్మకూ, రాక్షసులకూ దేవతలకూ, పాపులకూ పుణ్యులకూ అనాదిగా జరుగు సంఘర్షనాత్మకమగు కథలనే ప్రధానంగా చేపట్టి తదర్హమగు ఇతివృత్తాన్ని పోషించిరని తెలియుచున్నది. పురాణకాలపు జనులు దైవికశక్తులపై, దేవాసుర దైత్య దానవ గణాల ఉనికిపై నమ్మకముండినవారగుట వలన నాటి కవులు ఆ అంశమునకు సాహిత్యమున స్థానమిచ్చి రచించిరి. "The mass

of peaple believed whole heartedly in the existence of good and bad spirits and the literature of the time exhales this belief."[212] ప్రాచీన సాహిత్యములోని పలు పాత్రలు అప్రాకృతమైనవి. దివ్యాంశ సంభవమై లోకాతీతమగు రీతిలో పుట్టుట, పెరుగుట, జీవించుట కలిగి భగవంతుని లీలావిభూతి కనుగుణముగా, ఆతని ఆశయముల నెరవేర్ప వలసిన కారణజన్ములుగా కల్పింతురు. సామాజిక జీవనమున క్రౌర్యమూ, హింసా, సాధువ్యథా, దౌష్ట్యమూ ప్రబలినపుడు పరమాత్మ ధర్మరక్షణకై తానవతరించుటేకాక తన పరివారములోని వారిని, దూతలను, భృత్యులనూ అవతరింపజేయుచుండును. వీరికాభగవంతుడు సామాన్య మానవులకువలెకాక విచిత్రమైన ఆకారములను, విశేషమైన శక్తులనూ ప్రసాదించి పంపుచుండును. ఆ దేవుని కార్యములను సాధించుటలో వీరు తమ జీవితములను చరితార్థ మొనర్చుకొనినవారై, జనవంద్యులై సమాజ గౌరవమునకు పాత్రులగు చుందురు. ఇట్లు రూపొందించగా వెలసిన పాత్రలలో హనుమంతునిపాత్ర కూడ ఒకటి. సకల దేవతల అంశలు త్రిమూర్తులలోచేరి పెంపొంది దివ్యా ద్భుత రీతిలో జన్మించి, దివ్య వరాలుపొంది ఒక విశిష్టమైన వ్యక్తిత్వముతో హనుమంతునిపాత్ర వెలసినదని చెప్పవచ్చును. ఈ కల్పనకు ఏ ఒక కవియో, ఏ ఒక గ్రంథమో కారణమని చెప్పజాలము.

హనుమంతుని పాత్ర రూపకల్పనలో ఏ కవి యేమి కల్పించి ఏ స్థితికి తెచ్చెనో చెప్పుట చాలా కష్టము. ఎందుకనగా ఈ పాత్ర పురాణపాత్ర. పురాణములను ఒకరే వ్రాసిరో, అనేకులు వ్రాసిరో ఇంకనూ తేలవలసియున్నది. అష్టాదశపురాణములను వ్యాసుడొకడే వ్రాసెనని నమ్మువారితో మనమూ అంగీకరించిననూ, హనుమంతుని పాత్రరూప కల్పనలో వ్యాసుని భాగమెంతో స్పష్టపరచవలసియుండును. ఆ పురాణములలో కూడ హనుమంతుని స్వరూప స్వభావ జీవితములలో ఏయే అంశములు (Aspects) ఏయే పురాణములలో ఏయే మేరకు పోషితమో కూడ పరిశోధించినగాని తెలియదు. శ్రీమద్రామాయణ మున వాల్మీకి హనుమంతుని పాత్ర చిత్రణలో విశేషమైన శ్రద్ధతో కృషి చేసియున్నాడు. తెలుగు, తమిళము మొదలగు ద్రావిడభాషలతోపాటు ఉత్తర హిందూదేశభాషలగు హిందీ, బెంగాలీ, మరాటీ భాషలలో వారివారి కవులు హనుమంతుని పాత్రను మలచుటలో ఎన్నో నూతనాంశములను (వాల్మీకి తెలుపనివి) తెలిపియున్నారు. ఈ కల్పనల కాలక్రమమెట్టిదో తేలినగాని

ఎవరెవరి కృషి ఎంతమాత్రమో నిర్ణయింపజాలము. అందువలన హనుమంతుని పాత్ర బహుభాషలలోని రచయితలచే జన సమాజములలోని వారి అభీష్టములకు, అవసరములకు తగినట్లుగా, కాలక్రమములో రూపొందుతూ వచ్చిన పాత్ర అని చెప్పవచ్చును. జాతీయ జీవనమందలి సకల భాషాకవుల భావనకు ఫలముగా వెలసినట్టిదే హనుమంతునిపాత్ర (Hanuman's character is the creation of a master mind - the Nation's mind.) ఈ పాత్ర అవిర్భావము శ్రీరామ శ్రీకృష్ణుల పాత్రలవంటిదేనని చెప్పవచ్చును.

శ్రీరాముడు, శ్రీకృష్ణుడు భారతీయ సాహిత్య సంస్కృతులలో ప్రభవించిన ఉత్తమోత్తమ పాత్రలు. దేశము ఎన్ని దండయాత్రలకు విదేశీదాడులకూ గురియైనా, ఎన్ని అన్యమతాల ప్రభావానికి గురియైనా, చారిత్రకమైన ఎన్నో మార్పులకూ చేర్పులకూ గురియైనా శ్రీరాముని, శ్రీకృష్ణుని పాత్రల ప్రభావం ఈ నాటికి మన సంస్కృతిలో చెరగకుండా ఉన్నది. దేశమందలి ఏ ఒక భాషలోని ఏ ఒకరో ఇద్దరో కల్పించిన పాత్రలు కావివి. భిన్నత్వంలో ఏకత్వం గల భారతీయుల సంస్కృతిలో భాషా భేదానికతీతమైన క్రాంతదర్శుల అనారతమగు సమగ్రమగు కృషికి ఫలముగా ఈ పాత్రలు రూపొందినవని తత్త్వవేత్తల అభిప్రాయము. They do not belong to one language, one sect, one religion; they belong to not only to india but to humanity also.) . హనుమకూడ ఇదే విధముగా రూపొందిన పాత్ర. రామకృష్ణులు సామాన్యులవలెనే జన్మించి, జననమాదిగా మరణమువరకు తమ కాలపు జనజీవితముపై ప్రభావం చూపిరి. కాలక్రమమున వీరికి సంబంధించిన వాఙ్మయము పెరుగుతూవచ్చేకొద్దీ వారికి జాతిలో పూజార్హత, దైవత్వసిద్ధి సంక్రమించినట్లే హనుమంతుని పాత్రకూడ ఆరాధనీయమగు దైవత్వాన్ని పొందింది అలంకార శాస్త్రములలో కావ్యాత్మచర్చ శతాబ్దములు సాగినట్లుగా, వైజ్ఞానికశాస్త్రములో అణుసిద్ధాంతచర్చ జరిగినట్లుగా, కాలములో హనుమంతునికి సంబంధించిన వాఙ్మయము బహుభాషలలో,అనేకులచే ప్రతిపాదింపబడు చిత్ర విచిత్ర విషయములతో నిండిపోవుచూ రాగా అనేకానేక గుణములతో ఒక విశిష్టరూపమూ, వ్యక్తిత్వమూ హనుమంతునిపాత్ర సంతరించుకొనినది. కానీ ఎవరెంతచేసినా, వాల్మీకి ఋషిసత్తముని కృషి వాటికి వరవడిని, లక్ష్యాన్ని నిర్దేశించినదని చెప్పవచ్చును. క్రౌంచమిథునమును వేరు చేసిన వేటగానిపై 'మానిషాద ప్రతిష్ఠాం' అను శ్లోకమున తన శోకమును

గ్రక్కిన విషయము కవితావిర్భావానికి హేతువుగా తెలిపి తన కావ్యానికి హృదయాలను కదిలించే ఆరంభాన్ని వాల్మీకి ఇచ్చినా, అతని కావ్యఫలమగు రామాయణము ఉద్రేకములో కేవలము కొన్ని క్షణములలో వెల్వడినదని మనము నమ్మజాలము. సప్తకాండ సమాహారమగు తన రామాయణగాధ నతడు సమాజ సంస్కారానికినీ, ధర్మప్రతిపాదనకునూ ఉద్దేశించెను. తన కార్యోద్దేశమునకు తగిన అనుకూలమగు ఎట్టికథ ఉండాలో, ఏలాంటి పాత్ర లుండాలో ఆతడెంతో జాగరూకతతో భావించి, సకలోహసనాధమగు తన కమనీయ కవితాకళకు వన్నెలుదిద్దు సన్నివేశకల్పనల కుపక్రమించియుండును. జనావళినాడి తెలిసిన మహనీయుడతడు. తన కాలానికేకాక కాలాంతరముల కునూ నిల్వగల్గు విశ్వజనీనతనతడు తన కావ్యమున సాధింపదలచెను. కావున సుబోధకమగు సరళ సంస్కృతముననే తన కావ్య మధువు నతడు మన కందింప యత్నించి కృతకృత్యుడయ్యెను. (Through his insight into human nature, and in comparable poetry, which was deeper in feeling and greater in range, he composed his poem THE RAMAYANA.)

రామాయణమున వాల్మీకి కవితాశిల్పము తెల్సికొనేకొద్దీ తెలియదగిన రమణీయాంశములతో కూడినట్టిది. సృష్టిలోని సకల స్థావర జంగమ మృగపక్షి సంతానములతోపాటు, దేవ, రాక్షస, నర, వానర, ప్రాణిసంతతులను తన పాత్రలుగా స్వీకరించి శ్రీరాముని సకల సద్గుణాభిరామునిగా సకల ప్రాణికోటికి ప్రియరంజకునిగా, చిత్రించు ప్రయత్నము ప్రాచేతసు లొనరించి యున్నారు. భూమిని, నీటిని అగ్నినీ, వాయువునీ, ఆకాశాన్నీ (పంచభూతములు) వన పర్వతములనూ, జంతు ప్రపంచాన్నీ, తరులతా సమూహాన్నీ, పక్షివర్గాన్నీ, వింతవింత ఆకారాలు గల రాక్షసులనూ, భల్లూకాలనూ, వానరులనూ, నరులనూ, నిషాదులనూ, సాధులనూ, మునులనూ, ఋషులనూ దేవతలనూ తన కావ్యమున ప్రవేశపెట్టి, కావ్యకళాధర్మమునకూ కథనమునకూ భంగము కాకుండా సమ్మేళనమొనర్చి తన కావ్యప్రయోజనము నతడు సాధించెను. శ్రీరాముని సాధారణ మానవునిగానే చిత్రించినా, పుత్రునిగా, శిష్యునిగా, భర్తగా, సోదరునిగా, మిత్రునిగా, సాధురక్షకునిగా, సత్యశీలునిగా, ప్రభువుగా, నీతికోవిదునిగా, ధర్మావతారమూర్తిగా అతనినే ఆదర్శముగా స్వీకరించునట్లు రూపొందించెను. ఆదర్శములతోఅతని అడుగుజాడలలో చరించు భరత లక్ష్మణ

శత్రుఘ్నులతోపాటు, గుహ, భరద్వాజ, వసిష్ఠ, విశ్వామిత్రాది మానవ పాత్రలతోపాటు, జటాయువు, సంపాతి వంటి పక్షిపాత్రలు, విభీషణాది పాత్రలను అతడు కల్పించెను. ప్రధాన పాత్రయగు శ్రీరాముని గుణగణముల శోభింపజేయుటకే ఈ పాత్రలను సమాంతరముగా అతడు నిలిపినట్లే పోలికకై (Contrast) రావణాది పాత్రలను కల్పించెను. సమాంతరశ్రేణిలో వానర భల్లూకాదులగు సుగ్రీవ జాంబవంత అంగద హనుమానులను రూపొందించి నరవానరమైత్రిని సాధించు ప్రయత్నమతడు చేసెను. నరులలో రాముడుత్తమునిగా వానరులలో హనుమంతుడుత్తమునిగా అతడు భావించెను. మర్యాద పురుషోత్తమునిగా రాముడెట్లు మహనీయ గుణాత్ముడయ్యెనో హనుమంతుడు ఉత్తమ సేవకునిగా, రామదాసుగా, రామదూతగా, రామకింకరునిగా, రామ భక్తునిగా, రాజనీతిజ్ఞునిగా, రాయబారిగా, వీరునిగా, ఆపన్నివారకునిగా, యోగిగా, జీవన్ముక్తిమార్గ ప్రదర్శకునిగా, అజన్మ బ్రహ్మచారిగా, అభయ ప్రదాతగా, నవవ్యాకరణవేత్తయైన వాచాదక్షునిగా, ఈషణత్రయదూరునిగా, జ్ఞానిగా, ఆచార్యునిగా, మహాత్మునిగా బహుముఖమైన వ్యక్తిత్వము కలవానికిగా హనుమంతుని పాత్రను వాల్మీకి తీర్చియున్నాడు. అద్భుత బలపరాక్రమాది గుణ విశేషములు గల శ్రీరామ లక్ష్మణ వాలి సుగ్రీవ రావణాదుల సరసన హనుమంతుని వంటి పాత్రను కల్పించి, వారితో సమానమగు గౌరవమును పొందునట్లుగా ఈ పాత్రను వాల్మీకి తీర్చెను. ప్రపంచ సాహిత్యాలలోనే ఇది అపూర్వము. ఏలన, ఒక యుగములో దైవమని భావింపబడిన వ్యక్తి, ఇంకో యుగములో ఆరాధనకు దూరం కావచ్చు. The idol of one age is ofter relegated to the lumber room of the next) కనరాని మార్పులదెచ్చు కాలపు దిబ్బలలో కనుమరుగైపోయిన పాత్రలవలెకాక కాల క్రమమున హనుమంతునిపై ఆదరణతోపాటు ఆరాధనాభావము కూడ పెరుగునట్లు వాల్మీకి యీ పాత్రను చిత్రించి యున్నాడు. తన మధురకవితాశిల్పము ద్వారానేకాక, మానవ స్వభావ పరిశీలనను సూక్ష్మముగా పరిశీలించు తన నైపుణ్యముతోకూడ అతడీపనిని సాధించెను. ఏవిధమగు యుక్తిచాతుర్యములతో కాక మానవ స్వభావములోని విశ్వజనీన సహజగుణముల స్పృశించి యీ సాధనలో అతడు కృతకృత్యుడైనాడు. (He appeals to the universal instinct of human nature and compels our interest by no literary trick, but by making us feel that his characters were as real as we are )

సమాజములు మారవచ్చు, మనుష్యులు మారవచ్చు, యుగములు మారవచ్చు, సమాజధర్మాలు, సంప్రదాయాలు మారవచ్చు, సాంఘిక వ్యవస్థ మారవచ్చు కాని, మానవ స్వభావములో అనాహతముగా ఉండే కొన్ని అంశ ములు మాత్రము మారవు. ఋషిచేతి పాత్రచిత్రణలో ఈ కార్యమందలి పాత్రలు నేటివరకు సకల మానవాళిచే ఆదరింపబడుచునే యున్నవి. ఇతని పాత్రచిత్రణా, కథాసంవిధానమూ ఎంతస్థాయికి ఎదిగినవనగా, ఈ రామాయణ కథ అసంభవమైనదనిగాని, అభూతకల్పన అనిగాని మనకెక్కడా అనిపించదు. కేవలము కథను తెల్పడమే కవి ధ్యేయముకాదు. పాఠకునిపై ఏ ప్రభావము పడవలెనో దానినే పడునట్లుచేసి కావ్యపఠనము దాత్త సంస్కారమునందించు నట్లు ఉన్నతాశయముల ప్రేరేపించునట్లు చేయుట దానికన్నా ముఖ్యము. ఇట్లొనర్చిన కవి కల్పిత పాత్రలు సజీవమై, సమాజముపై చెరగనిముద్ర వేయ గల్గును. ఆయా పాత్రల ఆకారములలో, గుణములలో, భేదములెన్నో ఉన్ననూ, వాటివాటి ప్రయోజనములను అవి నెరవేర్చుకొనుచు కవి నిర్దేశించిన ప్రయోజనముల సాధింపగల్గినవి. వాల్మీకి కవి గొప్ప శక్తి సామర్థ్యములకు ప్రతిఫలమైన ఎన్నో పాత్రలలో ఆంజనేయుని పాత్ర కూడ ఒకటి.

రామాయణము సీతారాముల చరిత్రమైనప్పటికిని దీనిలో హనుమంతుని పాత్రకు వాల్మీకి సముచిత ప్రాధాన్యమునిచ్చి యున్నాడు. వానరులలో ఇతని కిచ్చినంత ప్రాధాన్యమింకే వానరునకు ఇవ్వలేదు. రామరావణుల తర్వాత రామాయణమున హనుమంతుని పాత్రయే ముఖ్యమైన పాత్ర. ఇతడు సాధించిన కార్యములరాశిని బట్టి చూచినా, వాటిని సాధించుటలోని క్లేశములను బట్టి చూచినా ఈ పాత్రద్వార నెరవేరినన్ని కార్యములింకే పాత్రద్వారా నెరవేర లేదు. అంతేల! అసాధ్యక సాధ్యకార్యములు, ఆకార్యముల చేయుటకు వేరె వ్వరూ పూనలేని వాటి దుర్ఘటత్వములను గమనించినచో ఇట్టి పనుల సాధించుటకే వాల్మీకి యీ పాత్రను ప్రవేశపెట్టినాడని అనిపించును. ఇతని జననమూ, దేవతలిచ్చిన వరాలవలన సిద్ధించిన అజేయత, అవధ్యత, అస్త్ర శస్త్ర ప్రభావములకు లోబడకుండుట, అజన్మ బ్రహ్మచర్యము, కామరూపత, కామగమనము, చిరంజీవిత, రామకార్యతత్పరత మొదలగు విశేషములతో కూడిన పాత్రగా ప్రవేశపెట్టినందున ఇతడమిత ధైర్యసాహస పరాక్రమ పాండిత్య రాజనీతిజ్ఞతలను ప్రదర్శించుటలో ఔచిత్యముండునట్లుగా చేసిన కవి కృషి ప్రశంసాపాత్రము.

వాల్మీకికవి కావ్యమునకు యథామూలముగా కొన్ని అనువాదములు వెలసినవి. అందువలన వాని ఆధారముగా వాల్మీకి పాత్రచిత్రణనే తెలుగు కవుల పాత్రచిత్రణగా స్వీకరించుట కర్తవ్యము. ఆనందరామాయణము, ఆశ్చర్యరామాయణము, మైరావణ చరిత్రము మొదలగు కావ్యములు వ్రాసిన కొందరు కవులు హనుమంతుని గుణగణములను చిత్రించుటలో కొన్ని అవాల్మీకములగు కల్పనల గూర్చి యున్నారు. హనుమంతుని అమాయకత్వమును తెలుపుటకో, అతనికి రామునిపై గల (మూఢ) భక్తి తెలుపుటకో, అతని జాతికర్హమగు చేష్టలను చూపుటకో వారా కల్పనల చేసినట్లు భావించవలసినదే కానీ లోకజ్ఞత, ఔచిత్యజ్ఞానము లేనివానిగా మనము భావించరాదు. రాముడు బహుమతిగా ఇచ్చిన ముత్యాలహారమును కొరికి చూచుట, రాముని భోజన పాత్రను ఎత్తుకొని చెట్టెక్కి కూర్చొనుట, సీతారాముల దాంపత్యక్రీడలకు ఆటంకముగా నుండినట్లుగా, శ్రీరాముని రూపమునతప్ప ఇంకే రూపములోను దైవమును గుర్తింపజాలకుండుట, సీతాదేవిని హింసించిన రాక్షసాంగనల చంపుటకై సీతను అనుమతికోరుట, లంకను దహించుటలో కొన్ని కోతిచేష్టలు చూపుట మొదలగు చర్యలను వాటిని సృష్టించిన కవుల కాలమునుబట్టి ప్రజలను నవ్వించుటకై కవులొనర్చిన మార్పులుగా మాత్రం గుర్తించవలెనే కానీ వాటి కధిక ప్రాధాన్యమీరాదు. భక్తినీ, యోగాన్నీ అతడు శాస్త్రీయముగా అభ్యసించినా, కేవలము శిలాసదృశమైన శుష్కశాస్త్రీయ పద్ధతికి అతడు విలువ నీయక చిత్తశుద్ధితో కూడిన ఆచరణకే ప్రాధాన్యము నిచ్చినవాడు. ఇతడు సంప్రదాయ విధేయుడైనట్టి తీవ్రవాది (He is a conservative revelutionry) ఇతని భక్తి విశ్వాసతీవ్రత (Intensity of faith) అనితరసాధ్యమై విలక్షణమైనందున ఇతరులకది సులభముగా బోధపడనందున ఇతని భక్తిని మూఢభక్తిగా వారు ముద్రవేసిరని చెప్పవచ్చును.

హనుమంతునంతటి రాజనీతి పరిజ్ఞానముగలపాత్ర రామాయణమున నింకొకటి కనబడదు. ఇతని లోకజ్ఞత, ఔచిత్యపాలన, దయ, శీలము, సంభాషణా చాతుర్యము, సమయోచిత నిగ్రహము, ఇంగితజ్ఞత, పరాక్రమము, ఆలోచనాశక్తి, ధార్మికత సహజసుందరమైనవి. సకలశక్తులు సామరస్యంతో ఇతనిలో మేళవమొందినవి. [He is a full grown personality wiih a harmonious blend of all the faculties of a human being.] ఇంతటి శక్తిశాలియై కూడ ఇతడు గర్వములేనివాడై, నిర్మలుడై సద్గుణము

లతో ప్రకాశించినవాడు. 'ఏకోపి దోషో కిరణేష్వి వాంకః' అను రీతిలో రామాయణ భారత పాత్రలలో ఏ పాత్రను చూచినా ఏదో ఒక లోపమో, దోషమో ఉండని పాత్ర కనబడదు. వానరుడయ్యు, ఏలాంటి మచ్చలేని నిర్మలమైన పాత్రకు హనుమాన్ ఆదర్శము.

## 3 కావ్యములలో పాత్రచిత్రణ

కావ్యములలో పాత్రచిత్రణకూ, మానవ నిత్య జీవనమునకు చాలా సంబంధమున్నది. ప్రతి వ్యక్తికి ఒక జీవితం ఉంటుంది. అందులో పుట్టుట, పెరుగుట, ఆహారవిహారములు, నిద్ర, తోడి మానవులతో మైత్రీ ప్రణయాది భావాలు, మరణించుట అనునవి ప్రధానాంశాలు. నిజజీవితములో నున్నట్లే కావ్యములలోకూడా ఉండాలని నియమములేదు. ఇవి ఏవిధంగా ప్రతిబింబించాలో ఆ పాత్రకు కవి తన కావ్యశిల్పమను చట్రములో కల్పించిన చిత్రంమీద ఆధారపడియుండును. మానవుల జీవిత నాటకరంగంలో పాత్ర ధారులగుటవలన వారు నిజజీవితములో సమాజ సంస్కారములకు, నాగరి కతకు, సభ్యతకు లోబడి స్థల కాలోచితముగా ప్రవర్తిస్తూ ఉంటారు. ఒక వ్యక్తి బాహ్యరూపాన్ని, చేష్టలనూ కవి వర్ణించవచ్చు. తోడివారితోచేయు ప్రసంగములలో వారివారి స్వభావములను సూచించవచ్చు. కాని, వ్యక్తిలోని అంతరంగిక అనుభూతులను తెలుపనిచో ఆ పాత్ర నర్థముచేసికొనుటకు వీలు కాదు. ఆవేశానుభూతులు, కలలు, సుఖదుఃఖాలు వగైరాలను సభ్యతా విధేయుడైన పాత్ర పూర్తిగా వ్యక్తీకరించుట జరుగదు. The passions, dreams, joys and sorrows and self communings which politeness or shame prevent one from expressing them ][213]

హనుమంతునికి సంబంధించిన కావ్యాలలో పలువురు కవులతని జీవిత మందలి సకలాంశములను స్పృశించి చిత్రింపరైరి. జన్మాత్ ప్రభృతి గడచిన జీవితమంతా చిత్రించే ప్రయత్నము ఏకవీ కూడా చేయలేదు. ఆంజనేయుని జీవితములోని కొన్ని ముఖ్యాంశములే పలువురు చిత్రించినారు. అతని అద్భుత జననమును గూర్చి ప్రథమాధ్యాయములో తెలిసికొన్నాము. దేవతల వరముల వలనను, సీతారాముల వరముల వలనను ఇతడు చిరంజీవి యైనందున మరణ మును గూర్చి చిత్రించు పని తప్పినది. ఇతని శైశవక్రీడలలో ఒక్కటో, రెండో

అంశములు తప్ప ఎక్కువగా ఏ వివరమూ మనకు లభించుటలేదు. సూర్య బింబాన్ని పట్టబోవుట, ఋషుల ఆశ్రమములలో అల్లరి చేయుట, సూర్యునివద్ద విద్యాభ్యాసము తప్ప ఇతని బాల్యవిశేషములను వివరంగా చిత్రించినవారు లేరు. రామాయణములో రాముడే నాయకుడు కావున అతని గుణగణముల చిత్రించుటలో చూపిన ప్రాధాన్యము ఆంజనేయుని యెడ కవులు చూపలేదు. శ్రీరాముని సుఖదుఃఖాది అనుభూతులను వర్ణించినారే కానీ ఆంజనేయుని ప్రతిక్షణ మనోనుభూతులను తెలుపు ప్రయత్నము చేయలేదు. అందువలన ఆంజనేయుని పాత్రచిత్రణలో లభ్యసాక్ష్యముల నుండి ఊహించి తెలిసికొన వలసిన పని తప్పనిసరియగుచున్నది.

కోటివిద్యలు కూటికొఱకే అనినట్లు మానవజీవితములోనే కాక సర్వ ప్రాణికోటి జీవితములో ఆహారసేకరణ మొక ప్రధానాంశము. హనుమంతుని ఆహారవిహారాదుల గూర్చి మనకు ఎక్కువగా తెలియదు. సీతాదేవిని అశోక వనములో సందర్శించిన సందర్భమున అతడు ఆహారము కోరినట్లు కొన్ని రామాయణములలో (అవాల్మీకమగు కల్పన) కలదు. సీతావార్త తెచ్చిన పిమ్మట సుగ్రీవుని మధువనములో కపులందరితో కలిసి మధువులనానినట్లు వాల్మీకి వర్ణనయే కలదు. సాగరలంఘన సందర్భమున మైనాకుని ఆతిథ్యమును గూడ నిరాకరించి వెళ్ళినేకాని ఆహారస్వీకారమొనర్చలేదు. ప్రాణికోటి ఆహారమునకై చేయు యత్నములు, బ్రతుకుతెరువునకై చేయు పనులు జిహ్వాకింపగు విందుల నారగింపవలయునను తహతహ ఇవన్నియు నిత్యజీవితములో చాలా ప్రధాన మైనవి. హనుమంతునకు ఎట్టి అహారము ప్రియమో, ఏయేవేళలలో అతడు ఆహారము స్వీకరించెడివాడో, ఎట్టి పానీయముల సేవించెడివాడో తెలుపు గ్రంథాలులేవు. హనుమంతునకు మలమూత్రాదులు కానీ, ఆకలిదప్పులుగాని లేవని కొందరి కల్పనలున్నవి. వానరులధిక భోజనప్రియులుగాను, సుగ్రీవుని వలె మధుపానాసక్తులుగాను మనకు తెలిసియున్నను హనుమంతుడు వారివలెనే అట్టి అభిరుచులతో చరించినట్లు సాక్ష్యములు లేవు.

ఆహారము తర్వాత స్వప్నసుషుప్తులు ప్రతిజీవికి ఉండునట్టివే. హను మంతుని నిద్రను గూర్చికానీ అతనికి ఏలాంటి కలలువచ్చెడివో మనకే సాక్ష్యము లభించుటలేదు.

జీవి జన్మించిన వెంటనే శిశుచైతన్యము తర్వాత గమనించు విశేషములో "స్త్రీ–పురుష" లింగనిర్ణయము ముఖ్యమైనది. వ్యక్తి జీవితములో ఈ లింగ విభేదము ప్రధానపాత్ర వహించును. పుట్టినప్రాణి చిత్తవికాసానికి, జీవిత స్వరూపానికి, అశలకు, ఆశయాలకు లింగమే కారణము. భాగవతమున శ్రీకృష్ణ నిర్వాణ ఘట్టమున—

"శోకహేతువహంకార మమకారాత్మకంబైన ద్వైత భ్రమంబనియు, ద్వైతభ్రమంబునకుఁ గారణంబు దేహంబనియును, దేహంబునకు బీజంబు లింగంబనియును, లింగంబునకు మూలంబు గుణంబులనియు, గుణంబులకు నిదానంబు ప్రకృతియనియును, బ్రహ్మాహమ్మనియెడు జ్ఞానంబున లీనమై ప్రకృతి లేకుండుననియు, ప్రకృతి యడంగుటయి నైర్గుణ్యంబనియును, నైర్గుణ్యంబు వలన కార్యలింగనాశనంబనియును, కార్యలింగనాశంబున నసంభవంబగు ప్రకృతింబాసి క్రమ్మఱ స్థూలశరీర ప్రాప్తుండుగాక పురుషుండు సమ్యగ్భోగం బున నుండుననియును నిశ్చయించి అర్జునుండు విరక్తుండై యూరకుండె".... అని కలదు.[214] (శ్రీ మహాభాగవతము ప్రథమ స్కంధము–37) కనుక లింగము (Sex) వ్యక్తి జీవితములో జీవితాంతము ప్రధానపాత్ర వాహించు నట్టిది. వ్యక్తి స్త్రీయా, పురుషుడా అను లింగస్థితినిబట్టియే వేషభాషాది నాగరికతా సంస్కారములు జరుగుచుండును. జననమొందిన తర్వాత శైశవ మున నిద్రాణముగానున్న లైంగికజ్ఞానము (Sex Sense) వ్యక్తితోపాటే పెరిగి, ప్రౌఢత్వము వచ్చుకొలది, శరీరములోవచ్చు మార్పులతోపాటు లైంగి కోచితమగు భావములు చిత్తమున స్థానము పొందుచుండును. రూపాభిమానము, అలంకరణప్రియత్వము, ఇతరుల నాకర్షించుటకై పాటుపడుట అనునవే ఆ భావములు. "Sex begins before adolosence, and survives sterility, it is indeed co-eval with our lives, although at the mating age its effects are more obvious to society."[215A]

లైంగిక ప్రేరణమున సౌందర్యారాధన, ఆకర్షణ, ప్రేమ, స్నేహము, తృష్ణ ఇత్యాది భావములు కలుగుచు భిన్నలింగమునకు చెందిన వ్యక్తి స్పర్శకై తోడుకై, కలయికకై ప్రాణి అలమటించును. ఈ ప్రేరణయే మిధునక్రీడకు, ప్రజోత్పత్తికి మూలము. దీనినే ప్రణయానుభూతిగా పేర్కొనవచ్చును. ఈ ప్రణయభావంతో ఏవేవో తెలుపలేనన్ని అనుభూతులు కలుగుచుండును. ఆ అనుభూతుల అనుభవములో పరవశించి, వాటిని భిన్న లింగశ్రేణికి చెందిన

ప్రాణికి అందించి వాటికి బదులు ఆ ప్రాణినుండి తనకందని అనుభూతులను, ఆనందమునూ పొందాలని తపన ఉంటుంది. When human beings love they try to get something. They also try to give something, and this double aim makes love more complicated than food and sleep.[215B] తానాకర్షించిన వారితోనో, తన నాకర్షించిన వారితోనో సంబంధమును వాంఛించుట సహజ మానవగుణం. దర్శన, స్పర్శన, సంభాషణ, సంభోగ వియోగ సహజీవన సహగమనత్వ ములకు స్త్రీపురుషులెలా ప్రవర్తిస్తారో కవుల పాత్రచిత్రణలో అధికముగా గోచరించును. హనుమంతుని ప్రణయజీవితము, అతని లైంగిక భావవికార ములు (Sexval urges) తెలుపు సన్నివేశములను ఏ కావ్యములోనూ, ఏ కవి కూడా కూర్ప ప్రయత్నించలేదు. ఆంజనేయుని ఆజన్మ బ్రహ్మచారిగా, జితేం ద్రియునిగా చూపే ప్రయత్నములో వారాతని లైంగిక 'వాసన'ల తడవలేదు. స్త్రీగానో, పురుషుడుగానో పుట్టి ఈ సామాజిక జీవితమున భిన్నలింగ వ్యక్తుల ఆకర్షణాపకర్షణలకునూ, భావవికారములకునూ లోనుకాకుండా జీవించుట ఎవరికినీ సాధ్యముకాదు. ఆంజనేయుని లైంగిక అనుభూతులను (Sexval impulses) వికారములను ఏ కవిగూడా ఏ గ్రంథములోగూడా సూచింపనైనా సూచింపలేదు. రావణాంతఃపురములో నిద్రించు రాక్షస స్త్రీలను చూచినపుడు హనుమంతుడే వికారమును పొందలేదు. తాను వారిని దర్శించుటలోని ధర్మాధర్మముల గూర్చిన విచికిత్సయే అతడు పొందెనుగాని దర్శనీయులగు వారి అవయవ సౌందర్యాదులకు స్పందించడయ్యె.

కావ్యమొక కళాసృష్టి. ప్రతికళకు కొన్ని సూత్రాలుంటాయి. ఈ సూత్రాలు నిత్య జీవిత ప్రాపంచిక సూత్రాలవంటివికావు. కావ్యకళాధర్మాలకూ, కావ్య నిర్మాణోద్దేశమునకు లోబడియె పాత్రలు కవిచేత రూపొందింపబడును. A work of art has its own laws. They are not those of real life, and that a character is real when it lives according to its laws. The barrier of art divides them from us. They are real not because they are like ourselves, but because they are convincig. తన కావ్య ప్రయోజనమున కనుగుణము ఏ పాత్ర యొక్క బాహ్యాంభ్యంతర మనోజీవితాలెంతవరకు సహృదయులకు వ్యక్తం కావాలో అంతవరకే రచయిత తెలియజేస్తాడు. The characters must

adopt themselves to the other requirements of their CREATOR.[215C] అంతేకాక పాత్రచిత్రణలో రచయిత శక్తికీ, కావ్యపరిధికి గల పరిమితులనుగూడ గుర్తించియే మనము వ్యవహరించాలి. His range and limitations must not be left out of cosideration.[216A]

కావ్యమున కథకూ, పాత్రచిత్రణకూ ఎంతెంత ప్రాధాన్యం ఇయ్యబడునో ఆ అంశముపై కూడా పాత్రచిత్రణ ఆధారపడియుండును. కథకే ప్రాధాన్య మున్న కావ్యంలో కార్యకార్యము నెరవేర్చుటలో "పాత్రలు" సాధనాలుగా ఉంటాయి. పాత్రయే ప్రధానమైన కావ్యంలో ఇతివృత్త రూపానికీ, కథా వికాసానికీ కొంత భంగమేర్పడును. 'When the interest of the plot is upper most, characters are used simply or mainly to carry on the action. Where attention is paid primarily to characters the expansion of personality will prove fatal to the regularity of the plot design.[216B] కాబట్టి ఇతివృత్తానికీ, పాత్రలకూ గల సంబంధము సరైనపాళ్ళలో నిర్వహింపబడుట చాలా ముఖ్యం. పాత్రద్వారా ఇతివృత్త వికాసం జరుగుచో అది ఔచితీ శోభితమై కావ్యకళా ధర్మాలకు గొడ్డలిపెట్టుకాని రీతిలోనే సాగాలి. కొన్ని గుణవిశేషములుగల పాత్రలు తమతమ భావోద్రేకాలకు తగినట్లు కావ్యమందలి కొన్ని విశిష్ట స్థితులలో తారసపడి ప్రతిస్పందిస్తూ, కథావికాసానికి తోడ్పడుతూ ఉండునట్లు రచన జరుగుతుంది. కథారూపానికి తగినట్లుగానే పాత్రచిత్రణ ఉంటుంది. పాత్ర సకలగుణాలనీకాక కథయొక్క కార్యానికి ఎంతమాత్రం అవసరమో అంతే ఆ పాత్రగుణాలను ప్రస్ఫుటీకరించాలి. అతిగా పాత్ర గుణస్వరూపాదుల వ్యక్తం చేయడం కావ్యకార్యావసరములకు మించి చేసిన పాత్రచిత్రణగా కనబడును. (Characterisation in excess of the reeds of the action of the plot.) In the evolution of plot out of character, the motives which prompt the persons of the story to act as they do, must impress ~~his~~ us both in keeping with their natures and adequate to the regulating incidents.... Simple or complex, the plot evolves, as natural consequence of the fact that a number of given people of such and such dispositions and impelled by such and such motives and passion, are brought together in circumstances which give rise to an

interplay of influence or clash of inrests among them. Every charater should be presented as to appear absolutely adequate to all the demands which the plot makes upon it. According to prof. TOLMAN 'only those characteristics of a hero (of a personage) showed be made prominent which really influence the course of action and that these characteristics should be unmistakable.[216C]

కథలో పాత్ర ప్రవర్తన చూచినపుడు అతని ఉద్దేశములు అతడెందుకు అతని పాత్రలో అలా ప్రవర్తించాడో సహృదయునకు విశ్వసింపదగిన తీరులో చిత్రింపబడాలి. పాత్రల సంవాదములద్వారానే వారి అనుభూతులూ, అభిప్రాయాలు మనకు తెలియును. నిజజీవితంలో వ్యక్తులొకరితో ఒకరు సంఘటితమగుచూ తోచినట్లే కథా ప్రపంచంలో కూడ ఆయాపాత్రలు ఇతర పాత్రలతో తటస్థపడినపుడు తమతమ ఆంతరంగిక వృత్తులను దాపరికం లేకుండా ప్రదర్శింపజాలరు. అతి సన్నిహితత్వము, స్నేహమూలేనిచో, ఒక పాత్ర ఇంకొకపాత్రతో వ్యవహరించుచో మాటలకూ, చేతలకూ ఒక ఆచ్ఛాదన తరచుగా పడుచుండును. (delibrate disguise) పాత్ర తన ఏకాంతములో తనలో తాననుకొను స్వగతములలోను, తన ప్రాణసమానులగు వారివద్దనో దాపరికములేకుండా తమ మనోభావాల వ్యక్తమొనర్తురు. అప్పటివారున్న స్థలమునుబట్టి సన్నివేశాన్నిబట్టి పాత్ర స్వభావాన్నిబట్టి దాని ప్రవర్తనను పరిశీలించి సముచితమైన అంశాలనే ఆపాత్ర పాత్రచిత్రణను పరిశీలించడం కోసం మనం గ్రహించాలి. (Every utterance must be tested by reference to the charecter of the speaker; his own situation and relation to the action; the possible bias given by his incidents, his sympathy and antipathy. To catch a phrase here and there and without thought of its context, to treat it as an impartial and authentic expression of opinions is in the last degree uncritical.[216D]

పాత్రచిత్రణలో వివిధ పాత్రల స్వభావాలలోని భేదసాదృశ్యముల చూపు పరిశీలన కొందరు చేస్తుంటారు. (comparison by contrasting characters) పాత్రలోని గుణాలకు సమాంతరంగా నిలుచునట్టి ఇంకోజాతి పాత్రను కల్పించడం రెండో పద్ధతి. శ్రీరాముని పాత్రకు భిన్నంగా రావణుని

పాత్రనూ అతని గుణగణాలకు 'తోడుగా,' 'సమాంతరంగా' హనుమంతుని పాత్రను కవులు ప్రవేశపెట్టియున్నారు. ఆంగ్లకవి థాకరీ అనునతడు "I don't control my character; I am in their hands, and they take me where they please" అని అనుట గమనార్హము. ఈ వాక్యమునననుసరించి చూచినపుడు ఒక విషయము స్పష్టపడును - తన ఇష్టమునకు తగినట్లుగా పాత్రల కల్పించి తాననుకొనినట్లే అవి ప్రవర్తించునట్లు చేయు రచయితగా ఒకడుంటే, పాత్రమీద యాజమాన్యమేమీ లేకుండా అది ఏ విధంగా లాక్కొనిపోతే ఆ విధంగా కథను నడిపే రచయిత ఇంకొకడున్నాడని - మొదటి కోవచెందినవాడు కావ్యనిర్మాణ సూత్రములను వల్లించిన సుశిక్షితుడు. ఇతడు తన పాత్రలను తన అదుపులో ఉంచుకొని తన కథా క్రమానికి తగినట్లుగా వారిని రూపొందిస్తాడు. రెండవకోవకు చెందినవాడు స్వతంత్రమైన ప్రతిభకలవాడై తన పాత్రలను చాలినంత స్వేచ్ఛనిచ్చి అవి తమంత తాము (బ్రహ్మ చేసిన సృష్టికి ప్రతిసృష్టిగా) ఆవిర్భవించునట్లు చేస్తాడు. వాల్మీకి భగవానుడీ రెండోకోవకు చెందినవాడు ఇందులో స్రష్ట కేవలము సాక్షీభూతుడు. పాత్రయే తన స్వభావాదుల నావిష్కరించుకొనినట్లుండును. (The former simply manufactures, and its effects are always within the fieldg of conscious and deliberate effort. The latter really CREATES, and for this reason, its out workings are often as stronge and inexplicable to tbe anthor himself. It is always better that a character should be mode to reveal itself than that it should be dissected from the outside, is thoroughly sound.[216E]

సంస్కృతాంధ్ర తమిళాది భాషలలోని కవులు ఆంజనేయుని పాత్ర ఏలాగుంటే బాగుంటుందో, ఏఆశయ సాధనకై అతనిని దేవతలావిర్భవింపజేసి అనుగ్రహించిరో ఆ విధముగా దానిని తీర్చి ఆదర్శమైన పాత్రగా (Idealized charater) రూపొందించారు. రామకార్య నిర్వహణకు తగిన సామర్థ్యాన్ని అతనికిచ్చి తన్నిర్వహణలో కృతకృత్యుడగుట కర్హమైన గుణగణాలనూ, శక్తులనూ అతనికి కల్పించి సహృదయునకు అతని పాత్రలోని ప్రముఖాంశములు తమంత తాము తెలియవచ్చునట్లు సన్నివేశముల కల్పించి ఆ పాత్ర ప్రవర్తనకు తగినంత స్వేచ్ఛనిచ్చి పోషించి యున్నారు.

సామాన్యులు కలలోకూడా చేయుటకు సాహసింపజాలని అలౌకికమైన, అద్భుత పరాక్రమ సాహసకృత్యములను హనుమంతుడు చేయగల్గెను. అందు వలన ఈ పాత్రకు కొన్ని విశేషగుణముల కవి ప్రసాదించి యుండెను. అలౌకి కాద్భుత సాధనలచేయు పాత్రను ప్రవేశపెట్టుట శ్రవ్యకావ్య కళారంగంలో సర్వసాధారణంగా సహృదయాభిరుచికి విందొనర్చుటకై చేయు కల్పనమే. అందువలన ఈ పాత్రలరూపమూ, చేష్టలూ, విచిత్రముగానూ, లోకాతీతము గాను ఉన్నట్లు కల్పించి కవి ఎన్నో కావ్యప్రయోజనాలను పొందును. (Fantastic, super human and abnormal qualities attributed) పాఠకునుత్తేజపరచుట, ఆశ్చర్యమున ముంచుట, కావ్యపఠనావ్యగ్రతలో విరతినిచ్చుట (Comic relief) కథనానికి కమనీయత నాపాదించుట, సన్నివేశ వైవిధ్యాన్ని సాధించుట, రసపోషణ చేయుట – ఇత్యాది ప్రయోజనములు వానిలో కొన్ని. ఇది భారతీయ సాహిత్యములన్నింటా గల్గినవిశేషమే. కావుననే దేవతలూ, రాక్షసులూ, భూతప్రేతపిశాచాలూ, వింత ఆకారాలు గల వ్యక్తులు, సింహాలూ, పులులూ, ఎద్దులూ, దున్నపోతులూ, కోతులూ, ఎలుగులూ, పాములూ, మకరములూ, ఏనుగులు, పక్షులూ మొదలగునవి ప్రవేశపెట్టబడి కావ్యానికి ఆకర్షణ కలిగించుచుండును. ఒకే జాతిలో కూడ స్థూలరోమ, వృశ్చిక రోమ, విద్యుజ్జిహ్వ కుంభకర్ణ, మూషికముఖ, శుకముఖాదులగు వారిని కూడా ప్రవేశపెట్టుట కలదు. పాశ్చాత్యులకు వీనిని అర్థము చేసికొనుట కష్టము కానీ భారతీయులకు ఇందులో క్లేశములేదని మానియర్ విలియమ్సు పండితుని అభిప్రాయము. "In the indian epics, the boundaries between the natural and the super natural, between earth and heavan, between the divine, human and animal creations are singularly vague and undefined; troops of deities and semidivine parsonages appear on the stage on every occasion. Gods and animals are ever changing places. The myths of indian epics are still closely intervowen with present indian faith."[217]

## 4 హనుమంతుని పాత్ర గూర్చి కొందరు పండితుల అభిప్రాయాలు.

ALIOUS WVRM అను ఆంగ్ల పండితుడు వాల్మీకి రామాయణ పరిశీలనలో హనుమంతుని పాత్రనుగూర్చి తెలిపియున్నాడు. 'రాముని సచివు

లలో ఇతడు ముఖ్యుడు. ప్రభువు ఆజ్ఞల నమలు చేయుటకు అందరికన్న ముందుగా నియమింపబడు కార్యనిర్వాహకుడితడే (Executive) దౌత్యా రాజనీతివేత్తగా (Diplomat) దూతగా (సందేశహరునిగా) పరరాజ్య పరిస్థి తులను ప్రచ్ఛన్నంగా పరిశీలించు గూఢచారిగా (Reconnaiteur) రాజకీయ సలహాదారుగా, ఆదర్శ అమాత్యునిగా వాల్మీకి హనుమంతుని సృష్టించెను. తన ప్రభువులగు రామసుగ్రీవుల కార్యముల నన్నింటిని తన బహుముఖమైన ప్రతిభతో నిర్వహించుటలో ఇతని కుశాగ్రబుద్ధీ, ఔచితీపరిజ్ఞానమూ, మానవ మనస్తత్వ పరిశీలనాదక్షత, సందేశముల నందించు సామర్థ్యము అతడు సువ్యక్తమొనర్చెను. దుర్ఘటములైన కార్యముల ననేకముగా సాధించుట, గడువులోపల సాధించుట అను పరిమితులున్నప్పుడు కార్యావసరములోని తొందరలనుబట్టి వ్యక్తి తాను సాధించు లక్ష్యమునే ప్రధానముగా నెంచి సాధనా మార్గములను ఎట్టివైనా పాటించుట జరుగును. ఒత్తిడికి లోనైనపుడు, ఏకైకముగా కృషిచేయుచో నీతి నిజాయితీల కుద్వాసనచెప్పి ప్రయత్నించుట దోషముకూడ కాదని అనిపించును. ఎట్టి కార్యముల సాధించినా హనుమంతు డుత్తమ సాధనాసంపత్తిచేతనే తన కార్యముల సాధించెనేకానీ నీచపు పద్ధతు లను పాటించలేదు. "In the author's general conception, HANUMAN, is an ideal minister characterised by his skill in reconnoitring and his discretion in tackling affairs. his psychological depth of counselling and his responsibility in his role as messenger, all his actions being motivated by loyalty to and concern for his master as well as Rama and endowed with a gamut of ideal character traits. Though, Valmiki, often employs the pattern of spontaneous improvisation in expliciting this side of HANUMAN'S character in different situations, its uniform ontlook clearly reveals the author's distinct conception of HANUMAN as an ideal minister."[218A]

ఎక్కడ ఏ విధంగా ప్రవర్తించాలో, ఏ రూపమున చరించాలో, ఎవరెవరితో ఏ తీరున భాషించాలో సుందరకాండమున చిత్రింపబడిన హను మంతుని పాత్రలో గోచరించును. అపార్థమున కవకాశమివ్వకుండా, తన సందేశమును సీత వినునట్లుగా మాట్లాడి, ఆమె తనను విశ్వసించునట్లు చేయు

నట్లు చేయుటలో అతనిశైలి, రావణునివంటి అధికార మదాంధుని వద్దకు చేరి వానికి నీతి బోధించుటలోని ధైర్యసాహసములు, లంకలో సాగించిన శత్రు నిర్మూలనారూప విధ్వంసక చర్యలు వాల్మీకి పాత్రచిత్రణలో ముఖ్యంగా గోచరించును. "The imaginalive depiction of HANUMAN'S fabulous super human powers of locomotion, super natural lustre, strength and valone, his HERCULEAN power and rage of demolition, his ardour for fight and pugnacity, mightvalour, heroism and skill in fighting the most valiant warrions and of his boastful and bombastic selff assertion ………in all these, the poet has an apportunity to project before the audience scencs ot awe imbued with a sentiment of heroic wonderment, so as to thrill the audience. In projecting such scenes, the poet, in order to bring them to their climax, exhausts all the resources of his poetic imagination, following the inspirations of the moment. As he makes HANUMAN the hero of such scenes, he will invest him with character traits fully appropriate to the highly imaginative and fubalous timbre which pervades these scenes. Thus, we can say, that the depiction of HANUMAN'S super human dimension is based on the bardic pattern of spontaneity. Yet, the consistency which emerges in all such similar scenes, never the less, shows that Valmiki had formed some definite conception of HANUMAN'S super natural dimension in his mind.' [218B]

అందువలన ఈ పాత్రను ఉదాత్తఫణితిలో తీర్చంమేకాక ఉదాత్త శైలిలో దానిని రూపొందించినాడను శ్రీ శ్రీనివాసశాస్త్రిగారి అభిప్రాయము సమంజసముగా నున్నది. The p.et has conceived character of HANUMAN in the great style and executed it also in grand style.[219]

మండోదరినిచూచి సీతగా భ్రమపడి ఆ సంతోషములో సంబరమొంది కొన్ని మర్కటచేష్టలు చేయుట, సీతను తన వీపుపై మోసుకొనిపోవుటకై ఆమె అనుమతి కోరుట, రావణ వధానంతరము సీతాదేవివద్దకువచ్చి ఆమెను

బాధించిన రాక్షసకాంతలను గోళ్ళతో చీల్చి, దంతములతో త్రవ్వి చంపుటకై ఆమె అనుమతిని కోరుట మొదలగు సన్నివేశములలో హనుమంతుని పాత్రలో కొన్ని కపిలక్షణములను వాల్మీకి చూపినాడనిపించును. ఎంత ఆదర్శీభూత మొనర్చిన పాత్రయైనా దానిని చీమూ నెత్తురూకల పాత్రగాదాని జాతిధర్మాన్ని కొంత చూపుట దోషముకాదు. "In all these episodes, monkeyish traits of his character take away somthing of the ideal character of HANUMAN. But we should not torget that Valmiki even when poitraying on ideal personality will delve deeply into human psychology. In a nut shall, HANUMAN is an ideal flesh and blood character, primarily an ideal counseller, with at times, the super natural dimeusion of a Hevenleam super monkey."[220]

సమీరకుమారవిజయము ప్రకారము: హనుమంతుని వ్యక్తిత్వం గురించి సంక్షిప్తముగా ఇందులో ఉన్నది. ఇతడు విద్వజ్జనులలో విద్వచ్ఛిరోమణి; కవులలో ఉత్తమకవి; గాయకశ్రేష్ఠులలో గాయకశ్రేష్ఠుడు; తపోనిధులలో తపశ్శాలి; యోగులలో పరమయోగి; ధీమంతులలో ధీమంతుడు; విరక్తులలో వైరాగ్యపరుడు; వీరులలో వీరాధివీరుడు; అప్రమేయుడు; జితేంద్రియుడు; వినయపరుడు; కార్యకోవిదుడు; సౌశీల్యనిధి; నిగర్వి; లోకజ్ఞుడు; ఆత్మశక్త్యజ్ఞుడు; కామరూపధరుడు; కామదూరుడు.

సకల దైవ ప్రభావముల్ సద్గుణములు
పరమ సుజ్ఞాన వైరాగ్య భక్తి కరుణ
లతుల కాంతి ప్రతాపంబు లైక్యమొంది
పవన నందన రూపమై పరిణమించె.[221]

రామాయణ రత్నాకరమను గ్రంథమున శ్రీ విద్యాప్రకాశానందస్వామి గారీవిధంగా హనుమంతుని పాత్రనుగురించి తెలిపిన అభిప్రాయములు: "బలపరాక్రమముల చేతను, కార్యదక్షత చేతను, వినయవిధేయతల చేతను, కర్తవ్యనిష్ఠ చేతను అందరి హృదయాలలో సుస్థిరస్థానము పొందిన పాత్ర ఇది. ఉత్సాహము, నిర్భయత్వము, పవిత్రత, ప్రభుభక్తి, ఇంద్రియ నిగ్రహము, విద్యావైదుష్యము మొదలగు ఉదాత్తగుణములన్నియు ఇతనిలో మూర్తీభవించినవి. హనుమంతుని రూపము వానరరూపమేకాని తేజస్సు

వానరతేజస్సు కాదని ప్రహస్తుడొకచో చెప్పినాడు. వానరశరీరము ధరించినా తనయొక్క ప్రయత్నాతిశయముచే మానవత్వమునుదాటి, దేవత్వమునుదాటి సాక్షాత్ దేవుడే అయి వెలసినవాడు ఆంజనేయుడు. ఉదారచరిత్ర, ఉదార వ్యక్తిత్వములతోపాటు మహోత్తమ సద్గుణములు కలిగియుండి, శంకరాంశ జుడై, రామ కింకరుడై వెలసిన హనుమంతుని జనులు సాక్షాత్తు దేవునిగా ఆరాధించుటలో ఆశ్చర్యములేదు. జగత్కల్యాణ కారకుడైన హనుమంతుడు మూర్తీభవించిన సద్గుణరాశి.[222]

భగవద్దత్తమైన శరీరమునకు సంబంధించినవితప్ప ఇతర లోపములేవీ హనుమంతుని పాత్రలో కనబడవు. తనకై తాను కోరదగిన ఏ ప్రయోజ నమూ ఆశించి హనుమంతుడు ప్రవర్తించిన సందర్భ మొక్కటికూడ లేదు. మానవులకు సర్వసామాన్యమైన అరిషడ్వర్గస్పర్శ ఏమాత్రమూ హనుమంతుని పాత్రలో కనరాదు. వాలి వధలో, శూర్పనఖావమానములో, సీతావహ్ని శుద్ధిలో, గర్భవతియైన సీతను త్యజించుటలో, శంబూకుని వధించుటలో రాముని చరిత్ర వివాదాస్పదమైనది. ఇట్టి వివాదమునకు ఆధారమగు సన్నివేశము హనుమంతుని జీవితమున ఒక్కటికూడ లేదు. ధర్మపరాయణత రాముని శీలమున ఎట్లు ముఖ్యమో రామసేవా తత్పరత హనుమంతుని శీల మున అట్టిదే. వెదకి చూచినా ఇతని శీలమున దోషమును చూడజాలము. బలం, వేగం, శౌర్యం, పరాక్రమం, ధైర్యం, సాహసం, దయ, వాత్సల్యం, పరోపకారత, ఆపన్నివారకత, జితేంద్రియత, నిస్స్వార్థ సేవాదీక్ష మొదలగు గుణములను ఆరాధించని వ్యక్తి లోకమున ఉండడుకదా. ఇన్ని గుణాల కాటపట్టయినందుననే హనుమ దైవముగా గుర్తింపబడెను. రామాయణమున మరి యే యితర పాత్రకు లభింపనిస్థానము హనుమంతునిపాత్రకు దక్కినది. రామ కింకరుడైన ఇతడు సీతారాములిరువురికీ 'శం'కరుడై తన శంకరాంశ మును సార్థకపరచుకొనిన లోకశంకరుడే. భగవంతునికి సన్నిహితులైన పురాణపాత్రలు ఎన్నో వున్ననూ దైవత్వానికి ఎదిగిపోయిన పాత్రలు ఎన్నో లేవు. హనుమంతుడు రామసేవకుడై ఆరాధనీయుడై దేవుడైనాడు. సీతా రాముల వరములకు పాత్రుడై జరామరణ రహితమైన చిరంజీవిత్వమును పొందిన మహాత్ముడీతడు. రామాయణమున కోతికూడ నీతితోప్రవర్తించినదను నానుడికి నిదర్శనమైన హనుమంతునిపాత్ర ఆరాధనీయమే కాక అద్భుతమైనది

కూడ. డాక్టర్ అప్పజోడు వెంకటసుబ్బయ్యగారు తెలిపినట్లుగా "అమేయమైన ఒక శక్తి, అద్భుతమైన యుక్తి, అచంచలమైన భక్తి సంగమించిన ఒక మహా పవిత్ర త్రివేణీతీర్థం అంజనేయుని వ్యక్తిత్వం. అనంత కల్యాణగుణపరిపూర్ణుడగు శ్రీరామునివంటి ప్రభువునకు సేవకుడై అతనిముందు తనప్రజ్ఞలచూపి, పొగడ్తలొంది, ప్రశస్తిని పొందుట అంజనేయునికొక్కనికే చెల్లినది. వ్యక్తి ఔన్నత్యానికీ, సమాజకల్యానానికీ దోహదం చేసిన ఒక మహనీయ జీవితమార్గం అంజనేయునిది. శక్తి, సామర్థ్యాలతోపాటు అవరోధాలను దాటగల్గు ఉపాయముకల్గి, అనుకొన్నదానికంటే అధికంగా విజయం సాధించుటవలననే 'చూచిరమ్మనిన కాల్చివచ్చినాడనుఖ్యాతికి అలవాలమైన శీలము హనుమంతునిది.'[223]

సీతాపహరణానంతరం రామాయణకథను నడిపించుటలో హనుమంతుని పాత్ర సూత్రధారుని పాత్రయే.[224] బహుముఖ వ్యక్తిత్వము కలిగిన హనుమంతుని జీవితము రామపరతంత్రమైనది రామభక్తునిగా, రామదాసునిగా, రామసేవకునిగా, రామమాతగా, రామసచివునిగా, రామసలహాదారుగా, రామవాహనముగా, రామకార్యతత్పరునిగా, రామరక్షాదీక్షితునిగా ఈతని శీలమెల్లవేళలా రామపరతంత్రమైనది. సకలవిద్యావేత్తగా, నవవ్యాకరణవేత్తగా, కళాకారునిగా, సంగీతకళానిధిగా, వాక్యకోవిదునిగా, మహాబలునిగా, మహావీరునిగా, మహావేగశాలిగా ఉండికూడ నిరహంకారుడై నిర్మలచిత్తుడై శిశుసదృశ అమాయకత్వముతోనుండుట (Child like innocence) ఇతని వ్యక్తిత్వమందలి విశేషము. ఒక కార్యమునుగురించి తెల్సికొని, దానిని సాధించాలను ఇచ్ఛతోపాటు సామర్థ్యము కలిగికూడ ఏమీ తెలియనట్లుండుట గొప్పవిషయమని ఆంగ్లోక్తి. (To know, to will and to do and yet keep silent about one's powers is a great thing.)

హనుమంతుని పాత్రకున్నంత ఆకర్షణ రామాయణమందలి యితరయే పాత్రకును లేదు. (Charisma) దానికనేక కారణముల చూపవచ్చును. దేహబలముతో సాధించు కార్యములనతడు మహాసాహసముతో సాధించెను. ఇతని తోడి వానరులెవ్వరును ఇతను చూపినంత జవసత్త్వ పరాక్రమములను చూపలేదు. కార్యనిర్వహణకు కేవలము బలమున్నంతనే చాలదు. దానికి అవసరమగు బుద్ధిబలమును, యుక్తిని, ఉపాయమును హనుమ కొల్లగా కలిగియుండెను. ప్రయత్నించిన ప్రతికార్యమున ఫలసిద్ధిని పొందినవాడు పావని.

ఇతనికేవిషయములోను ఓటమిలేదు. ఏ పనికి నియోగింపబడినా, మారు మాటాడకుండా, ముందు వెనుక ఆలోచించకుండా, ఇతరుల సాహాయ్య మర్థించకుండా, జాగువేయకుండా తక్షణం ఆ పనిని సాధించడానికి పూనడం హనుమంతునికొక్కనికే చెల్లినది. తలచినపని నెరవేరువరకు మనసును ఇతరత్రా మళ్ళించకుండా, విశ్రాంతికై వేకారకుండా, రామబాణం లక్ష్యశుద్ధి కలిగినట్లుగా కార్యంసాధించుట ఇతనిప్రత్యేకత. వాలి సుగ్రీవులకన్నా బలశాలియై కూడ వారిని యెల్లప్పుడు గౌరవించెనేకాని మీరి చరించలేదు. రామునికి రాక్షస వినాశమున ఇతని సహాయ మనల్పమైనది. రామకైంకర్యదీక్షలో ఇతనికి సాటిరాగలవారే లేరు. సందర్భోచిత సలహాలనిచ్చు సచివునిగా, రాజకీయపుటెత్తులను పరిశీలించి రాబోవు పరిస్థితులనూహించి, ప్రమాదములు రాకమునుపే వానిని ఊహించి నిర్భయముగా ప్రభువుయెదుట తన అభిప్రాయముల ప్రకటించి ప్రభువు కర్తవ్యమును సరిగా నిర్ణయించుకొనుటకు సామీరి నిర్వహించినపాత్ర గొప్పది· శ్రీ శ్రీనివాసశాస్త్రిగారి మాటలలో: "Many things in his character attract one; People yield their hearts so thoroughly to him. He was great nearly in every sense of the word. He performed great deeds of volour, of physical strength which no other living character of his time could have performed. These deeds required the greatest strength, greatest will power, fell to his lot, and he performed then with admirable thoroughness of execution. They were done on the highest level of devotion, rectitude, and sense of duty. Superlatives crowd HANUMAN as you contenplate him. He was most devoted to Rama and allowed no man to come near him in his love for Rama, and his desire to perform all the things, whether he ordered them or not. He is wise, he is moderate in his counsel. He is always ready to see things while yat they are only comming. Few can approch HANUMAN in sheer greatness, in weight of achievement, He belonged to the VANARA race, which is inferior to the race of man. It is therefore from the nature of a monkey that HANUMAN, has risen. Our appreciation of his greatness will be enhanced when

we remember the fact that by nature, by constitution, he was a monkey "[225] వానరుడై కూడ నరులకన్నా ఘనకార్యాలు సాధించి నాడు కనుకనే హనుమంతునికింత ఖ్యాతి.

హనుమంతుడు సాధించిన ఘనకార్యములు : బాలుడుగా నున్నప్పుడే సూర్యబింబం పట్టుకొనపోవుట, సూర్యునివద్ద సకలవిద్యల నేర్చుట, రామ సుగ్రీవ మైత్రీ సంఘటనము, సాగరలంఘనము, సీతాన్వేషణము, లంకా దహనము, రావణసభలో రావణునికి నీతివాక్యముల బోధించుట, సేతునిర్మాణ కార్యభారము పూనుట, విభీషణునికి శరణాగతి నిప్పించుట, యుద్ధమున శ్రీరామాదుల పక్షమున పోరుట, సంజీవనీ పర్వతము ననేకమార్లు తెచ్చుట, శ్రీరామలక్ష్మణులను కాపాడుట, రామ సైన్యమునకు పెట్టనికోటగానుండుట, మైరావణవధలో గుట్టుగా కార్యసాధనచేయుట, శతకంఠ (సహస్రకంఠ) వధలో తోడ్పడుట, అశ్వమేధయాగమున హయము ననుసరించివెళ్లుట, రాము నికి సన్నిహిత పరిచారకుడై ఉండుట, సీతారాములవద్ద తత్త్వరహస్యముల నెఱుగుట, మోక్షమును కోరకుండా రామధ్యానదీక్షలో నిత్యకైంకర్యాసక్తితో చిరంజీవిగా నుండుట, సత్యభామ, గరుక్మంత, తుంబురు నారదుల గర్వభంగ కారకుడగుట, భీమార్జునులకు తోడ్పడుట, నరవానరుల నాపదలో ఆదుకొనుట ఇత్యాది కార్యములు.

## హనుమంతుడు చంపిన (చంపుటకు హేతువయిన) రాక్షసులు:

అశోకవన విధ్వంసవేళలో 1 జంబుమాలి మరియు 8000ల మంది రాక్షసులు, మంత్రిపుత్రులేడ్గురు, పంచసేనానులు, అక్షకుమారుడు. మొత్తం ఎనిమిదివేల పధ్నాలుగురు.

## యుద్ధరంగమున ఇతనిచే చచ్చినవారు :

1 జంబుమాలి, (వీడింకొకడే) 2 ధూమ్రాక్షుడు, 3 అకంపనుడు, 4 దేవాంతకుడు, 5 త్రిశిరసుడు, 6 కాలనేమి, 7 మాల్యవంతుడు, 8 స్థూల జంఘుడు, 9 మహాదంష్ట్రుడు, 10 మహోదరుడు, 11 శార్దూలముఖాదులగు ఏడ్గురు, 18 మైరావణుడు, 19 నికుంభుడు, 20 ఖడ్గరోముడు (వీడు రాము నిచే హతుడైనట్లు కొన్ని రామాయణములలో కలదు.)

## హనుమంతుని వ్యక్తిత్వములోని ముఖ్యాంశములు :

1 పాండితీబుద్ధివిశేషములు – వాక్యకోవిదత్వము, 2 సకలశాస్త్ర సకల కళావేతృత్వము - తత్త్వజ్ఞానము, 3 భక్తి, 4 రామసేవ, 5 రామనామ ప్రచారకత్వము, 6 దూతగా – దౌత్యవ్యవహర్తగా – సందేశహరునిగా, 7 ఆజన్మ బ్రహ్మచారిత్వము - జితేంద్రియత, 8 నిరహంకార వినయసౌశీల్యం, 9 రాజనీతిజ్ఞత, 10 పరాక్రమ ధైర్యసాహస శౌర్యము, 11 అపద్రక్షకత, 12 కామరూపత, 13 చిరంజీవిత్వము-అజరామరత్వము, 14 ఆచార్యునిగా, 15 యోగిగా, 16 జీవన్ముక్తిమార్గ ప్రదర్శకునిగా, 17 మహాత్మునిగా, 18 ఆరాధ్య దైవముగా, 19 భావిబ్రహ్మగా, 20 జ్ఞానిగా ఎన్నో అంశము లున్నవి. వీనినిగూర్చి ప్రత్యేకముగ కృషిచేసి తెలియదగిన విశేషములెన్నో ఉండును కాన వానిని భవిష్యత్పరిశోధనకు విషయముగా ఎంచి విరమించు చున్నాను. (10వ అధ్యాయములో తెలిపియున్నవి తప్ప)

అధ్యాయము—10

## హనుమంతుని వ్యక్తిత్వ గుణగణాది విశేషములు.

### 1 దివ్యాంశసంభూతుడు

హనుమంతుడు దివ్యాంశసంభూతుడు. సర్వదేవతల అంశలు త్రిమూర్తులలో చేరి రుద్రునిద్వారా తేజోరూపమున వెల్వడి పృథ్వి, అగ్ని, వాయుదేవతల సహకారముతో అంజనాదేవికి లభించి జన్మించినవాడు. పంచభూతములకితని జన్మతో ప్రత్యక్షసంబంధముండుట విశేషము. దుష్టసంహారమునకు భగవంతుడు శ్రీరామావతారము దాల్చగా అతనికి కింకరుడై సేవింపులొనర్చుటకు సాక్షాత్తు శివుడే అంజనేయుడై జన్మించెను. రుద్రాంశ సంభూతత్వములతో పాటు, వాయునందనత్వము ఇతని విశిష్టతకు కారణమైనది. శ్రీ రాముని తన ఆరాధ్య దైవముగాపొంది అతనినే సేవించుచుండి శ్రీ సీతారాముల కలయికకు హేతుభూతుడైనందున రామాయణమున శ్రీ సీతారాములితని తమ పుత్రునిగానే భావించి వాత్సల్యము చూపిరి. అందువలన శ్రీ హనుమంతుడు శ్రీ సీతారామ పుత్రునిగా భక్తాదులు భావించుచుండుటకు వీలయినది. పుట్టుకతో వాయునందనుడగుట అనిలవేగమును, రుద్రతేజోరూపమున సకలదైవాంశముల పొందినందున లోకాతీతమగు అసాధ్యక కార్యముల సాధింపగల్గినవాడయ్యెను. ఇంద్ర వజ్రాయుధపు దెబ్బను సహించి జీవించినవాడై, సర్వదేవతలను తపముచేసి మెప్పించకయే వారినుండి వరములను అయాచితముగా పొందిన అదృష్టశాలి యితడు. దేవతలను తా నుపాసించకపోవుటేకాక, దేవతల బాధలనే తీర్చుటకు అవతరించిన సుకృతి యితడు. శ్రీరాముని వలెనే అంజనేయుడు కూడ జగద్రక్షకై అవతరించెను. 'అంజనేయావతారేణ జాతః సంరక్షితం జగత్.'[226] పురాణములలో అనేకులు యక్ష రాక్షస గంధర్వాదులు తపోదీక్షలో బ్రహ్మ రుద్రాదుల మెప్పించి వరములపొంది ఆ తర్వాత గర్వముతో విర్రవీగి లోకకంటకులైనట్లు జగద్విదితము. హనుమంతుడట్లుకాక ఎన్నో అద్భుతమగు వరములను పొంది లోకకల్యాణ రూపమగు కార్యములకు, శ్రీరామసేవకు తన శక్తి యుక్తులను ధారపోసెను.

దీనివలన ఇతని నిష్కామకర్మనిరతి వ్యక్తమగును. నిజ మనోరథమునొక దానిని ఏర్పరచుకొని, స్వార్థమునకై ఇతడు పాటుపడినట్లు చూపజాలము. శ్రీ విష్ణువవతారమగు శ్రీరాముని సమాశ్రయ కారణమున ఇతడు గొప్ప పదమును పొందెను.

పశుర్మనుష్యః పక్షీవా యేచ వైష్ణవ సంశ్రయాః।
తేనైవ తే ప్రయాస్యంతి తద్విష్ణోః పరమాం పదం॥

హనుమంతుడు దివ్యాంశ సంభవుడు కావుననే ఇతనికి దివ్యదృష్టికలదు. అర్జునునితో పందెం వేసినపుడు సేతువు క్రుంగనందుకు కారణము నతడు తన దివ్యదృష్టితోచూచి కూర్మరూపమున భగవంతుడుండెనని గ్రహించి తన ఓటమిని అంగీకరించెను. సౌగంధిక పుష్పముకొఱకై భీముడురాగా, అతడు తెలుపకముందే అతడు తన తమ్ముడని దివ్యదృష్టితో గుర్తించెను. త్రిశూల రోముడనువానిని చంపుచో వాడు స్ఫటికశిలలో దాగినట్లు ఈ దివ్యదృష్టి తోనే తెలిసికొనెను.

"హనుమంతుడు సర్వదేవతలకు శరణ్యుడు, భక్తవత్సలుడు, త్రాత, సర్వకామదుడు, సకలదేవతలచే నుపాసింపబడువాడు. ఒక ముఖమున శివ బీజాక్షరముకలవాడు. మూడు భాగములలో త్రిమూర్తులుకలవాడు. భవిష్య ద్బ్రహ్మ, మహాయోగి, మహాజ్ఞాని. ఇతడు నారసింహ, గరుడ, వరాహ, హయగ్రీవ ముఖములనుగూడ కలిగి పంచముఖుడనబడును. ఇతడు ద్వాదశా దిత్య, ఏకాదశరుద్ర, అష్టవసు, బ్రహ్మ విశ్వదేవతలచే సదా కూడి యుండు వాడు. షోడశ శక్తులతో కూడినవాడు. ఇరువది క్షేత్రపాలకులతో, వటు కాదులతో అలంకరింపబడినవాడు సర్వతత్త్వములతో, వివిధ ఛందస్సులతో సేవింపబడువాడు. ముప్పదిరెండు నృసింహ రూపములతో పరివేష్టింపబడి యుండువాడు. అట్లే యోగినీగణములతోనూ, భైరవగణములతోను అరువది నాలుగు వాయుజనిత రూపములతోను పరివేష్టింపబడి యుండువాడు.[227]

శ్రీమద్భాగవతంలో కృష్ణుడు తన విభూతులను పేర్కొనుచో హనుమంతుని కూడ తన విభూతులలో ఒకటిగా పేర్కొనెను.

వాసుదేవో భగవతం త్వంతు భాగవతేష్వహం।
కిం పురుషాణాంతు హనుమాన్విద్యాధ్రాణాం సుదర్శనః॥

(అధ్యా 16 శ్లో 29)

అందువలన హనుమంతుడుపాసనలకు, పూజలకు దైవముగా గుర్తింప బడెను. వాల్మీకి మహర్షి హనుమంతుని అప్రాకృతపురుషునిగానే వర్ణించెను. 1 రావణునుని ఎత్తుకొని అగ్నికుండము కడకు హోమముచేయుటకై యజ్ఞ పశువును కొనిపోయినట్లు కొనిపోయెదనుట, (సుందర. సర్గ 13 శ్లోం 50 అర్థమైనం) 2 'నహి త్వాం ప్రాకృతం మన్యే వానరం వానరర్షభ' అని సీత అనినది, (సర్గ 36 సుందర. శ్లో 9) రావణుడు హనుమంతుని తన సభలోకి తేబడుచుండగా చూచి 'కిమేష భగవాన్నందీ భవేత్స్వాక్షాది హాగతా' అని అను కొనెను. (సందర. సర్గ 50 శ్లో 2) శ్రీ సీతారాముల కలయికకు కారణమై వారిద్వారా శ్రీరామపరిష్వంగము, చిరంజీవత పొందిన హనుమంతుడు రామాయణములోనేకాక ఏ సాహిత్యములోనూ కనబడని విశిష్టమైనపాత్ర.

## 2 హనుమంతుని వినయ సౌశీల్యాదులు

హనుమంతుడు ఆజన్మ బ్రహ్మచారి. బ్రహ్మచర్యమను దానిని గూర్చి, తదావిర్భావమును గూర్చి తెలియదగిన అంశమున్నది.

బ్రహ్మ ఆవులించగా రుద్రుడు జన్మించెను. ఆ జన్మించిన రుద్రుడు సగము స్త్రీగా, సగము పురుషునిగా అవతరించెను. బ్రహ్మ అతనిని వేరు వేరుగా రూపొందించెను. అట్లు వేరైన రూపములనుండి పురుషరూపమునుండి ఏకాదశ రుద్రులు జన్మించిరి. అట్లే స్త్రీభాగముగా ఉన్న రూపంకూడ అనేక రూపములైనది. ఏకాదశరుద్రులు బహు తేజోగుణవిశిష్టులు. స్త్రీ పురుషాంశలు కల రుద్రునినుండి కాక కేవలం పురుషాంశంనుండి వచ్చిన ఏకాదశరుద్రుని నుండి ప్రభవించిన కారణముననే హనుమంతునకు ఆజన్మ బ్రహ్మచారిత్వము కలిగెను. ఈ అంశము విష్ణుపురాణమునందున్నది. ఈ ఆజన్మ బ్రహ్మచర్య మతి కఠోరమైనది. లోకస్థులకు జనులకీస్థితి నూహించుటకుకూడ వీలుకాదు. (జీవశాస్త్రమీనాడెన్నో వైజ్ఞానిక సత్యముల తెలుపుచున్నది. సృష్టిలో ప్రతి ప్రాణిలో 'X' 'Y' అను క్రోమోజోములుండు స్థితినిబట్టియే సృష్టిలో స్త్రీ పురుష విభాగ మేర్పడుచున్నదని నిరూపితము. కేవల పురుషధర్మమూ, కేవల స్త్రీ ధర్మమూ ఏ పాత్రలోనూ ఉండవనియు స్త్రీ పురుషుల కలయిక వలన జన్మించువారిలో స్త్రీ కావడానికి గానీ, పురుషుడు కావడానికిగానీ గర్భస్థ శిశువుగానున్న సమయముననే ఈ క్రోమోజోముల ఏర్పాటు నిర్ణయింప

బడి శిశువునకు లింగనిర్ణయము జరుగునన్నది శాస్త్రీయసత్యము. ఈ కారణమున వయోచితమగు భావములు స్త్రీలకు పురుషులయెడ, పురుషులకు స్త్రీలయెడ ఆకర్షణాది వికారములు కలుగుచుండుననియు సభ్యతా సంస్కారాల వలన, ప్రవర్తనా నియమాదుల వలన వ్యక్తులు తమ హృదయస్థ వికారాదులు దాచ గలిగినా, స్పందనను ఆపజాలరని శాస్త్రజ్ఞుల అభిప్రాయము.) అంజనేయునికి స్త్రీ దర్శనమాత్రమున ఎట్టి స్పందనగానీ, భావవికారముకానీ కల్గినట్లు సాహిత్యాధారాలు లేవు. అందువలన ఇతనిని అస్ఖలిత బ్రహ్మచారి అని వ్యవహరించుచున్నారు. రావణాంతఃపురములో వివిధ స్థితులలో అనాచ్ఛాది తలై వివిధశృంగారావస్థలలో, రతిసంరంభముతో, రతిశ్రమాదులతో నుండిన ఎందరో స్త్రీల సీతడు చూచికూడ ఏవిధమైన మనశ్చాంచల్యము పొందని స్థిరచిత్తుడాంజనేయుడు.

సుగ్రీవాది వానరులందరు బహు స్త్రీ లోలురుగా నుండగా తమ జాతి ధర్మమునకు భిన్నముగా ఆంజనేయుడుండెననగా ఆతని ఆజన్మ బ్రహ్మచర్యమే అందుకు కారణమనవచ్చును. ఈషణత్రయదూరుడై నందున ఈతని శరీర మున రోమరోమమునసేకాక హృదయమందుగూడా రాముడే నిండియుండెను. 'అంతా రామమయం బీజగమంతా రామమయం'బని రామదాసు కీర్తనలలోని భావ మాంజనేయునియెడ అన్వయించినంత ఔచిత్యముతో ఇంకెవరికినీ చెప్ప జాలము. 'సర్వం విష్ణుమయం జగత్' అని అనినట్లుగా హనుమంతునికంతా సీతారామ మయమే.

బ్రహ్మచర్యమనగా దేహమూ, బుద్ధీ రెండూ విశుద్ధములై అనుభూతికి గల ముఖ్యావరణనిరోధము తొలగియుండుట. కేవలము సంభోగత్యాగము బ్రహ్మచర్యముకాదు.—

కాయేన మనసా వాచా సర్వావస్థాసు సర్వదా।
మైథున దర్శన త్యాగో బ్రహ్మచర్యం ప్రచక్షతే॥

—అని యాజ్ఞవల్క్య ప్రమాణము ప్రకారము వాక్కునను, మనస్సునను (భావములోను) అట్టి భావము లేకుండుటే బ్రహ్మచర్యము. మైథునదర్శనము, స్పర్శనము, కేళీ, కీర్తనము, గుహ్యభాషణము, సంకల్పము, అధ్యవసాయము, క్రియానివృత్తి అని విషయతృష్ణ ఎనిమిది విధములని శంకరభగవత్పాదులు పేర్కొని యున్నారు. భగవద్రామానుజులు విషయతృష్ణను స్త్రీ భోగ్యతా

బుద్ధిగా పేర్కొనిరి. ఆత్మరతుడైనవానికి బ్రహ్మచర్యమే ముఖ్యము. శంకర రామానుజుల జీవితమే ఇందుకు నిదర్శనము. ముఖ్య భక్తుడగునేని గృహస్థుడుగా నుండియు సదా బ్రహ్మచారిగానే యుండును.

బ్రహ్మచారి యైనందున హనుమంతుని జితేంద్రియునిగా చెప్పవచ్చును.-

ఇంద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే।
ఏతైర్విమోహ యిత్యేష జ్ఞాన మాకృత్య దేహినం॥
తస్మాత్త్వ మింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ।
పాప్మానం ప్రజహిహ్యేనం జ్ఞాన విజ్ఞాన నాశనం॥

— అని గీత (3 అధ్యా. 40-41 శ్లో.)లో తెలిపినట్లుగా పంచేంద్రియములను తొలుత నిగ్రహించి ఆత్మజ్ఞానమును అనుభవజన్య జ్ఞానమును నశింపజేయునదియు, పాపస్వరూపమైన కామమును లెస్సగా విడుచుటయే జితేంద్రియత. ఆహార నియమము, అప్రతిగ్రహము, కామజయము, యోగాభ్యాసము కలవారు నిగ్రహానుగ్రహ సమర్థులగుదురని అందువలననే ఆంజనేయుడు అష్టసిద్ధుల నొసగగల్గువాడయ్యెనని పెద్దలందురు.

## 3 హనుమంతుడు అహంకార రహితుడు

ఇతడు నిరహంకారి. ఇతనికి స్వాతిశయమనునదియే లేదు. సీతాదేవికి శ్రీరామసందేశమందించు వేళలో తన బలము నుగ్గడించుచో తాను సామాన్యమైన ఒక కోతినని చెప్పుకొనెను. తనకంటే ఎంతో గొప్పవీరులు రామ సుగ్రీవులవద్ద నున్నారని చెప్పెను. ఏదైన ఒక కార్యముపై పంపుచో ప్రభువగువాడు తక్కువశ్రేణిలోని వారినే దూతగా, సందేశహరునిగా పంపుదురనియు, కావున తనను చూచిమాత్రమే సుగ్రీవసైన్యములోని బలాబలముల మదింపు చేయరాదని సీతకు తెల్పిన నిరహంకారి సామీరి. సాగర లంఘన సమయమున సూర్యునికి, ఇంద్రునికి, వాయువునకు, బ్రహ్మాదులకు, సీతారాములకు నమస్కరించి సాగిపోవుట ఈతని వినయశీలమును తెలుపును. సీతా సందేశము కొనివచ్చిన తర్వాత వానరులాంజనేయుని పొగడుచుండగా, సుగ్రీవుని కార్యము శ్రీ సీతారాముల కృపాప్రసాదముచే తనచే సాధింపబడెనని చెప్పెనేకానీ తన శ్రమనుగూర్చి, గొప్పతనాన్నిగూర్చి చెప్పలేదు. ఇట్లే సంజీవనిని తెచ్చిన వేళలోను, శతకంఠాది రాక్షసులపై దాడి వెడలుచో తా

నొనర్చిన జవసత్త్వాది పరాక్రమపూరిత కార్యములకు రామానుగ్రహమే కారణమని పేర్కొనుట ఈతని నిరహంకారత బాటును. రావణసభలో "దాసోహం కోసలేంద్రస్య" అని తనను రాముని దాసుగానే చెప్పుకొనెనేగాని తననుగూర్చి గొప్పలను పలుకలేదు. సావధానముగా స్వామికార్యమును చూచువాడే దాసుడని అందురు. (దంసయతే స్వామి కార్యాణి వావధానేనేం దాసః) తన స్వామికి పరతంత్రుడై జీవించినవాడు ప్రాణనందనుడు. He came to know the truth of the cycle of time, the purpose of the YUGAS (యుగములు) each turn of the wheel cansing tne advent of the lord with all the attendant paraphernalia. He realized the importance of time, its consant movemeut and his own state as a bird of passage. Through devotion and love to his lord he should seek to escape the merciless fargs of time, that he should utilise every movement of his life according to the will of his master [228] అందువలన ప్రసన్నుడు తనను అందరికన్నా తక్కువగా భావించుకొనునేకాని తనను శ్లాఘించుకొనడను సూత్రమునకీతడుదాహరణము. ('కార్యం నైర్భ్యాను సంధానం' ప్రసన్నా మృతం)[229] తాము హనుమంతుడొనర్చిన ఉపకారములకు ప్రత్యుపకారము చేయలేక అతని ముఖమును చూడలేకున్నామని శ్రీరాముడు తెలిపినపుడు హనుమంతుడు 'ప్రభూ! మీరు సర్వజ్ఞులు. మేము వానరులమగు శాఖా మృగములము. సముద్రమును దాటుట, లంకను దహించుట, రాక్షసులను చంపుట, తమరాజ్ఞాపించిన కార్యముల చేయుట ఇవి మీ ప్రతాపమువలననే జరిగెను. వీనిలో నా ప్రయోజకత్వము శూన్యము. మీ ముద్రికాబలముచే సముద్రమును గోష్పాదమువలె దాటితిని. అ ముద్రికనుచూచి జానకి శాంతించెను. అమె శోకాగ్నియే లంకను దహించెను. ఆమె చూడామణి బలముచే నేను మరల సముద్రమును లంఘించి మిమ్ము చూచితిని. నాకు నిత్యానపాయినియైన భక్తిని మీయందు ప్రసాదించిన చాలును' అని హను మంతుడు పలికిన పలుకులు కేవలముపచార వాక్యములు కావు. అతని నిజ చిత్తస్థితియే అది.[230]

శ్రీమద్రామాయణారంభమున వాల్మీకి మహాముని నారదులవారిని తన కావ్యనాయకుడగు శ్రీరామునకుండదగు షోడశగుణముల పేర్కొనియున్నాడు. ఇట్టి దుర్లభములగు గుణములుకల శ్రీరాముని ఆశ్రయించి అతనివలె ఆ

గుణముల నన్నింటినీ కలిగినవాడు కాకున్నను ఆ గుణ ప్రపూర్ణుడగు పర మాత్మ నాశ్రయించిన సజ్జనుడు అంజనేయుడు. (కోన్వస్మిం త్సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్ .............................................. జాతరోషస్య సంయుగే.— (బాలకాండ 2, 3, 4 శ్లో. 1 సర్గ.)

1. గుణవాన్ అనగా తనకన్నా అల్పులతోకూడ కలసియుండగల సౌశీల్యం కలవాడు.
2. వీర్యవాన్ అనగా చేయదలచిన పనిని చేయునట్టివాడు. (పట్టుదల కలవాడు.)
3. ధర్మజ్ఞః అనగా ఇహలోక పరలోక ధర్మముల తెలిసినవాడు.
4. కృతజ్ఞః అనగా అపకారములను మరచి ఉపకారములను గుర్తుంచుకొను వాడు.
5. సత్యవాక్యః అనగా పొగడ్తలకై అబద్ధములాడక, హితవాక్యములగు సత్యములను భాషించువాడు.
6. దృఢవ్రతః అనగా ప్రతిజ్ఞ నెరవేర్చుకొనువాడు.
7. చారిత్రేణ చకోయుక్తః అనగా పెద్దలు మెచ్చుకొను నడవడికలవాడు.
8. సర్వభూతేషు హితః — సమస్త ప్రాణుల హితము కోరువాడు.
9. విద్వాన్— సకలమైన పాండిత్యము కలవాడు.
10. సమర్థః— కార్యనిర్వహణాదక్షుడు.
11. ఏక ప్రియదర్శనః — ఏ అవస్థలో చూచినను ఆకర్షకమైన అందము కాలవాడు.
12. ఆత్మవాన్— ధైర్యము కలవాడు.
13. జితక్రోధః— కోపము నధిగమించినవాడు.
14. ద్యుతిమాన్— ఆధ్యాత్మిక తేజస్సుతో వెలుగువాడు.
15. అనసూయకః— పరుల అతిశయమునకు సంతోషపడువాడు.
16. జాతరోషుడు — ఇతని కోపమునకు ఎదుట దేవతలు మొదలుకొని ఎవ రును నిలువజాలకుందురు.

——కావున హనుమంతు డీవిధమగు షోడశగుణపూర్ణు నాశ్రయించి ఆ గుణముల నారాధించి వాని నాకలించుకొనిన సత్ జనుడు. భగవదర్పితమైన కర్మమును 'సత్' అని అందురు. అది కలవాడు సజ్జనుడు.

హనుమంతుడు శ్రీరాముడు ప్రతిష్ఠించిన లింగమును పెకలించుటకు ప్రయత్నించిన కథలో హనుమంతు డహంకరించినట్లు భావించుటకు వీలులేదు. రాము డెంతచెప్పినను వినకుండా హనుమంతు డీపనిని చేసినందుకు శతానందుడే ప్రశ్నింపగా వసిష్ఠమహర్షి తెలిపిన సమాధానము దానిని విశదపరచునదై యున్నది.

శ్రీరామ లింగంబు సికతా మయంబుగాఁ
  జింతించు లోకుల భ్రాంతిబాపఁ
బరఁగ సాంబద్రోహ మొదవించి ఘనుడైన
  నెఱి దూలునను మాట నిర్వహింప
నతలాది లోకముల్ వ్యాపించె శివుడన్న
  రాముబాక్యము నిదర్శనముసేయ
నణు రేణువైన రామావ నీశుడు నిల్పి
  నొరుల కసాధ్యమౌ టెఱుకపరుప

దలచి రామనాథ దైవ శోర్త్స్వాటనో
ద్ధతి వహించెఁగాక ధర్మవేది
పరమ పుణ్యుడతడు ప్రత్యక్ష పరమేశు
డజ్ఞుడే చెలంగ.[231]

## 4 రామభక్తుడు – రామనామ (భక్తి) ప్రచారకుడు

ఈశ్వరుని యందలి పరమ ప్రేమయే భక్తి. 'సాపరానురక్తిరీశ్వరే' 'సాతస్మిన్ పరమ ప్రేమరూపా'. భగవంతుడు నావాడు అను మమకారమే భక్తి. సర్వేంద్రియములకు నధిష్ఠానమైన భగవానుని నిర్మలమైన ఇంద్రియములచేత తత్పరబుద్ధితో ఫలాభిసంధి రహితముగా సేవించుటయే భక్తి. ఇది కేవలము అనుభూతి యోగ్యమే. ఇది అలౌకికము. భక్తికిని లోక సాధారణమగు ప్రేమకును ఎంతో తారతమ్యమున్నది. భక్తి ఇట్టిది అని

ఊహించుటకు బుద్ధిశక్తి చాలదు. దాని స్వరూపము తెలుపుటకు భాషాశక్తి చాలదు. భక్త్యనుభవము అంతఃకార్యము; ఇతరులకది గోచరింపదు. కాయికభక్తి, వాచకభక్తి, మానసికభక్తి అని యిది స్థూలముగా మూడువిధములు. భక్తుని భక్తితీవ్రతనుబట్టి భగవంతునకు చేతనునకుగల సంబంధమునుబట్టి ఇది తొమ్మిదివిధములుగా మారును. పరమార్థదృష్టికిది ఏకరూపమే అయినను చేతనుల పూర్వసంస్కారమునుబట్టి, అభిమానాదులనుబట్టి పలు రూపముల నొందుచుండును. ప్రహ్లాదునిలో స్మరణాసక్తిగా, అంబరీషునిలో పూజాసక్తిగా, వృద్ధవార్జునునిలో సఖ్యాసక్తిగా, దేవకీ యశోదా కౌసల్యలలో వాత్సల్యాసక్తిగా, రుక్మిణీ సత్యభామలలో కాంతాసక్తిగా, బలి విభీషణులలో ఆత్మనివేదనాసక్తిగా, సనత్కుమారాదులలో తన్మయాసక్తిగా, గోపికలలో పరమ విరహాసక్తిగా, నారద వ్యాసులలో గుణసంకీర్తనాసక్తిగా ఉన్నట్లు శ్రీ హనుమంతునిలో దాస్యాసక్తి రూపమగు భక్తికలదు. అందువలన విరహాసక్తి భక్తియొక్క పరమలక్షణమని శ్రీ యామునాచార్యులనినట్లుగా శ్రీరాము నెడబాసియుండని సాన్నిధ్యమునే అంజనేయుడు సదా కోరుచుండుట కిదియే హేతువు. "దర్శనం పరభక్తిః స్యాత్, పరజ్ఞానంతు సంగమః, పునర్విశ్లేషణ భీరుత్వం పరమా భక్తి రుచ్యతే" భగవద్దర్శనం పరభక్తి; ఐక్యము పరిజ్ఞానం; అట్టి యైక్యమునకు భంగము రాకూడదనెడి ఆకులపాటు పరమభక్తి.[232]

భక్తియోగాదులగూర్చి భగవద్గీతలో ఎంతయోవిలువైన విషయమున్నది. 'యోగినామపి సర్వేషు మద్గతే నాన్తరాత్మనా' 'మచ్చిత్తా మద్గత ప్రాణా' 'మయ్యావేశ్య మనోయేమాం' 'యోనహృష్యతి నద్వేష్టి' అను శ్లోకములలో తెలుపబడినట్లుగా హనుమంతుడు యోగులలో శ్రేష్ఠుడై భగవంతునకు ప్రియమైన వాడయ్యెను.[233] ఇట్టిభక్తుని ఏకాంతిక భక్తుడందురు. ఇతనినే ముక్తుడనియు, భాగవతుడనియు, సత్పురుషుడనియు వ్యవహరింతురు.

"యదైకాంత్యం గతౌ విష్ణౌ భగవత్యాత్మ భావనే।
తద్వైష్ణవా భాగవతః సంత యిత్యాభి ధీయతే॥"

హనుమంతునిభక్తి త్రిగుణాతీతము కావున లోకవాసనలతని నంటలేదు. ఇట్టి ముఖ్యభక్తులు తీర్థస్థానములకు పవిత్రతనుగూర్తురు. ఎల్ల కర్మంబులును పావనము చేయుదురు. సర్వశాస్త్రములకు ప్రమాణము నాపాదింతురు. (తీర్థీకుర్వన్తి తీర్థాని, సుకర్మీ కుర్వన్తి కర్మాణి, సచ్ఛాస్త్రీ కుర్వన్తి శాస్త్రాణి) లోక

మున జనులు స్వీయభోగార్థమే పాటుపడుచుండగా, భక్తుడు లోకకల్యాణార్థమై పాటుపడును. అందువలన భక్తుడు ఏ జాతిలో పుట్టినా, విద్యావంతుడైనా, కాకున్నా పూజ్యుడే. 'నాస్తితేషు జాతి విద్యా రూప కుల ధన క్రియాదిభేదః' (నారద భక్తిసూత్రములు - పుట 271-276.) వానరజాతిలో జన్మించినను హనుమంతుడు తన భక్తిచేతనే ఆరాధనీయుడయ్యెను.—

ధ్యానాకర్ణన దర్శన
గానంబుల నా తలంపు గలిగిన జాలున్
బూనెదరే కృతార్థత్వంబున్.[234]

—'శ్వపచోపి మహీపాల' అను సూత్రముతో శ్రీ వచన భూషణమున తెలుపబడినట్లుగా నైచ్యము జన్మసిద్ధము. తక్కువజన్మమే శ్రేష్ఠము. ఉత్తమ జన్మము దోషయుక్తము. తక్కుజన్మ యైనచో శేషత్వమున కనుకూలించినదై యుండును. నీచకులజుడైనను విష్ణుభక్తు డయ్యేనేని వాడు బ్రాహ్మణునికన్న అధికుడు.[235] 'జన్మము, వంశావళి, ‌కులము, ధర్మము, మానము, కుటుంబము, బలము, గుణము, చాతుర్యం వీనికన్నా భక్తియే ఎక్కువ" అని తులసీదాసు.[237]

రామాయణకావ్యములో ఎందరో భక్తులున్నా, వారందరిలో హనుమంతు డొక్కడే నిష్కామభక్తుడు. సుగ్రీవ విభీషణాదులు రాజ్యార్థులుకాగా, హనుమంతుడొక్కడే ఫలాపేక్షలేని భక్తిని చూపినవాడు. అవతార పరిసమాప్తి కాలమున హనుమంతుని రాముడు సంభావించి తన నేదైనా కోరుమని పలికినపుడు హనుమంతుడు 'ప్రభూ నామనస్సు మీ యెడ నెయ్యము పూనునట్లుగా, మీ భక్తి నాకు చెలువారునట్లుగా, నా మనస్సు ఇంకెందును ప్రవర్తించకుండా, మీ నామానుసంధానమునే లయించునట్లు, మీ చరిత్ర లోకమునందెంత కాలము నిలుచునో అంతకాలము నా శరీరమున ప్రాణములుండుగాక' అని కోరెను. ఇట్లు హనుమంతుడు కోరుట దేహాభిమానముచేత కాదు. ఏలన, దేహము సాధనమును, వాహనమును. దానిని విడిచినచో ఏకార్యమును సాధ్యముకాదు. మరియొక జన్మమనినచో కాలమెంతో వ్యర్థమగును. కావున సాధింపవలసినదొక్కజన్మమునందే. సమగ్రముగా సాధించుట కర్తవ్యము. రామనామామృత పానమున జీవించుభాగ్యము మోక్షసుఖముకన్నా ఎక్కువైం దని హనుమంతుడు తలంచెను. 'సత్యం శపే వారణ శైలనాథ. వైకుంఠ

వాసేపి నమే అభిలాష' అను ఆళ్వార్ల సంప్రదాయమునకు అనుగుణమైన నడవడి తిరువడిది. కావుననే శ్రీవైష్ణవ సంప్రదాయమున ఇతనిని 'శిరియ తిరువడి' అనియు, హనుమదాళ్వార్లనియు వ్యవహరించుట.

అమలిన భక్తి కొందఱు మహాత్ములు మచ్చరణారవింద యు
గ్మము హృదయంబునన్ నిలిపి కౌతుకులై యితరేతరాను లా
పముల మదీయ దివ్యతను పౌరుషముల్ గొనియాడుచుండి మో
క్షము మదిగోరవొల్ల రనిశంబు మదర్పిత సర్వకర్ములై.

కాన విజ్ఞాన వైరాగ్య కలితమైన
భక్తియోగంబునం చేసి పరమపదము
కొఱకు నయ్యోగివరులు మచ్చరణ భజను
లగుచు జరియింపుదురు నిర్భయాత్ములగుచు.

గురుభక్తిం జిత్తము మ
త్పరమై విలసిల్లు నంత పర్యంతము స
త్పురుషుల కిహలోకంబునఁ
జిరతర మోక్షోదయంబు సేకురుచుండున్.[237]

భగవద్రామానుజులు తెలిపినట్లుగా భక్తులకు ధారక పోషక భోగ్యములు నీరు, అన్నము, తాంబూలము మొదలగునవన్నియు భగవంతుతే. 'ఉణ్ణుం శోఱుం పరుకుం నీరుం తిణ్ణం వెత్తిలయుం ఎల్లం కణ్ణన్' అని తమిళమున సూక్తి. వివేకము (హితాహిత పదార్థ విజ్ఞానము) విమోహము (ఆశారాహిత్యము) అభ్యాసము (అనుష్ఠానము) క్రియ (పరోపకారము) కల్యాణము (ఋజువర్తనము, సత్యము, అహింస, దయ, దానగుణములు కలది) అనవసాదనము (సంతోషముగా నుండుట) అనుద్ధర్షము (ఉద్వేగరాహిత్యము) ఏ భక్తునిలో ఉండునో అతని భక్తియోగము శీఘ్రఫలకారి అగునని శ్రీమద్రామానుజుల వాక్యము. హనుమంతునిభక్తి ఇట్టి విశిష్టలక్షణ భూయిష్టము.

భగవద్భక్తునకు భగవత్కథాశ్రవణమున్నచో దర్శన మక్కరలేదు. ఏలన, కనుకలికన్న వినుకలియే గొప్పది కనుక. ఏకాంత భక్తునకు భగవత్కల్యాణ గుణములుతప్ప, తత్కీర్తనముతప్ప మరియొకటి తలపునకేరాదు.—

"యత్ర యత్ర రఘునాథ కీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాంజలిం

బాష్పవారి పరిపూర్ణ లోచనం
మారుతిం......................"

—అను ప్రతీతినొందిన హనుమంతునకు శ్రీరాముని మహాప్రస్థానము సాక్షాత్తుగా దర్శనీయమైనను ఆ శ్రీరాముడు తన చర్మ చక్షువులయెదుట లేడను భావమే కలుగదయ్యె. ఆ రాముని తనలో నిల్పుకొని రామస్మరణతో రామమయమైన శరీరముతో అతడు చిరంజీవిగా నిల్చిపోయెను. శ్రీరాముని అతడనుదినము అర్చించు విధానము ఈశ్వర ప్రణిధానమైనది.

కరణంబు లఖిలోప కరణంబులును గాఁగ
ప్రాణంబు లుపచార చటులుగాగ
గంగా ప్రముఖ నాడికలు జలంబులు గాఁగ
షట్కమలములు పుష్పములు గాఁగ
జఠరాగ్ని హెూత్ర ముజ్జ్వల ధూపంబు గాఁగ
బటు జీవకళలు దీపంబు గాఁగ
నందితానందంబు నైవేద్యము గాఁగ
రవి శశిజ్యోతు లారతులు గాఁగ
అంగ దేవాలయమున సహస్ర కమల
పీఠమున శాంతిజనకజో పేతుడగుచు
జెలగు పరమాత్ము రాము నర్చించువాడు.[238]

హనుమంతుని భక్తి ఆత్యంతికమైనది. దీనిని కొందరు సరిగా అర్థము చేసికొనజాలక హనుమంతునిభక్తి మూఢభక్తి అని ముద్రవేసిరి. భక్తి దశలలో భక్తుడు తన ఇష్టదైవమును తప్ప అన్యములనెల్ల నిరసించి యుండును. అన్యులను తూలనాడుట కూడ జరుగును. దీనిని భక్తి బాల్యవిచేష్టితమని అందురు. ఇట్టి భక్తుడు అమాయకునివలె తోచును. దైవమున కెన్నో రూపములు అవతారములు ఉన్నను, తానుపాసించు రూపమునొక్కదానినే విశ్వసించును గానీ ఇతర రూపమును గుర్తింపడు. 'పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్' ("బ్రహ్మజ్ఞానముపొంది బాల్యములో నుండవలెను.") భక్తుడు శిశుసదృశమైన ఆర్జవముకలిగి తనను రక్షించుకొను ప్రయత్నమే చేయడు. భగవంతునికి పరతంత్రుడై తదనుభవముననే ఉండును. ఇట్టి అనుభవము కలిగినందుననే హనుమంతుడు ఈ చేతనా చేతనాత్మకమగు సకల జగత్తు

రామమయమని యెఱిగినవాడై ఏమీ తెలియనివానివలె నుండెను. అందు వలననే అర్జునునితో పందెం కాచినవేళలో శ్రీకృష్ణుడు తన రూపమునార్చి శ్రీరామునిగా కనపడి హనుమంతునికి అర్జునునకు సఖ్యమేర్పరచగలిగెను. శ్రీకృష్ణుడు పిలుచుచున్నాడని చెప్పిన గరుడునకు పలుకని హనుమ శ్రీరాముని పేరు చెప్పగానే క్షమాపణవేడి అనుసరించి వచ్చెను. తన సభలో ప్రవేశించు హనుమంతునికి శ్రీకృష్ణుడు తాను రామునిగా, రుక్మిణి సీతగా రూపొంది కనబడి రనగా, హనుమంతుని ఈ భక్తిలోని అమాయకతను, స్వచ్ఛతను గౌరవించియే 'యేయథామాం ప్రపద్యంతే తాంతథైవభజామ్యహం' అని గీతావాక్కు. ఇట్టిభక్తి ఆత్యంతిక భక్తి అని భాగవత ప్రమాణము. దీనిని మూఢభక్తి అనుట మూఢ లక్షణము. "నిష్కాములైన మదీయ భక్తులకు నట్టి భక్తియోగంబు సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యంబులకు సాధంబుగావున మహాత్ములగు వారలు తమ మనోరథ ఫలదాయకంబులైనను మదీయసేవా విరహితంబులైన యితర కర్మంబుల నాచరింపనొల్లరు. దీని నాత్యంతిక భక్తియోగంబందురు.[239]

## 5 రామనామ ప్రచారకుడు – రామదర్శన కారకుడు

హనుమంతుని జీవితమున రామనామ ప్రచారము ప్రముఖమైనది. తన మహత్తును భగవంతుడు తానె వచ్చి నేరుగా చెప్పుకొనజాలడు. దానిని విశదవాక్ శిఖామణులగు భక్తులద్వారా జరిపించుకొనును. భగవంతుడు వాచ్యముకాగా తన్నామము వాచకము. భగవంతునికిని ఇతరులకును ఎంత తేడా కలదో, భగవంతునకు అతని నామమునకు అంతే తేడా కలదు. భగ వంతునికన్నా అతని నామమే గొప్పది. భక్తునకు ఇది సర్వదా దగ్గరుండునది. అన్నివేళలలో, అన్నిచోట్ల మెలగునట్టిది. భగవత్ప్రీతిని, భగవత్సంశ్లేషమును కలిగించుటకు నామమే శరణ్యము. జీవించియున్నంతకాలము చేయుటకు వీలయిన సులభసాధనము నామానుసంధానము. మంత్రానుష్ఠానమునకు నియమము, నిష్ఠ, ఋజువర్తము, సదాచార మావశ్యకము. నామానుసంధాన మునకు ఏ నిబంధనలు లేవు. అన్ని నామములు భగవంతునివే అయిననూ త్యాగరాజస్వామివారననట్లుగా, నారాయణాష్టాక్షరిలోని 'రా' శివ పంచాక్షరి లోని 'మ' కలువగా హరిహరాత్మకమగు రామనామమయ్యెను. ఇది తారక మైనది. 'మీ స్మరణం దనర్చు మానవులు సద్గతి పొందుదురు ఎంతవింత' అని గోపన్న తెలిపియున్నాడు. ఈ రామనామమును ప్రచారము చేసినవాడు

పావని. రామమయమైన జీవితముకలవాడై, సంకటమోచనుడై సర్వశక్తి సమన్వితుడయ్యెను. నీలుడు సేతువు నిర్మించుచో రాళ్ళను అందించుచు హనుమంతుడు ప్రతి శిలమీద రామనామము వ్రాసెడివాడు. అవి సముద్రముపై ఉంచగా తేలుచు నిల్చియుండెడివి. 'రామ' అను అక్షరము వ్రాసిన ఫలకమునకు ప్రదక్షిణమొనర్చుచో విశ్వమునకే ప్రదక్షిణము కావించనట్లే. ఎవనియింట 'రామ' అను నక్షరము అహోరాత్రములు మ్రోగుచుండునో వానియింట సమస్త భోగభాగ్యాలు చేరునని పద్మపురాణ సాక్ష్యము.

"మంగళాని గృహేతస్య సౌభాగ్యాని చ భారత।
అహోరాత్రం చ యేనోక్తం 'రామ' ఇత్యక్షర ద్వయం॥"

శాండిల్యాది మహర్షులు, యోగులు. ప్రహ్లాదాది భక్తులు హనుమంతుని చేరి చతుర్వేదములలో, పురాణములలో బోధింపబడిన తత్త్వమేదియో తెలుపమని కోరిరి. అపుడు సదాగతిపుత్రుడు—

ఏతేషునైవ సర్వేషు తత్త్వంచ బ్రహ్మతారకం।
రామ ఏవ పరంబ్రహ్మ రామ ఏవ పరంతప॥

—అని తెలిపినట్లు రామరహస్యోపనిషత్తులో కలదు.—

కేవలం రామనామైవ సదా సజ్జీవనం మునే
సత్యం వదామి సర్వస్వ మిద మేకం సదామమ

—అని హనుమంతుడు రామనామమే తన జీవనము, తన సర్వస్వముగా చెప్పుకొనెను. 'నా స్వామియగు శ్రీరాముని మంగళ నామమును ప్రేమతో ఎవరు జపింతురో వారికి నేను అనుక్షణంబు ప్రయత్నపూర్వకముగా ప్రదాతనై కోర్కెలదీర్చి సుఖమునిత్తును' అని హనుమంతుడే చెప్పుకొనెను.

"ఏ జపంతి సదా స్నేహాన్నామ మాంగల్యకారణం
శ్రీమతో రామచంద్రస్య కృపాళో మమ స్వామినః
తేషామర్థీ సదా విప్రప్రదాతాహం ప్రయత్నతః
దదామి వాంఛితం నిత్యం సర్వదా సౌఖ్యముత్తమం"

భీమునకు యుగధర్మముల తెలిపిన సందర్భములో కృతయుగమున తపోధ్యానాదుల చేతను, త్రేతాయుగమున యజ్ఞయాగాదుల చేతను, ద్వాపరమున అర్చనాదుల చేతను, కలియుగమున నామసంకీర్తం చేతను జీవులు తరింపగలరని తెలిపియున్నాడు.

సుగ్రీవునికి శ్రీరామ స్నేహప్రాప్తి కలిగించినవాడు హనుమంతుడు. శరణాగతి సందర్భమున విభీషణునికి శ్రీరాముడను కూలుడగునట్లుగా చెప్పిన వాడు హనుమంతుడే. శ్రీరామ యుద్ధ విజయవార్తను సీతకందించినవాడు హనుమంతుడే. శ్రీరామాగమనవార్త భరతునకు, గుహునకు అందించినవాడు గూడ ఇతడే. గోవర్ధనపర్వతమును వ్రజభూమిలోనిల్పి శ్రీరాముని దర్శనమునకు బదులు ద్వాపరమున శ్రీకృష్ణుని స్పర్శకు మార్గోపదేశము చేసినవాడు మారుతియే. తులసీదాసు రామాయణము వ్రాయుచో దానివలన ఒక బ్రహ్మరాక్షసునికి శాపవిముక్తి అయ్యెను. ప్రత్యుపకారము వేడుమని బ్రాహ్మణుడడుగగా తనకు రామదర్శనము కావలెనని తులసీదాసు కోరెను. అపుడతడు నీవు రామభజన చేయుచో ఒక వృద్ధబ్రహ్మచారి రూపమునవచ్చి వింటూవుండే వ్యక్తిని ఆశ్రయించినచో ఆ కోరిక నెరవేరగలదని చెప్పెను. తులసీ అట్లే చేయగా ఆ వృద్ధుడు రేపు నీకు దర్శనమిచ్చునని చెప్పెను. ఈ వృద్ధుడు హనుమయే. కాని రాముడు తన సహజరూపమునకాక పాదుషా రూపమున వచ్చెను. తులసి అతనిని గుర్తింపకపోయెను. మరునాడు వృద్ధుని (హనుమంతుని) అడుగగా 'పాదుషా రూపమున వచ్చెనే నీవు చూడ లేదా' అని పలికి తన దైవమును ప్రార్థించి తులసీదాసుకు రామదర్శనము కలిగించెను.[240]

## 6 హనుమంతుని పాండితీ బుద్ధివిశేషములు – వాచాదక్షతేత్యాదులు

సుగ్రీవునికి శ్రీరామునితో స్నేహము కలునట్లు చేయుటలో హనుమంతుని పాండితీబుద్ధి విశేషమును, వాక్యకోవిదత్వమును మహర్షి విపులంగా వర్ణించియున్నాడు. సమయజ్ఞుడై ఎప్పుడెట్లు మాట్లాడవలయునో ఇతనికి తెలియుననియే శ్రీరాముడితనినే సీతకు సందేశము నందింప పంపుచూ తన అంగుళీయకము నితనికే ఇచ్చెను. ఆమెకు ఎట్లు తమ సంగతి తెలుపవలెనో రాముడు తెలుపలేదు. వృక్షమున కూర్చొని శ్రీరామకథ గానంచేసి సీతాదేవిలో కలుగు అనుమానములను తొలగించి ఆమె నమ్మునట్లుగా భాషించినాడు. ఆ మాటలలో స్నిగ్ధత, మాధుర్యము, విశ్వసనీయత చూపగల్గెను.

అతి లక్షణ సంపన్నం
బతి మాధుర్య గుణ భూషణాంచితమును స
మ్మత మష్టాంగ యుతంబగు
మఱి యొప్పగ నీవనేర్తు మాటాడంగన్.

—అని సీతయే యీతని వాచాదక్షతను మెచ్చుకొనినది. తన విజయవార్తను సీతకు తెలుపుటకును, తన ఆగమనవార్త భరతునకు తెలుపుటకు శ్రీరాముడు హనుమంతునే నియోగించెననగా ఆతనిపాండిత్య వాగ్విశేషమును గమనించియే యని చెప్పవచ్చును.

రావణసభలో శ్రీరాముని ఘనతను చాటుటయేకాక రావణుడు ఇంకపై క్షీణపుణ్యుడై పాపఫలమును అనుభవింపక తప్పదని హెచ్చరించుటలో అతని ధైర్యము, శత్రువులతో భాషించుటలో అనుసరింపదగిన వైఖరి తెలియుచున్నది. రామాయణమందలి 'సుందరకాండ'లో హనుమంతుని పాండితీ బుద్ధివిశేషములు, వాచాదక్షత, ఇంగితజ్ఞత, లోకజ్ఞత బ్రహ్మాండముగా పోషింప బడియున్నది. వానినిగూర్చి 'తత్త్వదీపిక' ఇత్యాది గ్రంథాలలో చూడ దగినది.[41]

సీత అగ్నిప్రవేశము చేయుటకు రాముడు కారకుడయ్యెను. ఆ సందర్భమున హనుమంతుడు చూపిన వాచాసంయమనము గొప్పది. అగ్ని సీతనేమియు చేయదను నమ్మకము లంకాదహన వేళలో హనుమంతునికి తెలిసివచ్చిన విషయము. శ్రీరాముడు ధర్మమే అవతారముగొనిన మూర్తి కావున (రామో విగ్రహవాన్ ధర్మః) సీతాదేవికి ఆపద రాదనియు, రాముని ధర్మనిరతిపై అచంచల విశ్వాసముంచి మౌనముగా నుండెను. ఈ మౌన మతని వాఙ్నిగ్రహమునకు సాక్ష్యము.

సాగరలంఘన వేళలో తనను పరీక్షింపవచ్చిన నాగమాతను 'తల్లీ' అని సంబోధించి, సీతను వెదకుట అను శ్రీనిమిత్త కార్యమునకై తాను వెళ్ళుచుంటిననియు తెలిపి ఆమె మెప్పుపొంది వెళ్ళెను. అదేమాదిరికాక ఛాయాగ్రాహిని గౌరవింపక వధించివెళ్లెను. ఏ కార్యము నెట్లు సాధించవలెనో అట్లు సాధించుట సామీరి ప్రత్యేకత.

సీత హనుమంతుని పరీక్షింపగోరి శ్రీరామ లక్ష్మణుల రూపములను వర్ణింపుమని కోరినది. వారిని వర్ణించుచు హనుమంతుడు తనకుగల సాముద్రిక

శాస్త్ర పాండిత్యమును ప్రదర్శించుటేకాక భగవంతుడగు శ్రీరాముని, భాగవతుడగు లక్ష్మణుని వర్ణించి భగవద్భాగవత స్వరూపానుసంధానరూప స్తోత్రము ద్వారా పండితురాలగు సీతను నమ్మించెను. ఇది హనుమంతుని బుద్ధిబలమునకు నిదర్శనము.

## 7 హనుమంతుని జవసత్త్వ పరాక్రమ ధైర్యసాహస విశేషములు

ఈ అంశముగురించి రామాయణము సుందరకాండము, యుద్ధకాండము, సమీరకుమారవిజయము, పరాశరసంహితలలో ఎంతో విషయము హనుమంతుని జీవిత వృత్తాంతముననే తెలిపియున్నాను. వాయుపుత్రుడగుటవలన హనుమంతుని జవసత్త్వములు సహజసిద్ధములు. రుద్రవీర్యసముద్భవుడగుట వలన మహావీరుడయ్యెను. దేవతల వరములవలన అపజయమెరుగని విజయుడయ్యెను. బాల్యమున సూర్యబింబమును పండని పట్టుకొనబోవుట అతని జవసత్త్వములకు తొలి పరిచయమునిచ్చు సంఘటన. సాగర లంఘనము రెండవ ఘనకార్యము. ఈ సముద్రమును దాటివచ్చినవారిలో శూర్పనఖ, మారీచ సుబాహులు, రావణుడు, అకంపనుడు, శ్రీరామాదులు కలరు. రావణునకు పుష్పకవిమానము సాధనము. తక్కిన రాక్షసులకు మాయాజాలము శరణ్యము. పుష్పకవిమానమునవెళ్లు రావణునకు జటాయువెదురుకాగా తికమక పడినాడు. శ్రీరాముడు సేతువు నిర్మించెను. హనుమంతుడొక్కడే దీనిని తన భుజబలముచే తరించెను. సంజీవనీపర్వతమును తెచ్చుటలో శత యోజనములకన్న ఎక్కువదూరము వెళ్ళుటయేకాక సకాలములో కార్యసాధన చేయుట ఇతని వేగమునకు తార్కాణము! శతకంఠాదులపై దాడివెడలుచో వాలసేతువు నిర్మించి వారిని దాటించుట, శ్రీరాముని, వారి సోదరులను వీపున మోసి తెచ్చుట ఇతని బలమునకు నిదర్శనము. ఈ బృహత్తర కార్యముల నొనర్చుటకన్నా, వానిని సాధించినతర్వాత విశ్రాంతికై ఒక్క నిశ్వాసము కూడ హనుమంతుడు తీసికొనకుండుట ఇతని బలసాహసములకు ప్రబల సాక్ష్యము. పర్వత, వన, భవన, ప్రాకార, నగర, ద్వారసహితముగా లంకా పట్టణమునే తాను ఎత్తుకొని పోగలనని హనుమంతుడు సీతతో పలుకుట అతని సామర్థ్యమునకు గుర్తు. తనకు బలము వున్నను ఉత్తరకుమారునివలె గొప్పలు

చెప్పుకోకుండా, అణగి మణగి యుండుట అంజనేయుని ప్రత్యేకత. ఇతనికి దేహబలము ఎక్కువయా? బుద్ధిబలము ఎక్కువయా? అని మనలో విచికిత్స కల్గును. కిష్కింధకు, అయోధ్యకు నెయ్యాన్ని కలుపుటలో ఇతని బుద్ధిబలమే హేతువైనది. శారీరక బుద్ధిబలము ఎంతవున్నా దానికి తగిన అప్రమత్తత, చతురత, యుక్తి, ఉపాయము లీతనికధికముగానుండుట మరొక విశేషము. ఒక్క చేతి దెబ్బతో ఎనుబదివేలమంది రాక్షసుల చంపగలశక్తి ఇతనిది.

ఇంద్రజిత్తు బాణములకు మూర్ఛపోయిన సందర్భమున సైనికులను పరామర్శించును విభీషణుడు రా.గా జాంబవంతుడు 'హనుమంతుడు జీవించి యున్నాడా?' అని అడిగెను. రామ సుగ్రీవాదులనడుగక హనుమంతునే అడుగుటలో ఆతని ఆంతర్యమేమిటో తెలుపమని విభీషణుకోరగా, 'హనుమంతుడున్నచో వానర సైన్యముతోపాటు శ్రీరామ లక్ష్మణ సుగ్రీవులందరూ ఉన్నట్లే' అని జాంబవంతుడు తెలిపెను. హనుమంతుని సామర్థ్యమునకూ, బలమునకు, కార్యదక్షతకు ఇంతకన్న వేరే నిదర్శనము చూప నక్కరలేదు. లక్ష్మణుడు మూర్ఛనొందినపుడు లంకలోని సుషేణుని తేబోయి సూక్ష్మరూపమున హనుమంతుడు వెళ్ళెను. వాడు వచ్చునో, రాడో అని అనుమానముతో వానిని ఇంటితోసహా తెచ్చెను [241] సూక్ష్మరూపముతోపాటు బృహద్రూపం ధరించుటకూడ ఇతనికి కార్యసందర్భములలో ఉపయోగపడెను. త్రివిక్రముడగు వామనునికి, శ్రీకృష్ణునికి సాధ్యమైన ఈ శక్తి రామ కార్యములలో హనుమంతు డెన్నిమారులో ప్రయోగించెను. మృగ పక్షి మానవశక్తులన్నీ హనుమంతునిలో సంగమించినవి. (He possessed supreme animal, bird and human powers).

వాలి, దశకంఠుడు సాటిలేని పరాక్రమముకలవారైనా హనుమంతునికి సరిరారని ఉత్తరరామాయణమున రామునితో అగస్త్యుడే చెప్పియున్నాడు. "హనుమంతుడు జగములముంచు సాగరుడు; భువనములకాల్చు అగ్ని; ప్రళయ కాలమున రేగు యముడు. శౌర్యము, నయసాధనము, ధైర్యము, పరాక్రమము, దార్ఢ్యము, బలము, స్థైర్యము, ప్రాజ్ఞత, మహిమ హనుమంతునిలో నెలకొనియున్నవి—

"స్థైర్య ధైర్య పరాక్రమ సాహసంబుల శౌర్య గాం
భీర్య బుద్ధులఁ జాతురీనయ వీర్య యుక్తుల సూక్తి మా

ధుర్య కార్యాధురీణతా జనతుష్టి కారణ చర్యలన్
సూర్య శిష్యున కీ ప్రభంజన సూతికిన్ సములుందురే."[242]

—త్రేతాయుగమున సాక్షాత్తుగా శ్రీ హనుమంతుడు భగవంతునకు తోడై యుండగా ద్వాపరయుగమున హనుమంతుని కేతనమే అంతటి విజయమునకు కారణమగుట గమనార్హము. మరియు సాగరుడు శ్రీరాముడెంతప్రార్థించినా ప్రసన్నుడుకాక రాముని ఆగ్రహమునకు గురికాగా రామ కింకరుడగు హనుమంతునికి వశపడుటయేకాక తనలోని మైనాకునిపిల్చి ఆతిథ్యముకూడ ఇప్పింప ప్రయత్నించెను. Hanuman's great valour power and skill is morvellously exhibited in his facile leap cver the sea. His fearlessness of Ravana is an indirect eulogy of HANUMAN'S heroic nature and mind.[243] రాముని సైన్యములోని వీరులను రావణునికి తెలుపుచు శుకుడు 'హనుమంతుడు, హనుమంతుడు, హనుమంతుడు' అని మూడుసార్లు పలికెను. అతని ప్రముఖ పరాక్రమమున కింతకన్న నిరూపణ అక్కరలేదు

## 8 హనుమంతుని పోరాట విధానము

హనుమంతుడు యుద్ధముచేయుటలోనేకాక ఎగురుటలోనూ, చెట్లను పెకలించుటలోనూ, పర్వతాలను ఎత్తి విసరుటలోను ఘనుడు. యుద్ధములో ఏ అయుధమును పట్టకయే తన పిడికిలితోను, చేతి ప్రహారములతోను, వాల తాడనముతోను శత్రువుల వధించెడివాడు. ఇతనికితోక ఒక అయుధము. దానినాడించి, జాడించి, నేలపైకొట్టి సింహనాదము చేయగానే ఆ ధ్వనికి పక్షులు, మృగములు శత్రువులు మూర్ఛనొందెడివారు. శరీరాన్ని పెంచి 'శ్రీరామజయం' 'సుగ్రీవునకు విజయం' అని జయోక్తుల వల్లిస్తు రిరంసతో ప్రారేయాకృతి నొంది మూపులనుప్పొంగించును. సౌధములకున్న దూలములు, పరిఘలుగా వాడును. భవన స్తంభాలను పీకి వానిని విసరివేయును. తన ధ్వనులతో శత్రువులను నిర్వీర్యులజేయును. పోరాటమునకు తగిన అనుగుణమగు వైఖరి నీతడు ప్రదర్శించును. బాహుయుద్ధ దక్షులైన పాదచారులతో ఒక రకముగానూ, అయుధధారులతో ఇంకొక రకముగానూ పోరాడెడివాడు. రథవాహనాదులు కలిగినవారు తారసిల్లినచో ఆకాశానికి ఎగిరి ఆకాశములోనే సంచరించుతూ పోరాడెడివాడు —

కొందఱఁ గేల బాది మఱికొందర నేలనుమోది, గ్రుద్దుచుం
గొందఱ పిండి కొందఱను గోళ్లను జీల్చుచు, నట్టిట్టాకుచున్
గొందఱ గుండువోలె నొక కొందర దిరిరద్రిప్పి వైచుచున్
గొందలమంద గూల్చె రిపుకోటి వనాట విభుండుగ్రుడ్డై[244]

—చైత్య పాలకులను, జంబుమాలిని, మంత్రికుమారులను వధించిన పద్ధతిలో విరూపాక్షులను వధించలేదు. దుర్ధరుడనేవాని రథముపై కొండలాగా ఒక్కసారి దూకినంతనే వాడు మరణించెను. విరూపాక్షయూపాక్షులు పైకెగిరి వేగముగ పడుచుండగా చెట్లను వారికి ఎదురుగా విసరి వారి పతనవేగముచేతనే వారికి నాశనము కలిగించెను. కొందరిపై కొండల విసరి చంపెను. ఈ విధముగా హనుమంతుని కదనపాండితి వైవిధ్యముతో కూడినది. అక్షకుమారుని పాదాలు పట్టుకొని గిరగిర త్రిప్పిచంపగా, వానిసేనలను వాహనాలను చూపులతోనే భస్మీకృతమొనర్చెను. ఇంద్రజిత్తుతో పోరాడుచో ఆకాశానికి ఎగిరి వానిబాణములు తగులకుండా ఎగురుతూ, క్షణముకూడా ఒకచో నిలువక కదలుచూ కంటికి కన్పించుచూ అదృశ్యమగుచు పోరాడెను.

## 9 రాజనీతిజ్ఞత

సీతజాడ తెలియనందున అంగదాదులు స్వయంప్రభ ఉండిన గుహవద్ద ప్రాయోపవేశ మొనర్చుటయే కర్తవ్యముగా నిర్ణయించిరి. సీతవార్త లేకుండా కిష్కింధకు వెళ్ళినచో వారు సుగ్రీవుడు విధించు మరణదండనకు పాత్రులగుదురను భయముండెను. కాని తారుని ఆలోచనను, అంగదుని ఆలోచనను ఆంజనేయుడు వ్యతిరేకించి తన రాజనీతిజ్ఞతతో వారి దురాలోచనను బట్టబయలు చేసెను. అంగదుడు బలముతో నుండినచో అదిరెండవ వానరరాజ్య స్థాపనమేనని హనుమంతుడు భావించెను. ఈరెండు రాజ్యములమధ్య ఐకమత్యములేక ఉభయులు చెడిపోవుదురనియు, ప్రారంభించిన సీతాన్వేషణ కార్యము నెరవేరదనియు తలంచి అంగదునితోపాటు అతని ఆలోచనా సరళితో సాగువారిని కూడా తన మార్గమునకు త్రిప్పుటకై ప్రయత్నించి హనుమంతుడు కృతకృత్యుడయ్యెను. ఇందీతని ఆలోచనా విధానము, స్పష్టత, వానరమనస్తత్త్వ పరిశీలనము, వివాదాస్పద నిర్ణయములందలి కష్టనిష్ఠూరములు గుర్తింపగల మంత్రాంగమునకు నిదర్శనములు. అంగదునకు ఆంజనేయుని మాటలు ఇష్టము

కాకున్నను ఆంజనేయుని మార్గమును అనుసరింపక తప్పనట్లుగా తన మాటలతో సాధించుట హనుమంతునికే చెల్లినది. అంగదుని పొగడి, వాని ఉత్తమ గుణముల నుగ్గడించి, తన వచనములను వినునట్లుగా లోబరచుకొని క్రొత్త రాజ్యాన్ని స్థాపించువానికి చతుర్దశగుణములు, అష్టాంగములు, చతుర్విధబల ములు ఉండవలెనని హెచ్చరించెను (కిష్కింధాకాండలో వాల్మీకి చక్కగా విశదపరచినాడు) సుగ్రీవునిమీద గల ప్రభుభక్తికి ఇది తార్కాణము. విభీష ణునకు శరణాగతినిచ్చుచో, రావణునిసభలో ప్రసంగించిన వేళలో ఇతని రాజనీతిజ్ఞత ఎంతయో ప్రదర్శితమైనది.

## 10 దూతగా-దౌత్యవ్యవహర్తగా హనుమంతుడు

రాజకీయ దౌత్యము నెఱపుటలోనూ, నాయికానాయకుల హృదయాంతర సందేశముల నందించుటలోను హనుమంతునివంటి దూత ఇంకొకడు కనబడడు. భారతమున సంజయుడు, శ్రీకృష్ణుడు రాజకీయ దౌత్యము నిర్వహించిరేకానీ నాయికానాయకుల అన్యోన్య సందేశములను తెలిపెడి అవకాశము వారికిలేదు. శృంగారనైషధమున హంస, ప్రభావతి ప్రద్యుమ్నమున శుచిముఖి ఇత్యాదు లున్నా వారికి రాజనీతి స్పర్శలేదు. కావున దూతగా హనుమంతుడు రెండు బాధ్యతల వహించిన విశిష్టుడు. 'మందరము' వ్యాఖ్యలో శ్రీ వాసుదాసుగారు దూత లక్షణములను ఎన్నియో తెలిపియున్నారు. (చూడుడు సుందర కాండము 40-41 సర్గలు) తన ప్రభువుకై విశ్వాసపాత్రతతో పనిచేయుచు శత్రుస్థావరమున తన 'అంతర్యము' తెలియకుండా తిరుగుట; తారసిల్లిన వారికి తప్పించుకొనునట్టి మాటలతో జవాబిచ్చుట; తన నడవడిక, వాచావిభవములపై విశ్వాసము కలుగునట్లు చేసుకొనుట; తన శీలము నితరులు గమనించుచున్నను చారచక్షువులతో శత్రురహస్యముల గుర్తించుట; తన ప్రభువు గౌరవానికి, ప్రతిష్ఠకు (Image) తగినట్టి రీవితో వ్యవహరించుట; గొప్ప అభినయ సామర్థ్యం చూపుట; సమయోచితమగు కర్కశత్వము, ప్రసన్నత, నిగ్రహము దూతకు చాలా అవసరమైన గుణములు. ఇవి అన్నియు హనుమంతునిలో పుష్కలము.

సీతను వెదకునపుడు ఆయా దశలలో హనుమంతుడు పొందిన అను క్షణోచితభావాలు గమనార్హములు. సున్నితమైన విషయములు (Delicate

situation) ధైర్యసాహసములతోగాక ఓర్పుతో, దూరదృష్టితో, వివేకముతో, స్నిగ్ధతతో, ప్రసన్నతతో సాధించవలెనను సూక్తికి హనుమంతుడు చక్కని ఉదాహరణము. సీత కనరానందున చింత కలిగినపుడు, రావణుని వధింప వలెనను కోపము కలిగినపుడు, హనుమంతుడెంతో నిగ్రహము ప్రదర్శించెను. శింశుపావృక్షముపై హనుమంతుడుండగా సీత వద్దకు రావణుడేతించి ఆమెను లోబరుచుకొను మాటలనాడగా వానికి తగిన రీతిని సీత సమాధానము చెప్పుటను హనుమంతుడు వినెను. ఆమె స్వభావమతనికి తెలిసినందున రావణుడు వెళ్లిన పిమ్మట ఆమెతో ఎట్లు మాట్లాడవలెనో అతడు నిర్ణయించుకొనెను. ఈ నిర్ణయ మున అతడెంత సూక్ష్మాతి సూక్ష్మాంశములను ఆలోచించెనో లోగడ తెలిసికొని యున్నాము. తానే భాషలో మాట్లాడవలెనో! సీతకు అర్థమగు ప్రాకృతమున మాట్లాడదలచుట, చెట్టుపైనుండి రామకథను గానముచేయుట దూతగా అతడు తన బాధ్యతనెట్లు నిర్వర్తించెనో తెలియును. ఒంటరిగాఉండి ఏ కార్య మూలేక కేవలము శోకముతో రామధ్యాన తత్పరతలోనుండు సీతకు (ఇష్టమైనా కాకున్నా) హనుమంతుడాలపించు 'రామకథ'ను వినుటకొక శ్రోతగా సంసిద్ధు రాలగునట్లు సామిరి వేసికొనెను. 'One of the greatest things in the life of Hanuman is the way in which he went through scenes of great tenderness, and came out of all of them with credit to himself.'[245] "He weighs carefully all the ways and means of how best to communicate with sita without entailing any risk of frightening her or incurring an indiscretion which would lead to a frustration of the entire task—which reveals. Par excellence his nature of prudent and discreet counseller."[246]

బలమున నీతి బుద్ధి మృదుభావమునన్ సరసోక్తి నెల్ల వి
ద్యల బహుకార్య నిర్వహణతాగతి సత్య వివేక కీర్తులన్
బలియుడు గాన మెప్పొసగె భర్తకు మారుతి యిట్టు లన్నిటన్
మెలకువ లేకయున్నఁ దరమే నరనాథుని కొల్వు సేయగన్.[247]

హనుమంతుని రాజనీతిజ్ఞత, దూతగా అతని సామర్థ్యములగూర్చి జీవిత చరిత్రలో వివరముగ తెలిపినందున పునరుక్తియగునని యింతట విరమించు చున్నాను.

# 11 ఆంజనేయుని చిరంజీవత్వము

దేవతలిచ్చిన వరము వలన ఆంజనేయునకు స్వేచ్ఛామరణము సిద్ధించెను. సీతారాములితనికి వరములనిచ్చినందున 'రామకథ' ఉన్నంతవరకు అతడు జీవించుటకు వీలు కల్పింపబడెను. సీత తనకు హనుమంతుడొనర్చిన మేలుకై —

"నేనుపకారమేమియున్ దవిలి యొనర్పలేను
వసుధాస్థలి వర్ధిలు బ్రహ్మకల్పముల్"

—అని పలికినందున పరాశక్తియగు ఆమె వాక్కువలన అతడు చిరంజీవి అయ్యెను: (మొల్ల రామాయణము)

అశ్వత్థామ, బలి, వ్యాస, హనుమంత, విభీషణ, కృపాచార్య పరశురామ, మార్కండేయులు ఎనిమిదిమంది చిరంజీవులని ప్రసిద్ధి. కాని వీరిలో చిరంజీవిగా సార్థకతను పొందినవాడు హనుమంతుడొక్కడే. హనుమంతునికి రూపము కామరూపత్వము కావున అజరామరత్వమతనికి వరమైనందున "జాయతేఽస్తివర్ధతే విపరిణతేఽపక్షయతే నశ్యతి" అను షడ్వికారములు (పుట్టుట, ఉండుట, పెరుగుట, మారుట, తరుగుట, నశించుట) సమీరనందనునికి లేవు. భాగవతము ద్వాదశస్కంధమున మార్కండేయోపాఖ్యానమున మార్కండేయుడు శివుని 'దేవా యీ శరీరముతోడన అనేక యుగంబులు బ్రదుకునట్లు' వరము కోరగా, అతనిని శివుడు పార్వతీ సమేతుడై నారాయణుని వద్దకు తీసికొనివెళ్ళి అతనికి వరమును కోరగా విష్ణువు అతనికి జరారోగ వికృతులులేని ఆయువును ప్రసాదించెనను కథ కలదు.[248] అంజనేయుడు తాను చిరంజీవిగా నుండవలెనని కోరకయే రామానుగ్రహమున రామకైంకర్యార్థమై దానిని పొందెను. భగవద్గీతలో —

"జన్మకర్మచమే దివ్యం ఏవం యో వేత్తి తత్త్వతః
త్యక్త్వాదేహం పునర్జన్మం నైతి మామేతిసోఽర్జున"

—అని కలదు. శ్రీ సీతారామ మాహాత్మ్యమును దివ్యమైనదిగా నెఱింగిన హనుమ దేహత్యాగము లేకుండానే వారి అనుగ్రహమున నిత్యకింకరుడై వరలెను.

# 12 హనుమంతుడు-రచయితగా-సకల కళావేత్తగా

హనుమంతుడు శ్రీమద్రామాయణము వ్రాసెననియు దానిని వినిన వాల్మీకి తన రచనకు ప్రచారము లభింపదనుచు దుఃఖపడుచుండగా హనుమంతుడు తన రచనను సముద్రమున పారవేసెనని ఒక కథ జనులలో ప్రసిద్ధి వహించి యున్నది. "హనుమంతుడు నవవ్యాకరణములను సూర్యునివద్ద అభ్యసించెను. భగవద్గీతకు భాష్యము వ్రాసెను. రామాయణము రచించి గానము చేసెను. మంత్రరాజ నృసింహస్తోత్రము రామపరముగా వ్రాసెను. ఇతడు నాదబ్రహ్మరూపియగు శివుని అవతారము. నాట్యకళాకోవిదుడు, నారదతుంబురులకు, రంభాదులకు గానకళాప్రావీణ్య సంబంధమగు గర్వమును తొలగించెను."[249] హనుమంతుడు నృత్యకళా విశారదుడు. శాస్త్రీయ సంగీతాచార్యులలో శివుడూ, భరతమునీ తర్వాత హనుమయే ముఖ్యుడు. "సంగీత పారిజాతము" అను గ్రంథము హనుమంతుని సంప్రదాయమునకు చెందినదే. శార్దూలుడు, కాహలుడు హనుమంతుని సంగీత సంప్రదాయ ప్రవర్తకులు[250A]. హనుమంతుడు హనుమన్నాటకం రాతిఫలకములపై వ్రాసెను. దీనినే రాజభోజుడు పొంది తన పండితుడగు దామోదర మిశ్రులచే పరిష్కరింపజేసెను.[250B]

హనుమంతుడు భగవద్గీతకు వ్యాఖ్య వ్రాసెననియు, దానికి పైశాచిక వ్యాఖ్య అని అందురనియు 'హనుమద్విలాసమ'ను గ్రంథము పేర్కొనినది. "సంగ్రామ విముఖుడైన అర్జునునికి కృష్ణుడు గీతలను బోధించెను. అవి విని తనకవి జ్ఞాపకమున నుండుటలేదని కిరీటి అనగా అతని రథకేతనముననున్న హనుమంతుడు --

"సమ్యక్‌బుద్ధం మయా సర్వం ధృతంచ హృదయే తథా
కాలాంతరే ప్రవక్ష్యామి తుభ్యం సాధు మహామతే"

—అని పలికెను. అది వినిన కృష్ణుడు "గురువు చెప్పకుండా మంత్రాన్ని వినినచో పిశాచము కాగలరు. నీవు నేను అర్జునునకు తెలుపగా రహస్యముల వింటివి. కావున పిశాచము కాగలవు" అని తెలుపగా హనుమంతుడు కృష్ణునే ఆశ్రయించెను. "భారతయుద్ధ పరిసమాప్తితో నీకు పిశాచరూపం తొలగిపోతుంది. ఆ తర్వాత నీవు సేతు బంధనంలోని పైశాచిక తీర్థస్నానంచేసి

రామలింగేశుని పూజించినచో పిశాచరూపం తొలగును. నీవు గీతలకు భాష్యం వ్రాయుము" అని పలికిన కృష్ణుని మాటలను విని హనుమంతుడు సేతు బంధనమున పైశాచిక తీర్థస్నానానంతరం శివపూజచేసి భగవద్గీతలకు వీనుల విందగు వ్యాఖ్య వ్రాసెను. దీనికి పైశాచిక వ్యాఖ్య అని పేరు వచ్చినది.[251]

## 13 హనుమంతుడు భావిబ్రహ్మ

హనుమంతుడు కల్పాంతములందు లోకముల సృష్టించు భావిబ్రహ్మ పదవి నొందునని అగ్నిపురాణమున కలదు.[252A] పరాశరసంహిత ముప్పది ఎనిమిదవ పటలముననూ, యేబదినాల్గవ పటలమునను హనుమంతుడు భవిష్య ద్బ్రహ్మ కాగలడను విషయమున్నది. 'శ్రీరాముడు నా కథ భూమిపై నిలుచు వరకు జీవించి ఆ తర్వాత బ్రహ్మవై లోకముల సృష్టించి, ముల్లోకవాసుల గూడి నా స్వరూపమునే పొందగలవు' అని వరమునిచ్చినందున ఇతడు భవిష్య ద్బ్రహ్మ అయ్యెను.[252B] శ్రీరాముని అంగుళీయకమును బ్రహ్మకు పంపియుండె ననియు, దానిని తెమ్మని హనుమంతుని కోరగా అతడు బ్రహ్మలోకమునకువెళ్లి వారు తనకా ముద్రికనీయనందున వారితో పోరాడెను. ఎన్నో కల్పములలో ఎందరో రాములు ఇచ్చిన ముద్రికలుగల సరస్సులో అసలగు రామముద్రికను తీసికొనలేకపోయి, ఆ ముద్రికలకు నమస్కరించి శూన్యహస్తములతో రాముని వద్దకు వచ్చెను. ఎన్నో కల్పములలో ఎందరో రాములూ ఎందరో హను మంతులు వెలసిరని హనుమకు ఈకథ తెలియపరచెను. చివరకతడు భక్తితో బ్రహ్మలోకమందలి హ్రదమందలి ఒక అంగుళీయకమును రామునకు తెచ్చి యిచ్చెను. రాముడు సంతసించి 'బ్రహ్మలోకమును చూచి నీవు ముచ్చట పడి నావు కావున నీవు బ్రహ్మలోకాధిపత్య మొందగలవని' వరమిచ్చెను. అందు వలన హనుమంతుని భవిష్యద్బ్రహ్మగా పేర్కొందురు.[252C]

## 14 హనుమంతుడు – ఆచార్యునిగా

ఈ అంశమును శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యులగారి 'సుందర కాండము–తత్త్వదీపిక' అను గ్రంథమున విపులముగా చర్చింపబడియున్నది. శాస్త్రార్థముల నెరిగి తనకు తెలిసిన దానిని ఇతరులకుచెప్పి, చేయించుచుతాను ఆ ప్రకారము వర్తించువాడే ఆచార్యుడు. (అచినోతిహిశాస్త్రార్థానాచారే స్థాప యత్యపి, స్వయమాచారితే యస్మా దస్మాదాచార్య ఉచ్యతే)

శ్రీరాముని ప్రథమముగా దర్శించినపుడాతని మంగళగుణముల ప్రశంసించి మంగళస్వరూపమునే దర్శించి పరమాత్మయని గుర్తించినవాడు హనుమ. రాముని కేవలము దాశరథిగా కాక సర్వజగద్రక్షకునిగా గుర్తించిన ప్రథముడితడే. ఇతనిని చూచిన రాముడు ప్రహృష్టవదనుడై శ్రీమంతుడయ్యెనని మహర్షి వాక్యము (ప్రహృష్టవదన శ్రీమాన్.... 3 సర్గ శ్లో 25) జీవుల తరింపజేయు ఆచార్యుడు లభించినందుకు పరమాత్మ సంతసించెను భగవంతుని సందేశము జీవునకందించు దూతయే ఆచార్యుడు. భగవద్దూతయై, భగవద్వాహనమై, భగవత్ప్రాప్తికి విరోధులగువారికి సంహర్తయై భగవత్పరతంత్రమైయుండెడి శబ్దమే హనుమంతుడు. కావున ఇతడే మంత్రమూ ఇతడే గురువు.[253] ఇతని ద్వారానే సుగ్రీవునకు భగవత్ప్రాప్తి కలిగినది.

శ్రీ వేదాంతదేశికులవారు "దర్పోదగ్రదశేంద్రియ"అను తమ శ్లోకమున (సంకల్ప సూర్యోదయ గ్రంథమున) హనుమంతుని ఆచార్యకత్వమును గూర్చి తెలిపియున్నారు. "లంకయందు నిర్బంధింపబడిన సీత ఏవిధంగా రాక్షసాంగనలచే బాధింపబడి, తర్జనభర్జనలకు గురియై శ్రీరాముని ఉనికిని తెలియక బాధపడుచు, హనుమంతుని ద్వారా వృత్తాంతము విని శ్రీరామపదప్రాప్తి కలుగునని సంతోషముపొంది ప్రాణధారణ ఎట్లు చేసినదో అట్లే సంసార సాగరమందుండి ప్రబలమైన మనస్సుయొక్క అధికారముతో విజృంభించిన పది బాహ్యాంతరింద్రియములకులోనై హనుమత్సహాయుడైన ఆచార్యుని వలన సర్వేశ్వర విషయక జ్ఞానము పొంది ఊరటచెంది తత్ప్రాప్తికై చేతనుడు నిరీక్షించుచుండును."

సుందరకాండమున హనుమంతుడు ఆచార్యునిగా తోచినట్లే యోగసాధకుడగు శిష్యునిగాకూడ గోచరించును. యమనియమ, ఆసన, శ్వాసబంధ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులు అను ఎనిమిది అంగములు గల యోగాభ్యాసాది విధము హనుమంతుని చర్యలలో కననగును—

"మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాంవేత్తి తత్త్వతః"

—అని పరమాత్మ ప్రవచించినట్లుగా[254] కోట్లమంది కపులలో హనుమంతుడొక్కడే కార్యసిద్ధి నొందెను. హనుమంతుడు యోగియైనను ఇతరోపాయము

లను వదలి శ్రీరామదాసోహమ్ అను మంత్రభావనతో రామునకే ప్రపన్నుడై సాగినందున సముద్రమును దాటగలిగెను.

ఆచార్యుడగు అంజనేయుడు ప్రసన్నుడైన తర్వాతనే శ్రీరాముడను దైవము ప్రసన్నుడగును. ఎంబెరుమార్ల (శ్రీరామానుజులు) అనుమతిలేనిదే నంబెరుమాళ్ల అనుగ్రహం (దైవానుగ్రహం) కలుగదను వైష్ణవసంప్రదాయము ఎలెనే హనుమదాళ్వార్ల అనుగ్రహము ద్వారానే శ్రీరాముని అనుగ్రహము సులభసాధ్యమూ మోక్షార్థి నిరంతరం భగవంతుని కలిసి ఉండాలనీ అట్లా ఉన్నవారికి భగవంతుడు ముందుగా బుద్ధియోగాన్ని ప్రసాదింమనని దానిద్వారా సాధనచేసినచో ముక్తి పొందుదురని భగవద్గీత—

"తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం
దదామి బుద్ధియోగం తం యేనమాముపయాంతితే"

—తెలిపిన ఆచార్య ఆదర్శమాంజనేయునిది.[255]

## 15 హనుమంతుడు—జీవన్ముక్తి మార్గ ప్రదర్శకుడు

బాంధవముననైనఁ బగనైన వగనైన
బ్రీతినైనఁ బ్రాణభీతినైన
భక్తినైన హరికిఁ బరతంత్రులైయుండ్రు
జనులు మోక్షమునకు జనుదు రధిప.[256]

—రామ పరతంత్రజీవనుడై అంజనేయుడు జనులకు జీవన్ముక్తిమార్గ ప్రదర్శకుడైనాడు. ముక్తి అనగా జ్ఞానము నొందుటయే. "తత్త్వజ్ఞానాన్ముక్తిః" శంకరులవారు—

సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః

—అని చెప్పియున్నారు. దుఃఖవిధ్వంసనమే ముక్తి. 'ముక్తిర్మోక్షో మహానన్దః' (మహానందమనుభవించుటే ముక్తి) అని యామునాచార్యుల వాక్కు. సదా భగవంతునకు కైంకర్యముచేసి అనుభవించు అనందమాత్మైకవేద్యమ్మని స్తోత్రరత్నమున 'కదాహమైకాన్తిక నిత్యకింకరః ప్రహర్షయిష్యామి' అని చెప్పినట్లుగా, భగవంతునితో ముఖాముఖిగాచేరి చూడగ్గలుట సాలోక్యముక్తి అగును.

భగవంతునితో నిరంతరముండుటే కాక తాను చూచునదెల్ల భగవద్విభూతి విలాసములేనని గ్రహించుట సామీప్యముక్తి. ఈరెండు ముక్తిదశల దాటిన వారు భగవత్సాయుజ్యమును చేరి సామీప్యముక్తి కర్హులగుదురు. ఈ స్థితిలో భేదము కొంత ఉండనే ఉండును. భగవత్సారూప్యమున్నంతనే భగవంతునకు వలె భక్తునకు కూడ జగత్సృష్టి లయశక్తులుండునని భావింపరాదని శంకరులే తెలిపియున్నారు. భేదభావము సమూలముగా నశించి భగవంతునిలో ఐక్యమొందుటే సాయుజ్యమని అద్వైత సిద్ధాంతము. దీనిని భక్తికి ఫలముగా భగవంతుడనుగ్రహింప వలయునేకాని ప్రయత్నఫలముగా నెవరును పొందరు.

భక్తియోగమున సిద్ధుడై "సత్త్వరజస్తమో గుణహీనుండైన జనుండు మత్సమానాకారతంబొందు"నని భాగవతముననున్నను[259] భక్తుడు భగవంతుని సేవించుచు తద్రూపగుణానుభవానందము ననుభవించుటకే ఇష్టపడునుకాని అతనిలో ఐక్యమగుటకు ఇష్టపడడు. ఐక్యము నందానందానుభవములేదు. (చూడుడు భాగవతం 3 స్కంధం, 11వ స్కంధం) శ్రీరామకృష్ణ పరమహంసగారు చెప్పినట్లుగా పంచదార మాధుర్యముననుభవించుటలో ఘనతకాని, తానే పంచదార కావాలని తలంచడం గొప్పకాదు. There is greater thrill, greater freedom, greater warmth in remaining a servant (కింకర) than in becoming the master.[258] 'నిర్వేతకుమైన భగవత్సేవ ముక్తికంటే గరిష్ఠంబ'ని భవానందచిత్తుడైన హనుమను జీవన్ముక్తిమార్గ ప్రదర్శకునిగా గుర్తించవచ్చును.

భగవత్సాక్షాత్కారము నెట్లు సాధింపవలయునో హనుమంతుడాచరణ పూర్వకముగా సాధించి, మందాధికారి, మధ్యమాధికారి, ఉత్తమాధికారి అవస్థలుదాటి ముముక్షువులకు తరణోపాయము సూచించుటకు మార్గదర్శకుడయ్యెను. మానవుడు మల విక్షేపావరణములను తొలగించుకొని, స్థూలసూక్ష్మ కారణశరీరముల నధిగమించి, సత్త్వరజస్తమో గుణముల నిర్మూలించినచో, ఆత్మసాక్షాత్కారము నొందును. హనుమంతుడు త్రికరణశుద్ధిగా నిష్కామముగా, శ్రీరామ ప్రీతికరముగా కర్మల నొనర్చెను. మనస్సుతో రామమంత్రము జపించెను. వాక్కులతో రామగుణ గానము చేసెను. దేహముతో రామకార్యము లాచరించెను. త్రికరణశుద్ధిగా ఇట్లు రామదాస్యము సలిపి ఇంద్రియ వృత్తులను

శ్రీరామపరముగా నొనర్చి బాహ్యవిషయము నుండి మరల్చెను. ఈ దాసత్వ ముతో జీవుడువేరు, పరమాత్మవేరు అను ద్వైతభావమున్నను మందాధికారికి అది తగినభావమేనని సీతారామాంజనేయ సంవాదమున "దేహబుద్ధ్యాఽస్మి దాసోహం" అని ప్రకటించి అంగీకరించెను.

నిజమనోరథ ఫలదాయకములగు కార్యములకై కాక రామకార్యాచరణ మునకే కాలము గడిపి ఇంద్రియ నిగ్రహము వలన మధ్యమాధికారికై ప్రాణా యామ, మంత్రజప, సజ్జన సాంగత్యములను మూడు మార్గముల ద్వారా మనోలయమును సాధించెను. మానసపూజ అను నాల్గవ మార్గము ద్వారా ద్వైతభావము తొలగి ఉత్తమాధికారియై తాను పరమాత్మ అంశయే ననుభావ మును గుర్తించెను. "జీవబుద్ధ్యాత్వదంశకః" సీతారాములతనికి ఆత్మసాక్షాత్కా రము కల్గించు ఆత్మానాత్మవిచారము బోధించినందున సాధన చతుష్టయములను సమకూర్చుకొని, అమనస్కతను పొంది ఉత్తమాధికారియై జీవన్ముక్తు డయ్యెను.[259] 'ఆత్మబుద్ధ్యాత్వమేవాహమితిమే నిశ్చితామతిః'.

పరమ ప్రేమరూపమైన భగవద్భక్తి కలవాడు భగవదనుభవ ప్రాపకమగు కైంకర్యమునే కోరి మోక్షమునుగూడ పొందక జీవన్ముక్తులై యుందురు. 'మోక్షము మదిగోరనొల్లరు మదర్పిత సర్వకర్ములై' (భాగవతం) ఈ విధ ముగా త్రివిధ అధికారులకు సాధకులకు, ఆచరణ రూపమగు సాధన నీతడు జీవన్ముక్తిమార్గ ప్రదర్శకుడయ్యెను. ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత సంప్రదా యస్తులు, అన్ని మతములవారు, యోగులు ఇతనిని ఆదర్శసాధకునిగా గుర్తించి సేవించుచున్నారు.

విభవావతారములందుగానీ, అర్చామూర్తులందుగానీ పరిపూర్ణ భగవ దనుభవము కలవారు జీవన్ముక్తులవలె నుందురు. సర్వ జగద్రక్షకుడగు శ్రీరాముని కాపాడుకొనవలెనను ప్రేమ హనుమంతునిది. ఇట్టి ప్రేమ, జ్ఞాన మును కూడా మరుగుపరచును. గోపికలిట్లే శ్రీకృష్ణుని భద్రతనే సదా కోరు కొనిరి. హనుమంతుని వంటి భక్తుని సేవకు సరియైన ప్రతిఫలము భగవంతుడు కూడ ఇయ్యజాలడు. కర్మమునందుగానీ, ఫలమునందుగానీ, భక్తికి సరియైనది భక్తివినా ఇంకొకటిలేదు. తన భక్తునికి ప్రియమైన తన దివ్యమంగళరూప సంశ్లేషకు స్పర్శానందము రాముడిచ్చెను. ఇదియే వేదాంతముక్తి 'పరమ పురు

షుండు నజుండు యోగీశ్వరేశ్వరుండైన హరిని సోకిన స్థావరంబైన ముక్తంబగు[260A]

గురుభక్తిం జిత్తము మ
త్పరమై విలసిల్లు నంత పర్యంతము స
త్పురుషుల కిహలోకంబునఁ
జిరతర మోక్షోదయంబు సేకురుచుండున్.[260B]

## 16 హనుమంతుని కామరూపత్వము

హనుమంతుడు పరిముల్లుకంటె వన్నెగలవాడని యిదివరకే తెలిసికొని యున్నాము. "అంజనేయుడు మేరుపర్వతమువలె ఉండును. ఇతని వెంట్రుకలు బంగరు తీగలమాదిరి నేలమీద జీరాడుచుండును. అప్పుడప్పుడీతడు పంచముఖుడుగాకూడా ద్యోతకమగుచుండును. ఇతడు శక్తి, పాశం, శూలం, పరుశు, హలం, చక్రం, ముసలం, గద, పట్టిసం, ముద్గరం, గాండీవం, చర్మం, ఖడ్గం, కుంభం మొదలుగా పద్దెనిమిది అయుధాలను ధరించుచుండును."[261]

భారత యుద్ధమునకు ముందు రాయబార సందర్భమున శ్రీకృష్ణుడు విరాడ్రూపము చూపినట్లే హనుమంతుడు తన విరాడ్రూపమును సీతకు చూపెను. నాగమాతతో కలిసి అమెను ప్రసన్నను చేసుకొను వేళలోను, శతకంఠుని చంపు వేళలోను, మరి యింకెన్నో సందర్భములలో ఇతడు తన విరాడ్రూపం చూపెను. భీమునకుకూడా ఈ రూపము దర్శనీయమొనర్చెను. ఇతడు తన రూపమును తనకు ఇష్టమైనట్లుగా చిన్నదిగాకానీ, పెద్దదిగాకానీ చేసికొనగల శక్తిమంతుడు. రాముని చూచుటకు మొదటిసారిగా వెళ్ళినపుడు భిక్షురూపము, భరతునకు సందేశము అందించువేళలో బ్రాహ్మణరూపము, భీమసేనునికి మర్కటరూపమున ప్రవర్తించెను. మహిరావణుని వధించు సదర్భములో పంచముఖ అంజనేయరూపమొందెను. "The Pancha Mukha HANUMAN is purely a Vaishnava conception. The image of Pancha Mukha HANUMAN shows that Hanuman possessed all the attributes and powers of VISHNU. The protection of Pancha Mukha Hanuman is very beneficial and protects the devotee against all kinds of evils and dangers and adversities "[262]

ఇతరుల ప్రేరణలేకుండా హనుమంతుడనంతరూపములతో అవతరించు చుండునని పరాశర సంహిత.

మమావతారః బహవః మద్రూపాని బహూనిచ
యథా మాం భజతే భక్తస్తథైవావిర్భవామ్యహం

## 17 హనుమంతుని కపిలక్షణములు (వ్యక్తిగత లోపములు)

శ్రీ కరణం అశ్వత్థరావుగారి దండక రామాయణమునకు పీఠిక వ్రాయుచు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు "వాల్మీకి హనుమంతుని ఎంత గొప్ప వ్యక్తిగా చిత్రించినను ఒక్కచో మాత్రము పచ్చి కోతిగానే చిత్రించి యున్నాడు. అతని గొప్పతనమంతయు సంపాదితమేకానీ, సహజమైనది కపిత్వమేనని వాల్మీకి సమాధానము" అని తెలిపియున్నాడు. మండోదరిని చూచి సీత అని తలంచిన సందర్భమున తన జాతిలక్షణములగు చేష్టల నతడు చేసెను. (సుందరకాండం శ్లో॥ 54, సర్గ 10 ఆస్ఫోటయామాస చుచుంబ పుచ్ఛం) సీతను తన వీపుపై మోసుకొని పోవుదునని తెలిపినపుడు ఆమె 'నీవు నీకోతి స్వభావాన్ని చూపితివికదా! అని అనినపుడు హనుమంతుడామె తీవ్ర వాక్య సరణికి చిన్నబుచ్చుకొనినట్లుకానీ, కోపగించుకొనినట్లుగానీ మహర్షి వర్ణించకున్ననూ అతనికది ఎదురుచూడనిమాట. ఆమెస్థితిని, తన నూతన పరిచయమును గుర్తించి మిన్నకుండెను. సీతవార్త తెలిసిన పిమ్మట వానరులు దధిముఖుని అధీనములోని మధువనమునచేరి విచ్చలవిడిగా విహరించుచో వారిని వారించకపోవుట అతని సంస్కారమునకు కళంకముగా భావింపక వానరుల జిహ్వాచాపల్యమునకు విందు చేయదలంచిన ఔదార్యముగా గుర్తించ వలెను. నిద్రాహారాలుమాని అన్వేషణాసక్తులై విజయోపేతులై వచ్చినందున వారికీవిధమగు ప్రవృత్తి సహజమేకదా.

హనుమంతుడు బాల్యమున మున్యాశ్రమములో దూరి చిలిపిపనులు చేయుచుండగా వారతనికి శాపము పెట్టుటకు వీలులేని కారణమున ఇతనికి ఇతని బలము గుర్తుచేయువరకు తెలియనట్లు మరుపుతో నుండునని తలంచిరి. ఆ కారణమున అతడు సాధువై తన బలము తా నెరుగనట్లు ప్రవర్తించెను. కాని, కొన్ని సందర్భములలో తనకు తెలిసిన విషయములగూడ ఇతడు మరచిపోయినట్లు తోచును. సుగ్రీవుని వాలి తరుముచు వెన్నంటివచ్చినపుడు

అతనితో తానుగూడ పారిపోయెనేకాని ఉపాయములు తెలుపడయ్యెను. వాలి ఋష్యమూకాద్రిపైకి రాజాలడను మునిశాప విషయము హనుమకు ముందే తెలిసినను అతడుసుగ్రీవునికిచెప్పకుండుటకు స్మృతిభంగముగా తలంపవచ్చును. లంకాదహన సందర్భమున సీత అశోకవనమునమన్న విషయము ఇతడు మరచిపోయెను. దహనకాండ ముగియువేళలో దాని నెఱింగి తన స్మృతి విభ్రమమునకు కోపమే కారణమని గుర్తించి పశ్చాత్తప్తుడయ్యెను.

సీత అశోకవనమున నున్నట్లుగా లంకిణి హనుమంతునకు తెల్పినట్లు అధ్యాత్మరామాయణమునను, విభీషణుడుకూడా హనుమంతునికి ముందే ఈ వృత్తాంతము తెలిపినట్లు ఆనందరామాయణమునను కలదు. కాని లంకా నగరాంతఃపురములలో హనుమంతుడు సంచరించుట అతనికాసంగతి గుర్తు లేదేమోనని అనిపించును. అవాల్మీకమగు ఈ కల్పనల నంగీకరింపనిచో సమస్యయేలేదు.

రామాగమనవార్త భరతునకు హనుమంతుడు తెలిపినపుడు, సీతా వహ్ని ప్రవేశవిషయమును తెలపలేదు. రాముని విజయవార్త తెలుపుటయే కాని సోదరుల కానంద హేతువగు సమావేశసమయమున ఆ వృత్తాంత మసం దర్భమని భావించి అతడట్లు విషయమును మరుగుపరచెనని సమర్థించుకొన దగును. ఇది సభ్యతా సంస్కారవంతులగు సామాన్యజనులకు సహజమేనని శ్రీ శ్రీనివాసశాస్త్రిగారి భావము. ' He was very tender to BHARATA, that the shocking story need not reach his ears.... We do not like to tell unpleasant things, until they become terrilly unpleasant and reveal themselves. If so' it is only just an ordinary weakness that prevents people from telling the whole of astory."[264]

## 18 హనుమంతుడారాధింపబడుటకు కారణము

హనుమంతుడు కోతిముఖముతో నున్నను హిందువులకు ఆరాధనా పాత్రులగు దేవుళ్ళలో నొకడైనాడు. ఇతనికున్నంత ప్రచారమూ, ఇంక చాలకొద్దిమందిని మనహాయించినచో, వేరెవ్వరికినీ లేదు. విగ్రహారాధకులగు భారతీయులకు వేదాలలో తెలుపబడిన ఎనిమిదిమంది వసువులు, ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, ఇద్దరు అశ్వనీ దేవతలు మొత్తం ముప్పది

మూడుమంది మాత్రమేకాక పితృదేవతలు, బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులతో పాటు పక్షీంద్ర, పన్నగ, గజానన, హయముఖాది దేవతలుకూడ ఆరాధ నీయులే. 'His (the india's) faith in deities is so strong so deep rooted, that it is not shakan by the semi human or semi animal forms. He is well aware of the symbolism and psyehic powers assoeiated with each one of the deities". "The religious ideas of HANUMAN are conceptual and have a symbolic signficance'.[265A] మానవుని మనస్సు పసిబాలునికిగల కుతూహలముతో నుండును. ప్రాచీనకాలమునుండి నాలుగు జంతువుల ద్వారా అతనికానందము కలుగుచుండెను. ఏనుగు, డేగ, కోతి, సింహము. ప్రతి ప్రాచీన నాగరికతా చరిత్రలలో దేవతారాధన ఈ రూపాలలోనే గోచరించును. అవతారముల రూపకల్పనచేసిన పురాణ ములు మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, హయగ్రీవ, గజానన, ఫణి, వృషభ, భైరవ రూపాదుల ఆరాధనకు దోహదమొనర్చినవి. ఇట్లే హను మంతుని ఆరాధన కూడ జనాదరపాత్రమైనది. మర్కటరూపుడై హాస్యాస్పద మగు రూపముగలవాడని కొందరు పాశ్చాత్యులు తలంచినట్లుగాకాక హనుమం తుని భక్తి శ్రద్ధలతో భారతీయులందరు అర్చించుచుండుట జరుగుచున్నది. HANUMAN, the Simian God, is cetainly not a ludicrons figure as cetain westerners mistake him to be. On the contrary, he is an eminently loved and exclusive figure among the Hindu Deities, and occupies a prominent position."[265B]

"ఋక్షులు, వానరులు ఆదిమజాతులలోనివారు. వీరు రామాయణ కాలపువారు. వీరిని కోతులని పేర్కొనుట తప్పు. వీరు విద్యావంతులై సుఖజీవనం చేసినవారు. హనుమంతుడు వేదముల నెఱింగిన పండితుడేకాక వానరజాతిలో శక్తివంతుడని" డాక్టర్ శాంతకుమార్‌వ్యాస్‌గారి అభిప్రాయము. (The Rikshas and Vanaras were two aborginal races during the RAMAYANA period. It is a mistake to call them as monkeys. They were educated and lived comfartably. HANUMAN was a learned pandit in vedas and was a powerful man of vanara race. Hanuman was from the

Vanara caste and Jambavan from the Riksha caste. They were called after the monkeys and bears.)[266]

నేడు మనముచూచు కోతులలో ఇప్పటికి విద్యాసంస్కారాలు లేవు కావున హనుమంతుని, వాలి సుగ్రీవాదులను కోతులుగా తలంచుట నాగరికతా చరిత్రను దృష్టిలోనుంచుకొని చూచినచో (From the history of civilization and anthropology) దోషమేనని చెప్పవలసియుండును. శ్రీరాముని వంటివాడు హనుమంతుని వాక్యకోవిదత్వము ప్రశంసించెననగా నాటి వానర శబ్దమునకు 'కోతి' అని అర్థము చెప్పుకొనుట తప్పనితోచును. కవుల కల్పనలకు, హాస్యరస పోషణకొరకు, రావణునికి నందిశాపానుసారముగా నరులుగానివారిచేత పరాభవము జరుగవలెనని యుండుట వలనను, ఈ జాతి వారు కారణజన్ములుగా, ఉత్తమ సంస్కారముగలవారుగా నేటి శాఖాచరులగు కోతులకన్నా భిన్నరూపములుగా భావించక తప్పదు. అంతేకాక రామాయణ మందలి కపులందరు దేవతాంశములలో జన్మించినవారే. వాలి ఇంద్రాంశమున, సుగ్రీవుడు సూర్యాంశమున జన్మించిరి. కాని వారికి పూజార్హతరాక హనుమంతునకే ఆ విశిష్టత కలిగెననగా హనుమంతుడు వాలి సుగ్రీవులవంటి వాడు కాదనుట స్పష్టము. భారతీయ మత సంప్రదాయము హనుమంతునికి ఆదర్శప్రాయమైన ఉదాత్తస్థానము నిచ్చినది. "HANUMAN was of a different order form Sugriva and Vali and in whom all the early religious systems have achieved a spiritual status and made lasting contribution to the idealism of man."[267]

HANUMAN'S facial expression shows that he is humbly aspiring by Virtue of his good deeds to a higher state." జనసామాన్యమందీతనికిగల ఆకర్షణకిదియే కారణము. రాముడు, కృష్ణుడు, శివుడు మొదలగు దేవతలను జ్ఞానులు, సంపన్నులు ఎక్కువగా ఉపాసించుచుందురు. వారికి శ్రీవైష్ణవ సంప్రదాయమని, శ్రీ శైవ సంప్రదాయమని సంప్రదాయములున్నవి. కాని హనుమంతుడు అతి సాధారణ జనబాహుళ్యముచే నారాధింపబడుచున్నాడు. ఇతని ఆరాధకులకు హనుమత్సంప్రదాయములేదు. హనుమదారాధనా విధానముపై శ్రీవైష్ణవ ప్రభావము అధికముగా కలదు. అంజనేయుని నుదుటిపై ఊర్ధ్వపుండ్రములు ఈ సంప్రదాయ ప్రభావమే. ఇతని పంచముఖ ఆరాధనలో వానరరూపారాధన వలన

తేజోశక్తులు పొందుటకును, నరసింహరూప ఆరాధనవలన భయనివారకమగు రక్షను పొందుటకును, గరుడముఖారాధన పన్నగములుతదితర దుష్టశక్తుల నిర్మూలనకును, వరాహముఖారాధన రోగ నిర్మూలనకును, హయముఖారాధన జాడ్యనిర్మూలనకు, జ్ఞానసిద్ధికిని అని పెద్దలందురు. హనుమంతుని ముఖమున కుంకుమతో ఎఱ్ఱని పైపూత పూసియుండుట పూర్వకాలమున యుద్ధమున గాయములైనచో ఆ గాయములను మాన్పుటకు నేతితో కలిపిన కుంకుమను పూసెడివారను నమ్మకమువలన కలిగినదే. ఇట్లు ఎఱ్ఱని కుంకుమను ముఖమునకు పూయుట అతడు కర్మవీరుడని తెలుపుటకే. సీతామాత తన నుదుటి కుంకుమను (సిందూరం) అతనికిచ్చినందున అది హనుమంతునకు ప్రియమైనది. ఆ కారణముననే సిందూరముతో ఆంజనేయుని పూజించుట. (ఇతర ఏ దేవతలకును కుంకుమార్చనము లేదు). హనుమంతుని చేతిలో ఒక చేత గద, మరియొక చేతిలో పర్వతమున్నట్లు విగ్రహములు మలచబడియుండును. గద శక్తికి సాంకేతికము. పర్వతము అసాధ్యక సాధకత్వమునకు సాంకేతికము. ఇతని కేతనమందలి చేప అజరామరత్వమునకు సాంకేతికము. "The mace symbolises strength and is used to destroy evil forces and restore peace and righteousness. The mountain symbolises HANUMAN'S atrility to overcome inseperable difficulties or obstacles, i.e., to do the impossible. Such a deity alone is capable of delivering the devotees from all misfortunes and difficult situations. The fish symbol on the flag in HANUMAN'S hand is the symbol of eternity and immortality."[267B]

వాయవీయసంహిత, శివపురాణ శతరుద్రీయ సంహితలలో శ్రీరాముని ఆరాధనను ప్రవర్తింపజేసిన వానిగా హనుమంతుని పేర్కొనుట జరిగినది. శ్రీరామార్చకుడగుట వలన హనుమంతునికి కూడ ఆరాధనీయత కలిగెను. భాగవతసేవ భగవత్సేవకన్న ప్రశస్తమని శ్రీవైష్ణవ సంప్రదాయమున్నందున హనుమదారాధన శ్రీరామారాధనలో అంతర్భాగమైనది.

శ్రీమద్రామాయణమునకు నాయకుడగు శ్రీ సీతారామచంద్రు నుపాసించుట హనుమంతునికిష్టము. రామదాసుడగు హనుమంతుడు రామాయణమందలి సుందరకాండలో ప్రధానపాత్ర. ఇతని నుపాసించుటకై సుందరకాండ

పారాయణము జగత్ప్రసిద్ధి పొందెను. హనుమంతుని లంకావిజయ ఘట్టము దుష్టప్రేత పిశాచభూతగణ బాధనివృత్తికిని; పదమూడవసర్గ అను మారుతి నిర్వేదఘట్టము చిత్తభ్రమ నివారణకును; సీతా సందర్శనమను పదిహేనవసర్గ దారిద్ర్య నిర్మూలనకును; ఇరువదిఏడవసర్గ అను త్రిజటాస్వప్న వృత్తాంతము దుస్స్వప్నశాంతికిని; అంగుళీ ప్రదానమను ముప్పది ఆరవసర్గ తప్పిపోయిన ఆత్మీయులు ఇంటికి వచ్చుటకును; కాకానుగ్రహ ఘట్టమను ముప్పదియెనిమిదవ సర్గ రామాపచార శాంతికిని; యుద్ధకాండమందలి విభీషణ సంగ్రహమను భాగము ఆపద నిర్మూలనకును; సీతాంజనేయ సంవాదమను నూటపదహారవ సర్గ సకల దుఃఖనివృత్తికినీ, ఇదే కాండలోని సీతానయన సన్నివేశమను నూటపదహేడవసర్గ కారాగృహభయనివృత్తికిని పఠించుట లోకులకు తెలిసిన విషయము - సుందరకాండ పారాయణము. ఇహలోక సుఖానుభవమునిచ్చి క్రమముగ మోక్షము నిచ్చునని ఫలశ్రుతి.

ఆంజనేయుని పూజించినచో సర్వదేవతలను పూజించినట్లే. కారణము: అతడు సర్వదేవతాంశ జనితుడగుటయే. ఉమా సంహితలోను, సుదర్శన సంహితలోను, పరాశర సంహితలోను ఆంజనేయుని స్తోత్రములు వాని మాహాత్మ్యములు తెలుపబడియున్నవి. మూఢులనూ దరిద్రులను, కాపాడు దేవతలలో హనుమంతుడే ముఖ్యుడని పరాశర సంహితలోని ధ్వజదత్త చరిత్రము తెల్పును. (9వ పటలము)

ఆంజనేయః పూజితశ్చేత్ పూజితా సర్వదేవతా: (7వ పటలము పరాశర సంహిత). బ్రహ్మ తన అస్త్రమునకు క్షణమాత్రకాలము కట్టుబడియుండుమని ఆంజనేయుని కోరెను. శ్రీరామోత్తర తాపిన్యుపనత్తులో శ్రీరాముడు కూడ హనుమన్మంత్రోపాసకుడుగా తెలుపబడినాడు. ఐహిక సుఖములు కావలసిన వారు తననూ, మోక్షము కావలసినచో తన ప్రభువగు శ్రీరాముని అర్చించవదగునని శ్రీరామ రహస్యోపనిషత్‌లో హనుమంతుడే సెలవిచ్చి యున్నాడు—

ఐహికే సమనుప్రాప్తేమాం స్మరేద్రామ సేవకం
వాంఛితార్థం ప్రదాస్యామి భక్తానాం రాఘవస్యతు
ఐహికేషుచ కార్యేషు మహాపత్సు చసర్వదా
నైవయుజ్యో రామమంత్రం కేవలం మోక్షసాధకః.

—రామభక్తులగు వారెవరెవరు ఐహిక భోగముల కోరుదురో వారికి తానవి ఇచ్చి, వారి ఆపదలను తొలగింతుననియు, మోక్షమే కావలసినచో శ్రీరామునే ఆశ్రయింపవలసినదిగా ఆంజనేయుడు పై శ్లోకమున తెలిపిన దీనిని వివరించుచు శ్రీ రామకృష్ణ పరమహంసగారొక చతురమగు కథను తెల్పియున్నారు. తన దైవమగు శ్రీరాముని చేరి ప్రతి చిన్నవిషయానికి అతనికి నివేదించి తన రామ కైంకర్యమునకు అంతరాయము కలిగించుచున్నందున హనుమంతుడు "జను లార మీకు ఆపదలు పోవాల్సినచో, ఇహలోకభోగాలు కావల్సినచో నా దగ్గ రకే రండి. నా ప్రభువును చేరి ఆయనను వేధించకండి. మీకు మోక్షమే కావలసినచో అయననే ఆశ్రయించండి" అని చెప్పెనట. శ్రీరామునికి కేవలము మోక్షాధికారమును మాత్రమిచ్చి, తక్కిన శక్తులు అన్నీ తనవద్దనే ఉంచుకొనిన హనుమంతుని విధానము నేటి కేంద్రము - రాష్ట్రములమధ్య అధికారముల పంపిణీవంటిదిగానే తోచును.[268]

"శ్రీ మహావిష్ణువుయొక్క నిత్యవిభూతిత్వ ఆళ్వార్లుగా గరుక్మంతునీ, (పెరియతిరువడి) లీలావభూతిత్వ ఆళ్వార్లుగా హనుమంతునీ (శిరియతిరువడి) విష్ణువాహనములుగా శ్రీవైష్ణవ సంప్రదాయ ప్రవర్తకులు భావించుచున్నారు. రామునిది విభవావతారము కాన ఈ కాలముననున్న హనుమంతుడు గరుడుని వంటివాడని తలంపరాదు. బృహద్బ్రహ్మ సంహితలో "నిత్యభూతాత్మకమగు పరమపదమున ఏకాంతమందిరమున శ్రీరాముడను పేరుగల పరమపదవాసుని సన్నిధియందు ఎల్లప్పుడు హనుమంతుడుండునని కలదు. భృగుప్రోక్త వైఖానస సంహితలో భగవంతుడగు నారాయణునకు పదిరోజులు చేయు ఉత్సవములలో చెప్పబడిన పదివాహనములలో హనుమంతుడు మూడవ వాహనముగా చెప్ప బడి యున్నాడు. గరుక్మంతుడు ఐదవవానిగా తెలుపబడినాడు. పాంచరాత్రాగ మములలోను ఇట్లే కలదు. గరుక్మంతునివలె హనుమంతుడు కూడ భగవంతుని అర్చావతార మాహాత్మ్యము దర్శింపజేయు వాహనమై యున్నాడు. ఆదిశేష, గరుక్మంతులకు ముందరి స్థానము హనుమంతునిది. గరుక్మంతుని గర్వము పోగొట్టిన కథలున్ననూ వీరిరువురూ తుల్య ప్రభావులే"[269]

పూజనీయులగు దేవతలనుపాసించుచో ఒక్కొక్క దేవత ఒక్కొక్క విధమగు ఫలమునే ఇచ్చుచుండగా హనుమంతుడొక్కడే సర్వసిద్ధికారకుడు—

ఆరోగ్యసిద్ధి రాదిత్యాత్కార్యసిద్ధి ర్గణేశ్వరాత్
జ్ఞానసిద్ధి ర్మహాదేవాన్మోక్షసిద్ధి ర్జనార్దనాత్
హిరణ్యగర్భాదాయుశ్చ వైరాగ్యం చ ప్రజాపతే
శత్రు నాశో మహేంద్రాచ్చాప్యర్థసిద్ధి ర్హుతాశనాత్
విజయశ్చండికాయాశ్చ లక్ష్మ్యా సంపద ఏవచ
విద్యాసిద్ధి స్సరస్వత్యా సర్వసిద్ధి ర్హనూమతః[270A]

— తల్లిని మించిన దైవములేదనియు హనుమంతునికి సమానమగు దేవుడు లేడనియు హనుమద్విలాసమున తెలుపబడినది.[270B]

శ్రీరామ పట్టాభిషేక సమయమున సీతాదేవి హనుమంతునకిచ్చిన ముత్యాలహారమునతడు సీతారాముల నన్వేషించు నెపమున కొరుకుచుండగా సీత అతని ఆశయము గుర్తించి తనవద్దకుపిల్చి తత్త్వోపదేశమునకు యోగ్యత కల్గించుటకై తన పాపిటలోని సిందూరము నిచ్చెను. దానిని హనుమంతుడు శిరస్సుపై ధరించి ఆమెవద్ద తత్త్వోపదేశమొంది జ్ఞానసిద్ధి పొందెను. ఈ సన్నివేశమునకు గుర్తుగా హనుమంతుడు "ఇకపై నన్నెవరు సిందూరముతో పూజింతురో వారిని నా భక్తులుగా స్వీకరించి వారిని నేను సదా కాపాడుచుండెద"నని తెలిపినట్లు స్కాందపురాణం.

రాముడు మూలకాసురుని వధించుటకై వెళ్లగా సీతాదేవి రామవియోగ తప్తయై గోమయముచే ఆంజనేయుని రూపమును గోడమీద వేయించి దానిని పూజించుచు ప్రతిదినము హనుమంతుని తోక అంగుళమాత్రము పెరుగునట్లు చేయుచుండెను. దుర్గనూ గణపతిని, శంకరుని; ఆంజనేయుని జలవర్తి మూర్తులుగా కూడా ఆమె పూజించెను. ఈ కారణము చేతనే నేటి మానవులు అంజనేయుని తోకకు రోజుకొక చుక్కను శ్రీ గంధముతో పెట్టి ఆరాధించుట ఏర్పడినది.[271] శనిగ్రహ దోషనివారణకు హనుమదుపాసన కర్తవ్యమని హనుమాన్ లీలాతరంగిణిలో కలదు. (పుట 191)

ఇంక మంత్రతంత్రముల ద్వారా హనుమదుపాసనచేయు పద్ధతి కలదు. దానిని గురుముఖమున అధికారమునుబట్టి చేసికొనవలయునేకాని స్వేచ్ఛగా చేయరాదు. హనుమదుపాసనా కల్పద్రుమమూ హనుమత్పూవి విధానమూ పరాశర సంహితలలో వానిని తెలిసికొనదగినంత వివరముగా కలవు. "In Kaliyuga, the worship of HANUMAN is not only

essential, but extremely beneficial. He is the given of RIDDHI(Woddlygains)and SIDDHI(spiritual achievement."[272]

## 19 హనుమన్మహిమలు

పరాశర సంహితలో హనుమంతుని మహిమల తెలుపు కథలెన్నో కలవు. రాజ్యభ్రష్టత తొలగించి ఇహపరసౌఖ్యముల నిచ్చుటకు సోమదత్త చరిత్ర (4, 5 పటలములు) స్వర్గమందలి చింతామణ్యాదుల సాధించు నలునికథ (5వ పటలం) దారిద్ర్యమును, వ్యాధి నిర్మూలించుటకు ధ్వజదత్త చరిత్ర (8, 14 పటలములు) విజయుడనుంచి కథ విజయసిద్ధికినీ (15వ పటలము) కపిలుని కథలో భక్తుని బాధలను తొలగించుట పావని ఎంతటి భారమునైనా మోయగలడను కథ (20, 21 పటములు) కశ్యపునికథ ద్వారా చోరభయనివారణమును (22 పటలం) అపన్నివారకతనుతెల్పు హరిశర్మ కథ (23వ పటలమున) ఐహికాముష్మిక ప్రాప్తికి సుముఖుని కథ (34వ పటలం) వ్యాధి నిర్మూలనమునకు యువనాశకుని కథ (38 పటలం) మైందుని కథ (35 పటలం) తప్పిపోయినవాడిల్లు చేరునట్టి ధర్మకీర్తి కథ మొదలగు ఎన్నో కథల రూపమున హనుమన్మహిమలు తెలుపబడి యున్నవి.

హనుమంతుడే కాక హనుమంతుని రోమములకును గొప్ప ప్రభావ మున్నది. భీమునికి పురుషామృగమును రప్పించుటలో సాహాయ్యముగా హనుమంతుని రోమములే తోడ్పడిన కథ తత్సందర్భమున తెలిసికొని యున్నాము. తన రోమాన్ని అర్జున ధ్వజానికికట్టినచో విజయసిద్ధి కలుగునని తెల్పినవాడు ఆంజనేయుడు. ధర్మారణ్య ప్రదేశమున శ్రీరాముడు బ్రాహ్మణులకు దానధర్మములచేసి భూములను వృత్తులను ఇవ్వగా జైనమతావలంబియగు కుంభీపాలుడనువాడు హరించగా వానికి బుద్ధి వచ్చునట్లు వాని వినాశమునకు హనుమంతుని ఎడమ కక్షమూలరోమమునూ తిరిగి వానికి పశ్చాత్తాపము కలుగగా కూడికక్షములములోని రోమమును వాడినట్లు కథ కలదు.[273]

లోకములో చెడుగులు నశించుటకు హనుమదాలయము ప్రతి గ్రామమున ప్రతిష్ఠింపబడవలెనని బ్రహ్మవాక్కు (పరాశర సంహిత 6వ పటలము)

హనుమదారాధకులకనేక నియమములున్నను అజ్ఞాన జనితమగు దోషములున్నను దయాశాలియగు హనుమంతుడు వానిని సరకుసేయక అనుగ్రహించునని పరాశర సంహిత పదునెనిమిదవ పటలము తెల్పును.

బుద్ధిర్బలం యశోధైర్యం
నిర్భయత్వ మరోగతా
అజాడ్యం వాక్పటుత్వంచ
హనుమత్స్మరణాద్భవేత్.

# 20 సింహావలోకనము

హనుమంతుని కథను గూర్చి పాత్రచిత్రణను గూర్చి పది అధ్యాయములలో నేను తెలిపిన అంశములు దాదాపు ఎనిమిది సంవత్సరములపాటు నేను పరిశోధించి సేకరించిన అంశములే. హనుమంతుని జన్మక్రమమును (గూర్చి) మొదలుకొని ద్వాపరయుగాంతము వరకు గల చరిత్రను విపులముగా తెలియ జేసి యున్నాను. ఇంతటి గొప్ప విషయమును గూర్చి నేను తెలిపిన అంశముల సమగ్రతా సమగ్రతల గురించి సమీక్షించి, ఇంకనూ పరిశోధించి తెలిసికొను అంశమును గూర్చి తెలియజేయుట భవిష్యదుపయోగకారిగా నుండును. జన్మాత్ప్రభృతి గంధమాదనమున నివసించుటకు చేరువరకు హనుమంతుని జీవితము నందలి కార్యముల కాలక్రమమును సమీరకుమార విజయముననున్న దాని ప్రకారమే నేను పాటించితిని. శ్రీరాముడు పదునొకండువేల సంవత్సరములు పాలించెనని ప్రతీతి - త్రేతాయుగపు కాలప్రమాణము నేటి యుగకాల ప్రమాణమునకు వ్యత్యాసముండును. కాని యీ యిన్నేళ్ల రాముని చరిత్ర శ్రీమద్రామాయణమున కేవలము శ్రీరాముని జన్మ మొదలుకొని పట్టాభిషేకం వరకే విపులముగా తెలుపబడియున్నది. మొత్తము మీద శ్రీరాముని బాల్యము మొదలు రాజ్యపరిపాలనాకాలము వరకే వాల్మీకి తెలిపియున్నాడు. ఉత్తర కాండమున శ్రీరాముని మహాప్రస్థానము వర్ణించినను అంతవరకు గల శ్రీరాముని జీవితము గురించి తెలిపియుండలేదు. శ్రీరామాయణమున హనుమంతుడు కిష్కింధాకాండమున మనకు తొలుతగా వాల్మికిచే పరిచయము కావింపబడినందున హనుమంతుని జీవితమందలి ప్రధానాంశములన్నియు మనకు తెలియవచ్చుటలేదు. త్రేతాయుగమున తెలిసిన హనుమత్కథకు ఇచ్చిన ప్రాధాన్యము, ద్వాపరాదియుగమందలి కథకు కవులు ఇవ్వరైరి. శ్రీమద్రామాయణమున రామకథ ప్రధానము; హనుమత్కథ గౌణము. అందువలన ఇతని కథలోని సర్వాంశములు మనకు ఇంకనూ తెలిసికొనదగినవి ఎన్నియో యుండును.

